

మనుష్యునితల ఱెక్కలుఁ గలసింహము.

శ్రీరస్తు.

# ప్రాచీనదేశచరిత్రలు

ప. శ్రీనివాసరావు, బి. ఏ., గారిచే

విరచితము.



వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1917.

# ప్రార్థన.



మ. "పరుఁడై యీశ్వరుఁడై మహామహిముఁడై ప్రాదుర్భవస్థానసం
హారణక్రీడనుఁడై త్రిశక్తియుతుఁడై యంతర్గతజ్యోతియై
పరమేష్ఠిప్రముఖామరాధిపులకుం బ్రాపింపరాకుండు దు
స్తరమార్గంబునఁ దేజరిల్లువానికిం దత్త్వార్థినై మ్రొక్కెదన్.

వ. మఱియును సజ్జనదురితసంహారకుండును దుర్జననివారకుండును సర్వవ్యాపకుండును పరమహంసాశ్రమప్రవర్తమానమునిజనహృదయకమలకర్ణికామధ్యప్రదీపకుండును సాత్వతశ్రేష్ఠుండును నిఖిలకల్యాణగుణగరిష్ఠుండును బరమభక్తియుక్తసులభుండును భక్తిహీనజనదుర్లభుండును నిరతిశయనిరుపమనిరవధికప్రకారుండును నిజస్వరూపబ్రహ్మవిహారుండును నైనయప్పరమేశ్వరునకు నమస్కరించెద.

ఉ. ఏవిభువందనార్చనము లేవిభుచింతయు నామకీర్తనం
బేవిభులీల లద్భుతము లెవ్వఁడు సంశ్రవణంబు సేయ దో
షావలిఁ బాసి లోకము శుభాయతవృత్తిఁ జెలంగు నంతు నే
నావిభు నాశ్రయించెద సకలాత్మునిఁ గర్తను భద్రకీర్తనున్.

ఉ. ఏపరమేశుపాదయుగ మెవ్వఁడుఁ గోరి భజించి నేర్పుగల్
లోపలిబుద్ధితో నుభయలోకములం గులజత్వఁ బాసి యే
తాపము లేక బ్రహ్మగతిఁ దాను గతశ్రముఁడై చరించు నే
నాపరమేశు మ్రొక్కెద సకలాత్మునిఁ గర్తను భద్రకీర్తనున్.

చ. తపములఁ జేసినైన మఱి దానము లెన్నియుఁ జేసినైన నీ
జపములఁ జేసినైన ఫలసంచయ మెవ్వనిఁ జేర్పకున్న హీ-

# ప్రార్థన.

యపదములై దురంతవిపదంచితరీతిఁ గనొప్పుచుండు న
య్యపరిమితున్ భజించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్.

మ. యవనవ్యాధపుళిందహూణకశకంకాభీరచండాలసం
భవులుం దక్కినపాపవర్తనులు నీభద్రాత్ము సేవించి భా
గవతశ్రేష్ఠుల డాసి శుద్ధతనులై కల్యాణులై యుందు రా
యవికారుం బ్రభవిష్ణు నాదుమదిలో నశ్రాంతమున్ మ్రొక్కెదన్.

మ. తపముల్ సేసినవో మనోనియతినో దానవ్రతాసక్తినో
జపమంత్రంబులనో శ్రుతిస్మృతులనో సద్భక్తినో యెట్లు ల
బ్ధపదుం డౌ నని బ్రహ్మరుద్రముఖరుల్ భావింతు రెవ్వాని న
య్యపవర్గాధిపుఁ డాత్మమూర్తి సులభుండౌఁ గాక నా కిచ్చుతన్.

క. శ్రీపతియు యజ్ఞపతియుఁ బ్ర
జాపతియును బుద్ధిపతియు జగదధిపతియున్
భూపతియు యాదవశ్రే
ణీపతియున్ గతియు నైననిపుణు భజింతున్.

మ. అణువో కాక కడున్ మహావిభవుఁడో యచ్ఛిన్నుఁడో ఛిన్నుఁడో
గుణియో నిర్గుణుఁడో యటంచు విబుధుల్ గుంఠింప తత్త్వ
జ్ఞులై యేవిభుపాదపద్మభజనోత్కర్షంబులం గత్త్వసీ
తృణముం జేసెద రట్టివిష్ణుఁ బరమున్ సర్వాత్ము సేవించెదన్."

భాగ. ద్వి. స్కం. 58-66

# ఉపోద్ఘాతము.

సోదరసోదరీమణులారా !

ఒకరోజున శౌనకాదిమహర్షులు సుఖాసీనులై, నితాంత కరుణోపేతుం డగుసూతుం జూచి యిట్లు పలికిరి:—

చ. "అలసులు మందబుద్ధిబలు లల్పతరాయువు లుగ్రరోగసం
కలితులు మందభాగ్యులు సుకర్మము లెవ్వియుఁ జేయఁజాలరీ
కలియుగమందు మానవులు గావున నెయ్యది సర్వసౌఖ్యమై
యలవడు నేమిటం బొడము నాత్మకు శాంతి మునీంద్ర! చెప్పవే."

అనియడిగిన శౌనకాదిమునిశ్రేష్ఠులకు సూతుం డిట్లనియెఁ: ద్వితీయం బైనద్వాపరయుగంబు దీఱునసమయంబున నుపరిచర వసువు వీర్యంబున జన్మించి వాసవి నాఁ దగుసత్యవతియందుఁ బరాశరునికి హరికళం జేసి విజ్ఞాని యైనవేదవ్యాసుండు జన్మించి యొకనాఁడు బదరికాశ్రమంబున సరస్వతీజలంబుల స్నానాది కర్మంబులందీర్చి శుచియై పనులు లేనిచోట నొంటిఁగూర్చుండి సూర్యోదయవేళ నతీతానాగతవర్తమానజ్ఞుం డయినయాఋషి వ్యక్తంబు గానివేగంబుగల కాలంబునం జేసి యుగధర్మంబులకు భువి సాంకర్యంబు నొందు యుగయుగంబుల భౌతికశరీరంబులకు శక్తినష్టం బగుఁ బురుషులు నిస్సత్త్వులు ధైర్య హీనులు మందప్రజ్ఞు లల్పాయువులు దుర్బలులు నయ్యెద

రని తనదివ్యదృష్టిం జూచి సర్వవర్ణాశ్రమంబులకు హితంబు సేయం దలంచి......................"

సోదర సోదరీమణులారా! అతీతానాగతవర్తమానజ్ఞుం డగు వేదవ్యాసుఁడు, తన దివ్యదృష్టిని జూచినసంగతులు నేఁడు వ్యక్తమయ్యెనుకదా! యుగధర్మంబులకు భువి సాంకర్యంబు వొందెకాదె? భారతీయశరీరంబులకు శక్తి సన్నంబయ్యె; పురుషులు నిస్సత్త్వులు, ధైర్యహీనులు, మందప్రజ్ఞులు, అల్పాయువులు, దుర్బలులునయిరి; ఇట్టి దుర్దశలో నుండిన మనలనుజూచి యెవరు విచారింపరు?

మనదేహబలము సన్నమయ్యెను; బుద్ధిబలము మందగించెను; ధనబలము నీరసించెను. మన దుర్దశకు మనము కారకులము. ఒకరిని నిందఁజేయవలసినపని లేదు. ఇంతేని మనపూర్వపుణ్యమువలనను మనపూర్వులపుణ్యమువలనను మనకాంగ్లేయప్రభుత్వము వచ్చినందున, మన మింతవఱకు నిలిచియుంటిమి. లేనిచో, మనకేమేమిదుర్దశలు వచ్చి యుండునో చెప్పఁజాలము. ఆంగ్లేయులరాక మనకు మేలురాక యయ్యెను; నానాగతులను, నీరసించి కృశించి యుండినమనకుఁ గొంచెము కొంచెము మూఁడుబలములు కలుగుచున్నవి.

ఏనాఁడు దేహబలము, బుద్ధిబలము నశించునో, ఆనాఁడు మహాదేశీయులు నశించెదరు. ప్రపంచమునకు వలె, దేశీయులకును సృష్టిస్థితిసంహారములు కలవు. ఐజిప్టీయులు, బాబిలోనియనులు, అసీరియనులు, పారసీకులు, ఫొనీషియనులు, రోమకులు, గ్రీకులు మొదలగు మహాదేశీయులు వారివారికాల

ములో విజృంభించి, కాలక్రమమున నశించిరి కదా! వారు కూడ నాగరికులై, కళాప్రవీణులై, శాశ్వతమగు కీర్తిని సంపాదించి, యంతరించిరి. ఏవిధమున వారిరాజ్యములు పుట్టి పెరిఁగి యంతరించెనో, ఆయాచరిత్రమును బఠించుటవలన విశదమగును. కాల మొకరీతి గడువఁబోదు కదా!

హిందువులుకూడ వారికాలములో నాగరికులై, కళాప్రవీణులై, శాశ్వతమగు కీర్తిని సంపాదించిరి. భారతీయులనేక దశల ననుభవించిరి. ఐజిప్టీయుల చరిత్రము క్రీ, పూ, సం॥ 6000 రము మొదలు ప్రారంభ మయ్యెను; ఋగ్వేదకాలము క్రీ, పూ, సం॥ 2000 రములని చెప్పినప్పుడు, ఋగ్వేదమంత్రములను జెప్పుటకుఁ దగినంతశక్తి వచ్చుటకుఁ బూర్వ మెంతకాలము గతించి యుండునో మీరే యూహింపుఁడు. భారతీయుల నాగరికతయు ప్రాచీనము; అట్టిభారతీయుల రాజ్యములు పుట్టి పెరిఁగి యంతరించెను. ఆ భారతీయులదుస్థితులు క్రీ, వె, సం॥ 1100 రము మొదలు ప్రారంభమయ్యెను; క్రీ, వె, సం॥ 857 రములో సంతమయ్యెను. ఇంచుమించు ఏడునొక్కశతాబ్దములకు గాఢాంధకారములోనుండి, ఎరిగానక విలపించుచుండిన భారతీయులకు దొరతనమువారు వచ్చినతరువాత సుగుణోదయ మయ్యెను.

ఇప్పుడుకదా భారతీయులు మేల్కొనుచుండిరి; గాఢాంధకారములో నింతకాలము గతించినందున, దేహబలమును బుద్ధిబలమును ధనబలమును నశించెనని వారు తెలిసికొనిరి. భారతీయులనిన సామాన్యులా! వారు మహనీయులు; సకల కళాపూర్ణులు; వారిసాంఘిక ధర్మములును, వారియాచార

వ్యవహారములును, వారి రాజ్యతంత్రములును, వారిశాస్త్ర
ములును, ప్రసిద్ధి కెక్కెనుకదా ! సకలకళాపూర్ణులని చెప్పు
టయే వారు నాగరికులని చెప్పుట. దేశీయులు నాగరికులై విజృం
భించినవిధమును జెప్పునదియే చరిత్రము. మీఁదఁ జెప్పఁ
బడినమూఁడుబలములును గలిగియుండినవారినే నాగరికులని
చెప్పవలయును. ఆమూఁడుబలములు సరిసమానముగ నుండి
నంతవఱకు దేశీయులు నిలిచియుందురు ; వానిలో భేదానికి
వ్యత్యాసమువచ్చినను దేశీయులకు నష్టము కలుగును.

ఈమూఁడుబలములును నాగరికత యనుమహావృక్షము
నకుమూలము. ఈమహావృక్షమునిలుచుటకు సుక్షేత్రమొకటి
యుండవలెనుకాదా ! క్షేత్రముసారవంతమైనకొలఁది, బీజము
నాటుకొని వేరుదన్ని పెరిగి పెద్దదియగును. సారవంతమగు
క్షేత్రముమీఁదఁ బెరిఁగినయెడల నెన్నితుపానులు వచ్చినను,
వృక్షమునకు నష్టముకలుగదు. ఊసరక్షేత్రముమీఁదఁగాని వృ
క్షము పెరిఁగినయెడల దానికి హానివచ్చును. ఈమహావృక్షము
శాశ్వతముగ నిలిచియుండుటకుఁగాని శీఘ్రము నశించుటకుఁగాని
క్షేత్రమే ప్రధానము. క్షేత్రములో సారముండినయెడల మూఁ
డుబలములును సరిసమానముగనుండును. మహావృక్షము దినదిన
ప్రవర్ధమానముగనుండి భౌతికధర్మముల కొజింబడక శాశ్వత
ముగ నుండును.

ఈచరిత్రములో వ్రాయఁబడినమహాదేశీయుల నాగరికత
యేక్షేత్రముపైఁ బెరిఁగెను? హిందువుల నాగరికత యేక్షేత్రము
పైఁ బెరిఁగెను? ఈక్షేత్రము రెండువిధములని చెప్పియుంటిమి;

'లౌకికము' లేక 'ఐహికము' ; 'వైదికము' లేక 'దైవికము;' ఐహికక్షేత్రము నశ్వరము. దైవికక్షేత్రము శాశ్వతము. దేశీయుల నాగరికతామహావృక్షము ఐహికక్షేత్రముపైఁ బుట్టి పెరిఁగి నశించెను. భారతీయుల నాగరికతామహావృక్షము వైదికక్షేత్రముపైఁ బుట్టెను. ఈమహావృక్షము దినదినప్రవర్ధమానముగఁ బెరిఁగి పెద్దది యయ్యెను.

ఓ సోదర సోదరీమణులారా! ఈ మహావృక్షమునకుఁ గాలాంతరమున పురుగుపట్టెను. క్షేత్రమునకు సారము తగ్గెను. క్షేత్రము నీరసించినందున మూఁడుబలములు తగ్గెను. వృక్షము పచ్చగ నుండుటకు బదులు, ఎండుటకారంభించెను. క్షేత్రమును నిత్యము సారముఁ జేయకుండినయెడల, నీరసించును. ఆఱునూర్లక శతాబ్దమునఱకు భారతీయులు గాఢాంధకారములో నుండుట వలనఁ గదా వారివైదికక్షేత్రమునకు సారము తగ్గెను. వారి మూఁడుబలములు నీరసించెను. వారి నాగరికతావృక్షమునకుఁ బురుగుపట్టెను. అంతలో నాంగ్లేయులరాకవలనఁ జీకట్లు వీడి, అరుణోదయ మయ్యెను. వారు మేల్కాంచి, తమనీరసస్థితిని దెలిసికొనిరి.

ఈనీరసము పోవుటకు మార్గమేమి? ఏమార్గమున నీక్షేత్రమునకు సారము కలుగును? ఈభారతీయులక్షేత్రము కేవలము దైవికము, లేక వైదికము. దీనికిఁ దగినవిధమున సారముఁ జేయవలెను గాని మఱియొకవిధమునఁ జేయఁదలఁచినఁ బ్రయోజనము లేదు. దీనికిమార్గ మొకటికలదు. రెండవమార్గము లేదు. వైదికక్షేత్రముపైఁ బెరిఁగి కాలక్రమమునఁ బెద్దదియైన వృక్షము నూడఁదీసి లౌకికక్షేత్రముపై నిలుపఁబెట్టఁ దలంచుట కంటెఁ బిచ్చిపని మఱియొకటి లేదు.

శౌనకాదిమహర్షు లడిగినప్రశ్నకు సూతుం డిట్లు చెప్పెను:—

మ. "వరగోవిందకథాసుధారసమహావర్షోక్తిధారాపరం
పరలం గాక బుధేంద్రచంద్ర! యితరోపాయానురక్తిం బ్రవి
స్తరదుర్దాంతదురంతదుస్సహజనుస్సంభావితానేకదు
స్తరగంభీరకఠోరకల్మషకనద్దావానలం బాఱునే?" (భా. ప్ర. 40.)

"వరగోవిందకథాసుధారసమహావర్షోక్తిధారాపరంపరలంగాక" మఱియొకవిధమున నీస్వదేశక్షేత్రమునకు సారము గలుగునా? కలుగుట దుస్తరము. లౌకికక్షేత్రములవలె స్వదేశక్షేత్రమును సారముఁజేయఁదలఁచినయెడల నది సారవంతమగునా? దానిమీఁద నిలిచియుండిన నాగరికతావృక్షము పెరుఁగునా? ఓ భారతసోదరసోదరీమణులారా! మీనాగరికతావృక్షము ఋగ్వేదకాలమునకు మూఁడువేలసంవత్సరములకు పూర్వమునుండి పెరిఁగివచ్చుచుండెను. దానిబీజము స్వదేశక్షేత్రమున మొలిచి, పెద్దదియై, శీతోష్ణములను సహించి, నిలిచియుండెను. ఈమహావృక్షమును పడఁద్రోయవలెనని యనేకు లనేకవిధములఁ బ్రయత్నించిరి; కాని, వారిప్రయత్నములు వ్యర్థములయ్యెను. ఈమహావృక్షమును నిలువఁబెట్టుభారము మీది.

ఎట్లు దీనిని నిలువఁబెట్టఁగలరు? మనపూర్వులు చేసిన శుభాశుభకర్మఫలములను మన మనుభవించుచుంటిమి. అట్టు లనే, మనము చేయుచుండినశుభాశుభకర్మఫలములను మన సంతతివా రనుభవింపఁగలరు. మనపూర్వులు చేసినసత్కర్మల వలన మన నాగరికతావృక్షము దినదినప్రవర్ధమానముగ వచ్చెను. కాని, మధ్యకాలమున, కొన్నియవాంతరములవలన, సత్కర్మలకు నిరోధము వచ్చెను; ఆయవాంతరములన్నియు నేఁడు దూర

తనమువారియాగమనమువలన నశించెను. మనయాచరణవిధానములకు నిరోధకములు లేవు.

మ. "నినుఁ జింతింపుచుఁ బాడుచుం బొగడుచుఁ జెన్నొందు నీదివ్యచారిత్రముల్
వినుచుం జూతురు గాక లోకు లితరాన్వేషంబులం జూతురే?
ఘనదుర్జన్మపరంపరాదళనదక్షుంబై మహాయోగివా
గ్వినుతంబైనభవత్పదాబ్జయుగముఁ విశ్వేశ!విశ్వంభరా!"(భా. ప్ర.197).

లౌకికవ్యాపారములలో మెలంగుచుండినను, దైవబలమును సంపాదింపవలెను. బలముకూడ దానితో సమానము కాదు; అన్నిబలములకు దైవబలము మూలము; ఆదైవబలమే మననాగరికతావృత్తమునకు మూలము.మనకు దైవబలము విశేషముగ నుండుటవలన, మనకు దొరతనమువారి ప్రభుత్వము లభించెను. ఈదైవబలము మనపిత్రార్జితము; ఆబలమును మనము వ్యయముఁ జేయుచుంటిమి;మనస్వంత ఆదాయము శూన్యము; అందుచేత,నీవృత్తి మెండుచున్నది. దానికి బలము తగులుట లేదు.

"ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలమ్." (వా. రా. బాల.)

ఏబలముకూడ బ్రహ్మబలముతో సమానముకాదు. ఈ బలమును సంపాదించినఁగాని యీవృత్తము నిలువదు. 'దైవే ఽబలే దుర్బలే' హనుమన్నాటకము.దైవబలముబలము; అది లేకపోవుటయే దుర్బలము. ఈసంగతులను మనపూర్వులు తెలిసికొని దైవబలము నాధారముగఁ జేసికొని, మననాగరికతావృత్తమును పెంచిరి; దానిని నిలువఁబెట్టుభారము మీఁది.

ఆంధ్రగ్రంథములను ముద్రింపించి ప్రచురింపించుటలో నాంధ్రదేశమునకు మహోపకారముఁ జేయుచుండిన నాప్రియమిత్రులగు బ్రహ్మశ్రీ, శ్రీయుత, వావిళ్ల. వేంకటేశ్వరులు గారికి అనేక నమస్కారములం జేయుచున్నాను.ఈనాగ్రంథ మొకటియే

కాదు; తదితరగ్రంథము లనేకములను వారుముద్రింపించి లోకోపకారార్థము ప్రచురించుచున్నారు. ఇట్టి లోకోపకారులు శ్లాఘనీయులు; కాలమింతవ్యత్యాసముగ నుండినను వెనుదీయక ధనమును వ్యయముఁ జేసి గ్రంథములను ముద్రింపించుటయే వారియౌదార్యమునకు నిదర్శనము. ఈగ్రంథముద్రణమునందు నాకు సహాయపడి శ్రద్ధతో సంస్కరించిన శ్రీమాన్, ఉత్పల. వేంకటనరసింహాచార్యులుగారికి కృతజ్ఞుఁడను. భగవంతునికటాక్షమువలన నాప్రియ మిత్రులు సహస్రమాసజీవులై పుత్రమిత్రకళత్రబంధువర్గంబుతోఁ గూడి సిరిసంపదల ననుభవించుదురు గాక ?

ఓమ్ తత్సత్.

ఇట్లు, మీవిధేయుఁడు:

స. శ్రీనివాసరావు.

---

## పటముల సూచి.

# విషయసూచిక.



## ప్రథమప్రకరణము.



## ద్వితీయప్రకరణము.

## తృతీయప్రకరణము.



## చతుర్థప్రకరణము.



## పంచమప్రకరణము.



## షష్ఠప్రకరణము.



## సప్తమప్రకరణము.



## అష్టమప్రకరణము.



## నవమప్రకరణము.



## దశమప్రకరణము.



## ఏకాదశప్రకరణము.



## ద్వాదశప్రకరణము.







పూర్వులెఱింగిన
ప్రపంచము.



శ్రీరస్తు.

# మానవుల శైశవదశ

## ప్రథమప్రకరణము.



### మొదటి అధ్యాయము.

సృష్టి యనంతము ; అందులోఁ బదార్థములు మెండు ; ప్రతిపదార్థమున కొకచరిత్ర కలదు; అది దానిసృష్టిస్థితిలయములగుఱించి చెప్పును. ఎట్టిహీనమైనపదార్థ మైనను మనము దానినుండి నేర్చుకొనవలసిన సంగతులు కలవు; దానిపూర్వస్థితి యేమి? కాలానుగుణముగ నేమార్పులఁ జెంది ఈ వర్తమాన స్థితికి రాఁ గలిగెను? రాఁబోవుకాలములో నెట్లు ఉండఁబోవును? విశేషము ప్రయాసపడి యనేకులు జూచిన మనుష్యుల సుఖదుఃఖములుగఁ గనఁబడువాట్లను గుఱించియయితము బుద్ధిమంతులు కొందఱు చరిత్రను వ్రాసిరి; మీరు వినిన యేపురాణకథలకంటె నీచరిత్రము వినోదముగనుండదా? జీవము లేనివాట్లు, వాక్శక్తిలేని మఱికొన్ని పదార్థములవిషయమై కూడ ఈ మాట నిజమైనయెడల “సత్యం సత్యం పునస్సత్యం ముద్ధృత్య భుజ ముచ్యతే” జీవమును వాక్శక్తియును గల పదార్థములగుఱించి యింతకంటె వినోద మగుచరిత్రను వ్రాయుటకు వీలు పడునని నమ్ముచున్నాను.

అన్నిటికంటె మిక్కిలి అద్భుత మగుచరిత్రను మీకుఁ జెప్పఁబోవుచున్నాము. పదార్థములు స్థూలముగనుండిన, నక్షత్రము లగు నని చిన్నపిల్లలును,

ఒకానొకప్పుడు కాలముఁ గడపిన పెద్దవారను భ్రమపడి, అనేక వేలసంవత్సరములక్రిందట భూలోకములో గుండ్రని వెండ్రుకలును పెద్దదంతములు గలిగి భయంకరమగుజంతువునుగుఱించి చెప్ప గల మని తలఁచెదరు; కాని అది కాదు; మా యభిప్రాయమును విశదపఱచెదము; సావధానముగ వినుఁడు. ఆఫ్రికాఖండములో "చింపాంజి" అనువానరము కట్టుకొని నివసించుచున్నట్టి కుటీరముకంటె మధుపము నివసించుపట్టులోని షట్కోణపు గదులు అద్భుతములు కావా? స్థూలముగను మొద్దుగ బెఱిగిన "రైనాసరసు" అనుజంతువుకంటె, మన మెటుల పాలనిమిత్తము పశువులను సంరక్షించుచున్నామో, ఇటులనే చిన్న చీమలు కొన్ని క్రిములఁ బెంచి వాని పాలుఁదీయుటయు, పనిపాటులఁ జేయుటయు మన మెటులసేవకుల నుపయోగించెదమో అటులనే ఇతరములగు చీమలు మఱి కొన్ని క్రిములఁగట్టి పట్టి తెచ్చి, వానిచేతఁ బని జేయించు నని చెప్పుట వినోదము కాదా?

మంచిది; నిన్నుగుఱించి చెప్పఁబోవుచున్నాము. మన మెంతవఱకు దెలిసికొనఁగలిగితిమో అంతవఱకు నీవు నేర్చుకొనవలసిన దని మాయభిప్రాయము. ఏమి నీవు నేర్చుకొనవలెను? ఎటుల నీవు వర్తమానస్థితికి వచ్చితివో అదియే నీవు నేర్చుకొనవలెను. నీవు నీలాగున నెందుకుంటివి? ఆసంగతి భగవంతునకు దెలియును; అది మాకుఁ దెలియదు. మేము చెప్పలేము; ఈలోకములో మనలో నెవరికి బరమేశ్వరుఁ డారహస్యముఁ జెప్పలేదు; ఆయన ముందెప్పుడైన మఱియొకచోటఁ జెప్పిన జెప్పనచ్చును; కాని ప్రస్తుతముమాత్రము చెప్పలేదు. బహుశః నీ వీలాగున నుండుటలోను నీ కనుభవయోగ్యము లైన పదార్థములను సంపాదించుటలో నద్భుత మేమని తలంచెదవు? లేదా ఆపదార్థములు మనుజునకు సర్వదా కలిగి యుండె ననియు, లేక లేనప్పుడు వానిని అంగడి నుండి క్రయమునకుఁ దెచ్చుకొనె ననియు, లేక భూమిమీఁదఁ బుట్టినది మొదలు భోజనపదార్థములఁ బచనముఁ జేసి తరువాత వానిని భుజించి తదుపరి ఫలహారముఁ జేసెననియు, లేక, వర్తమానములోవలె చక్కనిదుస్తుల ధరించె ననియు,

మంచిభాషాపరిజ్ఞానముఁ గలిగి వ్రాఁతమాఁతలలో నాఱితేఱి యుండెననియు, దివ్యభవనములలో నివసించుచుండెననియు, మహోన్నతములగు దేవాలయములఁ గట్టి యుండెననియు,—నీవు తలంచెద వేమో? అటుల కాదు; అటులఁ దలంచిన తప్పు. నిన్నా దుర్మార్గమునుండి తప్పించి, సన్మార్గమునకుఁ దెచ్చుట మాయభిప్రాయము. ప్రథమమునఁ జూచుటకు భయంకరుఁడై, దిగంబరియై, పశువువలె విచ్చలవిడిగ మనుజుఁడు సంచరించెను. తననీడఁ జూచి వాఁడు భయపడెను, మేఘగర్భంబు వెలువడు క్రొక్కాఱుమెఱుంగునకును, గంభీర నినాదమునకును ఉలికిపడెను. సూర్యమండలము వెలువడివచ్చుచుండెడి మహాభూతముయొక్క సుసర్గములధ్వనియే ఆనినాదమనియు, ఆభూతముయొక్క దుర్నిరీక్ష్యమైనలోచనకాంతియే ఆమెఱుపనియు వాఁడు తలంచెను. వర్తమానములో మనము చూచుచుండెడి మనుజునకి తెలివితేటలు కలుగునప్పటికి వేనవేలు సంవత్సరములు పట్టెను.

పుస్తకముఁ బట్టి చదువుకొనుశక్తి కలుగుటకు బూర్వము ఎటుల నీవు అక్షరాభ్యాససమయమున "ఓనమాల"ను నేర్చుకొనియెదవో, ఈలోకములో బనిపాటులు లేక కాలయాపనఁ జేయుటయే మహాపాపము కనుక, పెద్దవాఁడవై నీపనిఁ జేయుటకుఁ దగినసామర్థ్యము నెటులనీవు చిన్నతనములోఁ దెలిసికొని కాలక్రమమున దానిని నెఱవేర్చెదవో; అటులనే మనుజుఁడుకూడ చాలావ్యయప్రయాసములచేత జయాపజయములఁ బొందును, కాలాంతరమునఁ దనపనిని నేర్చెను. ఏది మంచిపనియో, దానిఁ జేయుటకు మంచిమార్గమేదియో, మనవాల నొకరివలన నేర్చుకొనక, తనమట్టుకుఁ దాను భగవంతుఁడిచ్చినబుద్ధిని వృద్ధి చేసి, ఒకపనినే పలుమాఱులు చేయుచు, ఒకశబ్దముయొక్క వర్ణక్రమమును నేర్చుకొనుటకు నీ నెటుల శ్రమఁబడెదవో, అవిధమున సత్కర్మను సన్మార్గమున వినియోగించుటకుఁ బూర్వము మనుజుఁడు కష్టపడెను. ఒకానొకప్పుడు మనుజుఁడు దిగంబరియై కుడుచుటకుఁ గూడును, నిలుచుటకు నీడయు లేక సంచరించి సంచరించి, క్రమక్రమమున సంసారియై నాగరికుఁ

డయ్యెనని చెప్పుటకు నిదర్శనములు కానఁబడును. ఒకసంగతిఁ జెప్పవలసియున్నాము వినుఁడు; యుగాంతరముల క్రిందటఁ జేయఁబడి, ఆనాటిమనుజులు వాడుకఁ జేయు చుండినపనిముట్లును, ఆయుధములును అన్నిఖండములలోను, ముఖ్యముగ "ఐరోపా" ఖండములోఁ గానఁబడుచున్నవి. ప్రస్తుతము భూలోకములో నచ్చటచ్చటఁ బర్వతప్రాంతకాంతారములలో నుండు ద్విపాదపశువులు వాడుకఁ జేయుచుండిన వస్తువులుసయితము పూర్వమువానివలె నుండుటచేతి, నాఁటా లవు ద్విపాదపశువులచరిత్రము నాగరికతాశూన్యంబని చెప్పవచ్చును.

ప్రకంపనకల్పితకల్లోలాపారపారావారమధ్యగతంబులైన సింహళ బోర్నియో ఆస్ట్రేలియాద్వీపంబులలో నేటివఱకు నట్టిమనుజులు కానఁబడు దురు. వారిఁ జూచి భయపడి మనుజులా పశువులా యని తలంచెదవు. సత్యము; వారుమనుజులు కాని పశువులు గారు. వారు అనాగరికులు కనుక, దిగంబరులై శరీరమునకుం బురదఁబూసికొని, కందమూలాదులను బచనముచేయక భుజించుచు, నికృష్టకుటీరములలోను లేక తరుచ్ఛాయలలోను దివారాత్రంబులం గడుపుచున్నారు.; వీరినే "వనవాసుల"ని పిలుచుచున్నాము.

ఏనాఁడు దేశము లనుపేరు లేదో, ఏనాఁడు దేశీయులనువారు లేరో, అట్టిసమయములో దేశచరిత్ర లెటు లుండును. అట్టియుగాంతరముల ప్రప్రథమమునాఁటనుండి మానవచరిత్రఁ జెప్పఁబోవుచున్నాము. మనవలె సాంఘికులై దేశచరిత్రలను వ్రాయుటకుఁ దగినశక్తిసామర్థ్యములు కలుగుటకుఁ బూర్వము విశేషము వ్యాసంగముఁ జేయవలెను. ఒకశతాబ్దమున నూఱుసంవత్సరములు. అనేకశతాబ్దములు కలిసిన నొకయుగము; అట్టియుగము లెన్నియో గతించి నందున, ఆప్రాచీనమనుజుని యాచారవ్యవహారము లిట్టివని ధారాళముగ నిరూపించుటకుఁ దగినయాధారములు లేవు; అచ్చటచ్చటఁబడి యుండినరాతి పనిముట్లను శిథిలమైనమృత్పాత్రలను, గీతలు గీయఁబడియుండిన యెముకలను — వీనిని ఆధారముఁ జేసికొని, కొంతవఱకు నాఁటిచరిత్రను వ్రాసినారు.

మేము చెప్పఁబోవు కథ కారంభము మహా అలగ్జాండరుయొక్క దండయాత్ర కాలముకంటెఁ బూర్వము; వేదముల కాలముకంటెఁ బూర్వము; జాంబవంతుఁడు భూమికంటెఁ బెద్దయని వాడుకగలదు; ఇంచుమించా కాలము నాటనుండి కథఁ జెప్పుచున్నాము. ఆనాఁడు సింహళము ద్వీపము కాక, భరత ఖండముతోఁ గలిసి యుండెను. ఆనాఁటివగులు కొన్ని కాలాంతరమున నంతరించెను. అప్పటిమనుజులకు వానరములవలె వాలములుండెను. వారు ఆకులలముఁ దిని బ్రతుకు చుండిరి. వారు ద్విపాదపశువులు. మున్ముందు జ్ఞానము కలిగి నీవుంటెట నీవు తెలిసికొన బోవుసంగతులను మొదటఁ జెప్పుచున్నాము కనుక నీవు నమ్మవలసినది. వ్రాతపుస్తకములఁజూచి చదివి నేర్చుకొనుటకంటె తిరుశైల పాషాణములఁ గన్నులారఁజూచిన మేలు. అంతరిక్షమున నుండునక్షత్రమండలములవలె మనభూలోకము ప్రేలాడుచు నిత్యము వ్యత్యాసముఁ జెందుచు నింతో కాలము గడిపెను. కనుక దానివయస్సుఁ జెప్పుటకు వీలులేదు. జంతువులకు వార్ధకములో దేహము సడలి ముడతలుపడి రక్తము క్షీణించును. భూదేవికి అటులఁగాదు. "ఓం మేదినీ దేవీ వసుంధరా స్యాద్వసుధా దేవీవాసవీ బ్రహ్మవర్చసః... హిరణ్యగర్భిణీదేవీ ప్రసోదరి సనవే సత్యాయనే సీవ సముద్రవతీ సావిత్రీ... వాయుమతీ జలశయనీ స్వయంధారా జాసత్యంతో పరమేదనీ సోపరి ధర్త్రింగామం... శాల్యనసస్యఫలాఢ్యే పారిజాతతరుశోభితమాసే, స్వర్ణరత్నానాశినాంటపమాధ్యే చింతయేత్సకలలోక ధరిత్రీం శ్యామాం విచిత్రాం నవరత్నభూషితాం చతుర్భుజాం తుంగపయోధరాన్వితాం, ఇందీవరాక్షీం నవశాలిమంజరీం శుకం దధానాం వసుధాం భజామహే," "ధనుర్ధరాయ విద్మహే సర్వసిద్ధిం చ ధీమహి, తన్నో ధరా ప్రచోదయాత్."

అనేక సంగతులను గురించి మనము శంకింపవచ్చును; మనబుద్ధికొలఁది వానిని సమర్థింతుము. దానివలనఁ బ్రయోజన మేమి? అందుచేత సృష్టి అనాదియని చెప్పుచున్నాము. ప్రస్తుత మెంతసంగతి నిజము. దాని విషయమై శంకింప నవసరములేదు. భగవంతుఁడు కృపాళుఁడును భక్తవత్సలుఁడును కనుక

లోకములోఁ బిపీలికాదిబ్రహ్మపర్యంతముఁ గలచేతనాచేతనములలో దేనిని నిరర్థకముగ సృజింపక, యుక్తపరికరముల నిచ్చి యుక్తకాలములో మనుజుని భూలోకములోఁ బ్రవేశపెట్టెను. స్వయం కృషి వలన గ్రహించుట కనేక విషయములను మనకు భగవంతుఁడు విడిచిపెట్టినప్పటికిని, అట్టిస్వయంకృషిని ధారాళముగ జరిపించుటకు దగినపరికరముల నాయన మనకిచ్చెను; కర్మేంద్రియములను జ్ఞానేంద్రియముల నిచ్చెను; మే మిచటఁ గొన్నిపదములకు వ్యుత్పత్త్యర్థములఁ జెప్పుచున్నాము.

మనః:—మన్యతే అనే నేతి మనః - మన ఏవ మానసం మన=జ్ఞానే-దీనిచేత నెఱుఁగ బడును కనుక మనస్సు; మనస్సు గలవారు మానవులు.

మొదట పదార్థములకుఁ బేరిడినపుడు వానివాని యుత్కృష్టగుణముల ననుసరించి వానికి నామకరణముఁ జేసిరి. అటులనే :—

అరవిందం:—అరాన్ కేసరాన్ విందతీతి అరవిందం=కేసరములను పొంది యుండును.

ఉదకం:—ఉనత్తీతి ఉదకం=ద్రవమై యుండునది.

ఆపః:—ఆప్నువంతీ త్యాపః=వ్యాపించునవి.

భూమిః:—భూసత్తాయాం=సర్వము దీనియందు కలుగును.

గృహః:—గృహ్ణాతి పురుషే ణార్జితం విత్తం ధన మితి గృహం-పురుషునిచేత సంపాదింపఁబడినధనమును గ్రహించునది.

పశవః:—పశ్యంతే పాశైః పశవః-పశబంధనే-కట్టఁబడునది.

పాదః:—పద్యతే అనే నేతి పాదః-పదగతౌ-దీనిచేతఁ బోదురు.

పక్షీ:—పక్షౌ వస్య స్త ఇతి-రెక్కలు కలది.

అగ్నిః:—అగతి కుటిలం ఊర్ధ్వం వా గచ్ఛతీతి. ఊర్ధ్వముగా నైనను కుటిలముగా నైనను జ్వలించునది.

ఆకాశః:—ఆ సమంతా త్కాశంతే సూర్యాదయో౽త్ర త్యాకాశః-
దీనియం దంతట సూర్యాదులు ప్రకాశింతురు.

అభ్రం:—ఆపః బిభ ర్తీ-ఉదకమును భరించునది.

మేఘః:—మేహతీతి-తడుపునది.

పదముల ధాతురూపములఁ జూచిన పదార్థముఁ దెలియును. పదార్థమే పదార్థముల కాధారము. పదార్థజ్ఞానము కలదని తలంచు మనకు నిజముగఁ బదార్థజ్ఞానము లేదు. అజ్ఞానము మనపూర్వులకుఁ గలదు, అట్టిజ్ఞానోదయము కలుగుటకు మనము భగవంతుని బ్రార్థించెదము; అతఁడే మనకు గురువు.

శ్లో. "అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా,
చక్షు రున్మీలితం యేన తస్మై శ్రీ గురవే నమః.
గురు ర్బ్రహ్మా గురు ర్విష్ణు గురు ర్దేవో మహేశ్వరః,
గురు స్సాక్షా త్పరం బ్రహ్మా తస్మై శ్రీ గురవే నమః.

అట్టిజ్ఞానోదయము కలిగినఁ గాని మనపూర్వుల వేషభాషలను, ఆచార వ్యవహారములను మొదలగుసంగతులనుఁ దెలిసికొనఁజాలము. యుగాంతరముల క్రిందట జీవించి దేహయాత్ర గడిపిన వారిసంగతులను స్వచ్ఛముగఁ దెలిసికొనుటకుఁ దగిన ఆధారములు కానరానందున, ప్రచలితభాషాపదముల ధాతురూపములఁబట్టి వా రిట్టిపదార్థజ్ఞానముఁ గలిగి యుండిరని తెలిసికొని, వారు నాగరికులో, లేక యనాగరికులోఁ జెప్పుటకు మన కీపదములధాతువులు నిదర్శనములు.

వ్యవహారార్థము శాస్త్రజ్ఞులు మానవజాతినిఁ గొన్నికుటుంబములుగ విభజించిరి. ఈసంగతి ముందు విశదపఱుచుచున్నాము. మనము మానవకుటుంబములలోఁ బెద్దదియగు "ఆర్య" కుటుంబములోనివారము. ఈకుటుంబము వారు కొంతకాల మవిభక్తముగ నుండి, తదుపరి విభక్తులై స్వేచ్ఛానుసారము

"ఆసియా, ఐరోపా" ఖండములకుఁ బోయి యాయాదేశముల నాక్రమించి కాలక్రమమున వృద్ధిఁ బొందిరి. వారిభాషలు వేఱుపడినప్పటికిని, వారివారి భాషలలో నేఁడు వాఁడుకొనుచుండినపదములధాతురూపముల జూచిన వారందఱు కొంతకాల మవిభక్తకుటుంబములోనివారని చెప్పవగును. వారసర్వస్వమును నశించెను. కాని వారు పదార్థములకుఁ బెట్టిననామములు నశింపలేదు. ఆనామములనే మనము వివిధముగఁ బ్రయోగించుచున్నాము. ఇచటఁ గొన్నిపదముల వ్యుత్పత్తులఁ జేర్చుచున్నాము.

సం=సంస్కృతము; లా=లాటినుభాష; గ్రీ=గ్రీకుభాష; ఇం=ఇంగ్లీషుభాష.

| | |
|---|---|
| సం=పితరః<br>లా=పేటర్<br>గ్రీ=పేతర్<br>ఇం=ఫాదర్ | ధాతు రూపమొకటి<br>పాతీతిపితా "పా" రక్షణే రక్షించు వాఁడు. |
| సం=మాతా<br>లా=మేటర్<br>గ్రీ=మేతర్<br>ఇం=మదర్ | ధాతురూప మొకటి,<br>మాతివర్తతేగర్భః-గర్భము దీనియందు వర్తించును. |

---

## రెండవఅధ్యాయము.

### మనుజుని ప్రథమవాంఛలు.

మొదట మనుజుఁడు దిగంబరియై కడుపునకుఁగూడును, నిలుచుటకు నీడయును లేక పశువువలె సంచరించు చుండెను. భూమి హిరణ్యగర్భ యని

వానికిఁ దెలియదు; కష్టపడిన ప్రసవోదరి యగు ననియును తెలియదు. అట్టి స్థితిలో భూమి సనకాలిమంజరి యగుట యెట్లు ?

"శరీర మాద్యం ఖలు ధర్మసాధనం" అని చెప్పిన విధమున, శరీరము నిలువడియుండిన ధర్మాచరణమునకు సమర్థత కలుగును. శరీరమును నిలువఁ బెట్టుటకు గావలసినవి మూఁడు; క్షుద్బాధను శాంతింపఁజేయుటకు ఆహారమును, చలిబాధ నుపశమింపఁజేయుట కగ్నిహోత్రమును లేక దుస్తులును, రాత్రివేళల సంచరించు మృగాదుల వాతఁబడక సుఖముగ నిద్రించుటకుఁ దగిన కుటీరములును వానికిఁ గావలయును.

ఇచటనే పశ్వాదిమృగములకును మనుజునకుఁ గలభేదము విశద మగును. సృష్టిలో శీతోష్ణస్థితులకుఁ దగినవిధమున మృగములను నిర్మించి వానికిఁ గావలసిన యాహారమును భగవంతుఁడు వానిసమీపమున నుంచెను. మనుజునకుమాత్ర మట్టులఁ గాదు. ఉదరపోషణార్థము మనుజుఁడు చెమట నోర్చినఁగాని ఆహారపదార్థములు వానికి లభింపవు; అటులనే దేశకాలానుగుణ్యముగ ధరించుటకు వస్త్రములును, ఉండుటకుఁ గూడును వాఁడు ప్రయాసముఁబడి సంపాదించుకొనవలెను. మృగములకుఁ బోలె రోమములతో నిండినదళసరిచర్మము మనుజుని స్వేచ్ఛావిహారమునకు నిరోధకము కనుక వాఁడు గంబరిగ సృజింపఁబడెను. ఇందులో విశేష మేమన, వానికి భగవంతుఁడు బుద్ధి నిచ్చెను. అందువలనఁ బదార్థజ్ఞానము కలిగి జనుఁడనము నవలి, వాఁడు పశుపతి యగును. ఎప్పటికి పశువుపశువే; కాని వాఁ డట్లు స్థిరుఁడు కాక, తనపూర్వులవిధానముల గుర్తెఱిఁగి, వానిని వృద్ధిఁజేసి, ముందువచ్చువారికి దనయాచారవ్యవహారముల వలన దగ్గనీయుఁ డగును.

గృధ్రమునకుఁగల దూరదృష్టి వానికి లేకపోయినను, "దూరదర్శిని" అనుయంత్రముఁ జేయుసామర్థ్యము వానికిఁ గలదు. ఆయంత్రముగుండ దృగ్గోచరములు కాని నక్షత్రమండలములఁ జూచుటకు శక్తికలిగెను. ఏమండల

ములకాంతి మనభూలోకమునకు వచ్చుసరికి వేలసంవత్సరములు పట్టునో, అట్టిమండలములను వాఁడు చూచును; దానిసహాయమువలన సూర్యాదిగోళములలో లోహములు కల వనుసంగతి విశదమగుచున్నది. తేఁడివలె శీఘ్రముగ గమనించుటకు వానికి శక్తి లేదు; కాని ధూమశకటములను నిర్మించి వానిద్వారా రెండుఘడియలన్నరకాలములో నలువదిమైళ్లు ప్రయాణముఁ జేయును. గుఱ్ఱమునకుఁ గలదేహబలము వానికి లేదు; అయినను, నూఱుగుఱ్ఱములపనిఁ జేయుంటకుఁ దగిన "ఆవిరియంత్రముల" ను వాఁడు నిర్మించెను.

బుద్ధిబలముఁగాని లేక దేహబలముఁగాని మనుజుఁడు వృద్ధిఁ జేయుగలఁడు. ఈదయామైనదిమొద ఉదరపోషణకొఱకు దేహబలమును వినియోగించుటలో సవరవాఁ డభ్యాసపడినందున, శీఘ్రగమనములోనేమి దూరదృష్టిలోనేమి వాఁడునాగరికుని నతిశయించును. దేహబలములో నాగరికుఁ డెంత తగ్గునో బుద్ధిబలములో వాఁ డంత హెచ్చును; వాఁ డాబుద్ధిని సన్మార్గములోను దుర్మార్గములోఁగూడ ప్రసరింపఁజేయుచున్నాఁడు. ఎన్నియుగాంతరముల క్రిందటనో మనుజుఁడు భూమిమీఁదఁ బుట్టెను. అంతకుఁ బూర్వ మెంతకాలమునుండియో నదులు ప్రవహించుచుండెను. కొంతకాలమునకు నదీప్రవాహవేగమునకు గొండలు బ్రద్దలయి లోయలయ్యెను. జీవనదులెల్లప్పుడుఁ బ్రవహించుచుండుటవలన, వాఁడు సదా వానితీరములనే నివసించుచు, వానిజీవనదుల మూలమునఁ దనజీవనమును నిలువఁబెట్టుకొనెను. ఆహారముమాత్రమంతనిరాయాసముగవానికి దొరకలేదు. బహుశః మొదటవాఁడు ఆకు అలము దుంపలు పండ్లగువానినిఁ దినుచుండె నని తోఁచును; అటులనే మొదట వాఁడు తరుచ్ఛాయలలోఁగాని, లేకభూధరదరీద్వారములలోఁగాని విరమించుచుండె నని తోఁచును. నదీప్రవాహవేగమున బోవుచు సూర్యకాంతిచేఁ దళుకుతళుకుమను మీనములను గాని, లేక తనప్రక్కనుండిచెంగుచెంగు మని దాఁటిపోవుచుండినహరిణములఁగాని తినుటకు వాఁడుకోరియుండెను; వానినిఁబట్టుటకుఁ దగిన వలలు గాని, వీనిని హరించుటకుఁదగిన యాయుధములుగాని వానికి లేవు; భగవంతుఁ

డిచ్చిన హస్తములు నెరవేర్పలేనిపను లేమియును లేవు; అయినను వానికి అనుకూలములగు సాధనములుండవలెను, గొడ్డలి లేకపోయినఁ గఱ్ఱలఁగొట్ట గలఁడా? కలము లేకపోయిన వ్రాయఁగలఁడా? కత్తి లేకపోయిన సాముఁజేయఁగలఁడా?

---

## మూఁడవ అధ్యాయము.

### మనుజుని పనిముట్లు.

ప్రథమమున మనుజున కొకవాఁడియగుసాధనము కావలసియుండెను. కోఁతఁబడుదానికంటె నీసాధనము దిట్టముగ నుండవలెను. భూమిలో లోహములు కలవనుజ్ఞానము లేనిసమయమున, వానినుపయోగించువిధ మెట్లుల వానికి దెలియును? కొన్నిలోహములు ఖనులలోఁగాక, భూమిమీఁదఁ గనఁబడుచుండినను, వాఁడు వానిని గుర్తెఱుఁగలేదు. అందుచేత వాఁడు మొదట రాతితోఁ జేసినపనిముట్ల నుపయోగించుటవలన, శాస్త్రజ్ఞులు దీనికి "ప్రాచీనపాషాణయుగము" అని నామ మిడిరి. ఈ యుగములోని మనుజుఁడు రాయి, ఎముక, కొమ్ము మొదలగువానితో ననేకములగు పనిముట్లఁ జేయుచుండెను. రెండు చెకుముకిరాళ్ల రాపుడుచే నగ్నికణములు బయలువెడలును; కనుక వానిని వాఁడుపయోగించినట్లుల గానవచ్చును; కొన్నిరాళ్లను వాఁడు త్రికోణాకారముగఁ జేసి యుపయోగించెను; మఱికొన్నిటిని కత్తివలెఁ జేసెను; మఱికొన్ని బాదము కాయవలెఁ జేయఁబడి, నలువైపులనుండిన యంచువాఁడిగ నుండెను. ఈపనిముట్లు వానివాని పరిమాణములో వ్యత్యాసముపొందుచున్నవి; కొన్ని అఱుఅంగుళములు పొడుగును మూఁడు అంగుళములు వెడల్పును కలవి. వీనికంటెఁ బెద్దవి కలవు. ఈ ప్రాచీనరీతిపనిముట్లు వాఁడి లేక మెఱుగు లేక నదులు మేట వేసినస్థలములలో దొరకెను. నదీతీరమున ప్రాచీనమనుజుఁడు నివసించి యుండుటచేత,

వాఁడుపయోగించినపనిముట్లు కొన్ని నదీప్రవాహవేగమునఁ గొట్టుకొని పోఁబడి ఆనదులు మేటవేసినస్థలములలోఁ గానఁబడుచున్నవి.

ముందుకు బహుళముగ వ్రాయఁబోవుసంగతి నిచట సంక్షిప్తముగ వ్రాయుచున్నాము. శాస్త్రజ్ఞులు కాలమును కొన్నియుగములక్రింద విభజించిరి: —

(1) "ప్రాచీనపాషాణయుగము"; ఈయుగము కేవలము ప్రాచీనమైనది; రాబోవుయుగములతో దీనికి సంబంధము లేదు.

(2) "నవీనపాషాణయుగము."

(3) "కంచుయుగము."

(4) "లోహయుగము."

1, 2 యుగములకు మధ్య ననేకయుగములు గడచి యుండవలెను. అవి యెన్నియో తెలియవు. మిగిలిన 2, 3, 4 యుగములు నొకటి ననుసరించి యొకటి వచ్చెను. ఈయుగములలో మనుజుల నిత్యకృత్యము లెవ్వియో సాంఘిక వ్యాపారములేవియో, మొదలగుసంగతులను ముందుకు వివరించుచున్నాము.

---

## నాల్గవ అధ్యాయము.

### —> అగ్ని. <—

మనుజుఁడు మొదట నగ్నిహోత్రము నెటులఁ గనిపెట్టెనో, దానివిషయమై పలువురు పలువిధములఁ జెప్పిరి. వారివారి బుద్ధికొలది వారు చెప్పిరి కాని దానిలో నెంతవఱకుసత్యమో యెంతవఱకసత్యమో మనము చెప్పలేము. అనేకుల నేక సంగతులగుఱించి యీవిధమునఁ దమబుద్ధిచాతుర్యముఁ గనపఱిచిరి. ప్రస్తుతము "అగ్గిపెట్టెలు" దొఱుకుచుండినను, యజ్ఞాదిక్రతువుల, జేయునపుడు

అరణిఁదఱచి నిప్పుఁబుట్టించెదరు. ఈవిధముననే మనుజుడు మొదట నగ్నిఁ గని పెట్టెను. ఏవిధమైన నెండుదిట్టమగు పదార్థముల రాపుడువలన నగ్ని పుట్టునని వానికి తెలియును. చెకుముకిరాళ్లతో నాయుధములఁ జేయునపుఁ డగ్నికణములు వెడలునుకదా! అటుపైని చలిబాధవిశేషముగ నుండినపుడు ఆఱచేతులనునులుపుటొనినఁ గొంతవేఁడిమి శరీరములోఁ బుట్టునుకదా! ఒకకఱ్ఱలో గాడి ద్రవ్వి, దానికి సరియగుకఱ్ఱతో దానిఁద్రచ్చుటవలన, మొదటను వేడిమిపుట్టి ధూమము వెడలి, తదుపరి స్ఫులింగములువచ్చినపైని వహ్ని జ్వలించును.

యాత్రికులు చెప్పినకథలను వినిన, సవరలు మొదలగువారీవిధముననే నేటివఱకు నగ్నిం జేయుచుండిరని తెలియనగును. ఐరోపాఖండమున కుత్తర సముద్రములోని ద్వీపవాసు లొకమాదిరిచిన పక్షిశరీరములో వర్తిందోపి దానిని వెలిగింతురు. అది క్రొవ్వొత్తివలె వెలుతురు నిచ్చును. రాత్రివేళల వనమృగముల బారినుండి తప్పించుకొనుట కీనాఁడెంతమనుజునకావశ్యకమో, ఆనాఁడును మనుజునకావశ్యకము గనుక, వాఁడునిప్పుఁజేసి దానికిసమిధలఁదగిలించి అవిచ్ఛిన్నముగ దానిని కాపాడుచుండెను.

---

## అయిదవ అధ్యాయము.

### పాకము - పాత్రలు.

పచనముఁజేయని పచ్చిమాంసమును మనుజుఁడు తినుచుండెను; ప్రస్తుతము కొందఱుసవరలు పచ్చిమాంసముఁ దినుచున్నారు. వాఁడు క్రమముగ పచనముఁజేయుటఁ దెలిసికొనెను; పదార్థములను నిప్పులోవేసి, వానిఁగాల్చి భుజించెను. పచనముఁ జేయుటకు మఱియొకవిధముకలదు. భూమిలోఁ జిన్నగొయ్యిఁ ద్రవ్వి, వాఁడు చంపినజంతువుయొక్క తోలు నాగోతిలోఁబఱచి, నీరుఁబోసి,

దానిలోఁ బచ్చిమాంసమును వేసి, అటుపైని యెఱ్ఱఁగాల్పఁబడినరాళ్లను దానిలో వేసిన పిమ్మటనీరుడికి మాంసము పచనమగుచుండెను. రెండవవిధ మేమన పాత్రలకుమన్నును వ్రాసి, వానిలో మాంసము నుంచి నిప్పుమీఁద నుడికించెను. అగ్నిసంస్కారమువలన మట్టికి గట్టిదనము వచ్చుటఁజూచి మృత్పాత్రలఁజేసి, వానిని నిప్పులోఁగాని సూర్యకాంతిలోఁగాని కాల్చి, అవి గట్టిపడిన తరువాత వానిని వాఁడుపయోగించెను.

---

## ఆఱవ అధ్యాయము.

### నివేశములు.

ప్రథమమున మనుజుఁడు గుహలలోను, తరువాత, నేలమాన్యములఁ ద్రవ్వికొని, వానిచుట్టు మట్టిగోడలఁబెట్టి, వానిమీఁదఁ గొమ్మలతోఁ బంజరము వేసికొని, వానిలోను, మఱికొంత కాలమునకు రాళ్లనొకదానిమీఁద నొకటిఁ జేర్చి, వానిమీఁదఁ గప్పువేసికొని దానిక్రిందను నివసించెను. ఒకానొకప్పుడు నీళ్లలోఁగఱ్ఱలను స్థిరపఱచి, వానిమీఁద నఱపగట్టి దానిలో వాఁడు జీవించి యుండినట్లు తెలియుచున్నది. ఇట్టి అఱపలు "స్విసు (Switzerland) సరస్సులలో గాన నగును. నీళ్లలోనికిం దిగఁగొట్టఁబడిన కఱ్ఱలాకారమును జూచ నవి రాతి పనిముట్లతోఁ జెక్కఁబడినట్లు తోఁచును; ప్రథమమున నిట్టి "సరోనివాసముల"లో నివసించి, వాఁడువనమృగములవాతఁ బడక, శత్రుదాడినుండి తప్పించుకొనెను.

ఇట్టి "సరోనివాసముల"లో మనుజుఁడు జీవించుట "నవీనపాషాణ యుగము"లోనేగాక, తూర్పుహిందు దీవులలోను, ఆఫ్రికాఖండమధ్యభాగములోను నేటివఱకు కట్టినివాసములలో మనుజులసృష్టిస్థితిలయములు జరుగుచున్నవి. వీరు రాతిపనిముట్ల నుపయోగించుచు, వానితోఁ జెట్లఁగొట్టి పడఁ

బోరియుండును, ఎలుగు, తోడేలు, వరాహము మొదలగు జంతువులఁ జంపుచుండిరి. చేపవాఁడలలం బన్ని వానితోఁ జేపలం బట్టుకలదు. ఈవలలను నీళ్లలోఁ దేల్చుటకుఁ జెట్లబెరడును, మునుఁగించుటకు రాళ్లను వారుపయోగించిరి. మనుజాని ప్రాచీననివాసము లిట్టివని తెలియుటయే కాక, స్కాట్లాండు డెన్మార్కు దేశముల సముద్రతీరప్రాంతములయందు కుప్పలుకుప్పలుగఁ బడియుండిన నివేశములకు "పాకశాల" లని పిలుచుచున్నారు. ఆలచిప్పలు, సంకులు మొదలగునవి కుప్పలై పడియుండినందున, వానిలోని పురుగులఁ దినుచు మనుజుఁడీ ప్రాంతమున నివసించెను. ఇంతియ కాదు. లేళ్లు, దుప్పులు మొదలగు జంతువుల యెముకలును పక్షులయెముకలును చిన్న చెకుముకిరాయికత్తులును మఱికొన్ని వస్తువులు నీప్రాంతమునఁ గానవచ్చుచున్నవి.

మనుజునకు ముఖ్యముగ మూఁడువస్తువులు కావలయునని చెప్పియుంటిమి: పరుండుటకుఁ గూడును, నిలుచుటకు నీడయును, కాఁగుటకు నిప్పును వానికిఁ గావలయును. ఈమూఁడు నెటుల లభించెనో చూచితిమి. ఇక ముందు ప్రశ్నయేమన, ప్రాచీనపాషాణయుగమున మనుజు లేపదములనుపయోగించి సంభాషించిరి? ఈప్రశ్నకు జవాబుఁ జెప్పుట కష్టము కాని మఱియొకవిధమునఁ జెప్పవచ్చును. ఒకరిమనస్సులోని యూహలను మఱియొకరు గ్రహించుటకుఁ దగినసంజ్ఞలఁ గలిగియుండి, వానిమూలమున నితరసంగతుల నెటుల నేర్చుకొనిరో, అటులనే వ్రాతకోఁతలను గూడను క్రమముగఁ దెలిసికొనిరి. ఎముకలమీఁదను స్లేటుబల్లల మీఁదను మోటుగ వ్రాయఁబడిన లేళ్లు, దుప్పులు, వరాహములు మొదలగు నన్నిమృగముల బొమ్మలఁ జూడ, ఆయుగమునాఁటి మనుజులకుం బొమ్మలను వ్రాయుటలోఁ గొంత యభ్యసించియుండినట్లు తోఁచును. ఇదివఱకెన్నఁడును మృగములు బొమ్మలను అక్షరములను వ్రాసియుండెనని కాని, లేక అగ్నిహోత్రముఁ జేసియుండెనని కాని, వినలేదు, చూడలేదు; కనుక నీవిషయములలోనే కాక తదితరవిషయములలోఁగూడ మనుజుఁడు మృగములకంటె శ్రేష్ఠుఁడని చెప్పవలయుచున్నాము.

ఆకాలపుమనుజులప్రాంతకాంతలవిషయమై విశదముగ మున్ముందు వ్రాయుచున్నాము.

---

## ఏడవఅధ్యాయము.

### లోహములు - వానియుపయోగములు.

కాలక్రమమున నందఱికంటె బుద్ధిమంతుఁడును పదార్థములను సూక్ష్మముగఁ గనుఁగొనఁగలట్టివాఁడొకఁడు భూమి హిరణ్యగర్భయని తెలిసికొని, లోహముల నందఱికి వెల్లడిఁజేసెను. ఆమహాపురుషుఁడు లోకమునకుఁ జేసిన మహోపకారమును మఱచిపోఁగలమా? లోహములను, వానియుపయోగములను గుర్తెఱుఁగనిదినములలో మనుజుఁడుపొందిన దురవస్థలఁదలఁచిన లోహము లిట్టిమహోత్కృష్టమగు పదార్థములని తెలియనగును. లోహము లిట్టివని నేటి వఱకుఁ దెలియకయుండిన, నపారపారావారముయొక్క పారమునకుఁ బోఁదగిన పొగయోడలును, సముద్రవతియగుభూమిని సుస్వాయాసముతోఁ బ్రదక్షిణముఁ జేసివచ్చుటకుఁదగినధూమశకటములు నసంభావితములై యుండును. లోహజ్ఞానము లేని యవస్థ దురవస్థ, అదియపోహంబు.

దినదినప్రవర్ధమానంబగు మానవచరిత్రం జూడ, మనుజుఁడు పెన్నిధానంబగు భూదేవిం జేసినయాచనసార్థకమయ్యెను. ఎప్పుడు వాఁడు చేయఁబూనినపనికి రాళ్లు అనుపయోగములయ్యెనో, అప్పుడు వాఁడు తనకుఁ గావలసిన లోహములను భూమిలోనుండి తీసికొనివచ్చెను. అరణ్యములు పెఱుకఁబడినతరువాతను, అవిచ్ఛిన్నాగ్నిహోత్రమును స్థాపించుటకుఁ దగిన రాతిబొగ్గు భూమిలో దొరకెను.

అన్నిలోహములఁ దెలిసికొనుటకుఁ బూర్వము మనుజుఁడు బంగారమును గుఱుతుపట్టెను. అన్నిలోహములకంటెఁ గాంతికలది కనుకఁ గాంచనమనియు, మంచివన్నెగలది కనుక సువర్ణమనియు బంగారమునకుఁ బేర్లు కలవు. దాని కాంతికి వాఁడు భ్రమించెను. ఇతరలోహములవలెఁ గాక స్వచ్ఛముగ నదులలోను రాళ్లలో నది దొరకును. అది మెత్తనిది. కనుక నుపయోగించుటకు వీలుపడదని గ్రహించి దానిని రాగితో మేళనముఁ జేసి గట్టితనము వచ్చినతరువాత నుపయోగించెను. స్వచ్ఛమగు బంగారముతో నాభరణములఁ జేసి, వానితో దేహమును వాఁడు శృంగారించుకొనెను. అలంకారాపేక్షలో వనవాసియుఁ బురవాసియు సరిసమానులు. పాషాణయుగములో మనుజుఁడు ధరించిన నత్తగుల్లలహారములు నేఁడు చూడనగును; ఈనాఁడుకూడ వనవాసులకు వస్త్రధారణయందుకంటె నాభరణధారణయం దాసక్తి మెండు. అన్నిదేశములలోను అన్నికాలములలోను, ఎంతకష్టమైన నోర్చి, పచ్చబొట్లను మనుజుఁడు పొడిపించుకొనుటచేత, నిర్గుణమగుశృంగారమును గుర్తెఱిఁగి, తాను సింగారించుకొనవలెనని కోరుటయే వానికిని పశువులకును గలతారతమ్యమును సూచించును. సూర్యాస్తమయముయొక్క చక్కఁదనముఁ జూచునెడఁ బశువులు మేఁతమాని వానిశిరస్సులను మీఁదికి నెత్తునా! అంతరిక్షమున నింద్రధనుస్సు కనఁబడినపుడు గుఱ్ఱములుకాని వానరములుకాని ఆనందముఁ బొందునా ?

పతితపదార్థములతోఁ గలియక స్వచ్ఛముగ భూమిలో దొరకుటవలన, బంగారమునువలె తామ్రమును మనుజుఁడు వాడుకొనెను. మెత్తనిలోహమగుటచేత ననేకరూపములుగ మార్చి దానిని వాఁడుపయోగించెను; ఎచ్చటనైన తామ్రము విశేషముగ దొరకక, తగరము దొరికినయెడల, ఈరెండులోహములఁ గరిగించి, ఆమిశ్రలోహమగు కంచును వాడుకొనెను; కరిగినకంచును మూసలోఁబోసి, తనకిష్టమువచ్చిన యాయుధములఁ జేయుచుండెను; ఏయుగములో నీలోహములను వాఁడుపయోగించెనో, దానిని ''కంచుయుగ''మని పిలుచుచున్నాము. ఇనుము వాడుకలోనికి వచ్చుసరికి చాలకాలము పట్టెను. లోహము

ఖనులలోఁగాని స్వచ్ఛముగ దొరకదు. ఏస్థలములలో నది దొరకునో గుర్తెఱుఁగవలయును; అటుపైని ఖనిఁ ద్రవ్వి, ఆజాతిని తీసి కరిగించి మూసలో నుండి తీసినపైనకదా దానిని వాడుకచేయవచ్చును; ఇదియంతయు కష్టమైన పని. ఏనాఁడు వాఁడీపనిని సాధించెనో ఆనాఁడు దానితోఁ గత్తులును కుఠారములును బాణములును మొదలగులోహపుసామగ్రులఁ జేయనారంభించెను; ఆభరణములకును పిడులకును కంచు నుపయోగించెను; చెవిపోగులు, కంకణములు మొదలగు కంచు ఆభరణములు "స్విసు" సరస్సులలోఁ గానఁబడుచున్నవి. కాలక్రమమున వెండి బంగారు ఆభరణములు వాడుకలోనికి వచ్చెను.

నదులలోను, సరస్సులలోను, కొండగుహలలోను, భూగర్భములోను దొరకినపనిముట్లు, ఆభరణములు, ఆయుధములు మొదలగువానిని పరిశీలించి, వేనవేల సంవత్సరముల క్రిందటనుండి మనుజుఁడు భూమిమీఁద జీవించుచుండె నని చెప్పుచున్నాము. పత్రములమీఁదఁగాని కాగితములమీఁదఁగాని వ్రాయఁబడిన చరిత్రములానాఁడు లేవు. దినదినప్రవర్ధమానమగుమనుజుని చరిత్రలో వాని ప్రాచీనచరిత్రను నాలుగుభాగములుగ విభజించిరి; అవియేవనిన:—

(1) ప్రాచీనపాషాణయుగము.

(2) నవీనపాషాణయుగము
(3) కంచుయుగము
(4) లోహయుగము

} ఈ మూఁడుయుగను లవిచ్ఛిన్నముగ నొకటిగరువాత నొకటి వచ్చెను. ఈ యుగముల కాలపరిమితిఁ జెప్పలేము.

అయిన నొకటి నిశ్చయము; పాషాణయుగముల తరువాతఁ గంచు - లోహయుగములు వచ్చెననియు, ఆయాయుగములలో మనుజుఁ డాయావస్తువుల నుపయోగించుచుండెననియుఁ జెప్పఁగలము. ఇంతియకాదు. ఒకకాలమే కొందఱికిఁ బాషాణయుగము కావచ్చును; మఱికొందఱికిఁ గంచు లోహయుగములు కానవచ్చును.

ఇదివఱకు "సరోనివాసముల" గుఱించి ప్రశంసించియుంటిమి. ఈ నివాసములను "నవీనపాషాణయుగము వారు కట్టినప్పటికిని, వారిలోఁ గొందఱు "కంచుయుగము" లోనివారని తోఁచును. ఈ "సరోనివాసుల" కు గోధుములఁ బండించుటయు, పండినపంటలను నిలువఁజేయుటయు, గోగునారతో వస్త్రములనేయుటయు, "ఆవులు, ఎద్దులు, గొఱ్ఱెలు, మేఁకలు, గుఱ్ఱములు, కుక్కలు" మొదలగు జంతువులఁ బెంచుటయు వారికిఁ దెలియును. "లోహయుగము" వచ్చునప్పటికి మనుజుఁ డెంతియభివృద్ధి నొందెను? మృత్పాత్రలను, కంచునాణెములను, గాజుమొదలగువస్తువులఁ గనిపెట్టెనుకదా! "కాలమొకరీతిఁ గడవఁబోదు" కుడుచుటకుఁ గూడును, నిలుచుటకు నీడయును, కట్టుటకు గుడ్డయును లేక పశువువలె సంచరించినమనుజుఁడు 'లోహయుగము' నాఁటి కెంతిబుద్ధిమంతుఁ డయ్యెను. ఆనాఁటికానాఁ డుప్పొంగుచు, అధోలోకముల నధిగమించి, ఊర్ధ్వలోకముల కూర్ధ్వమై, ఏకకాలమున నేడేడుపదునాలుగులోకముల నవలోకించుచు వానిబుద్ధి విజృంభించెను.

"ఇంతింతై వటుఁడింతయై మఱియుఁ దానింతై నభోవీథిపై" అని వామనావతారమును గుఱించి చెప్పినసంగతి యీ విషయమును సూచించును.

---

# ఎనిమిదవఅధ్యాయము.

## మానవకోటికాలవిమర్శనము.

భూగర్భములోను, నదులలోను, సరస్సులలోను, పర్వతగుహలలోను దొరికినయెముకలను, ఆయుధములను, ఆభరణములను, పనిముట్లను చూచికదా మనుజుఁడు పెక్కువేలసంవత్సరముల క్రిందటనుండి భూలోకములో నుండెనని చెప్పుచున్నాము. ఈనిదర్శనము లంత ప్రాచీనములని చెప్పనేల?

ఆసియా, ఐరోపా, ఆఫ్రికాఖండములలో నచ్చటచ్చట భూమిలో నలుబది, యేఁబది, అఱువది అడుగుల లోతున త్రవ్వి చూచినపు జీవవస్తువులు దొరకెను. ఏమనుజులైన వీనినన్నియు సమకూర్చి భూమిఁ ద్రవ్వి, దానిలో నంతి లోతున పరిహాసార్థము వీని నుంచెనని తలంచుట పిచ్చియాలోచన కాని మఱియొకటి కాదు. భూమి పెక్కుమార్పులఁ జెందియుండెను; పల్లము మెరకయును, మెరక పల్లమగుచున్నది; నదులమార్గములు, నదీముఖద్వారములును మాఱుచున్నవి; కొన్ని భూములను సముద్రము ముట్టుచున్నది; మఱికొన్ని భూములు సముద్రములోనుండి పైకి వచ్చుచున్నవి. జీవులు శరీరమును విడిచినప్పుడు అగ్ని సంస్కారము కాని లేక భూసమాధిక్రియ కాని వానికిఁ జరగనపుడవి యచ్చటనె పడియుండును; కాలాంతరమున వానిమీఁద భూమిమేట వేసినందున, నంత లోతున నవి దొరకెను. మనుజునియొక్కయు ఇతరజంతువులయొక్కయు దుముకలును పునుకలును కలిసి కనఁబడుచున్నవి. శాస్త్రజ్ఞులు వానిని పరిశీలించి, ఆ కాలపుమనుజుని శరీరదార్ఢ్యమును ఔన్నత్యమును బుద్ధినిగుఱించి వ్రాసియున్నారు. అనంతకోటికాలము భగవంతునకు త్రుటిమాత్రము. వానిమహిమ యేమని చెప్పవచ్చును? శాస్త్రజ్ఞానము బహుళమైనకొలఁది, పరమేశ్వరుని మహిమ విపులమగుచున్నది.

---

## తొమ్మిదవ అధ్యాయము.

### గోపాలకులు, హాలికులు, వర్తకులు.

దిగంబరియై, వనవాసియై ఆహారముదొరకినదుంపను లేక పచ్చిమాంసముఁదిని పశువువలె సంచరించుచుండిన మనుజుఁడు క్రమముగ గోపాలుఁడై

కారులై వారుజీవించిరి. ఈవిధముననే తదితరవృత్తివ్యాపారములు బయలు వెడలెను. పదుగురుకలిసి పదికొంపలఁగట్టిన, నదియొకపల్లె యయ్యెను. పల్లెలు గ్రామములును, గ్రామములు పట్టణములును, పట్టణములు నగరములయ్యెను.

ప్రజలందఱు కలిసి శత్రువులతోఁ బోరాడుచుండిరి; లేక పిక్కబలమును దండబలమునుగల తమలోఁగొందఱినెంచి వారిని శత్రువులమీఁదికిఁ బంపుచు వచ్చిరి; వీరె సైనికులు; వీరే క్షత్రియులు; వీరివృత్తి "వీరవృత్తి". పదుగురుకలిసి జీవించినపుడు, అనఁగా సాంఘికులైనపుడు, స్వకార్యములలోఁ గాని లేక అన్యోన్యసహాయకృతకార్యములలోఁ గాని వారొకరితో నొకరు కలియుట తప్పనందున, వారు స్వధర్మములను నియమించుకొనిరి; వీనినే సాంఘికధర్మములని పిలుచుచున్నాము. మనుజులను వారివారిధర్మములలో నడిపించుటకును, శత్రువులమీఁదికి సైనికులను నడిపించుటకును వారికొకనాయకుఁడు కావలసి వచ్చెను. దేహబలముఁగలిగియుండినఁగాని యుద్ధముఁజేయ నేరఁడనియు, బుద్ధిబలముగలిగియుండినఁగాని ధర్మసంస్థాపనఁజేయ నేరఁడనియు వారు తలంచి, ఈ రెండుబలములు కలవానిని తమలోఁ దామెంచుకొని, వానిని నాయకునిగ నిర్ణయించుకొనిరి. ఈనాయకుఁడు క్రమముగ "రాజు" అయ్యెను.

నేఁడువలె నాఁడుకూడ మనుజులు అరిషడ్వర్గమునకు లోఁబడియుండిరి. కనుకవారిలో వారుగాని వారుపరులతోఁగాని పోరాడుచుండిరి. సాధారణముగ హాలికులును నగరవాసులును స్థిరులుకనుక వారిస్వభావము శాంతిమై యుండును; అస్థిరులై దేశసంచారముఁజేయువారును లేక పశువులమందలను వెంటఁ బెట్టుకొని సంచరించుగోపాలకులును శాంతచిత్తులుగాక ధూర్తులై వారికంటికింపుగఁ గనఁబడినదేశముమీఁదికిఁ బోయిదేశవాసులను దండించి బలాత్కారముగ దాని నాక్రమించుకొనుచుండిరి. ఇందువలనఁ దెలియునది యేమనిన, స్థిరులైయుండినవారికంటె నస్థిరులగువారు కలహమునకుఁ గాలుదువ్వుదురు. శాఖామందులము మేము మేమని వారిలోవారు పెనుఁగులాడుచుండిరి. ఇతరు

వృత్తులకంటె సేద్యపువృత్తి శ్రేష్ఠమని తలంచి, హాలికులు కష్టపడి పండించిన పంటలలో భాగమును దేశద్రిమ్మరులు కోరినపుడుగాని లేక లోహక్రియఁజేసి కొని జీవించుచుండినవాఁడు చేసిన పనిముట్లను వారు కోరినపుడును, దెబ్బలాటలు వచ్చి ఒకరినొకరు కొట్టుకొని చచ్చుచుండిరి. మాత్స్యన్యాయము ననుసరించి బలవంతులు బలహీనులఁ గొట్టి వారిభూమి నాక్రమించుటయు లేక వారి పంటలఁ బాడుచేయుటయు లేక వారిలోఁ గొందఱిని బానిసలుగఁ దీసికొని పోవుటయు — ఈమొదలగు దుష్కార్యములు సంభవించెను. అనంతరయుగములలోవలె నాయుగములోఁ గూడ మనుజులు దయాదాక్షిణ్యములులేక రక్తపానాపేక్షులై యుండిరి. "బలవంతుఁడు రాజు, వానిది రాజ్యము" అను సంగతి తప్ప మఱియొకటి వారికిఁ దెలియదు.

వైరముఁ బాటించి మనుజు లెంతకాలము జీవింపఁగలరు? కొంతకాలమునకు వైరమును మాని వారు శాంతచిత్తులై మిత్రులై జీవించిరి. మఱికొంతకాలమునకు వర్తకము సాగెను; భూమిని హాలికులు సాగుఁజేసి రెండింతలు పంటలఁ బండించిరి; సంవత్సరము పొడవున వారిభోజనమునకుఁ గావలసిన దానికంటె నధికముగఁ బండుచుండెను. ఈపంటలోఁ గొంతభాగమును గోపాలకులకిచ్చి, వారి పసువులఁ బుచ్చుకొనుచుండిరి; మఱికొంతభాగమును కమ్మరులకును వస్త్రంగులకు నిచ్చి వారుచేసినపనిముట్లం బుచ్చుకొనిరి. ఇట్లుల నిచ్చిపుచ్చుకొను వ్యాపారము జరుగుచుండెను; ఎంతకాలము తమవస్తువుల నొకరికిచ్చి వారినద్దనుండిన వానినిఁ బుచ్చుకొనుచుందురు? ఇది కష్టమగుపని; కనుక గవ్వలను రాగిముక్కలను లోహపుముక్కలను క్రమముగ వాడి తుదపరి కంచు, వెండి, బంగారు నాణెములను ఉపయోగించిరి. ఇదియే వర్తకము. పూర్వకాలదేశచరిత్రలఁ జూచిన నానాఁడు గూడ ప్రజలు వెండి బంగారములను విలువగల వస్తువులని తలంచి దానినాణెముల నుపయోగించిరి. "బైబిలు" గ్రంథములో "ప్రపంచోత్పత్తికాండ"లోఁ జెప్పిన విధమున, వెండిబంగారములను పశువులఁ గలిగి "అబ్రహాము" భాగ్యవంతుఁడై జీవించెను.

---

# పదియవఅధ్యాయము.

## భాష.

మనుజుఁడు తనకోరికలను ఊహాపోహాలను పరులకుఁ దెలియఁ జేయుట కభిలషించుటవలన భాష పుట్టెను. ఇతరసంగతులఁ గనిపెట్టి ఎటుల వానిని వాఁడు, వృద్ధిఁ జేసెనో, అటులనె భాషఁ గనిపెట్టి దానిని వాఁడభివృద్ధిఁ జేసెను. భాష ధ్వనిరూపకము; ఆధ్వనులు స్వల్పములు; వానిని వివిధముగ సమకూర్చుటవలనఁ బదములు పుట్టెను; ఆపదములసముదాయమునకు భాష యని పిలుచుచున్నాము. అనేకవిషయములను గుఱించి పదములు కలవు. ఆహా! మనుజుని బుద్ధిబల మెంతవఱకు విజృంభించెను? ప్రాచీనభాషలను ఆధునికభాషలను విమర్శించి చూడ వానిబుద్ధి విశద మగును. ప్రతిపదమును విభజించి దానివ్యుత్పత్తిఁ జూచిన నీసంగతి తేటపడును. సంస్కృతభాషలోఁ బదము లనేకములు కలవు: కాని, వానిధాతువు లన్నియు మూఁడునాలుగువందలకంటె నధికముగ లేవు. కొన్ని ప్రచలితభాషలు దినదినాభివృద్ధి నొందుచున్నవి; విదేశీయసంసర్గము భాషాభివృద్ధికి శ్రేయోదాయకము; స్వభాషలో లేనిపదములను వారన్యోన్యము చేర్చుకొనియెదరు ; నూతనవిషయములకు నూతనపదములను వారు కల్పింతురు.

మనుజునకు మొదట భాషాపదములు స్వల్పముగ నుండెను; అవి యైనను చిన్నవి, పెద్దవి కావు; తనకోరికలను ఊహాపోహాలనితరులకుఁ దెలియఁ జేయుటకు వాఁడు సంజ్ఞఁ జేయుచుండెను. శిరస్సునునానావిధములుగఁ ద్రిప్పుటవలన వానిభావము లనేకములు తెలియ నగును.

శ్లో. "ఆకారై రింగితై ర్జ్ఞాత్వా చేష్టయా భాషణేన చ,
నేత్రవక్త్రవికారేణ లక్ష్యతేఽంతరతం మనః."

ఆకారముచేతను, చేష్టలచేతను, నేత్రవక్త్రవికారములచేతను మనుజుని అంతర్భావముఁ దెలిసికొనవచ్చును. విదేశములలో యాత్రఁ జేయునపుడు, వారిభాష మనకుఁ దెలియనందున సంజ్ఞలవలనఁ గదా మనభావములను వారికిఁ దెలియఁజేయుదుము.

మానవజాతు లన్నియు నొకకుటుంబములోనివా రని చెప్పినవిధమున, భాషలన్నియు నొకమాతృభాషనుండి పుట్టె నని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు; కాని క్రమముగ జ్ఞాన మభివృద్ధి నొందినకొలఁది, ప్రాచీనసిద్ధాంతమును విడిచిపెట్టి, మఱియొకమార్గమును వారు త్రొక్కిరి. ప్రపంచములోనిభాషలకు మూఁడు ఆధారములు కలవు; వానిని "మాతృక" లని పిలిచెదరు. "యూదులు" అనువారిమతగ్రంథము "బైబిలు" యొక్క ప్రథమభాగము "హెబ్రూ" భాషలో వ్రాయఁబడెను; అందుచేత నాభాష మాతృకయని కొందఱు శాస్త్రజ్ఞులు తలంచిరి; కాని, ఇటీవల చేసిన శాస్త్రపరిశోధనములవలన నీమతమును విడిచిపెట్టిరి. పదములయొక్క ధాతురూపములంబట్టిచూడ, సంస్కృతము, జెండు, గ్రీకు, లాటిను మొదలగుభాషలను "మాతృక" యొకటి యని తెలియుచున్నది. ఈమాతృకకు "ఇండో జర్మానిక" భాషయని పేరు కలదు; ఇది నేఁడు అప్రచలితము. ఈ అప్రచలితభాషను "ఇండో-ఆర్యను" లేక "ఇండో-జర్మానిక" కుటుంబమువారు అవిభక్తముగ నుండినపుడు మాట్లాడుచుండిరి యని యూహించెదము. ఈమాతృకకు అష్టకన్యలు కలరు; వారి నిదిగువ నుదహరించెదము:—

I. ఆర్యులు—వీరిలో రెండుశాఖలు కలవు:—

(1) హిందూశాఖ—వీరిభాష సంస్కృతము. అనంతరము ప్రాకృతభాషలు. సంస్కృతము దేవభాష; కొంతకాలమునకు నది ప్రచలితమై, క్రమముగ వాడుకలోనుండి తప్పెను.

(2) ఐరేనియనుశాఖ—వీరు ద్వివిధులు.

(*a*) పశ్చిమశాఖ— వీరిభాష ప్రాచీనపారసీకము —క్రీ. పూ. సం. 520-350 రములు.

(*b*) తూర్పుశాఖ—వీరిభాష "అవెస్త"—ఈభాషకు "జెండు ఆవెస్త లేక జెండు లేక ప్రాచీనబాక్ట్రియను" అని మూఁడు నామములుకలవు. ఆవెస్త అనునది "జోరాస్ట్రియను"ల ప్రాచీన మతగ్రంథము.

II. ఆర్మీనియను—క్రీ. వె. 5 శతాబ్దము:—ఈభాషలోని ప్రాచీన గ్రంథము లాశతాబ్దము నాఁటివి అని తెలియుచున్నది.

III. గ్రీకు—ఈభాషయు, దానియుపశాఖలును.

IV. ఆల్బేనియను:—ప్రాచీన "ఇలీరియా" దేశములో నీభాష ప్రచలిత మయ్యెను; దాని ప్రాచీనగ్రంథములు క్రీ వె. 17 వ శతాబ్దమునాఁటివి అని తెలియుచున్నది.

V. ఇటాలికు:—ఇది ద్వివిధము—లాటిను అనియు అంబ్రియను-సామ్నిటికు అనియు—పోర్చుగీసు; స్పానిషు, కతలేనియను, ప్రావన్సాలు, ఫ్రెంచి, ఇటాలియను, రోమానియను, మొదలగు భాషలకు "లాటిను" మాతృక అయ్యెను.

VI. కెల్టికు:—

(1) గాలిషుభాష:—లాటిను, గ్రీకు, గ్రంథకర్త లుపయోగించిన పదములనామములఁబట్టియు, నాణెములవలనను, ఈభాషయొక్క పదములు తెలియుచున్నవి.

(2) బ్రిటానికు భాష:—కిమ్రికు లేక వెలుషు, కార్నిషు, బాసు బ్రెతను లేక ఆర్మోరికను, అను మూఁడుభాషలకు నది మాతృక అయ్యెను.

కిమ్రిక, బాసుబ్రెతను — అను నీరెండుభాషలలో వ్రాయఁబడిన ప్రాచీనగ్రంథములు క్రీ. వె. 8-9 వశతాబ్దములనాఁటివి అని తెలియుచున్నది.

(3) గేలికభాష:— ఐరిషుగేలిక, స్కాచిగేలిక, మాంక్సు — అను నీమూఁడుభాషల కామె మాతృకఆయ్యెను. ప్రాచీనగేలికభాషలో వ్రాయఁబడిన "ఓగం" శాసనములు క్రీ. వె సం॥ 500 రమునాఁటివి అని తెలియుచున్నది.

VII. బాల్టిక — స్లావోనికభాష: —

(1) బాల్టికశాఖ —

(a) ప్రాచీన-ప్రష్యను — ఈభాష 17-వ శతాబ్దమునాఁటికి అప్రచలిత మయ్యెను.

(b) లిథ్యూనియను,

(c) లెట్టిస్కు — ఈరెండు భాషలలో వ్రాసిన ప్రాచీనగ్రంథములు 16-వశతాబ్దమునాఁటివి.

(2) స్లావోనికశాఖ:— ఈశాఖకు రెండు ఉపశాఖలు కలవు —

(a) ఆగ్నేయ ఉపశాఖలో "రష్యను, బల్గేరియను, ఇలీరియను" భాషలుకలవు.

(b) పశ్చిమ ఉపశాఖలో "జెక్కు, సొరాబియను, పోలిషు, పొలాబియను" భాషలు కలవు.

VIII. జర్మానిక భాష:— తూర్పుజర్మానిక అనియు పశ్చిమజర్మానిక అనియు ఈభాష ద్వివిధము.

(a) తూర్పుజర్మానికభాష: —

(1) గాతిక—పశ్చిమగాతుల మతగురువు "ఉల్ఫిలాసు" క్రీ. వె. 4-వ శతాబ్దములో నీభాషలో "బైబిలు" గ్రంథమును వ్రాసెను. ఈ భాషలో నీగ్రంథముతప్ప మఱియొకటి కానరాదు.

(2) ప్రాచీన నార్సుభాష:—ఇది ద్వివిధము.

(a) తూర్పునార్సుశాఖలో "స్వీడిషు, గత్నిషు, డేనిషు" భాషలు కలవు.

(b) పశ్చిమనార్సుశాఖలో "నార్వేజియను, ఐసులాండిక" భాషలు కలవు. ఈతూర్పు జెర్మానికభాషలలో వ్రాయఁబడిన "రూనిక" శాసనములు క్రీ. వె. 3-4 శతాబ్దముల నాఁటివి అని తెలియుచున్నది.

(b) శ్చిపమజెర్మానికభాష:—

(1) హైజెర్మను:—దీని ప్రాచీనగ్రంథములు. క్రీ. వె. 8-వ శతాబ్ద మధ్యభాగమునాఁటివి.

(2) లోఫ్రాంకోనియను:—క్రీ. వె. సం. 1200రము వఱకును ప్రచలితము.

(3) లోజెర్మను:—దీని గ్రంథములు క్రీ. వె. 9-వ శతాబ్దమునాఁటివి. క్రీ. వె. సం. 1200 రము వఱకు నీభాషకు "ప్రాచీనసాక్సను" అని పేరు కలదు.

(4) ఫ్రిసియను:—దీని ప్రాచీనగ్రంథములు 14-వ శతాబ్దమునాఁటివి.

(5) ఇంగ్లీషు:—దీని ప్రాచీనగ్రంథములు 7-వ శతాబ్దాంతమునాఁటివి.

ఇంగ్లీషుభాష త్రివిధము:—

ప్రాచీనభాష:—క్రీ. వె. సం. 700—1100 రములు.

మధ్యభాష:—క్రీ. వె. సం. 1100—1500 రములు.

ఆధునికభాష:—క్రీ. వె. సం. 1500 మొదలు నేటివఱకు.

సం=మధు ; జెండు=మధు ; గ్రీ=మేధు ; ఇం=మీడ్ ; లి=మిదుస్ ;
సం=యుగం ; ఇం=యోక్ ; గ్రీ=జుగన్ ; లా=ఇ యుగం ; గా=యుక్ ;
లి=యుం గాస్ ;
సం=రుధిర ; గ్రీ=ఎ-రుత్రాస్ ; లా=రుబర్ ; గా=రౌడ్స్ ;
సం=పితృ ; ఇం=పాదర్ ; గ్రీ=పెతెర్ ; లా=పాటర్ ; గా=పాదర్ :
సం=మాతృ ; ఇం=మదర్ ; గ్రీ=మాతెర్ ; లా=మేతర్ ; హై జి=మూఓతర్.
సం=భ్రాతృ, ఇం=బ్రూదర్ ; జెండు=బ్రాటర్ ; గ్రీ=ఫ్రటర్ ; లా=ఫ్రిటర్ ;
లి=బ్రాతిస్.
సం=స్వస్పృ ; ఆర్మీ=స్కేసుర్ ; గ్రీ=హెకుర ; లా=సోక్రుస్ ; గా=స్వైరో ;
సం=త్వం ; ఆర్మీ=దు ; గ్రీ=టూ ; లా=టూ ; గా=దూ ; లిథ్యూ=తు ;
సం=దశ ; గ్రీ=డెక, లా=డెసెమ్ ; గా తేహున్.

ఆర్యకుటుంబమువా రెంతకాలము అవిభక్తముగనుండిరో చెప్పఁజాలము. వారు నాగరికులు; వారు సాంఘికులు; బంధుపుత్రమిత్రకళత్రసంబంధములను గుర్తెఱిఁగి యుండిరి. "ద్యౌపిత" అని భగవంతునకు వారు పేరుఁ బెట్టిరి. ఆ "ద్యౌపిత" అను భగవంతునకు గ్రీకులు "జూటస్ పితర్" అనియు, రోమకులు "జ్యూపిటర్" అనియు మాఱుపేరుఁ బెట్టిరి. (ద్యౌ=ఆకాశము; పిత=తండ్రి.)

శ్లో. "నత ద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః."
అని చెప్పినవిధమున వారు నమ్మియుండిరి.

ప్రపంచములోనిభాషలకు మూఁడు మాతృకలు కల వని చెప్పితిమి; "ఇండో-జెర్మానిక" భాషయొకమాతృక; దానిని గుఱించి ప్రసంగించితిమి. ఇఁకను ద్వితీయ మాతృకను చెప్పఁబోవుచున్నారము: —

కొందఱు నవరలు మొదలగు అనాగరికులు బొమ్మల వ్రాఁతను వ్రాయుచున్నారు. రాళ్లు, రాతిపలకలు, చెట్లు, గోరీలు—ఈ మొదలగు వానిమీఁద బొమ్మలను వ్రాసి వానిమూలమున నొకసంగతిని గాని లేక వర్తమానమును గాని ఇతరులకుఁ దెలియఁజేయుచుండిరి. కాలక్రమమున నీమార్గమును మనుజుఁడు విడిచిపెట్టి, ఉచ్చరించుటవలనఁ గలిగిన శబ్దములకు సంజ్ఞల నుపయోగించెను; ఆసంజ్ఞలే అక్షరములయ్యెను; అక్షరములసంయోగమువలనఁ బదములు పుట్టెను. ఆధునిక అక్షరసమామ్నాయము ప్రాచీనపుబొమ్మల వ్రాఁతనుండి పుట్టెనని కొందఱు శాస్త్రజ్ఞు లూహించిరి. అక్షరసమామ్నాయమును గుఱించి "ఆంధ్రవిజ్ఞానసర్వస్వము" లో వ్రాయఁబడినవ్యాసముఁ జదువఁదగి యున్నది.

---

## పండ్రెండవఅధ్యాయము.

### గణితము.

మనుజుఁడు చాలకష్టపడి గణితములను నేర్చుకొనెను. నేఁడు కొందఱు మనుజులకు నాలుగుసంఖ్యలకంటె నధికము తెలియదు; నాలుగుకంటె నధికము తెలిసినను, అయిదు, ఆఱు మొదలగుసంఖ్యలను పేర్లు తెలియవు. ప్రపంచమంతట చేతులవ్రేళ్లను బట్టి లెక్కించుట కలదు; కొన్నిభాషలలో "హస్తము" అను శబ్దమును "పంచ" అను సంఖ్యను తెలియఁజేయుట కొక్కపదము కలదు. నేటివఱకు మనము చేతులఁబట్టి లెక్కపెట్టుచున్నాము.

1 చేయి—అనగా 5 అయిదు

2 చేతులు— ,, 10 పది.

20 చేతులు— ,, 100 నూఱు.

గణితశాస్త్రములో "0" అనుసంఖ్యను కనిపెట్టుటవలనఁ గలిగినలాభములఁ జెప్పలేము. ఈశాస్త్రజ్ఞానములేనిసమయమున మనుజుఁ డేయులన్వ్యవహరించెనో యూహింపలేము.

ఐరోపాఖండమునను నాయువ్యమూలను నేటికిని గనఁబడు నిదర్శనములఁబట్టి, భూదేవియొక్క బాల్యదశ నింతవఱకు వర్ణించితిమి. మానవుఁడు మొదట నిప్పటికో జీవించియుండి, అచ్చటనుండి బయలుదేరి, వాయవ్యభాగమునకు వచ్చెను. "బ్రిటిషుసామ్రాజ్యము" లో "బ్రిటను" ద్వీపములు ఐరోపాఖండముతోఁ గలిసియుండెను; కాని, అవి ద్వీపములు కాలేదు. నేఁడు "ఇంగ్లాండు, ఫ్రాన్సు" అనఁబడు దేశములలో నాఁడు "రైనాసరసు" మృగములతో నిండిన ఏనుఁగులును సంచరించెను: ఆభాగమంతయు హిమపర్వతమునఁ బుట్టినిల్లయ్యెను; దేశమంతయును కారుబుదూని కాఱడవులతోను భీకరమగు దట్టపువులతోను నిండియుండెను, చిత్తడినేలతప్ప మఱియొకటి కానరాదు. అట్టిసమయములో మానవుఁడు స్థలములో జీవించుచుండెను? కొంత కాలము గతించినతరువాత మనుజుఁడు స్థలమునకు వచ్చెను. పిపీలికాది బ్రహ్మపర్యంతముగల చరాచరజంతుజాలములో పెక్కుమార్పులు వచ్చెను. ప్రకృతి అనేక వికృతులఁ బొందెను; అందుచేత దానికి "చంచలలక్ష్మి" యని పేరు వచ్చెను. వివిధశాస్త్రములఁ జూచిన అనేకశాస్త్రములఁబట్టి అది "చపల" యని తెలియుచున్నది.

---

## పదుమూఁడవఅధ్యాయము.

### మానవుని ప్రాచీన నివాసము.

మానవులయాకారభేదవిలాసములను వేషభాషలఁబట్టి, వారిని అయిదు జాతులక్రింద శాస్త్రజ్ఞులు విభజించిరి.

(1) "కాకేషియను" జాతివారు "ఐరోపాఖండములోను ఆశియాఖండములోను నివసించియున్నారు. "ఇండో-జెర్మానికు" కుటుంబమువారీ జాతిలోనివారు.

(2) "మంగోలినియను" జాతివారు చీనా, జపాను, టార్టరి మొదలగు దేశములలో జీవించియున్నారు. వారికి "పసుపుజాతి" వారని పేరు కలదు; పసుపుపచ్చని శరీరకాంతి గలవారు.

(3) "ఈథియోపియను" లేక "నీగ్రో" జాతివారు ఆఫ్రికాఖండములో నుత్తరభాగము తప్ప, మిగిలినభాగములో నివసించియున్నారు. వారు నల్లని శరీరములుకలవారు కనుక వారికి "చీఁకటి జాతి వారు" అని పేరుకలదు.

(4) "అమెరికెను" లేక "రుధిర" జాతివారు దక్షిణోత్తర అమెరికాఖండములలో నివసించియున్నారు. వారు యఱ్ఱని శరీరములు కలవారు కనుక "రుధిర" జాతివారని వారికిఁ బేరు వచ్చెను.

(5) "మలేయను" జాతివారు హిందూమహాసముద్రద్వీపములలో నివసించి యున్నారు. వారి శరీరముల కాంతి గోధుమరంగును పోలి యుండును. ఆయాజాతుల వారు నేఁడునివసించియుండు ప్రదేశములలోఁ బూర్వాణయుగమునాటినుండి నివసించియుండిరో లేక మఱియొకస్థలమునుండి యిచటకు వచ్చిరో చెప్పుటకు వీలుపడదు; అందుకు నిదర్శనములు కానరావు. "కాకేషియను" జాతివారి ప్రాచీననివాసము గుఱించి చెప్పుటకు నిదర్శనములు కలవు.

రూపరేఖావిలాసములంబట్టి "కాకేషియను" జాతివారనియు, వేషభాషలంబట్టి "ఇండో—జెర్మానికు" కుటుంబము వారనియు, ఒకరినే రెండు నామములతోఁ బిలుచుచున్నాము. "ఐరోపా" ఖండములో "ఆస్ట్రియా" దేశములో వారు ప్రాచీనకాలములో నివసించి యుండిరని కొన్ని నిదర్శన

## పదునాల్గవ అధ్యాయము.



### మనుజుని అభివృద్ధి. X

అనేకకోటిసంవత్సరములు గతించెను; కాల మొకరీతిఁ గడవలేదు. అగ్నిని గుర్తెఱుంగనివాఁడు దానిని జ్వలింపఁ జేయఁ గలిగెను.

"శ్లో. సప్తహస్త శ్చతుశ్శృంగ స్సప్తజిహ్వో ద్విశీర్షకః,
త్రిపా త్ప్రసన్నవదన స్సుఖాసీన శ్శుచిస్మితః.
స్వాహాం తు దక్షిణేపార్శ్వే దేవిం వామే స్వధాం తథా,
బిభ్రద్దక్షిణ హస్తైస్తు శక్తి మన్నం స్రుచం స్రువం.
తోమరం వ్యజనం వామై ర్ఘృతపాత్రం తు ధారయన్,
మేషారూఢం జటాబద్ధం గౌరవర్ణం మహౌజసం.
ధూమధ్వజం లోహితాక్షం సప్తార్చి స్సర్వకామదం,
ఆత్మాభిముఖ మాసీన మేవం ధ్యాయే ద్ధుతాశనం.

అని అగ్నిని ధ్యానించును.

"ఆత్మావై పుత్రనామాసి సజీవశరదశ్శతం,
అశ్మాభవపరశుర్భవ హిరణ్య మస్తృతం భవ."

అని కుమారునికి నామకరణముఁ జేయుచుండును.

"అపాం త్వౌషధీనాగ్ం రసం ప్రాశయామి శివాస్త్వాఅప ఓషధయ స్సంతు"

అని కుమారునకు అన్నప్రాశనముఁ జేయును.

"స్యోనా పృథివీ భవా నృక్షరాని వేశనీ యచ్ఛాన శ్శర్మ సప్రథాః"

అని గృహనిర్మాణముఁ జేయును.

# పదునైదవ అధ్యాయము.



## ప్రజాక్షయము.

ఇంతవఱకును మనుజుని శైశవదశను గుఱించి చెప్పితిమి. సృష్టిస్థితులు ప్రతిపదార్థమునకు స్వాభావికములు. ప్రాచీనపాషాణయుగము మొదలు నేటివఱకును గలకాలములో మనుజుఁడు పుట్టిపెరిగి శైశవబాల్యదశలఁ గడిపి ప్రస్తుతము యౌవనదశలో నుండెను. ఏవిధమునఁ జూచినను వాఁడభివృద్ధి నొందుచుండెను గాని క్షీణించుట లేదు. పూర్వులవిధానముల ననుసరించి, వాని నభివృద్ధిఁ జేసి తనసంతతివారికి నిదర్శనీయుఁ డగుచుండెను.

మనుజునిచరిత్రము నేటివఱకును నిరంతరముగఁ బ్రవహించుకొని వచ్చినను, దానిలోఁ గొన్నియంశములు భేదముఁ బుట్టించును; వానిని మనము లక్ష్యములో నుంచుకొనవలెను. ప్రాచీనయుగములలో ననేక దేశీయులు పుట్టి పెరిగి బలవంతులై, ఆచంద్రార్కము భూమిమీఁద నిలువఁబడియుండఁ దగిన మహారాజ్యములను స్థాపించి కాలక్రమమున నశించిరి. అని లిఖితపూర్వకము గు చరిత్రములవలనను ప్రాచీనశిథిలములవలనను మనకుఁ దెలియుచున్నది.

> "కారే రాజులు రాజ్యము ల్గలుగవే గర్వోన్నతిం బొందరే
> వారేరీ సిరిమూటఁ గట్టుకొనిపోవం జాలిదే?" భూమిపై
> పేరైనం గలరే..."

అని చెప్పినవిధమున రాజ్యములనేకములు లేచి నీల్గి విజృంభించి అస్తమించెను. అనంతమగు కాలావళిగుండ జ్ఞానమను దూరదర్శినిని బెట్టిచూచిన నామహారాజ్యములయొక్క సంపద్వైభవముల గుర్తెఱుగ నగును.

ఎన్నిశాస్త్రములను మనుజుఁడు చదివిన నేమి? అష్టదిక్కులను జయించిన నేమి? కుబేరునివలె ధనధాన్యములతోఁ దులఁదూగిన నేమి? నూఱుగజముల బలము గలిగియుండిన నేమి? భూతదయలేని యెడల, మనుజుఁడు ద్విపాద పశువు. ప్రజానాశనమున కనేక కారణములుకలవు. అందులో నిదయొకటి.

శ్లో. "ధ్యాయతో విషయాన్ పుంస స్సంగస్తే షూపజాయతే,
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే.
క్రోధాద్భవతిసంమోహస్సంమోహాత్ స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి."

అని చెప్పినవిధమున, మనుజుఁడు విషయములకు లోఁబడినయెడల, భ్రష్టుఁడగుటయేకాక, వానిమూలమున నితరులు సహితము నశింతురు. తెలిసియో తెలియకయో మనుజుఁడు పాపకృత్యముఁ జేసిన,రాజు వానిని శిక్షించును. లేక క్షమించును; కాని భగవంతుఁ డటుల కాదు; ఏవిధమైన తప్పుఁజేసినను వాఁడు శిక్షకర్తుఁడు.ఒకచిన్న బాలుఁడు తెలియక దీపములో వ్రేలుఁబెట్టినయెడల, "ఓబిడ్డా, నీవు తెలియక వ్రేలుఁబెట్టితివి; కనుక నిన్ను నేమిరకను." అని దీపముబాలునితోఁ జెప్పునా? ప్రకృతి ధర్మముల నుల్లంఘించినవానికి శిక్ష తప్పునా? మనుజుఁడు సాంఘికుఁడు కనుక, వాఁడుచేసిన పాపమునకు వాఁడే కాదు, ఆసంఘమువారును, ఆదేశీయులును, ఆపాపఫలము ననుభవింతురు. అందుచేత ననేకదేశీయులును వారి మహారాజ్యములు నంతరించెను; వారినాగరకత వారితో నశించెను.

అటులఁ జెప్పుటవలనఁ బ్రపంచమున కేమి నష్టము సంభవించెనా? "గతించినరోజులకంటె రాఁబోవురోజులు మంచివి కావు" అని పెద్దలు చెప్పుదురు; కాని, ఆమాటను విశ్వసింపకుము. అంతకంతకు లోకమభివృద్ధి నొందుచున్నది; కాని క్షీణదశలో లేదు. కృతయుగమువంటి రోజులు గతించె నని దుఃఖించెదరు. ఆకృతయుగములో తంతివార్తలుకలవా? ఇనుపదారులును,

బ్రహ్మయు, వాయువును, ఆత్మయు, సర్వము నగుచున్నది. ఆపదార్థ మొకటి గాని రెండుకాదు. పిపీలికాది బ్రహ్మపర్యంతము గలజీవరాసులకును పదునాలుగు లోకములకును సృష్టికర్త యొకఁడను జ్ఞానము కలుగునప్పటికి యెంతకాలము పట్టెనోకదా! భగవంతుఁ డొకఁడనుజ్ఞానము మనుజునకు మొదటలేదని మనము రూఢిగఁ జెప్పగలము. ఈజ్ఞానము కలుగునంతలో వాఁడేయేమార్గములలో సంచరించెనో వివరించెదము. ఒక్కొక్కసోపానము నెక్కుచు మనుజుఁడు మీఁదియంతస్తులలోనికిఁ బోవును; అటులనె అనేకములును భిన్నములు నగుమార్గములఁ ద్రొక్కి, తుదకు వానికి భగవంతుఁ డొకఁడనుజ్ఞానము వచ్చెను. భగవంతునివిషయమై మనుజునిబుద్ధి యెంతస్వచ్ఛమై యుండునో, వాని జీవనము కూడ నంతనిష్కళంకమై యుండును.

ఒకతండ్రికిఁ బలువురు కుమారులు కలరు; వారిలో నొకని నతండ్రి ప్రేమించును; తదితరులఁ బోషింపక నిరాకరించి వనములకుఁ బంపును. అచ్చట వారు నిద్రాహారములు లేక దుఃఖించి లోకాంతరగతులగుదురు. అట్టివాఁడు తండ్రి దుర్మార్గుఁడని ముద్దుకుమారునకుఁ దోఁచకయుండునా? ఆవిధముననే భగవంతుఁడు కూడ ప్రవర్తించునని కొందఱిమతము. సమస్తజంతువులను వారి ప్రసక్తిలేకయే జగత్కర్త ప్రాణముఁ బోసెను; అట్టిప్రభువు కొందఱిఁ బ్రేమించి యాదరించు ననియు, మఱికొందఱిని నిరాదరణతోఁ జూచుననియు, పామరులు శంకించెదరు. జగత్తులకుఁ దండ్రియైనవానితో నిహలోకములో నేతండ్రులు సమానులగుదురు? జగద్రక్షకుఁడైన మనతండ్రి శాంతుఁడును, దయాళుఁడును, కరుణాసముద్రుఁడు—ఆయనకు సమానులు లేరు. అందఱికిని సమీపమున నున్నవాఁడు. చరాచరజంతుజాలములకుఁ బ్రాణముఁ బోసినప్రభువు నేఁడుకాదు, పూర్వయుగములలోఁ గూడ నందఱి సమీపముననే యుండెను. ఈసంగతి మనకుఁ దెలియును. పూర్వయుగములవారికిఁ దెలియదు. మనుజులను తప్పుమార్గమునఁ బెట్టుమని భగవంతుఁ డేభూతమునకుఁ జెప్పలేదు. అంధకార మందఱికిని రోఁతఁ బుట్టించును—అజ్ఞానాంధకారమునుండి వెడలి, జ్ఞానారుణోదయకాల

ఎటువైపుఁ జూచిన నిలువఁబడియుండిన పర్వతములును లోయలును, ఆకుపచ్చనిరంగులతోఁగూడిన పర్వతశ్రేణులును వాని "ఉపత్యక-అధిత్యక." భూములును, చెట్లు చేమలులేని యెడారిప్రదేశములును, ఫలవంతము లగువృక్షములును, పుష్పజాతులును, ఒయ్యారపునడకలతో వచ్చు మనుజులును, నక్షత్రమండలమున కెగురుపక్షులును; గంతులు వేయు లేడిని; తీవిగ నడచు మృగరాజును; అరుణోదయసూర్యోదయములును; సూర్యాస్తమయములును; షడృతువులును; అంతరిక్షమునఁ బవనప్రేరితములైన నీలజీమూత సంఘములును; శుక్ల కృష్ణపక్షముల చంద్రమండలమును; తారావళియును, ఇంద్రధనుస్సును — ఈ మొదలుగాఁగలవానిని మనుజుఁడు పూర్వము చూచెను. నేఁడుచూచుచుండెను. ముందుకుఁజూడఁగలండు.

ప్రకృతిలో ననేకశబ్దములను వాఁడు వినుచుండును; నదులు ప్రవహించునపుడును, వాయువు ప్రసరించునపుడును, మేఘములుగర్జించినపుడును, వర్షముకురియునపుడును — తదితరసమయములలోఁగూడ ననేకశబ్దములు — కొన్ని మధురమయినవియు, మఱికొన్ని కఠినమయినవియు — వానికి వినఁబడును. "ఈ ప్రకృతిలోఁ గనబడనివాని యర్థమేమి? నేనెవరు? నేనిచ్చట నుంటిని? ఎచ్చటనుండి వచ్చితిని? ఎచ్చటకు వెళ్లఁగలను? ఏమిచేయఁగలను! ఈచూడఁబడుచున్నవన్నియు నెచ్చటనుండి వచ్చెను?" అని వానిలో వాఁడు వితర్కించును. పదార్థములఁ జూచి ప్రథమమున మనుజున కాశ్చర్యము కలిగెను; క్రమముగ వానిబుద్ధివికసింప, పదార్థముల జ్ఞానము కలిగినతరువాత వానికిఁ గారణమేమో తెలిసికొన ప్రయత్నించెను. ఎటువైపుఁ జూచినను ప్రకృతి సంపదలతో నిండియుండెను. అంతకంటె గొప్పది మఱియొకటిలేదు; కానరాదు.

నేఁడు మనము కనిపెట్టినవిధమున నాఁడుకూడ మనుజుఁడు వీనికిఁ గారణముఁ గనిపెట్టియుండు నని మనము తలఁపరాదు. తనయాలోచనలను మనవలె సరసవచనములఁ జెప్పలేకపోయినను, వానికి బుద్ధియుండెను. తనయిష్టానుసారము

పనిఁజేయుటయును లేక యూఁగుచుండుటయును, నిలుచుటయును లేక నడచుటయును, అని ష్టముకూడఁ గొన్నికాలములు కనుకూలముగ నుండుటయును వానికిఁ దెలియును. ఏదియో మనుజుని లోపలనుండి దీనిని పాలించుచున్నది. ప్రకృతియు స్థిరముగ నుండక చలించుచున్నది. నదులు ప్రవహించుచున్నవి. మేఘములు పరుగిడుచుండెను. పక్షులు చలించుచున్నవి. భూమి కంపించును ? సూర్యచంద్రాది గ్రహములును నక్షత్రమండలములును గమనించుచున్నవి. ఏదియో వానిలోనుండి వానినిఁ జలింపఁ జేయుచున్నది.

ఈవిధముగ సమస్తపదార్థములలో నేదియో నివసించియుండు ననియు, అది భూతమనియు, ఆభూతమే వానినిఁ జలింపఁ జేయుననియు, మనుజుని బుద్ధికిఁ దోఁచెను. మేఘగర్జనమును, ఇంద్రుని రథచక్రముల ధ్వనియని చెప్పుచున్నాము; పిడుగు పడిన రెండవ మనుజుఁడు చనిపోవును; దానిని అర్జునుఁడు పట్టుకొని తన పేరు పదిమారులు పలికినచో బయటపడునని దానిని శాసించెనని చెప్పి "అర్జునః ఫల్గునః పార్థః కిరీటీ శ్వేతవాహనః । బీభత్సు ర్విజయః కృష్ణస్సవ్యసాచీ ధనంజయః" అని శ్లోకముఁ జదువుదుము. మెఱపుఁజూచి ఇంద్రుఁడు తన వజ్రాయుధమును బరిపించుచున్నాఁడని యనుచున్నాము. అగ్నిహోత్రునకు "ధూమధ్వజుఁడు, హవ్యవాహనుఁడు" అని పేరుకలదు. ఇటువంటి పిచ్చిమాటములఁ బట్టియే యిటువంటివారు వ్రాయుదురు? పదార్థములయొక్క గుణములం బట్టి వానికి నామములం బెట్టిరి. వస్తువుయొక్క గుణమును గ్రహించుటచేత మనుజుఁడు దానికిఁ బేరుఁ బెట్టును. అగుటచే దానికిఁ బేర్పడియుండు నని? ప్రస్తుత మాగుణమును మరచితిమి; ప్రతిశబ్దముయొక్క వ్యుత్పత్తులంబట్టి, దానిగూఢార్థముఁ దెలిసికొనవచ్చును.

ఒక్కొక్క దానినిగురించి పురాణకథలఁ జెప్పుచున్నారు. నీటిలోనుండి భూమిపైకిఁ వచ్చెను. ఆదివరాహము భూమిని పైకెత్తెనని కథకలదు. అటులనే సూర్యచంద్రాగ్నులకుఁ గథలు కలవు. "పద్మినీ చ్ఛాయాసమేత శ్రీసూర్యనారాయణస్వామి బ్రహ్మణే నమః" అని చెప్పుచున్నాము. సూర్యునకు "పద్మినీఛాయ"

అను నిరువురు భార్యలు కలరు. సూర్యోదయమున భర్తరాకను "పద్మిని" వికసించును; అస్తమయమున వియోగము చేత నామె దుఃఖించి ముఖమును ముకుళించుకొనును. "ఛాయ" సదా భర్త ననుసరించి యుండును; ఆమెకు వియోగదుఃఖములేదు. మఱియొక కథ కలదు. దక్షప్రజాపతికి ఇరువదియేడ్వురు కుమార్తెలు కలరు. అతఁడు వారిని చంద్రునకిచ్చి వివాహముఁజేసెను. ఆభార్యలలో "రోహిణి" యం దతనికి మక్కువ విశేషము; అందుచేతనితరలైన చెల్లెండ్రు దుఃఖించి తండ్రితో మొరపెట్టుకొని నందున, నతఁడు చంద్రుని శపించెను; కనుక, చంద్రునకు వృద్ధిక్షయములు కలుగుచున్నవి. ఒక్కొక్క నక్షత్రమునం దొక్కొక్కరోజు చంద్రుఁడుండును; రోహిణీనక్షత్రమునందు చంద్రుఁడు విశేషకాంతి గలిగియుండును, ప్రథమమున మనుజులకు శాస్త్రజ్ఞానము లేకపోవుటచేతఁ బ్రకృతిధర్మములకు వాఁడిపిచ్చికథలఁ గల్పించెను. ఈవిధమున నే గ్రహణములగుఱించి కథలు కలవు. పూర్వము రాక్షసులును దేవతలును క్షీరసాగరమును మథించినపుడు అమృతము పుట్టెను; రాక్షసులును దేవతలును రెండుపంక్తులు తీరి కూర్చుండ, విష్ణువు మోహినీవేషముఁ దాల్చివచ్చి, తనచేతితో నమృతకలశముఁబట్టుకొని దానిని పంచిపెట్టుచుండెను. అప్పుడు రాక్షసుఁ డొకఁడు దేవతలపంక్తిలోఁ గూర్చుండి అమృతముఁ బుచ్చుకొనెను. ఆసంగతి సూర్యచంద్రులు కనిపెట్టి, వానిని విష్ణువునకుఁ జూపించిరి. అతఁడు కోపగించి చక్రముఁ బ్రయోగించి వానిఁ జంపెను; కాని వానికి మరణములేదు. కార్పణ్యముచేతఁ బర్వదినములలో వాఁడు సూర్యచంద్రులను మ్రింగుచుండును. ఆసమయముల మనవారు పునశ్చర్యలఁ జేయుదురు. గ్రహణముల గుఱించి మనకు నేఁడుస్పష్టముగఁ దెలియును. మహాభూతములు సూర్యచంద్రులను మ్రింగునని తలంచి చీనాదేశవాసులు గ్రహణకాలమున వాద్యములను వాయించెదరు. వేఁటకుక్కలు గ్రహణకాలమునఁ జంద్రునిఁ గఱచుటచేత నాబింబమునుండి రక్తము ప్రవహించుననని అమెరికాఖండములో నుండు ఇండియనులు తలంచెదరు.

అజ్ఞానముచేత భయము కలుగును; జ్ఞానోదయముచేత నది నశించును. అజ్ఞానోదయము కలుగుట యెట్లు? ఎంతకాలము పరిశ్రమఁ జేసి, గురువుల నాశ్రయించి, శ్రమఁబడినగాని జ్ఞానోదయ మగునా? ఒకానొకప్పుడు శాస్త్రజ్ఞానముకలిగినవారము సహితము పిచ్చిపనులఁ జేయుదుము; అజ్ఞానులుచేసి రనిన వింతయేల? అనేకవిషయములను గురించి నిర్మలమగుజ్ఞానము కలుగు నప్పటికి విశేషకాలము గతించెను.

నక్షత్రముల గురించి చిత్రమగుకథ కలదు. సూర్యచంద్రు లిరువురును స్త్రీలు. నక్షత్రములన్నియు చంద్రునిపిల్లలు. చంద్రునితోసమానముగ సూర్యునకుఁ గూడ పిల్లలు కలరు. ఇన్నినక్షత్రములకాంతిని మానవులు భరించ లేరని తలఁచి, సూర్యచంద్రు లిరువురు తమతమపిల్లలను తినివేయుటకు నిశ్చయించుకొనిరి, చంద్రుఁడు తనపిల్లలను దాచిపెట్టెను. కాని, మాట ప్రకారము సూర్యుఁడుతనపిల్లలఁ దినివేసెను. అప్పుడు చంద్రుఁడు తనపిల్లలఁ దీసికొని వచ్చెను. అప్పుడు సూర్యుఁడుకోపగించి, చంద్రుని వెంటఁ దఱుమనారంభించెను. సూర్యోదయమున నక్షత్రములకాంతి తగ్గును; సాయంసమయమున చంద్రుఁడు నక్షత్రములతోఁ బ్రకాశించును. నక్షత్రములన్నియు చంద్రునిభార్యలని మనము నమ్ముచున్నాము. ధ్రువమండలము గురించి కథయొకటి కలదు. "ఉత్తానపాద" రాజుయొక్క కుమారుఁడు తపస్సుఁజేసి భగవంతునికటాక్షమువలన మహోన్నతపదవిఁ బొందెను.

మనుజులకుసుఖదుఃఖములకు గ్రహములు కారణములని యొకపిచ్చి యూహ కలదు. అందుచేత గ్రహసంచారమునకు గ్రహచారమని పేరువచ్చెను. "సర్వగ్రహా శ్శుభయోగవశస్థానఫలావాప్తి రస్తు" అని బ్రాహ్మణులు చెప్పుచున్నారు. గ్రహములు ఉచ్చనీచస్థితులం బట్టి మనుజులస్థితిగతులం నడుచునని చెప్పుచున్నారు. ఎంత పిచ్చిభ్రమ! చీఁకటిలోఁ బడి మార్గముఁ దెలియక మనుజుఁ డీపిచ్చియాలోచనలఁ జేసెను.

వర్షాకాలములో నంతరిక్షమున రంగుధనుస్సుఁ జూచిన, నది ఇంద్రుని ధనస్సుఅని చెప్పుచున్నాము. ఉఱుము దేవేంద్రుని రథచక్రములధ్వని, అనియు, మెఱుపు అతని వజ్రాయుధము కాంతి అనియు నమ్ముచున్నాము. భూమిని ధరించుచున్న శేషువు కదిలినపుడు భూమి కంపించును. అత్యద్భుతములగు ప్రకృతిధర్మములఁ జూచి, మనుజుఁడు భ్రమించి వానిసంగతి తెలియనందున భయపడి, భూతపిశాచరాక్షసగణములఁ గల్పించెను. వానికిఁ గోపము వచ్చిన నవి మనుజులఁ బీడించునని తలఁచి బలులను ఉపహారములను కానుకల నిచ్చి, వానికి నుపశాంతిఁ జేయుదురు. మనుజునకు మతిభ్రమణము కలిగిన యెడల వానికిఁ బిశాచము సోకినదని తలఁచి, వానికి రక్షరేకలఁ గట్టెదరు. ఈపిచ్చి యాలోచనల కాద్యంతములు లేవు; పండితపామరులు వీనిఁ జూచి ఆమోదింతురు. శాస్త్రజ్ఞానము కలిగినకొలఁది, వీనిపట్టు విడిపోవును.

ప్రాకృతపదార్థము లన్నియు చంచలముగ నుండుటచేత, వానిలో నొకభూతము నివసించియుండు ననియు, ఆభూతము చెట్లను, మేఘములను, మృగములను చలింపఁజేయు ననియు మనుజుఁడు తలఁచెను. బ్రతికియుండినవానికిని మృతినొందిన వానికిని భేదమేమి? జీవించియుండినవానికి ఉచ్ఛ్వాస నిశ్వాసములు కలవు; అవిలేకపోయిన, మనుజుఁడు చనిపోయెనని చెప్పుదుము. ప్రాణములు అయిదు.

శ్లో. "హృది ప్రాణో గుదేఽపాన స్సమానో నాభిసంస్థితః,
ఉదానః కంఠదేశస్థో వ్యానస్సర్వశరీరగః." ఇత్యమరః.

అయినను మఱియొకవిశేషము కలదు. మాతృగర్భములో నుండినశిశువునకు ఉచ్ఛ్వాసనిశ్వాసములు లేవు; లేకపోయినను, ఆశిశువు జీవించియుండును. అటులనె ప్రాణాయామముఁ బట్టినమనుజుఁడు జీవించియుండును. అందుచేతఁ బ్రాణవాయువులకంటెఁ బలమగు "జీవము" కలదని మనుజుఁడు గుర్తెఱిగెను. "జీవము"నకు "జీవాత్మ" అని పేరుకలదు. ఈ జీవునియొక్క రూపరేఖావిలాసములఁ జెప్పుటకు సాధ్యముకాదు. ఈజీవుఁడు స్వప్నములలో

సంచరించును; స్వప్నావస్థలోఁ జరిగినసంగతులన్నియు సత్యమని మనుజుఁడు తలంచును. అనాగరికులయిన సవరవాండ్రుకూడ నీవిధముననే తలంచుచున్నారు. స్వప్నములో మృతినొందినస్నేహితులను బంధువులఁ జూచిన మనుజుఁడు భయపడును. ఈకాలమున దయ్యములయందును పిశాచములయందును వానికి నమ్మకము కలిగెను. నిదురలో జీవుఁడు శరీరమును విడిచియుండునని తలంచి, నిద్రించువానిని, లేపించుట పాతకమని చెప్పుచున్నాము. జీవుఁడు నిదురలో శరీరమును విడిచి పోవుననియు జాగ్రత్తలో లోనికివచ్చుననియు, మనుజుఁడు నమ్మి, ఉచ్ఛ్వాసనిశ్వాసములలో దయ్యములు దేహమును సోఁకుననియు వాని ప్రభావమువలన ఆవులింతలును తుమ్ములును కలుగునని తలంచెను. అందుచేత నొకఁడు తుమ్మినపుడు "చిరాయు రస్తు" అని దీవించుట కలదు. ఈ యాచారము దేశీయులందరికిఁ గలదు; ఇది "జేకబు" కాలమునుండి వచ్చుచున్నది.

జీవుఁడు శరీరమునకుఁ బైగా సంచరించుటవలన మనుజునకు రోగము కలుగుననియు, పురోహితుఁడును లేక మంత్రశాస్త్రవేత్తయు చేయుప్రక్రియలచేత దేహములో జీవుఁడుకుదురుపడు నని మనుజుఁడు ఊహించెను. ఈమిథ్యాభ్రమలు వాఁడు అనాగరికదశలోనుండినకాలము మొదలు నేఁడు నాగరికదశలోనికి వచ్చినప్పటికిని తగిలియున్నవి. వానియొక్క పూర్వోత్తరములను మఱచినను, "వానికిమతిపోయెను, వానికి స్మారకము తప్పెను, వానికి స్మారకమువచ్చెను" అనుమొదలగు వాక్యముల నుపయోగించుచున్నాము. అంగవైకల్యము కలిగిన యొడలజీవునకుఁ గూడఁగలుగునని భ్రమకలదు. శాశ్వతముగ శరీరమును జీవుఁడు విడిచిపెట్టి ఇహలోకములో ననుభవించిన పదార్థములఁ బరలోకములో ననుభవించుట కభిలషించునని తలఁచి, మృతినొందిన వాని భార్యలను సేవకులను బలవంతముగఁ జంపుచుండిరి. మృతినొందినవాని యుపయోగార్థము వస్త్రాలంకారములను వానికళేబరముతో సమాధిఁజేయుట కలదు.

ఈనాఁడు హిందువులు శ్రాద్ధములఁ బెట్టించునపుడు వస్త్రాలంకారములనిచ్చి బ్రాహ్మణులకు భోజనముఁ బెట్టుచున్నారు.

"పితృపితామహప్రపితామహాః అమీ వో గంధాః—ఇమాని పుష్పాణి అయంవో ధూపః—అయం వో జ్యోతిః—అంతః ప్రావరణార్థం బహిః ప్రావరణార్థం వః ఆచ్ఛాదనార్థం పవిత్రార్థమలంకరణార్థ మిదం వో వాసః—సువాసః—అని చెప్పుచున్నారు; పితృలోక మొకటి కలదని కల్పించినారు.

"నమో వః పితరో రసాయ నమో వః పితరః శుష్మాయ నమో వః పితరో జీవాయ నమో వః పితరః స్వధాయై నమో వః పితరో మన్యవే నమో వః పితరో ఘోరాయ పితరో నమో వో య ఏతస్మిన్ లోకేస్థ యుష్మాగ్ం స్తేను యేస్మిన్ లోకే మాం తేను య ఏతస్మిన్ లోకేస్థ యూయం తేషాం వసిష్ఠా భూయాస్త యే ఽస్మిన్ లోకే ఽహం తేషాం వసిష్ఠో భూయాసం"—అని చెప్పి పితృదేవతలకు నమస్కరింతురు.

ఈవిధమున నలువైపుల భూతములచేతను దయ్యములచేతను నావరింపఁబడి వానివలనఁ దనకు మేలుగాని కీడుగాని వాటిల్లునని తలంచి, వానిని శాంతింపఁజేయుటకు వాఁడు ప్రయత్నించెను; సంకటములు వానివలనఁ గలుగును. సంపదలకు వారు కారణములు; చీఁకటిగదులలో నవి నివసించును; గోరీలలో నుండి మృతినొందినవారు లేచి రాఁగలరు; బ్రతికి యుండినవారిని వారుపీడింతురు; ఈమొదలగు పిచ్చిభ్రమలు కలిగినందున మంత్రశాస్త్రమును వాఁడు కల్పించెను. "త్వగస్థిగతై స్సర్వపాపైః ప్రముచ్యతే సర్వభూతే ష్వపరాజితో భవతి, తతో భూతప్రేతపిశాచబద్ధ బ్రహ్మరాక్షసయక్షయమదూతశాకినీఢాకినీసర్పశ్వాపదతస్కరజ్వరాద్యుపద్రవజోపఘాతా స్సర్వే జ్వలంతం పశ్యంతు మాగ్ం రక్షంతు" అని మంత్రమును చదువుచున్నాఁడు. ఆహా! అజ్ఞానమువలన భయము కలిగెను; భయమువలన కర్మకాండ పుట్టెను.

ఈభూతప్రేతపిశాచములవలన భయము లేకుండుటకు రక్షరేకులను దండతాయెత్తులను వనమూలికలను వాఁడు ధరింతురు. భూతవైద్యులు వెడలిరి; మాంత్రికు లుద్భవిల్లిరి. మనోదౌర్బల్యము లేనిపిఱికిపందలభయముఁ బోఁగొట్టుటకు వీరు సమకట్టిరి. వీరు మంత్రముల నుచ్చరించి, పిశాచములను దయ్యములను భూతములను వెడలఁగొట్టెద మనిచెప్పి, వారివలన ధనమును స్వీకరింతురు; వీరు విభూతిఁ బెట్టెదరు; లేక రక్షరేకులఁ గట్టెదరు; లేక కుంకుమబొట్టుఁ దగిలించెదరు; లేక తీర్థము నిచ్చెదరు; అనేకమాయోపాయములఁ బన్ని, తమయందు నమ్మకమును కలిగించి యీతాంత్రికులు ప్రజలను భంగపెట్టుచున్నారు. ఈతాంత్రికులును, మాంత్రికులును, భూతవైద్యులు నన్నిదేశములలోను అన్నికాలములలో నుండిరి. మఱియొక వింతకలదు. భగవంతునికటాక్షముచేత నొకస్త్రీ సంతానము లేకయుండినయెడల, పిశాచము పట్టినందున నామె గర్భముధరించదే దని చెప్పి ఆమెను గొందరు రక్షరేకులఁ గట్టెదరు. కొందరు తీర్థము నిచ్చెదరు: కొందరు దండతాయెత్తులను బిగించెదరు.—ఆహా! ప్రకృతిధర్మములకు విరుద్ధమగు పనులఁ జేయుటవలన, నామె చూలింతిరాలగునా! అగోచరమగు వానిని గుఱించి చెప్పుటకు సమకట్టుటయు, తెలియనిసంగతులగుఱించి తెలిసినట్లు నటించుటయు, ఈమానుజులకు సహజము. ఈజన్మములో మనుజుఁడు కొన్నివిషయములను గ్రహించుటకు సమర్థత లేదు; గర్భోత్పత్తి, పరలోకము —వీనిని గుఱించి మనుజుఁ డేమి చెప్పఁగలఁడు? 'ఇద మిత్థ' మ్మని వచించుటకు వీలుపడదు.

ఈభూతప్రేతపిశాచములయందలి నమ్మకము నేటివఱకుఁ బ్రజలకుఁ గలదు, ఒకఁడు కడుపునొప్పిచేత బాధపడుచుండిన, వానిప్రథమకళత్రము వానిఁబీడించుచుండె ననియు; ఒకస్త్రీయెల్లప్పుడు చీఁకటిగదిలోఁగూర్చుండి రోదనముఁ జేసిన, అత్తగారిపీడయనియు చెప్పి, వారికి ధూపము వేయుదురు లేక ఇత్తడిగరిటెఁ గాల్చి, చురకలను వేయుదురు. ముఖమువాడినయెడల పీడ

కొట్టెననియు, ఆవులింతలును తేన్పులును విశేషముగ వచ్చిన యెడల పిశాచలక్షణమనియు, రాత్రినిద్రలో "ఓ" అని కేకలు వేసిన, దయ్యముపట్టెననియు చెప్పుచున్నారు.

అజ్ఞానాంధకారములో నవరవాండ్రేకాదు మనముసహితము దేవురించుచున్నాము. ఆకారణమున, దేవగణము మేలుఁజేయుననియు, రాక్షసగణము కీడుఁ జేయునని యూహించెదము. జీవాత్మయిట్టిది అని యీరోజువఱకు మనకుఁ దెలియదు; ముందుకుఁ దెలియగల దనునమ్మకము లేదు; ఆజీవుఁ డేవిధమున శరీరమును విడిచిపెట్టునో తెలియదు. పలువురు పలువిధముల వారిబుద్ధికుశలతకొలఁది పలికిన సంగతులను విశ్వసింపరాదు. అణుస్వరూపమగు జీవములనేకము లొకనీటిబిందువులోఁ గలవు; శరీరములోనినాళములయందుఁ బ్రవహించురక్తములోఁ గలవు; వానిని "సూక్ష్మదర్శిని" గుండ చూడ నగును; కాని, ఎంతసూక్ష్మమగు సూక్ష్మదర్శిని" గుండ నైన, మనము జీవాత్మను చూడలేము! దానిని మనవ్రేలుతో స్పర్శించలేము. భగవంతుఁడు మనకు మనోబుద్ధుల నిచ్చెను. వానివలన మన మనేకసంగతులఁ దెలిసికొనఁగలము; కాని, ఈజీవనదియొక్క ఆద్యంతములఁ గనిపెట్టఁజాలము. ఈశ్వరుఁడు మనకుఁ గొంచెము జ్ఞానము నిచ్చెను; విశేషముగ నిచ్చియుండినయెడల, దానియందు విలువ తగ్గును; అజ్ఞానము కొంచెము కనుక, దానిని అభివృద్ధిఁ జేయుచున్నాము; ఎంతజేయుచుండినను, దానికి హద్దు కనఁబడదు. అందుచేత, "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అని వాక్యము కలదు. తెరచినకొలది తేట బయలు వెడలును.

నలుప్రక్కలను తాను చూచిన ప్రకృతి ధర్మములను పదార్థముల నేవిధమున మనుజుఁడు గ్రహించెనో, దాని నింతవఱకు విశదపఱచినాము. ఏవిధమున వానిని భావించెనో వ్రాయుచున్నాము. తనకంటె బలముగల వని తెలిసికొని వానిని వాఁడు పూజించెను; వానికి నమస్కరించెను. సమస్తదేవతారాధ

చుననియూహించుట మౌర్ఖ్యము. ఈవిగ్రహము లనేక విధములు:—గడ్డిపూచలనుకట్టి దానికి బొట్టుఁబెట్టి కొలువవచ్చును; లేక రాతిపలకలకుఁ బసుపుఁబూసి వానిని కొలుచుట కలదు; లేక అవయవసూర్తి గల మహోన్నతవిగ్రహముల నారాధింపవచ్చును. దేవుఁడు త్రిశక్తియుతుఁడని భావించి, లేడినంటికాళ్లను అనేకచేతులను సింహపుశిరస్సును, పక్షిరెక్కలతోఁ గూడిన విగ్రహమును నిర్మించి, దానిని పూజించిరి. అన్నిదేశములలోను అన్నికాలములలోను నానాదేశీయులు నిర్మించి ఆరాధించినవిగ్రహములగుఱించి వ్రాసినచో, నదియొకసంపుటమగును. నేటివఱకుఁ గొన్నిదేశములలో విగ్రహారాధనఁ జేయుచుందురు; అనేకశతాబ్దములు గతించినగాని అదినిశ్శేషము కాదు.

శ్లో. స వైనదేవాసురమర్త్యతిర్య
ఙ్నస్త్రీ న షండో న పుమా న్న జంతుః,
నాయం గుణః కర్మనసన్నచాస
న్నిషేధశేషో జయ తాదశేషః,

సోఽహం విశ్వసృజం విశ్వ మవిశ్వం విశ్వవేదసం,
విశ్వాత్మాన మజం బ్రహ్మప్రణతోఽస్మి పరంపదం.

అనేకశతాబ్దములు గతించినగాని నిర్గుణబ్రహ్మముయొక్క జ్ఞానము కలుగదు. అంతవఱకు విగ్రహారాధన నిలిచియుండును.

నిర్జీవపదార్థముల నారాధించుట విడిచిపెట్టి, సజీవపదార్థములఁ గొలుచుట కారంభించెను. మొదట మనుజుఁడు సర్పములను వృక్షములను సేవించెననికొందఱు చెప్పుచున్నారు; సూర్యచంద్రులను, నక్షత్రములను, అగ్నిహోత్రమును వాఁడు పూజించెనని మఱికొందరి మతము. ఏదియైనను యొకటిమాత్రము సత్యము; దేశకాలానుగుణ్యముగమనుజుఁ డనేకదేవతల నారాధించెను. ప్రథమమున సమీపమున నుండిన పదార్థములకు భయపడి వానిని సేవించి,

వానికంటె బలవంతములగు ప్రకృతిధర్మములయొక్క పూర్వోత్తరములు తెలియనందున, వానికి జడిచి వానిని వాఁడు పూజించెను. ఈవిధమున పంచ భూతముల నారాధించుట వెడలెను.

వానిలో జలదేవతారాధనము ప్రథమము. దానివలన జీవము నిలుచును అన్ని ప్రదేశములలో నది సమృద్ధిగ నుండును.

శ్లో. గంగే చ యమునే చైవ గోదావరి సరస్వతి,
నర్మదే సింధుకావేరి జలేఽస్మిన్ సన్నిధింకురు"

పుణ్యస్నానములు కలవు; పుష్కరిణులు, తీర్థములు మొదలగునవి మూర్తి భవించి, బ్రహ్మసభలో సుఖాసీనులై యుండునని భారతములోఁ జెప్పబడి యున్నది. స్నానాస్పదవిధిని వినవలెను: —

"గంగాం ప్రవిశ్య నాభిమాత్రజలే స్థిత్వా శిఖాం ద్విధా విధాయ నిరుద్ధ కర్ణనాసస్త్రిః ప్లుత్వా ఆచమ్య" అని ప్రారంభముచేసి నీటిలో మునిగి లేచును. అటుపిదప "హిరణ్యశృంగం వరుణం ప్రపద్యే తీర్థం మే, దేహి యాచితః, యన్మయా భుక్తమసాధూనాం పాపేభ్యశ్చ ప్రతిగ్రహః, యన్మే మనసా వాచా కర్మణా వా దుష్కృతం కృతం, తన్న ఇంద్రో వరుణో బృహస్పతి స్సవితా చ పునంతు పునః పునః" అని గంగను ప్రార్థించును. "ఇంద్రో జేష్ఠానను" కుటుంబమువారు పంచభూతముల నారాధించుచుండిరి.

సంవత్సరములోఁ గొంతకాలము వాడియుండిన వృక్షములు వసంతకాలము వచ్చినతోడనే చిగుళ్లతో నిండును.

శ్లో. శ్రీమద్వసంతభవ దభ్యుదయేన వృక్షాః
కే నామ పత్రఫలపల్లవశాలినస్స్యుః,

అని చెప్పినవిధమున సమస్తవృక్షములు చిగిరించి, పుష్పములతోను ఫలములతో వ్రేలాడుచుండును. వాయువు వీచినపుడు చెట్లు చలించును; అందుచేత వానిలో నొక భూతముకల దని వానిని వాఁడు పూజించెను. "అశ్వత్థ స్సర్వవృక్షాణాం" అని గీతావాక్యము కలదు. అది పవిత్రమగు వృక్షము; అది భగవంతునిస్వరూపము; అందుచేత దానిని హిందువులు పూజింతురు; దానికి ప్రదక్షిణములఁ జేయుదురు. తరుశైలపాషాణములను, నదులను, సరస్సులను గ్రీకులు మొదలగు ఆర్యకుటుంబమువారు పూజించిరి. "ఓకు" వృక్షము "కెల్టిక" ప్రజలకుఁ బవిత్రము; దానిఛాయలో వారిమతగురువులు "డ్రూయిడులు" దేవతార్చనలఁ జేసిరి.

"ఐరావతం గజేంద్రాణాం"
"ఉచ్చైశ్శ్రవ సమశ్వానాం"
"వైనతేయ శ్చ పక్షిణాం"
"మృగాణాం చ మృగేంద్రోఽహం"
"ధేనూనా మస్మి కామధుక్"
"సర్పాణా మస్మి వాసుకిః"
"అనంత శ్చాస్మి నాగానాం"
"ఝషాణాం మకర శ్చాస్మి"

అని గీతావాక్యములు కలవు; వీనిని హిందువులు పూజించుచున్నారు. తరుశైలపాషాణములకంటె మృగములును పక్షులును బలముఁగలవి; కనుక వాని యందు గొప్పమహాత్మ్యకలదను నమ్మకముచేత, వానిని వాఁడారాధించెను. నిద్రాహారసంగమములలో మనుజునితో నవి సమాన మగును; కాని, వానికంటె నవి బలవంతములు; క్రమముగ వానిని వాఁడు స్వాధీనముఁ జేసికొనిన తరువాత, వానిని పూజించుట విడిచిపెట్టెను. దేశకాలములఁబట్టి ఆయాజంతువులను వాఁడు పవిత్రము లని భావించెను. ఉత్తరదేశములవారు భల్లూకమును,

## సూర్యోపాసనము.

"ఆదిత్యో వా ఏష ఏత న్మండలం తపతి తత్ర తా ఋచ స్త దృచా మండలగ్ం స ఋచాం లోకో ఽథయ ఏష ఏతస్మి న్మండలే ఽర్చిర్దీప్యతే తాని సామాని స సామ్నాం లోకో ఽథయ ఏష ఏతస్మి న్మండలే ఽర్చిషి పురుష స్తాని యజూగ్ంషి స యజుషా మండలగ్ం స యజుషాం లోక స్సైషా త్రయ్యేవ విద్యా తపతి య ఏషో ఽన్తరా దిత్యే హిరణ్మయః పురుషః."

"ఆదిత్యో వై తేజ ఓజో బలం యశ శ్చక్షు శ్శ్రోత్ర మాత్మా మనో మన్యు ర్మను ర్మృత్యు స్సత్యో మిత్రో వాయు రాకాశః ప్రాణో లోకపాలః కః కిం కం త త్సత్య మన్న మమృతో జీవో విశ్వః కతమ స్స్వయంభు బ్రహ్మై త దమృత ఏషపురుష ఏషభూతానా మధిపతిః"

కాశ్మీరదేశములో మార్తాండదేవాలయ మొకటి యుండెను; మాగ్రాముమునకు సమీపమున సూర్యదేవునిక్షేత్రము కలదు; ప్రతిసంవత్సరము వైశాఖమాఘమాసములలో భానువారమున దేవునిదర్శించుటకు వేనవేలుప్రజలు వచ్చుచున్నారు. ఒక్కసూర్యగ్రహమునే కాదు; తదితరగ్రహములను వాఁడు పూజించెను. వానినిబట్టి దినములకు నామములఁ బెట్టిరి. ఆగ్రహములయొక్క స్థితిగతులఁబట్టి మనుజులభోగభాగ్యములును సుఖదుఃఖములును కలుగు నని తలంచి, జ్యోతిశాస్త్రమును వాఁడుకనిపెట్టెను, ఈలోకములోని ప్రతిపదార్థమున కొక్కొక్కగ్రహము అధిపతి యని భావించెను. ఆపదార్థముయొక్క వృద్ధిక్షయములు, దానియధిపతిస్థితి బట్టి యుండును. ఈగ్రహాధిపత్యములు ప్రతిసంవత్సరము మారుచుండును.

"రసాధిపతి స్సూర్యః మృగాధిప శ్చంద్రః రత్నాధిపతిః కుజః" ఇత్యాదులు.

ఈవిధమున వాయువును, అగ్నిని వాఁడారాధించెను. త్రింశత్కోటి దేవతారాధనను, పంచభూతదేవతారాధనను విడిచిపెట్టి, వాఁడు ద్వైతములోనికి వచ్చెను. జ్ఞానభాస్కరుని కాంతులు ప్రసరించిన కొలఁది పూర్వదేవతలను విడిచిపెట్టి, రెండుశక్తులు కలవని వాఁడు తలంచెను. శుభములను సిరిసంపదలను కలుగఁజేయుశక్తి యొకటి; అశుభములను రోగాదులను కలుగఁజేయుశక్తి మఱియొకటి—అని యూహించెను; ఆశక్తిని భగవంతుఁడని భావించెను; అందుచేత నిరువురు భగవంతులు పుట్టిరి. శుభముఁ జేయుదేవుఁ డొకఁడును, అశుభముఁ జేయువాఁ డొకఁడును కలరని తలంచుట పిచ్చిభ్రమ.

శ్లో. "సుఖస్య దుఃఖస్య న కోఽపి దాతా
పరో దదాతీతి కుబుద్ధిరేషా,
అహం కరోమీతి వృథాభిమానః
స్వకర్మసూత్రగ్రథితో హి లోకః."

ప్రతిమనుజుని సుఖదుఃఖములకు వానికర్మములు కారణములు; భగవంతుఁడు సాక్షిభూతుఁడై యుండును. దీనికి విరుద్ధముఁ జెప్పినయెడల, దోషములనేకములు కలుగును.

ప్రపంచములోఁ బ్రతిపదార్థము పుట్టి పెఱిగి నశించుచున్నది; వానికి సృష్టిస్థితిలయము లని చెప్పుచున్నాఁడు. శుభాశుభములఁ గలుగఁజేయు దేవత లిరువురు కలరని చెప్పుట విడిచిపెట్టి సృష్టిస్థితిలయములకు వరుసగ ముగ్గురు దేవతలు కలరని యూహించెను. బ్రహ్మ సృష్టికర్త యనియు విష్ణువు లోకపాలకుఁడనియు లేక స్థితికర్తయనియు, శివుఁడు సంహారకర్త యనియు, ముగ్గురు దేవతలను కల్పించెను. శుభాశుభములకు వారు కర్తలని తలంచెను. శుభములను నిలుపఁబెట్టుటకును, అశుభములను నివారించుటకును వారికి శక్తికలదు; కాని, తనకు లేదని వానికి నమ్మకము కలిగెను. అందుచేత వాఁడు ప్రార్థించుట కారంభించెను.

శా. లావొక్కింతయు లేదు ధైర్యము విలో
లం బయ్యె ప్రాణంబు లా
వుల్ దప్పెను మూర్ఛ వచ్చె తనువున్
డస్సెన్ శ్రమం బయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మ
న్నింపందగుం దీనునిన్
రావే యీశ్వర కావవే వరద సం
రక్షించు భద్రాత్మకా.

ఈప్రకారము ఆపదలు వచ్చినపుడు వానినుండి రక్షింపు మని భగవంతునిఁ బ్రార్థించును. "లేక ధర్మార్థకామమోక్షచతుర్విధఫలపురుషార్థం పుత్రపౌత్రాభివృద్ధ్యర్థం సకలకామ్యార్థఫలసిద్ధ్యర్థం" అని సంకల్పముఁ జెప్పి పరమేశ్వరునిఁ బూజించును. కాలాంతము వఱకును భగవంతుని మనుజుఁడు ధ్యానించుచుండును. ఎట్టి అంతవికారమగు విగ్రహమైనను, దానిసన్నిధిని నిలువఁబడి, తన సుఖదుఃఖములను వాఁడు విన్నపముఁ జేసికొనును. ఎట్టి మనుజుఁడైనను, మనోవాచామగోచరుఁడైనపరమేశ్వరుని ధ్యానించుచుండిన వానియాత్మఁ జూచిన, ఆశ్చర్యముకలుగును. అజ్ఞానముచేత ననేకకోరికలను వాఁడు కోరినప్పటికిని, అపిచ్ఛికోరికలను పరమేశ్వరుఁడు సిద్ధింపఁజేయఁడు వానివలన వానికిఁ గీడుకలుగును. అపథ్యమగుపదార్థములను తలిదండ్రులు బాలురకిచ్చుటకు వెరచినవిధమున, మనుజులవాంఛితములను భగవంతుఁడు సఫలముఁ జేయఁడు. వాఁడు జ్ఞానవంతుఁడైనకొలది, "శ్రీపరమేశ్వరప్రీత్యర్థం" అనిసంకల్పముఁ జెప్పి ధ్యానించును.

శ్లో. నాస్థా ధర్మేన వసునిచయే నైవకామోపభోగే,
యద్భావ్యం తద్భవతు భగవన్ పూర్వకర్మానురూపం,

ఏత త్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాంతరే௨పి
త్వత్పాదాంభోరుహయుగగతా నిశ్చలా భక్తి రస్తు.

తుచ్ఛపుభోగముల నపేక్షింపక, సద్భక్తితో వాఁడు పరమేశ్వరుని ధ్యానించును.

బలుల నిచ్చుటగురించి చెప్పుచున్నాము. స్నేహితులమనుష్యులను నొప్పించినపుడును, లేక వారికిఁ దనయందు కోపమువచ్చినను, వారిని శాంతింపఁ జేయుటకు వాఁడుకట్నముల నిచ్చును. వారియందుగల ప్రేమచేతను విశ్వాసముచేతను వారికి వాఁడు బహుమతిఁ జేయును. భగవంతునకుఁ గోపము వచ్చినందున కష్టములు వచ్చెనని తలంచి, భగవంతునిపేరఁ జెప్పి, వ్రతములఁ జేయుదు ననియు, తీర్థయాత్రలకుఁ బోవుదు ననియు, లేక తలవెండ్రుకల నిచ్చెద ననియు, లేక నిలువుదోపు నిచ్చెద ననియు, లేక పుట్టెడుపాలు పాయసము నండించి పెట్టెద ననియు మొదలగు మొక్కులను మ్రొక్కుకొనియెదరు. మఱికొందఱు భగవంతునకుఁ గోపమువచ్చెనని తలఁచి, నరబలులను, పశుబలులను సమర్పింతురు; ఇంతకంటె గొప్పపిచ్చితనము మఱియొకటి లేదు; ఈబలులు, హోమములవలన లాభము లేదు. సర్వము భగవన్మయ మని తలఁచి, భక్తిశ్రద్ధలతో నడచుట యారాధనమట యొకటి; అతఁడు శిక్షించు ననుభయముచేత బలుల నిచ్చుట యొకటి; మొదటిది పుణ్యము; దానివలన జ్ఞానము కలుగును. రెండవది పాపము; జననమరణాదులకుఁ గారణ మగును. ఈబలులు, యజ్ఞాది క్రతువులు కంటె శ్రేష్ఠమయినది ఆత్మయజ్ఞము; దాని నందఱు చేయవలెను.

⁂

## ఆత్మయజ్ఞము.

త స్యైవం విదుషో యజ్ఞ స్యాత్మా యజమాన శ్శ్రద్ధా పత్నీ శరీర మిధ్మ మురో వేది ర్లోమాని బర్హి ర్వేద శ్శిఖా హృదయం యూపః కామ ఆజ్యం

మన్యుః పశు స్తపోఽగ్ని ర్దమ శ్శమయితా దక్షిణా వాగ్ఘోతా ప్రాణ ఉద్గాతా చక్షు రధ్వర్యు ర్మనో బ్రహ్మా శ్రోత్ర మగ్నీ ద్యావద్ధ్రియతే సా దీక్షా యదశ్నాతి తద్ధవి ర్య త్పిబతి త దస్య సోమపానం య ద్రమతే తదుపసదో యత్సంచర త్యుపవిశ త్యుత్తిష్ఠతే చ స ప్రవర్గ్యో య న్ముఖం తదాహవనీయో యా వ్యాహృతి రాహుతి ర్య దస్య విజ్ఞానం త జ్జుహోతి య త్సాయం ప్రాత రత్తి తత్సమిధం య త్ప్రాత ర్మధ్యన్దినగ్ం సాయం చ తాని సవనాని యే అహో రాత్రే తే దర్శపూర్ణమాసౌ యేఽర్ధమాసా శ్చ మాసా శ్చ తే చాతుర్మా స్యాని య ఋతవ స్తే పశుబంధా యే సంవత్సరా శ్చ పరివత్సరా శ్చ తేఽహర్గ ణా స్సర్వవేదసం వా ఏతత్సత్రం యన్మరణం త దవభృథ ఏత ద్వై జరామర్య మగ్నిహోత్రం య ఏవం విద్వానుదగయనే ప్రమీయతే దేవానా మేవ మహిమానం గత్వా ఽఽదిత్యస్య సాయుజ్యం గచ్ఛ త్యథ యో దక్షిణే ప్రమీయతే పితౄణా మేవ మహిమానం గత్వా చంద్రమస స్సాయు జ్యగ్ం సలోకతా మాప్నో త్యేతౌ వై సూర్యాచంద్రమసో ర్మహిమానౌ బ్రాహ్మణో విద్వానభిజయతి తస్మా ద్బ్రహ్మణో మహిమానమాప్నోతి తస్మా ద్బ్రహ్మణో మహిమానం. ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః.”

అనంతకోటికాలము గతించెను; ఆయా దేశములలో ఆయా కాలములలో ఆయా దేశీయులు ప్రబలులై నశించిరి. ఆయా దేశీయులు పరలోకమును గురించియు, ఉత్తరజన్మమునుగురించియు, కర్మనుగురించియు జననమరణాగులను గురించియు, వీనికంటె భగవంతుని గురించియు చెప్పినసంగతులు గ్రంథములలో వ్రాయఁబడియున్నవి. అవియే మతగ్రంథములు. హిందువుల మతగ్రంథము వేదము; క్రీస్తువులది బైబిలు; మహమ్మదీయులది కొరాను; పారశీకులది జెండ్-అవెస్తా; బౌద్ధులది త్రిపీటిక-భగవదంశసంభూతులయిన మహాపురుషులు, భగవత్ప్రేరణచే నీగ్రంథములనువ్రాసిరి; ఒక్కవిషయమునే పలువిధములఁ జెప్పిరి; చెప్పినవిధము భిన్నమయినను, లక్ష్యమొకటి. ఎవరుచెప్పినను, భగవంతుఁడు లేడని మాత్రము చెప్పలేదు! అందఱును భగవంతుఁ డొక్కఁడనియె చెప్పియుండిరి.

బండిచక్రమునాభియను తూము కలదు; ఆతూమును చక్రముతో కమ్ములు కలుపును; ఆకమ్ములన్నియును సమానము; ఏకమ్మి ననుసరించిపోయినను, నీవు తూమును చేరఁగలవు; ఆతూమును చేరుటయే మనకోరిక; ఏకమ్మి ననుసరించి పోయినను ఒకటేకదా! ఆతూము భగవంతుఁడు; కమ్ములు మతములు; వలయము ప్రపంచము; ఏమతము ననుసరించి గమనించినను, భగవంతునిఁ జేరఁగలరు; అన్ని మతములు సమానము. అన్నిమతములవారిలక్ష్య మొకటియే గాని, రెండు కాదు. అందుచేత నొకరితో నొకరు మతవిషయమై పోరాడుట మంచిపని కాదు. ఏమతమయినను, భక్తివిశ్వాసము లుండవలెను. భగవంతుని ధ్యానించి, దేశచరిత్రలను చదువఁబోవుదము.

## ప్రార్థన.

శ్లో. నతోఽస్మి తే పదం దేవ ప్రాణబుద్ధీంద్రియాత్మభిః,
యచ్చింత్యతే కర్మపాశాద్ హృది నిత్యం ముముక్షుభిః. ౧
మాయయా గుణమయ్యా త్వం సృజస్యవసి లుంపసి,
జగత్తేన న లిప్యసే ఆనందానుభవాత్మనః. ౨
తథాబుద్ధిస్సదుష్టానాం దానాధ్యయనకర్మభిః,
శుద్ధాత్మనాం తే యశసి సదా భక్తిమతాం యథా. ౩
తవాంఘ్రిపూజా నిర్మాల్య తులసీమాలయా విభో,
స్పర్ధతే వక్షసి పదం లబ్ధ్వాపి శ్రీః సపత్నవత్. ౪
అతస్త్వత్పాదభక్తేషు తవ భక్తిః ప్రియోఽధికా,
భక్తిమేవాభివాంఛంతి త్వద్భక్తాః సారవేదినః. ౫
అతస్త్వత్పాదకమలే భక్తిరేవ సదాఽస్తు మే,
సంసారామయతప్తానాం భేషజం భక్తిరేవ తే. ౬





మధ్యధరా సముద్రము
సిరియా
2
హేళి
కైరో
పిరమిడులు
మెంఫిసు
అరేబియా
రుధిర సముద్రము
తేబిసు
ఈజిప్టు
నూబియా

భాగములవారికిని జీవన మిచ్చి సంరక్షించుటచేత వారు లౌకికకష్టముల నెఱుంగక సచ్చిదానందభరితులై సకలకళలలోఁ బ్రవేశముగని నాగరికు లయిరి. భూమి సారవంతమై సర్వసస్యఫలభరితం బైనందున దేశము ప్రజాభివృద్ధిగలిగి యుండె నని చెప్పుటకు నిదర్శనములుగ మహోన్నతమైన దేవాలయములును గోరీలును నేటివఱకు నిలువబడి యున్నవి. ఆదేశస్థితికూడ దానిభోగభాగ్యముల కనుకూలముగ నున్నది. "మధ్యధరాసముద్ర" తీరమున నున్నందున "ఐరోపా" ఖండముతో వ్యాపారము సాగించుటయేగాక "రుధిరసముద్రము"నకును "అరబి" జలసంధికిని యీ దేశము తట్టియున్నందున, పూర్వపశ్చిమదిశలతో వాణిజ్యమును నడిపించెను.

ఐజిప్టీయులు శాంతస్వభావులు; అపరిమితాశాపరులు కారు; కనుకనే వారు శీఘ్రముగ నాగరికు లయిరి. పదునెనిమిదితరములవఱకు వారిరాజులు కూడ సంతుష్టులైయుండి రణభేరియనుమాట నెఱుంగక పరరాజులతో గర్షణవహింపక కాలమును గడిపిరి. దేశము ఫలవంతమైనదని చెప్పుటచేతను, నాఁడు శాంతచిత్తులని చెప్పుటచేతను, వారు సోమరులై అజ్ఞానాంధకారములోఁ గాలముఁ గడిపిరని భావము కాదు; దేహముఁ గష్టపెట్టి శాశ్వతమైన కీర్తిస్తంభములను స్థాపించుటయందును లేక "నైలు"నదీముఖద్వారమున నుండిన చిత్తడి నేలను సాగుఁజేసి సస్యములఁ బండించుటయందును వారు కాలయాపనఁ జేసిరి. మంచిబుద్ధులును, మంచినడవడికలును ఒకరినిజూచి నేర్చుకొనఁదలఁచిన, నవి పట్టువడునా! ఆగుణములు వారికి స్వాభావికముగఁ బుట్టినవియేగాని, పరులు నేర్పినవి కావు.

"ఆంగ్లేయ సర్వవస్తుప్రదర్శనశాలకుఁ" బోయి "ఐజిప్టీయవస్తు భాండాగారము"లో నిలువఁజేసిన "ప్రాచీనఐజిప్టీయుల" భండారములఁ జూచిన, పాషాణయుగమునాటికి వారు నాగరికులైయుండినట్లు తెలియుచున్నది. తరణిపెట్టబడిన ఆయుధములను, మృత్పాత్రలను, నానావిధములైన

యాభరణములను మాని, అపారమైన కాలావళిగుండ మనస్సు ప్రసరించి, ఆనాటిమనుజు లట్టివారని గ్రహించి ప్రథమమున "బాబిలను" దేశము లీదేశమునకు వచ్చి శిల్పవస్తువులఁ జేయుట నేర్చుకొనిరి. అన్యదేశీయులతోఁ గలసి మెలసి తిరుగుటచేత నాగరికాభివృద్ధిలోనికి వచ్చిరి.

గోరీలమీఁదఁ జెక్కఁబడిన శిలాప్రతిమలఁ జూచిన వారు రెండుతెగల వారని తెలియనగును. ఒకరు ప్రాచీనవాసులు; స్వచ్ఛమైన తలవెండ్రుకలను చామనచాయశరీరమును, నిడుదముఖములను ముందుకుఁ దోసికొనివచ్చిన పెదవులును, వారికిఁ గలవు; ఏటవాలుగనుండిన నేత్రములును, ధనురాకృతినొందిన కనుబొమలును వారిస్త్రీలకుఁ గలవు. స్త్రీపురుషాదులకుఁ జిన్నశిరోజములుండెను; పురుషులు పెద్దగడ్డములఁ బెంచి వానికొసలను నులిపి నిక్కబెట్టి యుంచెడి వారు. రెండవతెగవారికి నారికేళమువంటి శిరస్సులును దట్టమైన దవుడలును పెదవులును గలవు. రాజులును సామంతులును గంభీరులై ఔదార్యనిధులై, పరలోకచింతాక్రాంతులై యుండిరి.

రాజులు గాని సామంతులు గాని సంసారులు గాని విందుచేసినసమయమున భోక్తలకనుగుణముగ నొకశల్యపంజరమును నిలువఁబెట్టి యుంచుదురు. "షడ్రసములతోఁ బోషింపఁబడుచుండిన శరీరమునకుఁ గూడ నీయవస్థ సంప్రాప్తమగు" నని దానిభావమైయుంట వారికిఁ దెలియ నగును. రాజు రాజ్యమునకు వచ్చినపుడును మంత్రులును, సామంతులును, ప్రథమముననే దమతమగోరీలఁ గట్టించుకొనుదురు. వారివలెనే గాక సంసారులు సంతోషాతిశయముతో జీవించుచుండిరి. శిలాశాసనములను, శిలాప్రతిమలను చిత్రపటములఁ జూచిన నాట్యగానములలోను, క్రీడావిహారములలోను వారు పరిక్రమించుచుండిరని తెలియ నగును. జీవేచ్ఛగల వారు "ఆయురాశాస్తే, సుప్రజాస్త్వ మాశాస్తే, భూయోహవిష్కరణ మాశాస్తే, దివ్యంధా మాశాస్తే" అని వారు భగవంతునిఁ బ్రార్థించుచుండిరి. అటులనే బాలికాబాలకులుకూడ నాటపాటలలోఁ గలసిమెలసి తిరుగుచుండిరి. వారి పాఠశాలలు పెద్దవి; చంచలులైన బాలికాబాలకులను మార్గములోనికి దెచ్చుట

గురువులకుఁ గష్టముగ నుండెను. గురువులు బెత్తము నుపయోగింపకఁబోయిన "బాలురకు వీపులమీఁదఁ జెవులు మొలుచున"ని వారిలో సామెత కలదు.

గృహకుడ్య మెత్తున సరాసరి దానిపై నధికారమును సూచించుదండ మును ధరించియుండిన దేశాధికారియొక్క బొమ్మ చెక్కఁబడియున్నది. గోడ యొక్క మిగిలినభాగముపైని ఖనుల"ద్రవ్వుట, వేఁటాడుట, చేపలఁబట్టుట, ఇటికలఁ జేయుట దేవాలయములఁ గట్టుట—మొదలగు పనులఁ జేయుచుండి నటుల వానిభృత్యుల బొమ్మలు చెక్కఁబడియున్నది. వేత్రముఁజేతఁ బూని సేన కులు జాగరూకతతోఁ బనిచేయునటుల పరీక్షించు మఱియొక యధికారిబొమ్మ కూడ చెక్కఁబడియున్నది. ఇంతియకాదు. మఱియొకచోట దమ్ముచేయఁబడిన నేలమీఁద విత్తనములం జల్లి వానిని అణగ ద్రొక్కుచుండిన గొఱ్ఱెలమంద యొక్క బొమ్మ కనఁబడుచున్నది. ఇవియన్నియుఁ వారికీర్తిసంపదలఁ దెలియఁ జేయుచున్నవి. క్రీస్తుశతాబ్దములసమీపమునకు రానురాను ఇప్పటి బొమ్మల కును పూర్వమువానికిని కొంచెము వ్యత్యాసము కానఁబడును. ఈకాలము నాఁటి యజమానుని బొమ్మ చెక్కఁబడియున్నది.; కాని పూర్వమువలె పొట్టిచొక్కా యిని ధరించినటులగాక పెద్దచేతులు గలదానిని ధరించినటులకనఁబడును. పూర్వ ము గొఱ్ఱెలుచేయుచుండిన పనిని నేఁడుకృషీవలులు నాగలిఁ బట్టుకొనిచేయు చుండినటుల బొమ్మలవలనఁ దెలియనగును. సారాయివండుటయు బట్టలను మగ్గ మున వడకుటయు మొదలగుపనులఁ జేయుటయు వస్తుసామగ్రితో నిండియుం డిన పడవలు సముద్రముమీఁదఁ బోవుటయు ఐజిప్టియసైనికులు శత్రుసైన్య ములను యుద్ధములోఁ బాఱద్రోలుటయు - మొదలగు బొమ్మలు గోడలమీఁదఁ జెక్కఁబడియున్నది.

వ్యవహారార్థము "ఐజిప్టియులలో" అయిదుతెగలు కలవు. మొదటి తెగవారు సామంతులు అనగా రాజును రాజకుటుంబమువారును సూర్యభగ వానుని యంశచేత రాజు భూలోకములో నవతరించిన మహాపురుషుఁ డని వారియభిప్రాయము. ఆలోచనఁ జేయుటకును సలహానిచ్చుటకును నామకార్థము

"ర" అక్షరమునకు దీర్ఘము వచ్చెను. "రా" అను పేరుతో సూర్యభగవానుని "ఐజిప్టీయులు" "హెలీ" పురములో నొక దేవాలయములో నారాధించిరి. ఆమహా దేవుని కటాక్షముచేత వారిజననియైన "నైలు" నది సారసముగు చుండెను; లేక ఆయన కోపముచేత నీరసముగు చుండెను. మధ్యందినమార్తాండుని వారు "రా" అను పేరుతోఁ బూజించిరి. ఉదయభాస్కరుని "హార" అను పేరుతోను, అస్తమయసూర్యుని "తమ" అను పేరుతోను దినాధిపుని వారా రాధించిరి. సూర్యునకు "సురోత్తము" అనియు, "అహస్కర" అనియు రెండు పేర్లు కలవు.

(అ) హ (ః) (స్క) ర=హార.
(సు) (ర) (ఉ) త్తమ=తమ-
"తమ" "హార" శబ్దములకు వ్యుత్పత్తి ఈ విధమని తోచును.

మనుజులలోని జీవాత్మ ప్రభాకరుని కళయని వారిమతము. శరీరమును విడిచిన జీవుఁడు పరలోకమునకుఁ బోయి, అచట "అసిరసు" అను పరేత రాజుచేతఁ బాపపుణ్యములు విమర్శింపబడినతరువాత, వానిని యనుభవించుటకు యాలోకములకుఁ బోవు నని వారి సిద్ధాంతము. పుణ్యజీవులు సూర్యలోకమున స్వాగతులై విగతదోషులై, అచటనుండి పుణ్యలోకములకుఁ బోవుదురు. పాపాత్ములు రౌరవాదినరకములలోఁ బాపఫలము ననుభవించి, తిరిగి నంతరము భూలోకములోఁ గ్రిమికీటకాదిజంతుగర్భములలోఁగాని లేక నీచప్రజాతులలోఁగాని జననమొందుదురు. వారనేక దేవతల నారాధించిరి; ఈ దేవతలలో నుపదేవతలు కలరు; ఈయుపదేవతలకు సగము నరగణమును సగము దేవగణమును కలదు. ఆదేశములో నన్నినగరములలో దేవాలయములు కలవు; వానిలో భగవంతునివారు సగుణముగ నారాధించిరి. ఇంతియకాదు; మత్స్యము, మార్జాలము, వృషభము మొదలగుజంతువులు పవిత్రమైన వని యెంచి వారు వానిని గారవించిరి. "మంఫిసు" పట్టణములో నొక దేవాలయములో "అపిసు" అను పేరుతో నందీశ్వరుని వారు పూజించిరి. ఇచ్చట పూజారులు

పెక్కెండ్రు కలరు. షడ్రసములతోఁ గూడిన పక్వాన్నము నీనందీశ్వరుఁడు వెండిపళ్లెరములలో భుజించును. స్నానార్చనాదికృత్యములఁ జేయించుటకుఁ గొందఱుభృత్యులును పానోదకముఁ దెచ్చుటకు గొందఱును, శయనాదిపరిచారములకుఁ గొందఱును కలరు. ఇటుల మహావైభవముతో నుండిన నందీశ్వరుఁడు కాలధర్మమునొందిన, అర్చకులాశరీరమును భూషణములతోను దుస్తులతో నలంకరించి పాలరాలతోఁ గట్టఁబడిన గోరీలో సమాధిఁ జేయుచుండిరి. ఏగృహములోనైన మార్జాలముగాని శునకముగాని మృతినొందిన ఆగృహస్థు దానిమరణమునకు "అశుచి" పట్టవలెను. ఈమూలమున పిపీలికాదిబ్రహ్మపర్యంతముగల జీవులలోని జీవాత్మ అవాఙ్మానసగోచరుఁడైన పరమేశ్వరుని కళయని నిరూపించుట వారి ముఖ్యోద్దేశము. "నరాణాం చ నరాధిపం" అని చెప్పినవిధమున, రాజు భగవదంశసంభూతుఁడని తలఁచి ఆతనిని వారు పూజించిరి; ఆతఁడు భూలోకమునకు నవతరించిన సూర్యనారాయణమూర్తి యని వారి యభిప్రాయము. "ఓరాజా! నీకీర్తి సూర్యునివలె బ్రకాశించును; ప్రభువు వారికోరికలు సఫలమగును; నీవు రాజ్యము చేసినయెడల నుదకములు పాషాణములనుండి బయలు వెడలును; రాత్రి సూర్యుఁ డుదయించును." అని రాజును మంత్రులు స్తోత్రము జేయుదురు. ఇందుకు దృష్టాంతముగ నొకపురాణగాథకలదు. "ఈజిప్టు"నకు పైగల భాగములను "ఆసిరసు" అను పేరుగల నొక రాజు కలఁడు, అతఁడు భగవదంశసంభూతుఁడు; అతని సోదరుఁడు "సేతు" అనువాఁడు ఈర్ష్యచేత నతని జంపి, మృతకళేబరము నొకపెట్టెలోఁ బెట్టి దానిని "నైలు" నదిలో విడిచిపెట్టెను అది నదీప్రవాహవేగమున గొట్టికొని పోయి పోయి నదీముఖద్వారము నడమి సముద్రముఁ జేరను. భర్తృచింతాపరాయణియైన అతనిభార్య "ఈసిసు" భర్తృమరణమునకు దుఃఖించి, కళేబరము గానందునఁ జింతించి, దానిని వెదకి వెదకి, తుదకు దానిని సముద్రతీరమునఁ గనెను. ఆపెట్టెముతఁ దీయించి మృతకళేబరముఁ జూచి విలపించి కన్నీరు వరద్లైగాగ మూర్ఛఁబడి లేచి, శరీరమును తైలద్రోణిచేయించి సమాధిఁ జేయించుటకై దానిని "మెంఫిసు" పట్టణమునకుఁ దెచ్చెను. అన్నదమ్ముల వైరమున

కంతము లేదు. ఆశరీరము సమాధి చేయఁబడు సమయమున నష్టపడి, దానిని ముక్కలు ముక్కలుగ ఖండించి, రహస్యముగ నా ముక్కలను "సేతు" దాచివేసెను. ధర్మపత్నియైన "ఈసిసు" కష్టపడి, వానిని సంపాదించి సమాధి జేయించెను. తదనంతర మామె తనకుమారుఁడైన "హోరసు" ను పురికొల్పి "సేతు"తో యుద్ధముఁ జేయుటకు బంపెను. వీరిరువురు హోరాహోరీ మని పోరాడిరి; తుదకు "సేతు" ను కుమారుఁడు పట్టుకొని సంకెళ్లు వేసి తీసికొనివచ్చి తనతల్లి యెదుట వానిని నిలువఁబెట్టెను. ఆమె దయార్ద్రహృదయురాలు! కనుక వానిని సంకెళ్లనుండి విడిపించి స్వేచ్ఛావిహారమున కనుజ్ఞ నిచ్చి పంపివేసెను. అందుకుఁ గుమారుఁడు రౌద్రాకారుఁడై తత్తరపడి ఖడ్గముతో నామె శిరస్సును ఖండించెను. మాతృహత్యాపాప మతనికి దగులకుండ "తాతు" అనుదైవము గోశిరస్సును పెట్టి తల్లిని బ్రతికించెను తుదకు గుమారుఁడు "సేతుం జంపి" తనతండ్రి ఋణము దీర్చుకొనెను.

"ఆసిరసు" "ఈసిసు" "హోరసు" "సేతు" వీరిని "తేబీసు" పట్టణములో దేవాలయములో "ఆమను" అను నిర్గుణభగవంతుని నారాధించిరి. ఎన్ని కష్టముల నైనపడి మృతకళేబరములను వీరు సమాధి జేయుచుండిరని ఈ "ఆసిరసు" గాథవలన దెలియుచున్నది. ఎప్పటికైన పునర్జీవము వచ్చి ఈకళేబరములు లేచి తిరుగు నని మనోధైర్యము గలవారై యవి చెడిపోకుండ వానిని తైలద్రోణి జేయించి, అశ్మక్రియ, దారుక్రియ, చిత్రక్రియల సొబగు సొంపారు మందిరముల గట్టించి, వీనిలో వానిని సమాధిఁ జేయుచుండిరి. ఏబది శతాబ్దములకు పైగా గతించినవి. ఆనాటి "ఐజిప్టియుల" శమదమాదిగుణములను, కార్యనిర్వాహక నైపుణ్యముల నాచంద్రార్కము వారికీర్తి ప్రతిష్టలను వేనోళ్ల జాటుచు ఎండల కెండి వానలకుఁ దడిసి, చలిగాలి దెబ్బల దినుచు నిశ్చలముగ నిలువఁబడియుండిన "పిరమిదులను" మందిరములు నేటికిని గానఁబడును. అన్నిశతాబ్దములలో నాబాలవృద్ధ స్త్రీపురుషాదులను పండితపామరులకును యంత్రసాధనము లేమియు లేకయే మానుష్యమాత్రులే తన్మందిరముల గట్టఁగలిగిరా యని యాశ్చర్యము గలుగఁజేయుచుండును.

"పెద్దపిరమిడు" అరబ్బిదేశములోని ఖనులలోఁ ద్రవ్వఁబడి తేఁబడిన ఏకాండపు రాతిపలకలతోఁ గట్టఁబడెను. 3,60,000పనివాండ్రు ఇరువది సంవత్సరములు దానిని కట్టిరి; అంతయెత్తున కీబండరాళ్లె ట్లుల వారు తీసికొని వెళ్లగలిగిరో ఆశ్చర్యమగుచున్నది. పలువురు పలువిధములఁ జెప్పెడిసంగతులను నమ్మలేము. దానియొక్క,- ప్రతిముఖము 833-అడుగులు పొడవు, 725 అడుగులు ఎత్తు అని "ప్లినీ" అను రోమకచరిత్రకారుఁడు వ్రాసెను. దానిపునాదిలో నొక గది యుండును. ఏకాండపురాతిలో దొలచబడిన రంధ్రముగుండ దిగుడుమార్గమున దానిలోనికిఁ బోవలెను. అచ్చటనుండి మఱియొక యెగుడుమార్గము వెడలి "మహారాణిమందిరము" నకుఁ బోవును; అచ్చటనుండి మఱియొకమార్గము కష్ట్యాంతరములగుండఁ బోయి "మహారాజమందిరములోఁ" గలియును. "ఖూఫు" అను మహారాజుకాలములో నది కట్టఁబడెను; రాతితోఁ గట్టఁబడిన నతనిసమాధి యీమందిరములోఁ జూడనగును. ఇచ్చట రెండువాతాయనములు కలవు; వానిగుండ స్వేచ్ఛగ వాయువువచ్చి పోవుచుండును.

"ఇంతగొప్పమందిరములను వారేలకట్టిరి?" అను ప్రశ్నకు పెక్కురు పలువిధముల సమాధానములఁ జెప్పిరి. ఈమందిరములు వారినక్షత్రశాల లనియు వానిలోని వాతాయనములలో "దూరదర్శని" యంత్రములను నిలువఁబెట్టి వానిగుండ నూర్ధ్వగోళములను వారు చూచుచుండిరనికొందఱు చెప్పుదురు. ఏదెట్లున్నను ఇవి సమాధిమాత్రము నిజము; రాజులును, వారిభార్యలును, వారికుటుంబములవారును మృతినొందిన పిమ్మట వారిశరీరములను వానిలో సమాధిఁ జేయుచుండిరి. వానిని పిరమిడులనఁ జూడనగును. ఈమందిరములు వారికీర్తి ప్రతిష్ఠలను వెల్లడిచేయుట యనెడిమాట గాక మఱియొక సంగతికలదు. దయాదాక్షిణ్యములులేని రాజులు కఠినచిత్తులై ప్రజలను బాధపెట్టి వారిచేత వీనినిఁ గట్టించిరి. ఎందఱెన్నివిధముల, బాగులుపడలేక కొందఱును, బాధలఁబడికొందఱును, దేహత్యాగముఁజేసిరో చెప్పలేము. ప్రజలు తమరక్తము ధారవోసి దీనినిఁ గట్టిరి.

రెండవ "పిరమిదు" సమీపమున "స్ఫింక్సు" అను పేరుగల నొకశిలా ప్రతిమ కలదు. నాలుగు కాళ్లను ముడిచికొనియుండిన సింహశరీరమును, మనుజుని శిరస్సును కలిగియుండినట్లు ఈప్రతిమ చెక్కఁబడెను. ఇది ప్రాఙ్ముఖముగ నుండును. పరేతలోకమునకు దివాకరుఁడైన "హారుమా-చీసు" అను దేవుని ప్రతిమ యని చెప్పుదురు. నూరడుగులు పొడవుకలిగి నరముఖముచేత బుద్ధిబలమును, సింహశరీరముచేత దేహబలమును ఆప్రతిమ వెల్లడిచేయును. "పిరమిదుల" (గట్టించిన "ఖూఫు" అను మహారాజుని కాలములో నిది కట్టబడి, కాలాంతరమున దీనిమీఁదను ఇసుకమేట వేసెను. పదునెనిమిదవ తరములోని రాజు "చతుర్థతాత్మేశు"నకు స్వప్నములో "హారుమా-చీసు" దైవము ప్రత్యక్షమై ఇసుకలోఁ గప్పఁబడియుండిన తనశిలాప్రతిమను బయటకతిఁడు తీయించినయెడల నతనిని "ఈజిప్టు" దేశమున కధీశునిగఁ జేసెదనని చెప్పినట్లు ఆప్రతిమ యద్దనుండిన శిలాశాసనమువలనఁ దెలియనగును. "పిరిమిదులకుఁ" గొంచెముదూరములో నీప్రతిమ శిరస్సు భూమిలోనుండి బయటకు వచ్చుచున్నట్లు కనఁబడును. దీనికి "భయజనకుఁడ"ని నామమిడిరి." అని రోమక చరిత్రకారుఁడు "ప్లిని" వ్రాయుచు, "ఈశిరస్సుయొక్క శరీరము భూగర్భములోఁ గలదు. దానిచక్కని ముఖమునుండి తెలివితేట లొలుకుచుండును. ఆముఖములో మందహాసము కనబడును" అని అతఁడు వ్రాసెను.

ఇకను "కార్నాకు" దేవాలయముఁ జూచిన, వారు సకలకళావతంసులనిచెప్పనగును. "ఆమను" దేవతకొఱకు "తేబీసు" పట్టణములోఁ గట్టఁబడి మఱికొంతకాలమునకు "వీరతాత్మేశుఁడ" ను రాజు దానిని వృద్ధిఁజేసి, అశ్మక్రియ, శిల్పక్రియ, దారుక్రియలయొక్క సంపద్వైభవములతోఁ గూర్చి, దానిని మనోహరముగఁ జేసెను. దానికుడ్యములమీఁద వ్రాయఁబడిన శాసనములవలనను (బొమ్మలవలనను, ఆయాతరములచరిత్రము వ్రాయనగును. ఇచట నొకపేరోలగము కలదు; దానికిఁదగిలి ఉన్నతస్తంభములతోఁ గూడిన పంచహజారములు కలవు; అయిదుగదులు వీనికిఁ దగిలియుండును. సకలవిద్యా

నాథుఁడగు "తాతు" దేవుని ప్రతిమయు, జ్ఞానరూపిణి యైన "సాపు" అను సరస్వతి ప్రతిమయు, గోడలమీఁద వ్రాయఁబడెను.) ఈగుడులు వారిపుస్తక భాండాగారములు; కాలాంతరమున వారిశత్రువుల దుర్నీతిచేత నశించెను. "పాపిరసు" పత్రముల మీఁద వ్రాయఁబడిన వారిగ్రంథములు నేటివఱకుఁ జూడ నగును. ఆవ్రాతను మనము చదువలేము; అది గిలిబిలివ్రాత. వానిలో నొకటి వారిప్రాచీనగ్రంథము. "జ్ఞానప్రదీపిక" యను వారివేదములో జ్ఞానకాండ, ధర్మకాండ, కర్మకాండ యని మూఁడువిధములుకలవు. ఈగ్రంథము "తాతు" దేవుని ముఖమునుండి వచ్చినదని వారుచెప్పినను, ఆయాకాలములలో మనుజుల బుద్ధికుశలతకొలఁది నది వ్రాయబడినట్లు తోఁచును. కావ్యాలంకారనాటకముల లోను, అంకగణితములోను, బీజగణితములోను, జ్యోతిశ్శాస్త్రములోను — మొదలగువానిలో వైదికులు ప్రవేశమును గనిరి ; వారే శాస్త్రజ్ఞులు ; వారే అధ్యాపకులు — ఈప్రకారము వారు సూర్యభగవానుని ధ్యానించిరి: —

"సర్వదేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మి భావనః,
సువర్ణసదృశో భాను ర్హిరణ్యరేతా దివాకరః.
నమః పూర్వాయ గిరయే పశ్చిమే గిరయే నమః,
నమః పద్మః ప్రబోధాయ మార్తాండాయ నమో నమః.
పాయ త్యేష తప త్యేష వర్ష త్యేష గభస్తిభిః,
ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః.
నమో దేవాదిదేవాయ సూర్యాయాదిత్య వర్చసే,
గుణరూపవిహీనాయ పశూనాం సృష్టికర్తయే."

జీర్ణవస్త్రములను విడిచి నూతనవస్త్రములను మనుజులు ధరించువిధమున జీర్ణించిన కళేబరములను జీవుఁడువిడిచి కర్మఫలము ననుసరించి నూతనశరీరముల బొందునని వారిమతము. వారికి దేవునియందు భక్తివిశేషము. ధర్మముయం దాసక్తి మెండు; భూతములయం దభిమానము నిరంతరము.

"బహుధా ప్యాగమై ర్భిన్నాః పంథాన స్సిద్ధిహేతవః, త్వ య్యేవ నిపతం త్యోఘాః జాహ్నవీ యా ఇవార్ణవే" అని చెప్పినవిధమున వారనేకకోటిదేవతలనారాధించినప్పటికిని భగవంతుఁ డొకఁడే యని వారియభిప్రాయము.

---

## పదునెనిమిదవఅధ్యాయము.

### ఈజిప్టు - ఉచ్ఛదశ:—క్రీ. పూ సం. 4400-1400 రములు.

స్వయంకృషిచేసి కాలాంతరమున స్వానుభవముచేత శాస్త్రములను "ఐజిప్టీయులు" నేర్చుకొనిరి గాని మఱియొకరి వద్ద నభ్యసించలే దని చెప్పుటకు నిదర్శనములు కనఁబడును. ప్రాచీన పాషాణయుగము మొదలు లోహయుగము వఱ కెంతకాలము వారుగడిపిరో తెలియదు. ఈయుగములను గడిపినతరువాత మహావైభవముతోఁ గూడినరాజ్యపదవికి వారువచ్చిరి. తనుసత్క్రగ్నను, తనుసచ్ఛాస్త్రపఠనమును వారు ఊఁతఁగొని కాలారోహణము జేసిరి. క్రీ. పూ 46-వ శతాబ్దమునాటికి వారు నాగరికులై యుండిరి ; అంతకు పూర్వము వారాయుగములలో నెన్నిదివ్యసంవత్సరములు గడిపిరో చెప్పలేము.

క్రీ. పూ. 46-వ శతాబ్దమున "మనేశుఁడు" అనువాఁడు సంస్థానమున స్థాపించిన మూలపురుషుఁడు కొన్నిసంగతులలో మనముకాలనిర్ధారణఁ జేయలేము.ఎంతకాలము గతించినను, "మనేశుఁడు"అనురాజు వారిమూలపురుషుఁ డనుమాట నిశ్చయము. అతఁ డాదేశముయొక్క దక్షిణోత్తరభాగములఁ బరిపాలించెను; "మంఫిసు" పట్టణముఁ గట్టించెను. అన్నిదేవతలలో నేదేవుఁడు సర్వశాస్త్రములను మనుజునకుఁ దెలియఁజేసెనో, ఆ"థా"అను దేవునకొకదేవాలయము నతఁడాపట్టణములో నిర్మించెను;ఆదేవాలయముయొక్కరూపముమాసిపోయెను; ఆపట్టణముయొక్క దిబ్బలమీద "కైరో" పట్టణమును నేడుకట్టిరి.

మూఁడుయాఱువందలసంవత్సరములకు, అనఁగా క్రీ.పూ. సం॥3800ర ప్రాంతమున నాల్గవతరములోని "శేనుఫరుఁడు" అనురాజును వానిసంతతివారును "పిరమిదుల" గట్టుట కారంభించిరి. సాష్టాంగముఁ జేయు శత్రురాజు నొకనిని గదతోఁ గొట్టుచుండిన విధమున నీరాజు బొమ్మశిలమీఁదఁ జెక్కఁబడియున్నది. "శత్రుమర్దనుఁడ" ని బిరుదు వహించి, పరదేశీయులను జయించి వారివలన గప్పములఁ నతఁడు పుచ్చుకొనెను. ఆకాలములో "ఐంద్రజాలము" నందు వారికి నమ్మకముకలదు. ఒకనాఁడీరాజు చింతాక్రాంతుఁడై నీరసపడియుండ, ఐంద్రజాలికుఁ డొకఁడువచ్చి "ఓరాజా, ఒకపడవలో నీవు సరోవరముమీఁద విహరించిన యెడల, నీవుస్వస్థచిత్తుఁడవు కాఁగలవ" ని సలహాచేసెను, బంగారు కట్లుగల దంతపుతెడ్లను చేతులలోఁ బట్టుకొని పడవను గడుపుట కిరువదియువతులు సిద్ధముగ నుండిరి. అప్పుడు రాజు దానిలోఁ బ్రవేశింప, వారు దానిని గడపిరి. బుద్ధిపూర్వకముగ వారిలో నొకబాల తనచేతికంకణమును నీటిలోనికిం జాఱవిడిచి ఏడ్వసాగెను. రాజు ఆమె నుపలాలించి, ఐంద్రజాలికునికి వర్తమానముఁ బంపెను. అతఁడు శీఘ్రములో వచ్చి తనమహిమచేత సరస్సులో నొకప్రక్కనీరంతయు మఱియొకప్రక్కను వచ్చునటులఁ జేసి, ఆమెకంకణము నామెకిచ్చివేసిన తరువాత, సరస్సుపూర్వమువలె జలపూరిత మయ్యెను.

అనంతరము "ఖోయోపసు" అనురాజు సింహాసనమునకు వచ్చెను. అతఁడు "పెద్దపిరమిదు"ఁ గట్టించెను. "హిరోడతేశుఁడు" అను గ్రీకుచరిత్రకారుఁడు చెప్పినసంగతులు కొన్నినమ్ముటకు వీలులేకపోయినను, అతఁడీరాజునుగుఱించి చరిత్రలో వ్రాసినయంశములు వినఁదగియుండును. "ఈరాజు దుర్మార్గుఁడు; కలుషచిత్తుఁడు ; మనోవాక్కర్మలలోఁ గ్రూరుఁడు. దేవాలయములలో భోగరాగములను నిషేధించి, ప్రజలను దేవతార్చనవిధానములం జేయుచుండునటుల నరికట్టి, తనస్వంతపనులను వారిచేతఁ జేయించెను. ఈప్రకారము పదిసంవత్సరములవఱకు వారిని నిరోధించి, గనులలో వారిచేతఁ బనిఁజేయించి, రాతిపలకలను మోయించెను. తనగోరీనిమిత్తము పెద్ద

గోపురములఁ గట్టించి, వానిపునాదుల క్రిందభూగర్భములో మఱికొన్నిగదులను కట్టుటకు సమకట్టి, వారిచేతఁ బనిఁజేయించెను. 11 మొదలు 14 తరముల వఱకు "థేబీసు" పట్టణము రాజధానియై ప్రకాశించెను.

4-వ తరము మొదలు 11-వ తరమువఱకుఁ గలరాజులు 'పిరమిడుల' గట్టుటలోఁ గాలముఁ గడపిరి. 11-12వ తరములనాటికి "మంఫిసు" పట్టణము క్షీణింప అంతకుఁ బూర్వమునుండి పెఱుగుచువచ్చిన "థేబీసు" పట్టణము రాజధానియయ్యెను. దానిస్థితి మంచిది. పూర్వపశ్చిమదిశల నుండిన పర్వతశ్రేణులచేత శత్రుదాడినుండి రక్షింపఁబడి "నైలు" నది కిరుతటముల నుండు మైదానముమీఁద నాపట్టణము పెరిగెను. ఆనాటికి దేవతలందఱిలోను ఘనతవహించిన "ఆమను" దేవునికి విశేషభోగరాగాదులు జఱుగుచుండెను; అతని దేవాలయ మాపట్టణములో నుండెను. మతాభిమానులైనవారికి అది దేవస్థాన మయ్యెను.

11-వ తరమురాజులకు "అంతేపు"రాజు లని పేరు కలదు. వారిలో నొకఁడు వేఁటకాఁడు. అతఁడు కుక్కలతోఁ బోయి వేఁటాడుచుండినట్లు గోడమీఁదఁ జెక్కఁబడిన బొమ్మ జాడ నగుచు. ఈశిలాశాసనముల వలన మఱి యొకసంగతి తెలియుచున్నది. ఓడవర్తక మారాజులకాలములో "అరబ్బి" మొదలగు దేశములతో మెండుగ సాగెను. లొట్టియలమీఁద నెడారుల నుండఁ బోవువర్తకుల కుపయోగించునటుల నూతులం గొందఱు రాజులు త్రవ్వించిరి; దేశము పొలిమేఱలనుండిన ఖనులం గాపాడుటకు "దండుదుర్గము"లఁ గొందఱు రాజులు కట్టించిరి.

క్రీ. పూ. సం॥ 2500 రములోఁ బండ్రెండవతరము రాజులు రాజ్యము జేసిరి. వారికాలములో నాదేశము మహోచ్ఛపదవికి వచ్చెను. ఈతరములోను పూర్వతరములోను రాజులు గొప్పబిరుదులను వహించిరి. ఈతరములో "అమనేమ-హాతుఁడు" మొదటి రాజు అతనితరువాత సింహాసనమునకు వచ్చిన వాని

కాలములో నొకవింతసంగతి జరిగెను; దీనింబట్టి వారిస్వభావముఁ దెలియవగును. "శనేహాతుఁడు" అను సైనికుఁడు రాజు అమనేమ-హాతుని మరణమును విని, రాజపుత్త్రుఁడు 'ఉశర్త్సేనుఁడు' చంపఁజూచునని భయపడి దేశము నుండి పరారియై తన ప్రాణములఁ గాపాడుకొనెను. తుప్పలలోఁ బగటివేళలఁ దాఁగి, రాత్రికాలములోఁ బ్రయాణమగుచు, క్షుత్పిపాసలకు బాధపడి, కొంచెము నీరైనను దొరకునని భ్రాంతిపడి, వాఁడొకస్థలమునకు వచ్చెను. అచ్చట నీరు కనఁబడనందున, నేలఁబడి వాఁడు మూర్ఛిల్లెను. కొంతసేపటికి గోవుల "అంభా" శబ్దమును విని లేచి, వాఁడొక గోపాలకునిఁ జూచెను. అతనిని వాఁడాదరించి, అతనికి క్షీరముల నిచ్చి, జవసత్త్వములు వచ్చినపైని, వెంటఁబెట్టుకొని, గోపపల్లెకు దీసికొని వెళ్లెను; కాని సైనికుఁడు మాత్రమచ్చట నిలువక రాత్రికి రాత్రి బయలువెడలి "ఏడాము" దేశమునకుఁ బారిపోయెను. వాఁడా దేశపురాజు కొలువులోఁ బ్రవేశించి, క్రమముగ వృద్ధిఁబొంది సామంతుఁడై ఐశ్వర్యోపేతుండైన శాల్యోదనమును భుజించెను. కొంతకాలమునకు వానిపరాక్రమము విజృంభించెను; దేశములోని దుర్మార్గులదండును విదళించి, వాఁడు సేనాధిపతియై సైన్యములతో విచ్చలవిడి సంచరించి రక్షణశిక్షణాధికారములను వహించెను. ఇట్టుల కాలముగడిపి, వాఁడు వృద్ధుఁడయినప్పటికిని వానికి స్వదేశాభిమానము పోలేదు. అప్పుడు వాఁడు మహాప్రభూ! రాజాధిరాజ, రాజమార్తాండ, నేను మనుజమాత్రుఁడను; ఏలినవారికి జాబువ్రాయు నేపాటివాఁడను ప్రభువువారి రాజ్యములో నివసించియుంటిని. ఎచ్చట నేయవస్థలోనుండినను, ప్రభువుల పాదపద్మములను స్మరణఁజేయు చుంటిని; వయోవృద్ధు నైతిని; స్వదేశమునకు వచ్చి, తమపాదములవద్ద నా ప్రాణములను నిశ్చింతగ విడువవలె నను కోరిక తప్ప మఱియొకటిలేదు. ప్రభువులు నాకోరిక నీడేర్పఁగలరు" అని "ఐజిప్టు" దేశపురాజునకు లేఖను వ్రాసిపంపెను. ఆదేశపురాజు దానిం జూచి సంతసించి "నీస్వదేశాభిమానమునకు మేము సంతసించితిమి, నీకుఁ దగినసత్కారముఁ జేయుదుము, నీవు మాదేశమునకు వచ్చి నివసింపుము" అని ప్రత్యు

త్తరమును వ్రాసిపంపెను. వాఁడు దానింజూచి స్వదేశమునకుఁ బోయి రాజుం జూచి కొంతికాలము జీవించి స్వర్గస్థుఁ డయ్యెను.

ఈతరములోని రాజులు స్వలాభము నభిలషింపక ప్రజలసౌఖ్యమునకుఁ బాటుపడిరి. ప్రజలరాకపోకలకుఁదగు రాజమార్గములను వారు వేయించిరి; సస్యోపయుక్తమగునట్టుల పెద్దజలనిధులఁ గట్టించిరి—వర్తకము సాగెను; శత్రువుల భయము లేకుండ దేశముయొక్క పొలిమేరలను రక్షించిరి—"పిరమిదులఁ" గట్టుటలోఁగంటె దేవాలయములఁ గట్టుటలోఁ ప్రజలు శ్రమపడిరి. "అమనేమ - హాతుఁడు" గొప్పవేఁటకాఁడు; "సింహముఁ జంపి, మొసలిని కట్టి తెచ్చిన వాఁడ" నని యతఁడు బిగురుచుండెను—వీనికంటె గొప్పసంగతి యేమన, పొలిమేరలఁగాపాడి దేశమునకు స్వాస్థ్యముఁ దెచ్చినందున, నతనిని ప్రజలు ప్రేమించి గౌరవించిరి. అతనికుమారుఁడు "ప్రథమ—ఉశర్త్సెనుఁడు" సింహాసనము నెక్కి, అశ్మక్రియా, చిత్రక్రియల నైభవములతోఁ గూడినదివ్యభవనములను నిర్మించి, "హేలియోపురము" లో సూర్యాంశదేవాలయముఁ గట్టించెను—ఆదేవాలయము నేలఁగలిసెను: కాని దానిగోపురశిఖరము నేఁడు చూడనగును.

అతనితరువాత "ద్వితీయఉశర్త్సెనుఁడు" రాజ్యమునకు వచ్చెను. ఈకాలములో "ఆశియా" ఖండమునుండి "సమేత" కుటుంబములోనివారు కొందఱీదేశమునకు వచ్చి రాజాజ్ఞపైని కొన్నిసారవంతములగు భూములను సాగుఁ జేయుటకుఁ బుచ్చుకొని, నివసించుటకు నివేశనములను నిర్మించి భార్యాపుత్రాదులతోఁగాపురముండిరి. బాణములు గుదియలు ధనస్సులు వాద్యవిశేషములు—మొదలగువానితో వారు దేశములలోనికి వచ్చిరి. ఉపాయనముక్రింద వారుగొఱ్ఱెలను సుగంధద్రవ్యములఁ దెచ్చి రాజున కిచ్చిరి. ఈకథయంతయు శిలమీఁదబొమ్మలుగా చెక్కఁబడియున్నది.

"తృతీయ-అమెనెమహాతుఁడు" - క్రీ. పూ. సం. 2622—2578 వత్సరములు; —ఈకాలములో నితఁడు సుప్రసిద్ధుఁడు "అమెంపతి" యని బిరుదు వహించెను. ఒకసమయమునఁ బ్రతిసంవత్సరము "నైలు" నది పొంగి తాళప్రమాణమున పొంగివచ్చి దేశమునీఁదబడి పాడుచేయుటకాదు; లేక, అనావృష్టిచేతఁ గొన్నిసంవత్సరములలో నదిలో నీరులేక సస్యములు ఫలింపక పోవుటయును కలదు. ఈయతివృష్టి అనావృష్టులవలనఁ గలుగుబాధలఁ దొలగించు సాధనమొకరీతిఁ దలంచెను. "నైలు"నదినుండి "లిబియా" పర్వతములలో వెలసి నొక కాలువఁ ద్రవ్వించి, ఆకాలువలో నొక విస్తృజలనిధిం గట్టించెను. అతివృష్టివలన నది యుప్పొంగి పొర్లి పారినప్పుడు ఆ పొర్లునీరు యీ వస్తు కాలువగుండా "జలనిధి" లోనికిఁ బోవుచుండెను; అందుచేతఁ బ్రజలయును పశువులయును సస్యములయును బాధలేకయుండెను. అనావృష్టిచేత నీటియెద్దడి కలిగినప్పుడు, మరియొక కాలువగుండ నీరుఁ బారించి, వారు పంటల బండించిరి. "సర్పపూర్వ్యవ"మను పేరుగల "పిరమిడు" నితఁడు కట్టించెను. ఇందులో మూడువందలగదులు భూమిమట్టములోను మరిమూడువందలగదులు భూగర్భములోను కలవు. ఇవియన్నియు విస్తారదారులచేతఁ గలుపఁబడి, అగములవంటివి పండ్రెండు మహోన్నతమైన గోలవృత్తాంబములు కలవు. ఆ దేశీయులకు పవిత్రమైన మొసళ్లు చనిపోయిన తరువాత వానిని సమాధిఁ జేయుటకొఱకీ "పిరమిడు" కట్టబడెను. "బైబిలు" గ్రంథములో 'ప్రపంచోత్పత్తి' యను మకాండములోఁ జెప్పిన ప్రకారము "అబ్రహాము" అనువాఁ డీరాజుకాలములో విదేశమునకు వచ్చియుండును. అతనివంటివారేకాక, తదితర దేశవాసులు కూడ సారవసస్యఫలవంతమని తెలిసి ఈదేశమునకు వచ్చి కాపుర ముండిరి. ఈరాజు స్వర్గస్థుఁడయిన తరువాత, నా దేశముయొక్క సిరిసంపదలు తొలంగెను; అనేక విపదశలు సంప్రాప్త మయ్యెను.

15-16 సంవత్సరములు —"హిక్సోస్" రాజులు: — ఇదివఱకు మనము స్పష్టముగ చూచిరానివచ్చిన శతాబ్దములలో మఱికొన్ని స్వతంత్రరాజ్యములు

పగదేశములలో స్థాపింపఁబడెను. కాలక్రమమున "అశీరియా" దేశము బుద్ధిబలమును, దేహబలమును, ధనబలమును కలదియై, తనసరిహద్దులను విరివిఁ జేసికొనుచు "ఐజిప్టు"దేశముతో శత్రుత్వమువహించెను. ఈదేశమున కిరుగుపొరుగున నుండినవారు సహితము బలవంతులై జనాభివృద్ధియగుటచేత స్వదేశము సరిపడనందునఁ బరదేశముల నాక్రమించుటకు సిద్ధపడుచుండిరి. "హీతేయులను" వారును 'కేసులను' వారును ఒకకుటుంబములోని వారని శిలాశాసనముల వలనఁ దెలియుచున్నది; వీరుకూడ బలవంతులై స్వదేశముచాలనందున నీకాలములో 'ఐజిప్టు' దేశముపైకి దండెత్తివచ్చిరి. నూతనముగ దండువెడలి వచ్చినవారును దేశములో నిదివఱకు గాపురముండినవారు నేకకుటుంబములోనివారై దేశము క్షీణదశలో నుండుటచేత వారు దానిని సునాయాసముగ నాక్రమించిరని సిద్ధాంతము కలదు. "మనేతుఁడ"ను ప్రాచీనచరిత్రకారుఁ డీవిధమున వ్రాసెను:—"కేవలము నీచులును హీనకుటుంబములోని వారొకరు మాదేశము పైకి దండువెడలుటకుఁ దగినధైర్యస్థైర్యములం గలవారై వచ్చి మాదేశరాజులు తరాజులుగనుక వారిని స్వాధీనముఁ జేసికొని, ఒకయుద్ధమైనఁ జేయక దాని నాక్రమించిరి. మారాజులు వారిచేతిలోఁ జిక్కుపడిరి; వారు పట్టణములను ధ్వంసముఁజేసి, దేవాలయములను నేలఁగలిపి ప్రజలను చెప్పరాని బాధలఁబెట్టి ఆబాలవృద్ధుల స్త్రీపురుషాదులఁ గట్టి కొట్టిచంపి, మిగిలినవారిని బానిసలుగఁ జేసిరి? ఇటుల పూర్వదిశనుండి బయలువెడలివచ్చిన అనాగరికులదండు పొర్లిదేశముమీఁదఁ బారినందున పూర్వోపార్జితమయిన యైశ్వర్య నాగరికచిహ్నములు రూపము మాసిపోయెను—రాబోవు కొన్నిశతాబ్దములవఱకు దేశము క్షీణించి నీరసపడి యుండెను—"ఏవిధమైనశిలాశాసనములు లేక, దేశము మౌనమును ధరించియుండుటచేత, సమస్తకళలస్తంగతమైన వని తోఁచును"— మనుజులలో నొకరి కొకరు కీడుఁజేసికొనిన యెడలఁ గీడుఁబొందిన వాఁడెటుల కొంతకాలముగడిచినఁగాని దనపూర్వపుస్థితికి రాఁజాలఁడో, అటులనే దేశీయులుకూడ సంఘముపైని కీడుఁబొందిన యెడలఁ గొన్నిశతాబ్దములనఱకుఁ దమపూర్వపుమహోచ్ఛపదవిం బొంద నేరరు.

ఈతరములోని రాజులకు "హిక్సోసుల" ని లేక "గోపాలకులని దేశము నాక్రమించిన వారు పేరుఁ బెట్టిరి. ఈదేశమునకు వచ్చుటకుఁ బూర్వము శత్రువులు "గోపాలకావస్థ" లేక "సంచారావస్థలో నుండెడివారు కనుక, వారిరాజుల కీపేరిడిరి. అయిదుశతాబ్దములవఱకు వారీదేశముఁ బరిపాలించిరి; దేశముయొక్క నాగరికతను పాడుఁజేయఁ దలచి, వారు చిట్టచివఱకు దానిచేత బాగుపడిరి. "ఇస్రాయేలీయుల" లోనివాఁడైన "జేకబు" కుమారుఁడు "జోసఫు" ఈదేశమునకు వచ్చినపుడు, ఈగోపాలరాజులలో నొకఁడు వానినాదరించి పోషించెను—గోపాలుఁ డనుమాటను వినిన, ప్రతి "ఐజిప్టీయునకు" ను అసహ్యము. "జేకబు" ను వానికుమారులవంటివారిని "హిక్సోస" రాజొకఁడు సన్మానించి తనదేశములోఁ గాపురముండునటులఁ జేసెను.

18-వ తరగతి నవీనరాజ్యము—క్రీ. పూ. సం|| 1700-రము ఎట్టకేలకు "హిక్సోస" రాజుల ప్రభుత్వ మంతరించెను. వారు నాగరికులైనను, వారి పిక్కబలమును దండబలమును తగ్గెను; వారిసిరము నీరసించెను. తుదకు "హిక్సోస" రాజులును "థీబను" రాజులును కలిసి దేశమును రెండుభాగములుగఁ బరిపాలించిరి. "థీబను" రాజు "ప్రథమఅమేసుఁడు" స్నేహకోటిలోని సామంతరాజుల సహాయముచేత నొకసైన్యముఁ గూర్చి, దానితో దండెత్తి పోయి "హిక్సోస" రాజు నోడించెను. ఇంతటితో వారంతరించిరి; హతశేషులు "థీబను" రాజునకు స్వాధీను లయిరి.

"ప్రథమ తాత్మేసుఁడు"—ఈరాజు "ప్రథమఅమేసు"ని మనుమఁడు. 'తాత్మేసుఁడు' దేశమునకు స్వాస్థ్యముఁ దెచ్చి పరదేశములను లోఁబర్చుకొనుటకు దండుఁ దీసికొని బయలుదేఱెను. "నూబియ" "కుషు" దేశముల నతఁడు జయించెను. ఈజయముఁ గీర్తించుచు శిలాశాసన మొకటి వ్రాయఁబడెను. "అతఁడు పూర్వదక్షిణోత్తర పశ్చిమదిశలయందలి రాజులను జయించి వారివలన గప్పములఁ బుచ్చుకొనెను; అనాగరికులగువారిని లొంగదీసెను;

సమ స్తదేశాధీశు లతనిపాదాక్రాంతులయిరి" అని శాసనములో వ్రాయబడెను. అనంతరము "ఐజిప్టున" కుత్తరమునను "ఆశియా" ఖండమునకు నైరృతి మూల నుండిన "బాబిలను" "అశిరియా" దేశములపైకిని, "హితేతులు, కానతేతులు, ఫిలస్తేనులు" మొదలగువారి దేశములపైకిని దండునెడలి "పాలస్తేను" దేశముగుండఁ బోయి "యూఫ్రిటీసు" నదిని దాటి ఘోరాహవములో వారిని అతఁడు జయించెను. వారివలనఁ గప్పముల బుచ్చుకొని, జయజయధ్వనులు మ్రోయ మహావైభవముతో నతఁడు స్వరాజధానికి వచ్చిచేరను. శేషించిన పరిపాలనకాలము నతఁడు దేవాలయములఁ గట్టించుటలోను, సర్వజనోపకారమగు పనులలోఁ గడిపెను. అతఁడు దేశమునకు 'స్వాస్థ్యముఁ దెచ్చి దానికి రూపురేఖవిలాసముల నమర్చెను; పరదేశీయులతో స్వదేశీయులకు సంబంధముఁ గలుగఁజేసెను. ఈసంబంధము కేవలము దండోపాయము మీఁద నిలువఁబడి యుండినను, ముస్ముందు దృఢము కాగలదు.

"ప్రథమతాత్మేశునకు" "ద్వితీయతాత్మేశుఁ"డను కుమారుఁడును "హతేశి" అను కుమార్తెయుం కలరు. అతని మరణానంతరమును కుమారుఁడు సింహాసనమునకువచ్చెను, కాని, అతని కుమార్తె రాజ్యపాలనఁజేసెను. గాంభీర్యములోను, ధైర్యస్థైర్యములలోను, ప్రభుమంత్రోత్సాహశక్తులలోను "హతేశి" భ్రాతను మించినది కనుక నామె దేశముఁ బరిపాలించెను. తనతమ్ముని జీవితకాలములో నామె రాజ్యసూత్రములను వహించి, శాశ్వతమైన కీర్తిపనుల జేయ నారంభించెను. "థేబీసు" పట్టణము వద్ద నపూర్వముగ దేవాలయమొకటి యామె కట్టించెను; కార్నాకు పట్టణములోని "అమును" దేవాలయమును పూర్వముకంటె విరివి చేయించెను. ఇంతటితో నామె తృప్తి జెందలేదు. తమ్ముని మరణానంతర మతనికుమారుఁడు "తృతీయతాత్మేశుఁడు" బాలుఁడైనందున నతనిని నామకార్థము రాజుఁజేసి, ఆమె రాజ్యముఁజేసెను. "సూర్యదుహిత" అనియు, ఆమెకు దేవపత్ని అనియు ఆమెకు బిరుదులు కలవు. ఆమె క్రమముగ పురుషునిదుస్తులను ధరించి, మహారాజాధిరాజ అని పిలువఁబడెను. ఇంతియ

కాదు. ఆమె పడవలఁ గట్టించి పరదేశములతో నోడవర్తకమును సాగించెను. రుధిర సముద్రమున కిరుతటముల నుండు ప్రదేశములు సుగంధద్రవ్యములకుఁ బ్రసిద్ధికెక్కినందున, వానితో వర్తకము సాగెను. ఆదేశముల నేలుచుండిన రాణి సుగంధవృక్షములఁ దీసికొని "హాతీశ" నిఁ జూచుటకు బిరుదునిశానీలతో వచ్చెను. ఇందుకు ఆమె సంతసించి "ఆమాను" దేవునకు మఱియొక దేవాలయముఁ గట్టించెను. ఆదేవాలయముయొక్క రాతిగోడలమీఁద నీచరిత్రమంతయు చిత్తరువు చెక్కఁబడియున్నది. సముద్రముమీఁద నోడలు పోవుటయు, సుగంధద్రవ్యములఁ బట్టుకొని వ్యాపారులు వచ్చుటయు, సుగంధవృక్షములతో వచ్చినరాణియు, బిరుదునిశానీలతో నొకరినొకరు కలిసికొనుటయు ఈ—మొదలగు కథయంతయు స్పష్టముగా కనఁబడును.

హాతీశ యను నామె మేనల్లుఁడు 'తృతీయథాత్మోసుఁడు' దినదినప్రవర్ధమానుండై శిల్పశాస్త్రములలో నేమి, పంచతంత్రములలో నేమి, చతురంగబలముల నడిపించుటలో నేమి, పితామహుని మించెను. ఆమె కష్టము లేకపోయినను, రాజకీయవ్యవహారములలో నామెతో నతఁడుకలసి సంచరించెను. కొంతకాలమున నామె స్వర్గము నొంద, నతఁడు సింహాసన మెక్కి, శాసనములలో నామెపేరుఁ దీసివేయించెను. త్రయోవింశతిజన్మదినమున, నతఁడు రణభేరి వేయించి, చతురంగబలములతో "సిరియా" దేశమునకు సింహద్వారమగు "గాజా" పట్టణమునకుఁ బోయి, అచ్చట "ఫిలస్తీనుల" నోడించెను; అచ్చటనుండి "ఫిలస్తీను" దేశమునకు నడిచెను. "మాగెధియ" పట్టణసమీపమున "సిరియాను—హిత్తీయులు" యొక్క సైన్యములఁ బోరాటములో నోడించి, జయశబ్దములు మ్రోఁగ రాజధానికి వచ్చిచేరెను. పిదప నక ప్రతిసంవత్సరము నతఁడు "సిరియా" దేశముపైకి దాడి వెడలుచుండెను. ప్రతిసంవత్సరములోను సైనికులు వెండిబంగారములను రత్నములను సుగంధద్రవ్యములను తీసికొని వచ్చుచుండిరి. 'యూఫ్రటీసు' నదీతీరమున నుండు 'నినెవా' పట్టణమువఱకు నతఁడు దాడి వెడలెను, ఆదేశపురాజులతోఁ గలహించుటకు

భయపడి సంధిఁ జేసికొనెను. "బాబిలను" దేశవాసులు కూడ నుపాయనములనతనిఁ బంపిరి. ఇటుల జగదేకవీరుఁడై సముద్రముమీఁదఁ బోయి "గ్రీసు" "ఇటాలియా" దేశముల సముద్రప్రాంతభూములను కూడ బహుళః స్వాధీనముఁ జేసికొనెను, "కైప్రసు" ద్వీపవాసుల నోడించి వారి వలనఁ గప్పములఁ బుచ్చుకొనెను. అతనికాలములో "ఐజిప్టు" దేశము వీరదేశమని ప్రఖ్యాతి కెక్కెను. అతని కీర్తిస్తంభములు రెండు "లండను" పట్టణములోఁ గలవు. ఒకటి, దేవాలయగోపురశిఖరము "తేమ్సు" నదీతీరమునఁ గనఁబడును; మఱియొకటి "ఆంగ్లేయ సర్వవస్తుభాండాగారము"లో నతని శిలాప్రతిమయొక్క శిరోభాగమునఁ జూడనగును.

అతనివంశస్థుఁడు "తృతీయ అమనేతపుఁడు" రెండుమహోన్నతమగు శిలాప్రతిమలను నిర్మించి స్థాపించెను. వానిమూలమున నతనిని నేటివఱకు స్మరించుచుంటిమి. వేలువేలుగ నవిరెండును ఏకాండపుశిలలతోఁ జేయఁబడెను. ఈశిలాప్రతిమకారుఁడు రాజుపేరు కలవాఁడు. "ఆచంద్రార్కము రాజుపేరు భూమిమీఁదనుండునటులఁ జేసితిని; నేను చేసిన విధమున మఱియొకరు చేయలేరు. ఒడ్డుపొడుగులలో నీశిలాప్రతిమలఁబోలినవి లేవు — వానిని చేసి, ఎనిమిదిపడవలమీఁద 'థెబీసు' పట్టణమునకుఁ దెచ్చితిని — 'ఆలయములో వానిం బ్రతిష్ఠంజేసినరోజున నాగ్రామములో మహోత్సవము జఱిగెను' అనివాఁడు శిలాశాసనములో వ్రాసికొనెను.

రోమనురాజ్యము స్థాపింపఁబడిన ప్రథమసంవత్సరములలో, యాత్రికులు కొందఱీదేశమునకుఁ బోయి, ఈశిలాప్రతిమలఁ జూచినపుడు వీనిలో నొకదానిలోనుండి సంగీతధ్వనిపుట్టి నిరంతరము వినబడుచుండెను. ఇదియథార్థము. ఈధ్వనికిఁ గారణ మేమన, క్రీ. పూ. సం. 25 రములో నొక భూకంపము వచ్చెను; దానివలన నాప్రతిమ కొంచెము వికలమై, ఋతుధర్మము మాఱినపుడు ధ్వని వినఁబడుచుండెను. మఱి రెండువందల సంవత్సరములు గడి

చినతరువాత నా ప్రతిమయొక్క వైకల్యము బాగుచేయఁబడెను; ఆశబ్దము వినఁబడుటలేదు.

**18**-వ తరము :—శాసనములఁ బట్టిచూడ, ఈతరములోని రాజులు పరదేశములను జయించి, రాజ్యమును విశాలముఁ జేసిరి. ఆశియాఖండపు పశ్చిమభాగమును వారు స్వరాజ్యములోఁ జేర్చిరి. ఈమహారాజ్యము మూఁడువందల సంవత్సరములవఱకు నడిచెను. 'హిక్సోస' రాజుల కాలములో నంతరించిన శాస్త్రము లంకురించి విజృంభించెను. 'పాటు—పోటు; పోటు...పాటు' ఈప్రకారము కాలచక్రము తిరుగును; దేశీయుల స్థితిగతులుకూడ నటులనె దొర్లును.



## పందొమ్మిదవఅధ్యాయము.

### "ఈజిప్టు"—క్షీణదశ.

మధ్యరాజ్యము:—చక్రాధిపు:— "చతుర్థ-అమునోతెప్పుఁడు" పట్టాభిషిక్తుఁ డయ్యెను. దేశములో నంతటఁ బురాతనమునుండి దేవాలయములలో నారాధింపఁబడుచుండిన 'అమను' దేవతను నిషేధించి 'అతెను' అను సూర్యచక్రాధిష్ఠానదేవునినే పూజింపవలసిన దని రాజాయే నాఁడు ప్రకటింపించెనో, ఆనాఁడు మొదలు నాగరికపద్ధతులు ప్రారంభ మయ్యెను. 'ఖుతాతేను' అను పట్టణము నతఁడు రాజధానిం జేసెను; అచ్చట 'అతెను' దేవున కొక ఆలయముఁ గట్టించెను. దేశములోఁ బ్రతిదేవాలయములో 'అమను' దేవునివిగ్రహములఁ గొట్టి ముక్కలు చేసిరి. సమస్తప్రాణుల కాధారభూతుఁ డనియు, సమస్తజీవులకుఁ బ్రాణదాతయనియు వారు 'అతెను' దేవునిం గొలిచిరి. నిర్గుణుఁడైన భగవంతుఁడు సూర్యునితేజోరూపమున వెలుగుచుండె నని వారిమతము పూర్వము వలె ననేక దేవతల నారాధించుట విడిచిపెట్టి, ఇందుమూలమున వారొక దేవుని

నమ్మియుండిరి, కాని, పరలోకమును గురించి వారిపూర్వులకుఁ గలగొప్ప చింతలు వారి కీనూతనమతము వలనఁ గలుగలేదు. నవీనముగఁ గట్టఁబడిన దేవాలయములో భగవంతునిఁ బూజించుచు రాజు కాలముఁ గడిపెను; అతఁడు 'ఖునేతనుఁడు' అని మారుపేరుఁ బెట్టుకొనెను. ఈనామమునకు "చక్రవిభూతి" అని యర్థము. మనుజు లందఱిభగవదారాధనముఁ జేయుటనుగుఱించి రాజురాత్రింబవళ్లు శ్రమంపడెను. నూతన "ఆతెను" దేవతారాధకులనియు, పురాతన 'అమను' దేవతారాధకు లనియు, 'దేశీయులు ద్వైతమతస్థులయిరి. వారిలో వారికి మతకలహములు బలిసెను. ఎప్పుడు జూచిన మతవిషయకశాస్త్రవాదములలోఁ గాలము వ్యయముఁ జేయుచు, వారు దేశముయొక్క క్షేమముఁ గోరలేదు. నిరర్థక ప్రసంగములలోఁ దగి, దేహపరిశ్రమఁ జేయుటంగున, వారు క్రమేణ నీరసించిరి. వారు దుర్బలులని గ్రహించి, చుట్టుప్రక్కలనుండిన దేశీయులలోఁ బూర్వము వారిచేత నోడింపఁబడిన 'ఖేతులు' అనువారు నేఁడు బలవంతులై, వారిరాజుల నెదిరించిరి; అందుచేత, వారుశత్రువులతో సఖ్యముఁ జేసికొనిరి.

## 19-20. తరముల రాజులు:—ఉచ్ఛదశ:

'ప్రథమసేతుఁడు' అనురాజు సింహాసనము నెక్కి నశించిన రాజ్యము నుద్ధరించెను. 'మహాభవనకర్త' అని అతనికిఁ బేరునచ్చెను. 'కార్నాకు' పట్టణములో మహోన్నతమైన స్తంభావళితోఁ గూడిన హాజారము నతఁడు కట్టించెను. 'అబిడాసు' లో 'మమనోనియ' అను దేవళమును నిర్మించి, దానిగోడలమీఁద నతఁడు 'మనేతు' రాజుమొదలు తనవఱకుఁ గలరాజుల వంశావళిఁ జెక్కించెను. అతఁడును, అతనికుమారుఁడును భగవంతునికి సుగంధద్రవ్యములను సమర్పణఁజేసి, సహస్రగోవులను, సహస్రసోమపాత్రలను తమలో నొక్కొక్కనికిం దయచేయు మని ప్రార్థించుచున్నట్లు వారిబొమ్మలు చెక్కఁబడి యున్నవి.

"పాలస్తీను" దేశములోను తూర్పుదేశములలోనుండి వారు తిరుగబడినందున, సింహాసనమునకు వచ్చినవెంటనే "ప్రథమసేతుఁడు" దండువెడలి వారిని జయించి "సిరియా" దేశవాసుల గర్వము నణఁచెను. స్వదేశభాస్కరుఁడనియు, విదేశహింసకరుఁ డనియు బిరుదులను వహించి శత్రువుల నతఁ డోడించెను. "ఖేతులు, హిట్టేతులు, అమోరేతులు" మొదలగు వారిపొంకముఁ దగ్గించెను; కాని వారతని పరోక్షమున స్వరాజ్యమును స్థాపించుకొనిరి. "శత్రుదేశములలో జంబుకమువలె ధారాళమైన ధావనము కలవాఁడనియు, దుర్గమప్రదేశములలో సింహమువలె దుర్నివార్యమైన ప్రవేశము కలవాఁ డనియు, తీక్ష్ణమైన శృంగములుఁ గలవృషభమువంటివాఁడనియు, ఆశియాఖండనివాసులను భంగపఱచి, వారిరాజుల నదరిపడునటులఁ దూరాయినంటివాఁడనియు" దేశీయు లతని మీఁదఁ గూర్చిన పాటలు కలవు. అనంతరము "దక్షిణసిరియా" దేశము నతఁడు జయించి, దానిని స్వరాజ్యములోఁ గలిపెను; "ఉత్తరసిరియా" లో నుండిన "ఖేతుల" తో సంధిఁ జేసికొనెను; "ఐజిప్టు" మొదలు "క్రైరీని" పట్టణము వఱకుఁ గల పశ్చిమదేశములో నుండిన వారిని జయించెను. వీరు పర్వతగుహావాసులు; వీరి నేత్రములు వృషభముల నేత్రములఁ బోలియుండెను; స్వచ్ఛమగు శరీరకాంతిఁ గలవారు; వీరు శిరస్సులను ముండనముఁ జేసికొని, వానికొక ప్రక్కనుజడను ధరించియుండిరి. అతఁడు దక్షిణమున 'నైలు' నదియుత్పత్తిస్థానము వఱకుఁ బోయి, అచ్చటి 'నీగ్రో' ల జయించెను; ఇటుల నలుదిశల సాధించి రాజుల నిరాజసములఁ బఱచి రాజధానికి వచ్చెను. శత్రువులదాడినుండి దేశమును రక్షించుటకు బురుజులతోను భటసద్ధములతోఁ గూడిన మహోన్నతమైన ప్రాకారపుగోడఁ గట్టించుట కారంభించి, అతఁడు స్వర్గస్థుఁడయ్యెను.

అతని కుమారుఁడు 'ద్వితీయరామేసుఁడు' సింహాసనము నెక్కి, తండ్రి కాలములో నారంభింపఁబడిన ప్రాకారములఁ బూర్తిఁ జేసి యుద్ధములో నప్రతిరథుఁడని పేరుఁ దెచ్చుకొనెను. అతని వీరప్రతాపములఁ గొనియాడుచు నొక చాటుధారగీతము కలదు. ఆశియాఖండమునుండి "ఐజిప్టియుల" దొలఁగిం

చుటకు "ఖేతులు" తిరుగఁబడినపుడు అతఁడు వారిమీఁదికేపండు వెడలెను. ఆసమయమున రణరంగములో నొకభాగమున నతఁడొక్కఁడు రథము నెక్కి శత్రువులతోఁ బోరాడెను. మంతు దేవుని వలెఁ బోరాడితిని; కుడిచేతితో గదను ప్రయోగించితిని; ఎడమచేతితో ఖడ్గముఁ బట్టుకొని పోరాడితిని 'బాలు' దేవునికిఁ బోలి వీరావేశము వచ్చెను. పంచసహస్రహయముల మధ్యనుండిసను నాతురగములు వానిని దునుమాడెను, శత్రువులలో నొకసైనసానామీఁదికిఁ గత్తి నెత్తలేక, లోలోపలవారు క్రుంగిరి; నన్నుచూచిన తోడనే వారు భీభత్సులై, అవయవముల పటుత్వము చిటిలిపోవ గదను ప్రయోగించుటకు గాని బల్లెముతోఁ బొడుచుటకు గాని వారికి శక్తిలేకపోయెను. వారుచైతన్యము లేక పడి నాచేఁ జచ్చిరి. అని రాజులుచెప్పినట్లు గీతములో వ్రాయఁబడినది. ఈ యుద్ధమువలన నతనికి లాభము లేకపోయెను. కొంచెము కాలములో వారితో సంధిఁ జేసికొని, ఖేతుల రాజకుమారికను రామేశుఁడు వివాహమాడెను. క్రమముగ నతని పరిపాలనాంతమునకు ఐజిప్టీయులు కృశించి నీరసించిరి.

'ప్రథమసేతుఁడును, అతనికుమారుఁడు ద్వితీయరామేశుఁడు ను మహాభవనకర్త' లని పేరుబడిరి. ఉన్నతములగు వారిశిలాప్రతిమ నేటివఱకు జూడవగును. ఆపాదమస్తకపర్యంతము వారి రూపరేఖావిలాసము లీప్రతిమలయందు నిర్దుష్టముగఁ గనఁబడును. బహుశః ఈరామేశుఁడే ఇస్రాయేలీయులను కష్టపెట్టెను. ఖనులఁ ద్రవ్వించి శిలలను వారిచేత మోయించెను; వారిచేత నాయుధముల బట్టించి శత్రువులమీఁదికి యుద్ధమునకుఁ బంపెను. ఇన్నివిధముముల వారిని గష్టపెట్టుటకుఁ గారణమేమి? వారు మొదట గోపాలకులు; వారిదేశము పొలిమేర భూములకు వచ్చి విడిది చేసియుండిరి. క్రమక్రమముగ వారు పెరిగి వృద్ధిఁ జెందిరి. అందుచేత వారు తనదేశము పైకి ముట్టుకొని వచ్చెద రనుభయముచేత రామేశుఁడు వారినిఁ గష్టపెట్టెను; కనుక వారిచీమురక్తము లెండి, వారు నీరసించి కృశించిరి. పశువులవలె వారు బరువులను మోయుచుండిరి. "వరవేత్రహతోత్తమాంగులై" యుద్ధమునకుఁ బోయినపుడు యోధుల రథము

బను వారు లాగిరి; బనులలోని రాళ్లను తీసికొనిపోయి 'పిరమిదుల' ను వారే గట్టిరి; ఈపనులు వారికి నికృష్టమై హేయమైన పని తోచెను; ఈపనులలో వారిగుండెలు జారిపోయెను. 'ఆశియా'కును 'ఐజిప్టు' నకును మధ్యనుండిన ప్రాకారపుగోడ నంటి 'రామేశము' 'పిథాము' అనుపట్టణములు రెండు 'ప్రథమసేతుని' కాలములోఁ గట్టనారంభింపఁబడి అతనికుమారుని కాలము నాటికిఁ బూర్తి అయ్యెను. ఈనగరములలో రాజుయొక్క ధనాగారము లుండెను; వీని నిర్మాణములో 'ఇస్రాత్తేయులు' నియోగింపఁబడిరి. 'ద్వితీయ రామేశుని' లేక అతనికుమారుని ఆస్థానములో 'బైబిలు'లోఁ జెప్పఁబడిన "మోసెస్సు" అనువాఁడు పెరిగి పెద్దవాఁ డయ్యెను. ఈరామేశుని శిలాప్రతిమలు ఆంగ్లేయసర్వవస్తుభాండాగారములోఁ జూడ నగును.

మినపథుఁడు:—ఈరాజు సింహాసనమునకు వచ్చినతరువాత నారాజ్యము నీచాభిముఖమై దిగనార్చుచు వచ్చెను. అతని శిలాప్రతిమలఁ జూడ, మృదువగు రూపురేఖవిలాసముల కలిగి ధైర్యస్థైర్యములులేని దుర్బలుఁడగు రాజు అని తోచును; చతురోపాయముల నెఱుఁగక చతురంగబలముల నెట్టుల నడిపించును? ఐంద్రజాలికులసహవాసముతో నతఁడుకాలము వెళ్లఁబుచ్చెను. అతని రాజ్యారంభమున స్వకీయపరకీయరాజ్యవ్యాపారములు శాంతముగ గమనించుట చేత, దేశమునకుఁ దొట్రుపాటురానేర దనిమంత్రులు భ్రాంతిఁ బడిరి. రాజు శౌర్యహీనుఁడైనపుడు లోకమునకుఁ గాంతియెటుల వచ్చును.

అతఁడు రాజ్యమునకు వచ్చిన అయిదవసంవత్సరములో నాదేశమునకు వాయవ్యమూల నుండిన "లిబియా" దేశపురాజు తదితరరాజులతోను దేశీయులతో నేకీభవించి నలుబదివేలసైనికులను వెంటఁబెట్టుకొని అతనిమీఁదికి దాడి వచ్చెను. చతురంగబలముల నడిపించుకొని పుత్రమిత్రకళత్రాదులతో నీదేశము నాక్రమించి కాపురముండుటకు వారు వచ్చిరి. వారి ధాటికి 'ఐజిప్టీయులు' నిలువలేక పోయిరి. 'మంఫిసు' 'హేలీపురముల' నడుమను వారు వచ్చి, వానిచుట్టు ప్రక్కలనుండిన ప్రదేశమును ధ్వంసముఁ జేసి, వానిమీఁదికి వచ్చిరి.

హీకేశరాజులకాలములోనైన, ఇట్టియుపద్రవముఁ జూడలేదని ఆదేశచరిత్రకారుఁడు వ్రాసెను. క్రమముగ శత్రువులుముట్టుకొని వచ్చి గ్రామములను పట్టణముల నాక్రమించుకొనిరి.

అల 'మంఫీసు' పురంబులో 'నగరిలో నామూలసౌధంబు పాపల మందారవనాంతశాతామృతసరఃప్రాంతేందుకాంతోపలోత్పలపర్యంకము'ల మీదఁ బవళించి వినోదించు రాజు 'మనేపథుఁడు' శత్రువులరాక విని ఉలికిపడి లేచి సింహమువలె గర్జించి దండనాయకుల రప్పించి చతురంగబలముల నాయత్తముఁ జేసెను. దండును వెంటఁదీసికొని వెడలుటకు రాజు సిద్ధపడెను. అప్పుడు యోధులను రప్పించి, "ఓయోధులారా! ఓసైనికులారా! మీరు మాబిడ్డలు, స్వదేశాభిమానులు ధైర్యస్థైర్యజేగీయమానులు—ఓవీరులారా! మీతాతతండ్రులవలె స్వదేశముయొక్క కీర్తిప్రతిష్ఠల నిలుపఁబెట్టుటకుఁ గాలము వచ్చెను. మాప్రభుత్వములో నెట్టి యిక్కట్టులు రాకుండ మిమ్ముఁ గాపాడు భారము మేము వహించితిమి మీసహాయముచేత శత్రువులను శాసించుటను సిద్ధపడుఁడి. శీఘ్రముగ లేచి నడుములను బిగించి, ధనుష్టంకారములం జేయుఁడు! భగవంతుఁడు మనకు జయము నిచ్చును. అనివారిని హెచ్చరించి, రాజు భుజాస్ఫాలనముఁ జేసి కత్తిఁ ద్రిప్పెను. ఇట్లు రాజుచేత నుత్సాహింపబడిన సైనికులలో గోలాహలముపుట్టి వారు రణభేరిని వాయించిరి. ఇట్టుల "ఉత్తగనుమారుని, వలెఁ బ్రజ్ఞలఁబలికిన రాజు రణశబ్దమును వినినతోడనే దిగులుపడి గుండెలఁ జాఱ విడిచెను—"మీతో రణభూమికి గమనించుటకు మాకు భగవంతుఁడానుజ్ఞ నయచేయలేదు; కనుక మీరుపోయి వారిని ఖండించిరండు: మేము స్వయముగ వచ్చి శాసించుటకుఁ దగినశత్రువులుకారు." అని రాజు వారికిఁ జెప్పెను. రాజు పిఱికిపందయని తలంచి, అట్టివాఁడు రాకపోవుటయే శ్రేష్ఠమునిభావించి, వారు శత్రువులమీదికిఁ బోయిరి. ఇటు లుభయసైన్యంబులు ప్రళయకాలధారాధరంబులుం బోలె దారొక్కని వాఱొండొరులపై శరపరంపరలు వర్షించుకొనిరి. ఈఘోరాహవములో శత్రువులు దిగనాడినందున 'లిబియాని' దేశాధీశుఁడు

దిగంబరియై పరారియయ్యెను. వేలకొలఁది శత్రువులను యుద్ధములో వారు పట్టి తీసికొనివచ్చిరి; విశేషధనమును కొల్లాడిరి. ఇటుల శత్రుసైన్యములఁ దునుమాడి స్వసైనికులు స్వదేశాభిముఖులై రాజధానికి వచ్చిచేర, లజ్జావిహీనుఁడగు రాజు వారిజయమునకుఁ దాను కారణమని ప్రగల్భములఁ బలికినందున, రాజునందు గౌరవము దేశీయులకుఁ బోయెను. "మిడుతలదండువలె నాదేశముపైకి శత్రువులు వచ్చి ప్రతిమార్గము నరికట్టిరి; వారిని యుద్ధములో నోడించెదనని ప్రతిజ్ఞఁ జేసితిని—చూడుఁడు, ఎటుల వారిం దునుమాడి జయించి వారిదేశమును ధ్వంసముఁ జేసితిని" అని రాజు బీరములం బలికెను.

బైబిలుగ్రంథములోఁ జెప్పఁబడిన 'ఇస్రాయేలీయుల' విదేశగమన మీకాలములో జరిగియుండును; అటులైన, 'మనేపథుని' ఆస్థానములో 'మోసెస్సు' పెఱి పెద్దవాఁ డయ్యె ననిచెప్పవచ్చును. భగవత్ప్రేరణచేత మేమీదేశమునకు వచ్చితిమి అని వారినాయకుఁడు మొఱఁ బెట్టుకొనుచుండినను, ఆటు నేలవలకు రాజు వారిమొఱ లాలకింపక పెడచెవిఁ బెట్టెను. వారు సద్గుణప్రధానులని రాజునకుఁ దెలియును. దేవాలయముల నిర్మాణములో వారు పాటుఁబడి రని కూడ నతనికిఁ దెలియును. కొన్నిపనులఁ జేయుటకు దేశీయులు తిరుగఁబడినప్పటికిని, వారుమాత్రము పూనికతో వానిని నిర్వహించిరి. వారు దేశమును విడిచిపెట్టిపోవుట కిష్టములేక పోయినను, వారివలన దేశమున నుపద్రవములు వచ్చిన వని తలంచి, వారిని రాజు నిరాదరించెను. వారిని దేశములో నుంచుట మంచిదియని మంత్రు లెన్నివిధములఁ జెప్పినను వినక, చపలచిత్తుఁడును మాట నిలుకడలేనివాఁడును కనుక రాజు వారిని శీఘ్రములో దేశమునుండి పంపివేసెను. నిరాధారులై నిరాయుధులై పాదచారులై భగవంతుని రక్షణలో నుండిన 'ఇస్రాయేలీయులు' గమనించుచుండ, రథగజతురగపదాతులను వెంటఁదీసికొని, వారిం దునుమాడుటకు రాజు బయలువెడలెను. 'అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం' అనునటుల వారియోగక్షేమమును భగవంతుఁడు వహించియుండ,

'రుధిర'సముద్రము వారికి మార్గము నిచ్చెను; వారు దానిని దాఁటి సురక్షితముగ నవతలగట్టుఁ జేరిరి. ఇంతలో రాజు సైన్యములతో వచ్చి సముద్రమును దాఁటుచుండఁ బ్రచండవాయుప్రేరితంబై సముద్రముప్పొంగి వారిని ముట్టివేసెను. ఇటుల స్వసైన్యనాశనమునకు ఖిన్నుఁడై, హతశేషులతో రాజు స్వదేశమునకు వచ్చెను. అనంతర మారాజు పరలోకగతుఁడయ్యెను. అంతకంతకు దేశము క్షీణించి శల్యావశిష్ట మయ్యెను. రాజాజ్ఞను మన్నింపకపోయిన, రాజును మర్యాదఁ జేయువా రెవరు? మఱికొంతకాలమునకుఁ బ్రజలు రాజుమీఁదఁ దిరుగఁబడి, వారినాయకులు దేశమందంతట నచ్చటచ్చటఁ జిన్న సంస్థానముల స్థాపించి స్వతంత్రముతో నెవరికి వారు రాజ్యముఁ జేయుచుండిరి. 'సంసర్గము బలము, విసర్గముదుర్బలము' అనునట్టుల. వారు విభక్తులై దుర్బలులైయుండఁగ, బరరాజులు వారిని శాసించి సాధించిరి. 'శిరియా' దేశాధీశుఁడు 'అరేశుఁడు' 'ఐజిప్టు' లోని కొంతభాగము నాక్రమించెను.

'సేతనఖుఁడు'— స్వదేశాభిమాని:— అతఁడు 'మనేపథు'ని మనుమఁడు; స్వదేశాభిమాని. 'శిరియను'లతోఁ బోరాడి వారిని దేశమునుండి తరిమి అతఁడు సింహాసనము నెక్కెను. అతనికుమారుఁడు 'తృతీయరామేశుఁడు' దేశమునకుఁ గీర్తిప్రతిష్ఠలఁ దెచ్చెను. చతురంగబలములఁ జతురుపాయములతో నడిపించి శత్రుసేనల నతఁడు పాఱఁదోలెను. 'కొండగొఱ్ఱెలు వ్యాఘ్రధ్వనిని విని కంపము నొందువిధమున నాతని ధనుష్టంకారమునువిని భయపడిరి' అని చరిత్రకారుఁడు వ్రాసెను. 'థెబీసు' పట్టణము వద్దనుండిన 'మదీనతేబు' దేవాలయములలో నీయుద్ధములు చిత్రరూపములుగ గోడలమీఁదఁ జెక్కఁబడెను; అవి 'తృతీయరామేశు'ని కీర్తిప్రతిష్ఠలకు మూలము లయ్యెను. ఇంతియ కాదు. ఆనాఁడు సముద్రముమీఁద జరిగిన యోడయుద్ధముకూడ చిత్రరూపమునఁ గానవగును. ఈయుద్ధములో నతఁడు పడవదొంగల నోడించెను. ఇట్లు దేశమునకు స్వాస్థ్యముఁ దెచ్చి వయోవృద్ధగు 'తృతీయరామేశుఁడు' ప్రజలక్షేమముఁ గోరి పాటుఁబడి శేషించిన జీవితకాలముఁ గడిపెను. అతని వంశస్థులు దుర్బలులు; క్షత్రియధర్మమును విడిచిపెట్టిరి. అందుచేత దేశమున కపకీర్తి వచ్చెను.

వైదికరాజులు:—ఈవంశస్థులకాలములో 'హరహోరుఁడు' అను వైదికుఁ డొకఁడు బయలువెడలి రాజ్యసూత్రములను వహించెను. ఈకాల మంతయు నిబిడాంధకార బంధురంబై యుండెను. 21-వ తరములో నీరాజు వైదికులలో నగ్రగణ్యుఁడు. ఇట్లు విభక్తమైన రాజ్యమును 'థేబీసు' పట్టణములో వైదిక రాజులును 'తానీసు' పట్టణములో క్షత్రియులును వేర్వేఱుగఁ బాలించిరి. 'హరహోరుని' కాలములో నొకవింతసంగతి జరిగెను. దేవదేవుఁడైన 'అమన్రా' యొక్క తెప్ప ఉత్సవమునకుఁ గావలసిన కలపసామగ్రిని 'శిరియా' దేశము నుండి తెచ్చుటకీరాజు 'ఊనేమనుఁడు' అను వైదికునికి సొమ్మునిచ్చి యా దేశమునకుఁ బంపెను. ఈవైదికుఁ డాదేశమునకుఁ బోయి, అచ్చట నొక పట్టణములోఁ గలపబేరముఁ జేయుచుండ, నతనిభృత్యు లతని సొమ్మును దొంగిలించి పాఱిపోయిరి. అతఁ డాపట్టణపురాజునొద్దకుఁ బోయి మొఱఁ బెట్ట, రాజతనిని గారవించి భోజనపదార్థముల నతనికిఁ బంపెను. వైదికుఁడు స్వగుణముఁ జూపెంచెను. రాజు యొక్క ప్రోత్సాహముచేతఁ దనభృత్యులు సొమ్మునపహరించిరని రాజు నతఁడు నిందించెను. ఆపట్టణపురాజీమాటను వినినతోడనే వైదికుని శిక్షించుటకు సిద్ధపడెను: కాని ఇంతలో స్వదేశమునుండి సొమ్మువచ్చినందున నతఁడు 'శిరియా' దేశములోని 'బిబ్లసు' అను నొకరేవుపట్టణమునకుఁ బోయెను. అచ్చటఁ దనకుఁ గావలయు కలపఁగొని రేవునకుఁ దెచ్చి దానిని పడవలలో నెక్కించుచుండెను. తనబంధువుల నతఁడు నిర్హేతుకముగ దొంగలని నిందించెనని, కొందఱు పడవదొంగలడ్డుపడి, ఆకలపనంతయు దొంగిలించి, కారాగృహములో నతనిని ప్రవేశపెట్టెద మని భయపెట్టి వారు పాఱిపోయిరి. అంత నతఁడు భూమిమీఁదఁ బడి రోదనముఁ జేయుచుండెను. 'బిబ్లాసు' పట్టణపురాజు అతనిసంగతి విని, అతనిని పిలిపించెను. 'ఈపడవదొంగల భయము లేక పక్షులు స్వేచ్ఛగ విహరించును గాని మనుజులు మీ పట్టణములో స్వతంత్రముగ విహరింపలేర'ని రాజుతో నతఁడు ఘోషించెను. అప్పుడా రాజు, పడవదొంగలను పిలిపించి 'ఇతనితో మీకేమి ప్రయోజన' మని యడుగ 'ఐజిప్టుదేశపుపడవలను నాశనముఁ జేసి, ఇతనిని కారా

గృహములో నుంచుటయే మాకోరిక' యనివారు చెప్పిరి. 'ఇతఁడు ఆమనుదేవుని అర్చకుఁడు. అందుచేత నతఁడు శిక్షార్హుఁడు కాఁడు. పడవలో నెక్కించి సముద్రముమీఁదనితనిఁ బంపివేయఁగలము. అటుపైని మీరొకరినొకరెటుల సాధించుకొనినను, మాకు బాధ్యతలే' దని రాజుచెప్పి వారిని పంపివేసి, ఆతనిని పడవలలో నెక్కించి ప్రయాణముఁ జేసెను, అతఁడు పడవలో నెక్కి మిగిలిన పడవలతోఁ గూడ సముద్రముమీఁదఁ బోవుచుండ, వెనుకనుండి దొంగలు పడవలను గడుపుకొని వచ్చుచుండిరి. ఇంతలోఁ దుపానులేచినందున, నతనిపడవలు చెల్లాచెదరై, ఆతనిపడవమాత్రము 'కైప్రసు' ద్వీపతీరమునకుఁ గొట్టఁబడినందున నతఁ డాద్వీపములోఁ బ్రవేశించెను. అప్పు డాద్వీపవాసులతనిఁ జంపయత్నించిరి. 'మీరు నన్నుంజంపిన యెడల లాభమేమి? మీరాణియొద్దకు నన్నుం దీసికొనిపొండు' అని వారితో నతఁడు చెప్ప వారాప్రకారమతనిఁ దీసికొనిపోయి రాణిసముఖమున నిలువఁబెట్టిరి. ఆమెఁ జూచి 'ఓమహారాజ్ఞీ, ఆమనుదేవుని నివాసమగు 'థేబీసు' పట్టణము మొదలు 'కైప్రసు' ద్వీపము వఱకుఁ గలదేశములో నధర్మపరిపాలనయని లోకపువాడుక కలదు. ఈద్వీపములో మాత్రము ధర్మపరిపాలనయని ప్రసిద్ధము. ఈలోకపువాడుకను నేఁడు మాత్రము విపరీతము నచ్చె'నని అతఁడు చెప్పెను. ఆమాటలను విని, అతనిని ప్రాణములతో నామె విడిచిపెట్టెను. "కథకంచికివెళ్లెను". అనంతర మేమి సంభవించెనో మనకుఁ దెలియదు.

స్వదేశములోని మనుజులకు మానము లేదు; విదేశములలో వారికి సన్మానములేదు. ఈనీచదశను "ఐజిప్టు" దేశ మనుభవించుచుండెను; ఆమె పొరుగుననుండిన దేశీయులు మహోచ్ఛపదవిలోనికి వచ్చిరి. "అసీరియా" దేశమౌన్నత్యము లోనికివచ్చి, ఆనాటికిఁ గొంచెము క్షీణించెను. "ఇస్రాయల్-జూడా" అను దేశమును 'డేవిడు' పరిపాలించుచుండెను. ఇతఁడు రాజ్యసూత్రములను చాతుర్యముతో వహించి 'యూఫ్రిటీసు' నదికిని 'ఈజిప్టు' దేశమునకును మధ్యప్రదేశము నతఁడు స్వదేశములోఁ గలిపి, దానికి గౌరవముఁ దెచ్చెను. అతని

తరువాత సింహాసనమునకు వచ్చిన 'సోలొమను' 'ఈజిప్టు'తో వర్తకము సాగించి, వైదికరాజులలో నొకనికుమార్తెను వివాహ మాడెను. 'జేరూసాలము' అను పట్టణములో నీరాజు కట్టించిన దేవాలయముఁ జూడ, 'ఐజిప్టీయుల' దేవాలయనిర్మాణకౌశల్యమును 'ఇస్రాత్తేయులు' నేర్చినట్లు తోఁచును.

ఈయుభయదేశముల కీమైత్రి కొంచెము కాలమే యుండెను. 22-వ తరములో 'శశాంకుఁడు' అను రాజు సింహాసనము నెక్కెను. అతఁడు బుద్ధిమంతుఁడును నేర్పరి యని తెలిసికొని, 'సోలొమను'మీఁదఁ దిరుగఁబడిన ప్రజలకు నాయకుఁడైన 'జిరోభముఁడు' అతని వద్దకు వచ్చి ప్రసంగించుచుండెను. 'సోలొమను' కుమారుఁడు 'రహోభముఁడు' రాజ్యమునకు వచ్చెను; 'జిరోభముఁడు' ప్రతిరాజ్యము నొకటి స్థాపించెను. విభక్తులైన వీరియిరువురు కలహింప 'జిరోభముని' సహాయార్థము 'శశాంకుఁడు' సైన్యమును వెంటఁబెట్టుకొని పోయి 'రహోభముని' యుద్ధములో నోడించెను; అనంతర మతఁడు 'జిరోభముని' కూడ స్వాధీనముఁ జేసికొనెను. ఇటుల వారియిరువురిచేతఁ గప్పముఁ గట్టించుకొని 'జేరూసాలము' లో దేవాలయములోని వెండిబంగారములఁ దీసికొని, 'శశాంకుఁడు' స్వదేశమునకు వచ్చెను. ఈచరిత్రము నంతయు 'కార్నాకు' పట్టణములో దేవాలయము లోనిగోడలమీఁదఁ జిత్రరూపమున నతఁడు వ్రాయించెను. ఇస్రాత్తేయుల' రాజ్యమును, 'గలిలీ' సముద్రము మొదలు 'ఐజిప్టు' దేశమునఱకుఁ గలప్రదేశమును, 'మధ్యధరాసముద్రము' మొదలు 'శిరియా' ఎడారివఱకుఁగలప్రదేశము నతఁడు స్వరాజ్యములోఁ గలిపిపరిపాలించెను. అతనికుమారుఁడు కూడ నింతరాజ్యము నేలెను. అనంతరము 'రహోభము'ని పౌత్రుఁడు 'అశుఁడు' ధైర్యసాహసములు కలవాఁడై, 'ఐజిప్టీయుల' నోడించి ఇస్రాలు—యూడా' దేశమునకు స్వాస్థ్యముఁ దెచ్చెను.

23, 24, 25, తరములలో—అనఁగా రాఁబోవు మూఁడుశతాబ్దముల వఱకును 'జూడియా' దేశమును స్వాధీనముఁ జేసికొనుటకు బదులు, పూర్వదిశ

నుండి వచ్చి తనను పట్టివేయుచున్న శత్రువుల నరికట్టుటకు, 'ఈజిప్టు' దేశము 'ఇస్రాయిలు-జూడా' దేశములతో సఖ్యముఁ జేసికొనెను. 'ఈజిప్టు' ప్రతిభ తగ్గి పోయెను. ఆమె రాజులు తరాజులైరి; దేశమంతయు చిన్న సంస్థానముల క్రింద విభక్తమయ్యెను. క్రీస్తుపూర్వమెనిమిదవశతాబ్దములో— అనఁగా 'రోము' పట్టణము స్థాపింపబడిన శతాబ్దము—'అశీరియా' దేశాధీశుఁడైన 'తిగ్లాత్-పిలేశరు'ని ధాటికి వెఱచి, ఈపిల్లజమీందారు లందఱు, నానాటికి వృద్ధిచేసి బలిసి పెరుఁగుచున్న 'ఈతియోపియా'దేశాధీశుని శరణుఁజొచ్చిరి. వీరు తిరుగుబాటుఁ జేసిరని మిషఁబెట్టి, వీరి నితఁడు స్వాధీనముఁ జేసికొని, కొంతకాలమునకు వీరి రాజ్యమంతయు నాక్రమించుకొనెను. ఇట్లు 'ఈజిప్టు' దేశమన్యదేశాధీశాధీనమై స్వాతంత్ర్యమును పోగొట్టుకొనెను. ఉత్తరదశ నున్న 'ఈజిప్టు' నాఱసుఁ గల దేశమంతయు 'అశీరియా' రాజ్యములోఁ గలిసెను; 'శాల్మనేశరుఁ' డను రాజు 'ఇస్రాయేలీయుల' రాజైన 'హోశయు'ని జయించెను. 'ఇస్రాయేలీయుల' రాజు లితనితో సంతరించిరి.

'ఈజిప్టు' దేశము నేలుచున్న 'శబకు' నకును 'ఈతియోపియా' రాజునకును, 'అశీరియా' ప్రభువైన 'సర్గను' నకును రాజ్యవ్యవహారములు నెమ్మదిగ జరుగుచుండెను. 'శబకు'నివిషయమై నొక ముచ్చట కలదు—ఒకనాఁడు రాజు మంత్రులను వైదికులను పిలిపించి 'మాకు స్వప్న మొకటి వచ్చెను—థేబీసు పట్టణములోని దేవుఁడు మాకు స్వప్నములో నగపడి 'ఓ రాజా! నీవు వైదికుల నందఱినిఁ జంపివేయవలెను. లేనియెడల నిన్ను నాశనముఁ జేసెద' నని మాతోఁ జెప్పెను. కనుక మీ దేశములో నుండవలెననిన మేము మిమ్ములఁ జంపివేయవలెను; లేనియెడల మీదేవుఁడు మమ్ములను బాధించును. నిర్దోషులైన మిమ్ములఁ జంపుటకంటె మీదేశమును విడిచిపోయెద' మని వారితోఁ జెప్పి స్వదేశమున కతఁడు వెళ్లెను.

ఈనాటికి 'సేనాఖరీబు' అను రాజు పాలించుచుండ, 'అసీరియా' దేశము మహోన్నతిపదవికి వచ్చెను. 'శబకు' నిసుమారుఁడు 'శబతకుఁడు'ను 'జూడా' దేశపురాజు 'హజికేయుఁడు'ను కలిసి, 'ఫానీషియా, ఫిలిస్తైయా' 'ఈజిప్టు, ఈతోప్యపియా' దేశీయుల వెంటఁ బెట్టుకొని 'సేనాఖరీబు' రాజు మీఁదికి దండెత్తి వెళ్లిరి. ఈరాజు వీరినందఱిని 'ఏక్రను' పట్టణమువద్దనోడించెను. 'ఈజిప్టు' రాజ్యమస్తమించెను. ఈరాజు తరువాత రాజ్యమునకు వచ్చిన 'ఈసరు-హాదనుఁడు' అను రాజు సైన్యములను నడిపించుకొని పోయి 'ఈజిప్టు' దేశములో యుద్ధముఁ జేసియాదేశమును సాధించెను. 'మాఫిసు' పట్టణమును కొల్లఁబెట్టి, ధనరాసులను తీసికొని 'నినవ' పట్టణమునకుఁ బోయెను. తుదకు 'అశీరియా' ప్రభువైన 'అసురు—బనిపాలు'నికి దేశమంతయు లోఁబడియుండెను. దాని రాజులంతరించిరి.

## 26-వతేగము — దేశోద్ధారణ: —

అశీరియాకు లోఁబడి యాదేశములో నొకచిన్నసంస్థానము నేలుచున్న "సామేతికుఁడ"ను పిల్లరాజొకఁడు దేశమునకుఁ గొంతకీర్తిఁ దెచ్చెను. చతురంగబలములను చతురతతో నడిపించి యుద్ధములో శత్రువుల నోడించి దేశమునకు స్వాతంత్ర్యముఁ దెచ్చెను. దేశమునకు స్వాస్థ్యము వచ్చినతరువాత నతఁడు జీర్ణించి ప్రాణావశిష్టుఁడై యున్నవానికి జీవముఁ దెచ్చెను.

కళలు నిర్జీవకళలు, దేశము నిర్జనము, --ఇటువంటి దేశము నతఁడు పునరుద్ధారణఁ జేయుటకుఁ బూనుకొని, యహోరాత్రములు పాటుపడెను. దేశమంతయు పునస్సృష్టి చేయవలసి వచ్చెను. పత్తనములకుఁ బొత్తు వచ్చెను. మార్గములకు మార్దవము వచ్చెను. దేవళములకు దీపత్వము పాసెను; కళలు మూర్తీభవించెను; త్రిశక్తులుగల రాజు రాజ్యసూత్రములను వహింప, చతు

రంగబలములు చతురతతో మెలఁగుచుండెను. "గ్రీసు" దేశముతో వర్తకము సాగెను. ఆదేశవాసులీ దేశమునకు వచ్చి కాపుర ముండిరి. వారి సాంగత్యము వలన వీరితెలివి తేఁటపడెను. కాలము సమీపించి నవు డెవ రెన్నివిధముల నుప చారములఁ జేసినను ఏమికార్యము కలదు? కాలము దేశమునకు సమీపించినది; అది యస్తమించెను.

ద్వితీయనఖుఁడు:—ఇతఁడు పరాక్రమశాలి. బలమైన రెండు పడవల దండు నతఁడు నిర్మించెను. ప్రసిద్ధికెక్కిన 'ఫోనీషియా' దేశపుకళాశాలను వెంటఁ దీసికొని ఒకపడవలదండుతో నతఁడు'మధ్య ధరాసముద్రమును' దాఁటి 'అఫ్రికాఖండము' చుట్టును సముద్రయానముఁ జేసి మూఁడుసంవత్సరముల నాటికి 'రుధిర' సముద్రము వచ్చి చేరెను.

ఈలోపున 'అసీరియా' రాజ్య మంతరించెను. 'సిరియా' 'పాలస్తైను' దేశములఁ స్వాస్థ్యముగ నుండుటచేత 'నఖుఁడు' సైన్యముతో 'పాలస్తైను' దేశముపైకి దండెత్తిపోయి, ఈదేశపురాజగు 'జోసియా'ను 'మగేధ' వద్ద జరిగిన యుద్ధములో నోడించెను; అనంతరము. 'యూఫ్రిటీసు' నదివఱకుఁ గల 'సిరియా'దేశము నతఁడు జయించెను. 'పాలస్తైను' దేశమునకు రాజ ధానియైన 'జేరుసాలము' పట్టణము నేలుచున్న 'జోసియా' కుమారుఁడు 'జిహోకిముఁడు' ఇతనికిఁ గప్పము గట్టుచుండెను.

'కార్కిమిషు' యుద్ధము క్రీ. పూ. స॥ 605-రము:—'బాబిలో నియా' దేశాధీశుఁడు 'సిరియా' దేశమును స్వాధీనముఁ జేసికొని, 'ఐజిప్టీయు లను' కార్కిమిషు యుద్ధములో నోడించెను. ఈలోపున సింహాసనమునకుఁ దన వారసత్వమును నిలువఁబెట్టుకొనుటకై బాబిలను పట్టణమున కతఁడు త్వరపడి పోవలసివచ్చి నందున నతఁడు ఐజిప్టీయులను మట్టి వేయలేదు.

జూడా దేశపురాజా ఝషికేయుఁడు బాబిలనుతోఁ బోరాడుటకుఁ బోయినపుడు, శఖునికుమారుఁడు అప్రేశుఁడు వానికి సహాయ మిచ్చెను. కాని

అప్రేశుని సైన్యములు యుద్ధములో నోడెను. అనంతరము జూడులు బాబిలనుకు స్వాధీనులయిరి.

క్రీ. పూ. స॥ 565-రము:—శత్రుమర్దనుఁడైన బాబిలను దేశపురాజు 'నబుచదునజరు' అప్రేశుని యుద్ధములో నోడించి వానిని జంపి వాని సేనాధిపతియైన అమేశిసునివలనఁ గప్పముఁ బుచ్చుకొనెను.

ఎంతనీచదశవచ్చినను ఘనతతో బ్రతికిన దేశముకదా! పైకిమాత్రము సిరిసంపదలతోఁ గూడుకొని యున్నట్లు కనఁబడుచుండెను. ఆమెపట్టణములను నాశనముఁ జేసి, ఆమె సంపదను శత్రువులు పట్టికొని పోలేదు.

అమేశిసుఁడు అస్వతంత్రురాలైనను దేశమును మెలకువతో నేలెను. కొంతకాలమువఱకు దేశమునకు జీవమును నిలువఁబెట్టెను. అతనికి లోఁబడియున్న దేశములోని ప్రతిపరగణాధికారియు ప్రతిసంవత్సర మతనియొద్దకు వచ్చి సంవత్సర మంతయు తనపరగణాలోఁ దాను వ్యవహరించిన విధముఁ జెప్పవలసియుండెను. అశ్మక్రియ మొదలగు క్రియలు పరిఢవిల్లెను. ఆమేశిసుని కాలములో ఆశియా ఖండములో రాజ్యవిషయకపు మార్పులు కొన్ని జరిగెను.

పారశీక దేశవిజృంభణ:—పారశీక దేశమునకు లోఁబడియున్న చిన్నసంస్థానాధిపతియైన కైరసు అనువాఁడు ఆసియాఖండములో నందఱికంటె బలవంతులగు 'మీదియా' దేశవాసుల రాజు నోడించి 'విడియా' దేశముపైకి దండెత్తిపోయెను. అప్పుడు 'విడియా' 'ఈజిప్టు' 'బాబిలోనియా' ఈమూఁడు దేశము లేకీభవించి 'కైరసు' నెదిరించెను గాని ఈజిప్టు తప్ప మిగిలిన రెండు దేశము లతనికి స్వాధీన మయ్యెను. ఇతరసంస్థానములను సాధించుటలో నతఁడు జీవితకాలమంతయు నుపయోగించుటచేత నతఁడు ఈజిప్టును భంగపఱచుటకు వీలు లేకపోయెను. ఇతనికుమారుఁడు కాంబేసిసుఁడు రాజ్యమునకు వచ్చెను; ఇతఁడు దుర్మార్గుఁడు. లోకకంటకుఁడు. ఇతఁడు 'ఈజిప్టు' గర్వము నణచెను.

‘హీరొదోతీశుఁ’డను గ్రీకుచరిత్రకారుఁడు దానికిఁ గారణ మీదిగువను వ్రాసినవిధమునఁ జెప్పెను.

ఈజిప్టుదేశములో నున్న ఘనమైన నేత్రవైద్యుని పంపవలసిన దని పారశీకరాజు కైరసు ‘అమేశీసున’కుత్తరువుఁ జేసెను. ఇతఁడు గొప్పవైద్యుని యారాజునొద్దకుఁ బంపెను గాని, పుత్రమిత్రకళత్రాదులను విడిచి పరదేశమునకుఁ బోవుట కావైద్యుఁ డెంతయు దుఃఖించెను. పగ సాధించుకొనుట కావైద్యుఁడు సమయము వేచి, యొకనాఁడు రాజుసముఖమునకుఁ బోయి ‘మహాప్రభూ, ఏలినవారు దాసునివిన్నపము వినవలెను. అమేశీసుని కొక కూఁతురు కలదు. ఆమెచక్కనిచుక్క. ఏలినవారామెను పొందిన భాగ్యమె భాగ్య మ’ని కైరసుతోఁ జెప్పెను. అప్పుడతఁ డదృష్టముగ వినికిడివలన నామెను మోహించి, యామెపొందు గోరినవాఁడై, శీఘ్రములో నామెను తనయొద్దకుఁ బంపుమని ‘అమేశీసున’కుత్తరువు జేసెను. ఆతఁడు మాత్రము కుమార్తెను విడిచిపెట్టుట కిష్టపడక, ‘అప్రేశుని’కుమార్త నలంకరించి ఆమె నతఁడు రాజునొద్దకుఁ బంపెను. ఈమెతండ్రి, ‘అప్రేశుఁడు’ ‘అమేశీశుఁడు’చేసిన కుట్రచేత నతఁడు చనిపోయెను. అందుచేత నామెపగసాధించుకొనుటకును, ‘అమేశీశుఁడు’ చేసిన కృత్రిమవ్యాపారమంతయు రాజుతోఁ జెప్పెను. అప్పుడు కాంబేశీశుఁడు’ ‘ఈజిప్టు’పైకి దండెత్తి పోయెను.

అతఁడు దండెత్తివచ్చినపుడు ‘తృతీయసమేతీకుఁడు’ సైన్యములను వెంటఁ బెట్టుకొని యుద్ధమునకు నడిచెను. ఐకమత్యము వారిలో వారికి లేనందున వారు శీఘ్రములో నోడిపోయిరి. అప్పుడు రాజు ‘సమేతీకు’ని నగరబహిర్ద్వారమువద్దఁ గూర్చుండ నియోగించి, అతఁడు చూచుచుండ, నతనికుమార్తెను సామంతులకన్యలను నదికిఁ బంపి వారిచేత నీరుఁదెప్పించెను. శిరస్సునువంచికొని, ‘సమేతీకుఁడు’ కూర్చుండియుండెను. అనంతరము రాజు అతనికుమారుని సామంతుల కుమారులను శిరచ్ఛేదమునకుఁ బంపెను. అందుకైన నతఁడు దుఃఖిం-

పతేను. ఆమార్గమున నొకవయోవృద్ధుడైన భిక్షుకుఁడు వెళ్లుచుండ వానిఁజూచి సమేతీసుఁ డేడ్వసాగెను. అందుకు రాజు కారణ మేమనియడుగ 'నాకన్యారత్నముల కవమానము వచ్చినను, నాకుమారులందఱు నాకన్నులయెదుట మృతి నొందినను నాకుదుఃఖము రాలేదుగాని నాబాల్యస్నేహితుఁ డీవృద్ధుని దురవస్థఁ జూచి నాకు దుఃఖమువచ్చిన' దని యతఁడు రాజుతోఁ జెప్పెను. అందులకు రాజు పశ్చాత్తాపముఁ బడి, యతనిని గౌరవించెను; కాని అతఁడు తనమీఁదఁ దిరుగుబాటుఁ జేయఁగలఁడని విని రాజతనిచేత విషముకలపఁబడిన వృషభరక్తముఁ ద్రాగింప నతఁడు చనిపోయెను.

ఎక్కడఁజూచినను దేశములో రోదనము తప్ప మఱియొకటి లేదు. రాజు దేశమును ధ్వంసముఁ జేసెను; దేవాలయములను పడఁద్రోయించెను; "ఆపీసుఁడు" అను నందీశ్వరుని రాజు తనకత్తితోఁ బొడిచి చంపెను. "దేశమున కరిష్టమువచ్చెను. ఆమె ప్రజలు వేనవేలు కత్తివాతఁ బడుదురు. ఆమె గర్వ మణఁగి పోవును" అని "ఎజికీలుఁ డను" సత్యఋషిచెప్పిన విధమున జరిగెను. ఇట్టి యవమానములఁ బొందిన దేశము స్వాతంత్ర్యముఁ దెచ్చుకొనుటకు మంచిసమయముకొఱకై నిరీక్షించు చుండెను.

"మారాథాను యుద్ధానంతరము - క్రీ. పూ. సం. 490 రము:—

మారాథాను యుద్ధములోఁ బారసీకసైన్యములు గ్రీకులచేత నోడింపఁబడెను. ఈసంగతివిని, "మాఫెసులో" నున్న పారసీకసైనికులఁ జూచి, ఐజిప్టీయులు తిరుగఁబడిరి. పారసీకులరాజు జరక్సీసుఁడు వీరిగర్వము నణఁచెను. రెండవ పర్యాయము కూడ వీరు తిరుగఁబడిరి గాని ఇప్పుడును వారికి శృంగభంగ మాయెను. దేశములోని చిన్నసంస్థానము నేలుచున్న "నభరెటీసుఁడు" క్రీ. పూ. సం. 405 ప్రాంతమున "పారసీకులను" దేశమునుండి తఱిమి, ఆఱుసంవత్సరములవఱకు స్వతంత్రించి పరిపాలించెను. అతనివంశజులలో నొకఁడు "నక్తనేబుఁడు" దేశముచుట్టును రక్షణ దుర్గముల గట్టించెను; కాని పారసీక

రాజు 'అర్తజరజేషుఁడు' వీనినన్నిటిని భూమిపాల్జము చేసెను. ఈరాజు "మాఫి సు" పట్టణము మీదికి రాఁదలఁచెను గాని, అతనిసైనికులొకరితో నొకరు కలహించినందున నతఁడు వారిమీఁదికి రాఁజాలక పోయెను. ఇంతలో "నైలు" నదిపొంగి పార్లిపడెను. పారశీకసైన్యములు కొన్నికొట్టుకొని పోయెను; వారుచెల్లాచెదరై పారిపోయిరి.

తెలివితేటలతో "నక్తనేబుఁడు" రాజ్యము చేలెను. సమస్తకళలకు కొంచెము జీవము వచ్చెను. "ఆంగ్లేయసర్వవస్తుభాండాగారములో" సల్లశి లతోఁ జేయఁబడిన గోపురశిఖరములు రెండు కలవు; ఈరెండు నతని కాలము నాటివి; ఆతనికీర్తి ప్రతిష్ఠలను నిలుపుచున్నది. అతని వంశజుల కాలములో దేశమంతః కలహములచే బాధపడుచుండ,మిడుతల దండువలె పారశీక సైన్యము దేశముమీఁదఁ బడెను."నక్తనేబుఁడు" వారితోఁ బోరాడలేక "మాఫిసు" పట్టణమును విడిచి యడవులలోనికిఁ బోయెను.'పారసీక'రాజైన"అఖుసునసు" లోఁబడి,దేశము తనప్రేమను పోగొట్టుకొనెను. ప్రపంచములో నందఱికంటె ముందు సర్వకళలలోఁ బ్రవేశముగనిన దేశము, ప్రథమమున నే కళావిహీనమై నశించెనుకాని, దానిజయస్తంభములును దేవాలయములును పిరమిదులును దాని కీర్తిని ఆచంద్రార్కము నిలుపుచున్నది.


3
అసీరియా బాబిలోనియా
చాల్డియా
సిథియా
నల్లసముద్రము
కాకసస్ పర్వతములు
కాస్పియనుసముద్రము
చిన్న ఆశియా
అశీరియా
మధ్యధరా
సముద్రము
యెరూషలము
టైగ్రీసునది
యూఫ్రటీసునది
నినెవె
కాల.
అషరు
బాబిలోనియా
బాబిలను
సూసా
మేడియా
పెర్షియా
ఊరు.
చాల్డియా
ఈజిప్టు
నైలునది
అరేబియా
పారశీకసముద్రము
హిమాలయ పర్వతములు
సింధునది
ఇండియా
అరేబియాసముద్రము

శ్రీరస్తు.

# 'బాబిలోనియా' దేశచరిత్రము

## క్రీ. పూ. సం॥ 3800—1120 రములు.

## తృతీయప్రకరణము.



### ఇరువదియవ అధ్యాయము.

ఈదేశచరిత్రఁ జదువుటకు ముందు, జ్ఞానదృష్టిచేత నాదేశ మెట్టుల నుండెనో చూచెదము. 'యూఫ్రటీసు' 'టైగ్రిసు' నదులమధ్యభూభాగమునకు 'బాబిలోనియా' దేశ మనిపేరు కలదు. ఆనదుల దిగువభాగ మీదేశము; ఊర్ధ్వభాగము 'ప్రాచీన అసీరియా' దేశము. రెండుమహారాజ్యము లాకాలములో నీభాగమున స్థాపింపఁబడెను. అవి పుష్టిచేసె బలిసి పెరిగినవియై, కాలక్రమమున, క్షీణించి నశించెను. ఏభాగమున సుక్షేత్రములును, పల్లెలును, పట్టణములును, నగరము లుండెనో, అట్టిభాగము నేఁడు కటికప్రదేశమై, అచ్చటచ్చట పైకిమొనలెత్తుచున్న చిన్నమెట్టలతోఁ గూడి చూచుట కనిష్టము గలుగఁజేయుచున్నది. ప్రాచీనదేశములును మహారాజ్యములును నదిశ్మశాన మగుచున్నవి. ఆకాలములోఁ బ్రసిద్ధికెక్కిన 'ఉరు, బాబిలను, నినవె' అనుగొప్ప పట్టణము లాభూమిలోఁ గప్పఁబడి నశించెను. ఈభాగమును త్రవ్విచూచిన పైని శిలాశాసనములును, శిలాప్రతిమలును, పుస్తకములును కనఁబడెను; వీని నాధారము చేసికొని, ఈదేశచరిత్ర వ్రాయఁబడెను.

'నినవే' పట్టణములోని ప్రాచీనపుస్తకభాండాగారము:—ఈభాగములోని దిబ్బలను త్రవ్వుచుండ, నొకదానిక్రింద 'అశీరియా' దేశపు రాజగు 'సేనాఖరీబు' యొక్క నగరుకనఁబడెను. దానిలో నొకరెండుచిన్నగదులలో నొకఅడుగు దళపుమృతఫలకలు దొరకెను. ఈపలకలమీఁద 'కీలలిపి'లో వ్రాయఁబడిన అక్షరసమామ్నాయము కలదు. ప్రాచీనలిపి శాస్త్రజ్ఞు లీపలకలను సరిచేసి,వానిమీఁదివ్రాఁతను కనిపెట్టఁగలిగిరి; కావున, నీదేశచరిత్రను వ్రాయుటకు వీలుపడెను.

'సుమేర' జనుల కాలము;—చరిత్రకాలమునకుఁ బూర్వము వీరీదేశములో నుండిరి; 'సుమరు' దేశమునుండి వచ్చినట్లుతోఁచును. ఆదేశ మెచ్చట నుండెనో తెలియదు. లోహక్రియలోను కాలువలను త్రవ్వటలోను వీరికిఁ బ్రవేశముకలదు. వీరు నాగరికతావరోహణమార్గములో నుండిరి.

'సుమేర' జనుల మతాభిప్రాయములు;—వీరిమతాభిప్రాయములు విన, చోద్యములై యున్నవి. వీరిప్రభువులు వీనిని 'కీలలిపి' లో వ్రాసి పదిలముగ నుంచిరి. భూమి పానీయపాత్రవలెనున్న దని యు దానిపైభాగమువలె భూమియు కొంతజలము ను కలదియై, అగాధమగు భాగమున జీవులు నివసించుననియు వారిమతము. భూమిమీఁద నొకపర్వతము లేచి భూమ్యాకాశములనుకలుపుచున్నదనివారినమ్మకము. భూమిమీఁద నొకఅధోలోకమున, మనుజులకు మేలు చేయు ఏడుగ్రహములు భూమిచుట్టును తిరుగుచున్న వనియు, కీడుఁ జేయు ఏడుగ్రహములు కూడ తిరుగుచున్న వనియు ఈరెండుగ్రహకూటములవా రెప్పుడు నొకరితో నొకరు పోరాడుచుందు రనియు, వారిమతము. అన్నిటికంటె నూర్ధ్వలోకమున 'అన' అనునామముతో భగవంతుఁడుండును సముద్రములో 'ఈయ' అను మహామీనము నివసించి, నలువైపుల సంచరించుచు భూమిని సంరక్షించుచుండెను. స్వర్గమర్త్యలోకములలో మంచిపేరు లేనట్టి ఏడుగురు రాక్షసగణములలోనివారు—'మసకము' లను పేరుతో

నధోలోకమున నివసించుచుండిరి. వీరు భూకంపములకును తుపానులకును కారకులు. ఈదిగువను వ్రాసిన ప్రకారము వారిమతగ్రంథములో నున్నది:—వారేడుగురు! వారేడ్వురు; ఏడ్వురు వారు సముద్రములో నివసింతురు; స్వర్గమును కూడ వారు కలఁతఁబెట్టిరి. వారు సముద్రములో నుండి లేచి వచ్చెదరు. వారు స్త్రీలుఁ కారు, పురుషులు కారు. వారికి భార్యలు, పిల్లలులేరు.వలవలె నలువైపులను వారు వ్యాపింతురు. వారికొకనియామకము లేదు. మంచిగుణము లేదు. వారు మహామీనముయొక్క శత్రువులు.

ఓ 'అన' భగవంతుఁడా, వారిని జయించుము. ఓమీనమా! వారినినాశనముఁ జేయుము.

ఇచ్చటనే నరకలోకముకలదు.దానిలో జీవులందఱు చీఁకటిలోఁ దిరుగుచుందురు. పరలోకచింతన విషయమై మాత్రము వీరు ఐజిప్టీయుల కంటె తక్కువవారు.

వీరికి ఐంద్రజాలములోను తంత్రములోను నమ్మకము కలదు. ఒకనికి రోగము గ్రహబాధచేత నచ్చునని నమ్మకము. ఉల్లిపాయ పొరల నొకదాని తరువాత నొకదానిని తీసివేయుచు, వారు వానిరోగమును బాగుచేయుటకుఁ దలంతురు.''ఈయుల్లిపొరలనుండి అగ్నిలో దగ్ధమగు విధమున శరీరముయొక్క అన్నిపొరలలో నుండి దుష్టగ్రహము బయటకు వచ్చి నశించుగాక''అని వారు మంత్రమును చదువుటకలదు.ఇంతటితో వానిరోగము కుదురనపుడు వారువాని వీథిలోఁ బరుండబెట్టిన మార్గమున పోవువారవరైన రోగమునకుఁ దగిన ప్రతిక్రియ చెప్పఁగలుగుదురని వారినమ్మకము.వారు రక్షరేకులను కట్టుకొనుచుండిరి. ఇప్పుడు మనము 'ఆంజనేయ' విగ్రహమును చెక్కించి బంగారు రక్షరేకును కట్టుకొను విధముననె, వారు కూడ చిత్రమైన బొమ్మలతోఁ జెక్కఁబడిన వంపతాయెత్తులఁ గట్టుకొను చుండిరి.

చరిత్ర:—ఈసుమేరజనుల రాజులవిషయమై అంతగాఁ దెలియదు; ఈ భాగమంతయు పుక్కిటిపురాణము. ఒకకాలమున 'అలోరసుఁ' డను గోపాలక రాజు పాలించుచుండెను. అతనిగురించి నిదర్శనము లేవియు కానరావు. ఆనాటికి వారు పశుపాలకులై యుండిరి. వారికిఁ గాలువలును త్రవ్వుట, తెలియును; లోహక్రియను గుర్తెఱిఁగి యుండిరి. ఇటికలతో వారుగృహములఁ గట్టుచుండిరి. వీనినన్నియు నేర్చినవారైనను, వారి మతాభిప్రాయములఁ బట్టిచూడ వారు శైశవావస్థలో నుండిరని చెప్పఁగలము.

“సమేతజనుల” దండయాత్ర:—పూర్వకాలమున చాల్డియా దేశములో నొకజాతివారు కలరు. వారుపశువులువలె సంచరించుచుండిరి. అప్పుడు 'రుధిర'సముద్రములోనుండి 'ఓనేశుఁడు' అను మహాపురుషుఁ డొకఁడువచ్చెను. అతనిరూపము మత్స్యరూపమును నరరూపమును కలిసెను. ఈమత్స్యావతారుఁడు వారి యొద్దకువచ్చి వారిని సమస్తకళలలోఁ బ్రవేశపెట్టెను. అతని మూలమున వారు నాగరికు లయిరి. సాయంసమయమున నతఁడు సముద్రములోనికిఁ బోవుచుండెను. ఈప్రకారము వారిచరిత్రలు లిపిలో వ్రాయఁబడి యున్నది.

ఇటుల “చాల్డియా” దేశమునకు వచ్చి, ఆదేశీయులను నాగరికులఁ జేసినవారు సమేతజనులు. వీరీ దేశమును జయించి ఆక్రమించుకొనిరో, లేక దేశసంచారులై రానురాను వారీసారవంత మగుదేశమునకు వచ్చి కాపురముండి క్రమముగ తమవేషభాషలను ప్రచురించిరో, లేక దేశములోని ప్రాచీననివాసుల వేషభాషలను తాము నేర్చుకొనిరో, మనకుఁ దెలియదు. వర్తకవ్యాపారములో సమేతజనులకుఁ గౌశలము మెండు. నేఁడు సముద్రతీరమునకు నూరుమైళ్లదూరములో నున్న 'అరు' పట్టణము నాఁడు సముద్రతీరమున వారిచేతఁ గట్టఁబడెను. పూర్వదిశతో జరిగిన వ్యాపారమునకీపట్టణము రేవుపట్టణ మయ్యెను.

ఇట్లు సమేతులు కాపురముండిన కొన్నినాళ్లకు, దేశమంతయు చిన్న సంస్థానముల క్రింద విభక్తమయ్యెను; ప్రతిసంస్థానమున నొకరాజధానియుం డెను; అచ్చటనుండి రాజు సంస్థానమును పాలించుచుండెను. ఒకదేవాలయము కట్టఁబడి దానిచుట్టును అర్చకులును పరిచారకులును గృహములఁ గట్టుకొని నివ సించుచుండిరి. ఈదేవస్థానము క్రమముగ పెరిగి పట్టణ మయ్యెను.

## "ప్రథమసరగోనుఁడు" క్రీ. పూ. సం॥ 3800.

ఈరాజుయొక్క రాజధాని 'అగాధి' పట్టణము. ఇతనిజీవితచరిత్రము పురాణమువంటిది. ఇతనిపూర్వోత్తరములు విశేషము తెలియవు. "నావంశస్థు లు గొప్పవారు. యూప్రటీసు నదీతీరమున నొక సాంకేతికస్థలములో నాతల్లి ఒకశిశువును ప్రసవమయ్యెను. ఆశిశువు నామె యొకబుట్టలోనుంచి అబుట్టకు మూఁతవేసి,దానిని నదీప్రవాహములో విడిచెను.అది నీటిలో మునిగిపోక తేలి కొట్టుకొని పోయి 'అకుఁడు' అను గంగాధరునికి దొరకెను. పిల్లలు లేనివాఁడై నందున,వాఁడు శిశువు నెత్తికొని వాత్సల్యముతోఁ బెంచెను.ఆశిశువు నే నేను— వాఁడు నన్నుతోటకు కాపుంచెను. ఆసమయమున ఇస్తరుఅను భగవతి నన్నువరిం చెను." అని రాజుచెప్పినవిధమునఁ బురాణములోఁ గలదు.ఇతనికాలములోసమే తులు ప్రథమదండయాత్రకు వెడలిరి.వీరుసిరియనులను జయించి వారినికట్టిపట్టి తెచ్చినందున బాబిలోనియా దేశములోజనసంఖ్య బహుళమయ్యెను. "నలుబది అయిదుసంవత్సరములు రాజ్య మేలితిని: శత్రువులను జయించితిని. కంచురథ ములనెక్కి దేశమంతయు సంచరించితిని.మూఁడుపర్యాయములు పారసీకతీరము వఱకును గల భూమిని నాక్రమించితిని". అని రాజుచెప్పినవిధమున నొక శిలా శాసనము కలదు. ఇతఁడు క్రీ. పూ 3800 రములోని వాఁడై యుండును.

మఱికొన్ని శతాబ్దములకు "గదేయుఁడు" అను రాజు రాజ్యము నేలుచుండెను. శిరియాదేశమునుండి తేఁబడిన దూలములతోను ఏకాండపు రాతిపలకలతో నితఁడు దేవాలయములఁ గట్టించెను. అరబియా శిరియా ఈ

జిప్టుదేశములతో వ్యాపారముఁ జేయుటచేత, "అరు"పట్టనము నానాటికిఁ బెరిగి పెద్దపట్టణ మయ్యెను. అనంతరము "అరుగరుఁడు" అనురాజు సుమేరులను సమేతుల నేకీభవించి రాజ్య మేలెను. ఈకారణమున ముందుకు మహారాజ్యము స్థాపింపఁబడుటకు వీలుపడెను.

"ఈలామేతు"ల దండయాత్ర: —క్రీ.పూ.సం॥2300 రములో ఈలామేతులను వారు "బాబిలోనియా" దేశముపైకి దండెత్తివచ్చి దేశమును ధ్వంసముఁ జేసి గదేయుఁడు కట్టినదేవాలయములను నాశనముఁ జేసిరి. బైబిలులోఁ జెప్పఁబడిన "చేదరు-లయోమరుఁడు" అనువాఁడు "ఈలామేతుల" రాజై యుండవచ్చును. ఈరాజు ధాటికి భయపడి "తేరుఁడు" అబ్రహాము అనువారిద్దరు"అరు"పట్టణమును "విడిచి" కాననేతుల దేశమునకుఁ బోయి అచ్చట "హోబూరి" రాజ్యమును స్థాపించిరి."బాబిలోనియా" దేశముయొక్క దక్షిణభూములను "ఈలామేతులు"కొన్నిశతాబ్దములవఱకు నేలిరి. అనంతరము సమేతులరాజైన "హాముర బుఁడు" వారినోడించి, బాబిలను పట్టణమును రాజధానిగఁ జేసికొని దేశమంతయు నేలెను.

ఈరాజు సత్యవంతుఁడు. ధర్మాత్ముఁడు. ఇతఁడు దేవాలయములను కట్టించెను."టైగ్రిసు"నది పొంగిపొరలి పారి నపుడు దేశమున కుపద్రవము లేకుండ ఆనకట్లను జలనిధులను కట్టించెను. నీటియెద్దడి కలిగినపుడు నదినుండి నీరు పారించుటకు కాలువలఁ ద్రవ్వించెను.నదీజలములు నేను త్రవ్వించిన కాలువలగుండ పోయి దేశమంతయు పారుచుండెను. భూములు నిరంతరము పండుచుండెను. భూములు సర్వసస్యఫలవంతములై నందున ప్రజలు సుఖముతో జీవించిరి"—అని రాజు చెప్పినవిధమున శిలాశాసనము నొకటికలదు. క్రీ.వె. సం 1901రములో సూసా పట్టణములోని దుర్గములో దొరకిన శిలాశాసనముఁ బట్టిచూడ హాముర బుని కాలములో నాదేశము నాగరికతఁ జెందినట్లు కనఁబడుచున్నది.

అతనికాలములో "తపాలాఫీసు" లుండెను. వర్తకముసాగెను. ప్రజలు మతాభిమానులై యుండిరి. విపులముగ వ్రాయఁబడిన ధర్మశాస్త్రము కలదు. ఇది యే, రోమనుల ధర్మశాస్త్రమున కాధారమై యుండవచ్చును. "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం, ధర్మసంస్థాపనార్థాయ" అనునటుల "హామురబుఁడు" భూలోకములోనికి వచ్చెను. ప్రజలను ధర్మమార్గమున నడిపించుటకు నీతఁడు దేవతలచేత నీలోకమునకుఁ బంపఁబడెను. ఇతనిని "పశుపతి" యని పిలుచుచుండిరి.

ఈధర్మశాస్త్రము మూలమున నతఁడు ధర్మమార్గములను సత్ప్రవర్తనలను మనుజులకుఁ జూపెను. ఇందులోని సూత్రములు కొన్ని వినఁదగి యున్నవి.

"కాలుచున్న గృహములో వస్తువులను దొంగిలించినవానిని ఆమంటలోఁ బడఁద్రోయుటయె వానికిశిక్ష"—"పంటలుపండని సంవత్సరములో ఋణగ్రస్తుఁడు ఋణమును తీర్చుకొన నవసరములేదు"— ఈసూత్రములఁ జూడ, క్రీస్తు పూర్వము సం 2300 రముల నాటికి వారింతసత్ప్రవర్తనులై నాగరికులై యుండుట అత్యాశ్చర్యముగ నున్నది.

ఇంతియకాదు. దేశములోని మతాభిప్రాయముల నతఁడు సంపుటీకరణముఁ జేసి, వానిని పట్టణములో నగరుగోడలమీదఁ జెక్కించెను. "అసీరియా బాబిలోనియా" దేశములకు 'బాబిలను' పట్టణము సర్వకళాస్థాన మయ్యెను అతనికాలము కృతయుగముఁ బోలియుండెను. అప్రచలితభాషయొక్క వ్యాకరణములను నిఘంటువులను సుమేర సమేతి భాషలలో మృత్పలకలమీఁద సరిపంక్తులలో వ్రాయుటకుఁగాను ఈరాజుగాని ఇతనితరువాతవచ్చిన రాజుగాని యుత్తరువు చేసియుండెను. ఇప్పుడు మనము సంస్కృతముఁ జదివిన విధమున విద్యార్థులానాడు సమేరభాషను చదువుచుండిరి.

"కాసేతుల" దండయాత్ర:—క్రీ. పూ. సం 1783-1207 రము వరకు అసీరియాదేశము పుష్టిచేసి బలమగుచుండెను. బాబిలను దేశము సంపదచేత నిరసించెను. ఇంతలో "కాసేతులు" అను. రాతజనులు వారిరాజులతో దండెత్తి

వచ్చిరి. వారి పుట్టు పూర్వోత్తరములు తెలియవు; వారు దేశములను స్వాధీనముఁ జేసికొని బాబిలనుల వేషభాషల నవలంబించిరి. ఈ రాజులలో నొకఁడు ఈజిప్టురాజునకు రెండుత్తరములు వ్రాసెను. ఆయుత్తరములు నేటివఱకును కలవు. ఇంతలో అసీరియారాజు "తుకలిత-నినీబుఁడు" దండెత్తి వచ్చిరి. "బాబిలను" దేశము నాక్రమించుకొనెను.

అసీరియనుల దండయాత్ర:—క్రీ. పూ. సం 1275రము:—పొరుగున నున్న అసీరియనుల పోటునలనను దేశాభిమానులగు బాబిలనుల శస్త్రముల చేతను, కాసేతుల వంశ మంతరించెను.

కొంతికాలమువఱకు బాబిలనుల ప్రభ వెలిగెను; కాని, అసీరియనుల రాజు 'తిగ్లత-పిలేశరుఁడు' ఈదేశమును జయించి స్వాధీనపఱుచుకొనెను. ఇట్టుల రెండుదేశము లేకచ్ఛత్రాధిపత్యముక్రింద నుండినను బాబిలనులు తెలివితేటలు గలవారు గనుక తమదురవస్థకు ఘూర్ణిల్లుచుండిరి. మఱికొంతకాలమునకు వీరు "చాల్దియా'యనుపేరుతో రెండవరాజ్యమును స్థాపించి, కొన్నిసంవత్సరముల వఱకుఁ దమప్రభను వెలిగించిరి.



## ఇరువదియొకటవ అధ్యాయము.

## అసీరియా;—వీరుల దేశచరిత్రము.

## క్రీ. పూ. సం॥ 1830-606 రములు.

'టైగ్రిసు'నది కిరుతటముల నుపరిభాగమున నుండు దేశము 'అసీరియా'. ఈదేశములో నెండలు మెండు; నైరృతిదిశనుండి ప్రచండవాయువులు వీచుచుండును. అందుచేత నీదేశ మెప్పుడు నెండి వాడినట్లు కనఁబడును. వసంతకాలములో మాత్రము చెట్లు చిగిరించి పూచి కాచును. అప్పు డాదేశము చూ

చుట కింపుగ నుండును. గ్రీష్మఋతువు రా పూర్వ మాదేశీయులు పండించి పంటలఁ దెచ్చి గృహములలో నుంచుకొనియెదరు. గ్రీష్మము రాను దేశము మాడిపోవును. ఇట్టిదేశములో నుండుటచేత వారు వర్తకవ్యాపారములలోనికి దిగిరి. దానిని సాగించుటకు గాను వారు విదేశములను జయించుచుండిరి. ఇందు కుగాను వారు దేహపరిశ్రమఁజేసి, మహాయోధు లయిరి.

'బాబిలోనియా' దేశము వీరికి మాతృదేశమైనప్పటికిని, ఆదేశము యొక్క సర్వసంపత్కళలఁజూచి వీరసూయపడుచుండిరి. 'బాబిలోనియనుల' వలె వీరికి కళలలోఁ బ్రవేశములేదు. వేఁటాడుటయందును యుద్ధమును చేయుచుండుటను వీరికభిలాష మెండు. దేశములను జయించి వారు వర్తకమును సాగించిరి. ఈవిషయమును గుఱించిన శిలాశాసనములను శిలాప్రతిమలను చూడ నగును. వారి అవయవములు బలిసి కండలుగలవి. వారిగాత్రములు దృఢమయినవి. వారి రూపరేఖావిలాసములం బట్టి వారు సమేతకుటుంబములోని వారని చెప్ప నగును. ఆకుటుంబమువారి వ్యాపారగుణములు వీరికిఁ గూడ వచ్చెను. వీరు మహాగర్విష్ఠులు. సత్త్వంబున్నటులో వీరిని మించినవారు లేరు. వారిముఖముఁ జూచిన వారిగుణములఁ దెలియనగును.

బాబిలోనియాలోని సమేతజనులు కొంద ఱీభాగమునకు వచ్చి కాపురముండిరి. వారివంశజాలే 'అసీరియనులు—'అసరు, నినవే, కాల, సర్గను దుర్గము' అను ఈనాలుగుపట్టణములు ముఖ్యమైనవి. మొదటిపట్టణమునుండి దేశమునకుఁ బేరువచ్చెను. వీరదేశమునకు రాజధాని 'నినవే' పట్టణము. ఈపట్టణ ముండినస్థలము నేకశతాబ్దములనుండిఁ దెలియక యుండెను. అనంతర మాస్థలము తెలిసికొనఁబడినతరువాత, నపూర్వమగు సంగతులు మనకుఁ దెలిసెను. 'అసరుబనిపాలుఁడు' కష్టపడి సంగ్రహించిన పుస్తకభాండాగార మీపట్టణములోఁగలదు. జిగటమన్నును గొట్టములుగఁ జేసి, వానినిఁగాల్చినపైని అవిగట్టిపడును. అట్టిగొట్టములపైని కీలలిపిలో వారు గ్రంథములను వ్రాసిరి. ఈగొట్టముల సముదాయము దొరకెను

'అసురుబనిపాలుఁడు' తెలివితేటలు గలవాఁడు. కనుకనే గ్రంథశోధనలోఁ గాలముఁ గడిపెను. 'అతనిపూర్వపురాజు లెవరును గ్రంథములను గుర్తెఱిఁగినవారు కార'ని రాజు వ్రాసెను.

బాబిలోనియనులును వీరును మతాభిప్రాయములలో సమానులు. వారివలె వీరికి మాత్రము పిచ్చియాచారములఁ గాని పిచ్చియభిప్రాయములు గాని లేవు. బాగు చేసికొనుటకుఁ గాని ఓగు చేసికొనుటకుఁ గాని ఎవనికర్మమునకు వాఁడే కర్తగాని, దేవగణమువారుగాని రాక్షసగణమువారు గాని దానిని ముట్టలేరని వీరి సిద్ధాంతము. వీరు పూజించుచుండెడి విగ్రహములు కూడ వీరివలె దృఢమయినవి. బాబిలోనియనుల 'ఇస్తరు' దేవతను 'అస్తార్త' అను చంద్రదేవత యని మాఱుపేరు పెట్టి, వీరు దాని నారాధించుచుండిరి. ఈదేవతార్చనవిధానమును వినిన భయము పుట్టును. ఈదేవతకు వీరు బలుల నిచ్చుచుండిరి; సూర్యభగవానునికి 'బాలు'అను పేరిడి పూజించిరి. ఇతఁడు వీరికి ముఖ్యప్రాణదేవుఁడు. బాబిలోనియనుల పురాణకథను వీరు సంగ్రహించిరి. 'తముజు' అను దేవుఁడు 'అస్తార్త అనుచంద్రదేవతను వివాహమాడెను. హేమంతఋతువను వరాహముచేత నీదేవుఁడు పర్వతములమీఁదఁజంపబడి అధోలోకమునకుఁ బోవును. అప్పు డతనిభార్య విలపించి, అధోలోకమును గూర్చి పోవును, దాని సప్తద్వారములలో నొక్కొక్కదాని వద్ద నొక్కొక్క ముత్యాలహారమును విడిచి వెళ్లెను. ఈగాఢాంధకారబంధురంబైన లోకము నేలుచున్న దేవత నామెచూచి, సాష్టాంగనమస్కారములఁ జేసెను. ఆమె నీదేవతకారాగృహములోఁ బ్రవేశపెట్టెను. అప్పుడు దేవత లామెను విడిపించుటకొఱకు 'అరుణము' అను శునకమును పంపినందున ఆశునకము వచ్చి ఆమెను విడిపించి, భూలోకమునకుఁ దెచ్చెను. వసంతకాలములో సూర్యునికి 'అదోనేశుఁడ'ను పేరు పెట్టి, ఉత్సవములను వారు చేయుటకలదు. అప్పుడు ఆబాలవృద్ధులు స్త్రీపురుషులు వీధులలోఁ గుమిగూడి 'జీవతిఅదోనేశః. జయతి అదోనేశః' అని కేకలు వేయుచుండురు. చిన్నమొక్కలతోను మాలికలతోను తట్టల నల్లి, వానిలోఁ బుష్పము

లను ఫలముల నుంచి వారు సూర్యునికి సమర్పింతురు. ఈప్రకారము వసంత హేమంతఋతువులలో వారు భగవంతునిఁ బూజించుచుండిరి. 'నేబుఁడు' అనువాఁడు వాచాలమున కధిదేవత. 'పశుమితి' అను నామె సమస్తవిద్యల కధిదేవత. 'రిమానుఁడు' అనువాఁడు వర్షాధిపతి. ఇతఁడు 'వజ్రాయుధుఁడు.' ఈదేవతల సందఱిని వారు బాబిలోనియనుల వద్దనుండి సంగ్రహించిరి. బాబిలోనియనులు దేవళములఁ గట్టించి, దేవతార్చనలును తదేకధ్యానముతోఁ జేయుచుండిరి; అసీరియనులు మాత్ర మీదేవతలను సంగ్రహించినప్పటికిని, భక్తితేనిపూజలఁ జేయుచు, దేవాలయములకు బదులు వాని నిమిత్తము పెద్ద నగరములఁ గట్టించిరి. బాబిలోనియనులకు పరలోకము 'అనువసనిసి' వలెఁ గనఁబడును; వారికి పరలోకమున భయము పుట్టును. భూమిఁ దినుచుండిన జీవులే వారికంటికిఁ గనఁబడుదురు—అసీరియనులకుఁ బరలోక మనిన సంతోషము వచ్చును; ఆలోకము వీరికంటికిఁ దేజోనంతమై, సర్వసంపదలతోఁ గూడియుండెను. ఆలోకములో శాశ్వతమైన సంపదల ననుభవింపవచ్చు నని వారి నమ్మకము.

అసీరియనులు మహాయోధులు. కాలమంతయు వారు రణరంగములోఁ గడిపిరి. వారి జయస్తంభము లన్నియు వారి వీరకృత్యములఁ దెలియచేయును. ఆధారము లేవియు లేనందున వారిదినచర్య యెట్టిదో, వారి యాచారము లేవియో మనకు స్పష్టముగ తెలియవు. బీదలజీవనము భోగములులేనిది; వారి నివాసములు కుటీరములు; వానివెన్నుమీఁద గవాక్షము లుండెను. వారు చాపలను, బల్లలను, కూజాలను వాడిరి. సామంతులగృహములు భవనములు; వారి భోగములు నిరుపమానములు; వారిపానీయపాత్రలు కంచువి; ఉన్నతాసనముల మీదఁ గూర్చుండి వారు భుజింతురు; 'సిరికొలఁదిచిన్నెలు' అనునట్లు, సామంతులకు భోగరాగాదులకుఁ గొఱఁతయేమి? సాధారణజను లందఱు తలగుడ్డలను గాని టోపీలను గాని ధరించుట లేదు. వారిశిరోజములు బిరుసు. వానిని దువ్వి జడవల్లి కట్టిపెట్టుదురు. ఉద్యోగస్థులు, వైదికులు, గాయకులును టోపీలను గాని పాగాలను గాని ధరింతురు.

రాజు రథము నెక్కి యుద్ధమునకుఁ బోవును; రథమును సారథి తోలును; దానిమీఁదను ఛత్త్రచామరములఁ బట్టుకొని పరిచారకులు నిలిచియుందురు; ధనస్సును పట్టుకొని యొకఁడు ముందునడుచును; ఒకవేళ యుద్ధములో నోడినపుడు పారిపోవుటకుఁగాను గుఱ్ఱములను నడిపించుకొని వెనుకనుండి కొందఱు వచ్చుచుందురు. ఎచ్చటనైన సైన్యములతో విడిది చేసినపుడు, రాజు కూర్చుండుటకు సింహాసనముఁ దీసికొని ముందు కొందఱు నడుచుదురు. ముట్టడి వేయఁబడిన పట్టణము ముందు 'సేనాఖరీబు' రాజు సింహాసనాసీనుఁడై యుండినట్లు శిలాప్రతిమ యొకటి "ఆంగ్లేయసర్వవస్తుభాండాగారము"లోఁ గలదు. 'సర్వసేనాధిపతియైన అసీరియాదేశపురాజు, సేనాఖరీబు ఉన్నతాసనాసీనుఁడై యుండ, పట్టణము ముట్టడివేయఁబడి, అతఁడు చూచుచుండ, అందులోనిధనమంతయు తీసికొనిపోఁబడెను' అని శాసనము కలదు. పట్టణమును ముట్టడించి గెలిచినతరువాత ఘోరకృత్యములను వారు చేయుచుండిరి. పిల్లలను మంటలోఁ ద్రోసివేయుదురు; తెగిపడియున్న శిరస్సులను రాజునడుచుమార్గములో నుంచుదురు; పట్టుపడిన శత్రువులను పట్టణముబహిర్ద్వారములవద్ద మేకుబందీచేసి చంపివేయుదురు.

అసీరియనులు రాధారిమార్గములను నిర్మించుటలో నిపుణులు; అట్టి మార్గములుండుటచేత, సునాయాసముగ పైదేశములతో రాకపోకలు జరుగుచుండెను. వారికిఁ బడవలఁ గట్టుట తెలియ సందున, వారివర్తకమంతయు నాటువర్తకమే గాని నీటివర్తకము కాదు.

గతించిన శతాబ్దములలో నీదేశచరిత్రమంతగా తెలియనేరము. సంక్షిప్తముగ నున్నశాసనములఁ బట్టి చూడ, వారి రాజ్యమునకు వృద్ధిక్షయములుండినట్లు కనఁబడును.

క్రీ పూ. సం॥ 1120 రమ 'ప్రథమటిగ్లేత-పిలేసరుఁడు.' ఇతఁడు పూర్వము పుష్టిచేసి బలిసి పెరిగియున్న రాజ్యము నీరాజు వృద్ధిఁ జేసెను. పూర్వపురా

రాజొకఁడు 'బాబిలోనియా' దేశమును జయించి, ఏడుసంవత్సరములు దానిని పాలించెను. అన్నిదేశములవలె నాదేశముకూడ అసీరియారాజునకుఁ గప్పముఁ గట్టుచుండెను. 'నాప్రభుత్వమువలన వారంద ఱొకమనస్సు కలవారైరి. పన్నులను విధించితిమి. వారు కప్పములను కట్టుచుండిరి' అని రాజుచెప్పినట్లు శాసనము కలదు. స్వాధీనములై యుండిన దేశములలోనుండి, నానావిధవృక్షజాతులఁ దెప్పించి 'నినవే' పట్టణములో నొక ఉద్యానవనమును రాజు వేయించెను. ఈరాజు ఖ్యాతినొందినతరువాత స్వాధీనమైయున్న దేశములన్నియు స్వతంత్రించెను. మఱికొంతకాలమునకు 'అసరు-నజరుపాలుఁడు' రాజ్యమునకు వచ్చి వారి గర్వము నణఁచి వారిని స్వాధీనముఁ జేసికొనెను. 'అర్మీనియా, ఫోనీషియా, బాబిలోనియా, మెసపొటేమియా' దేశముల నతఁడు జయించెను.

క్రీ. పూ. సం॥ 859-825 రములు. 'ద్వితీయషల్మనేశరుఁడు':— ఈరాజు 'అసరునజరుపాలు'ని కుమారుఁడు; ఇతఁడు సింహాసన మెక్కినతరువాత, నారాజ్యమునకుఁబోయి వచ్చెను. 'ఆంగ్లేయసర్వవస్తుభాండాగారము'లో నతనికాలమునాఁటి మూఁడుకీర్తిస్తంభములు కలవు. ఒకటి నల్లశిలతోఁ జేయఁబడిన గోపురశిఖరము. అయిదుదేశములవారిని రాజుజయించినట్లును, వారిలో నొకరైన 'ఇస్రాత్తేయుల' రాజు 'యేహు' అనువాఁడు విజయుఁడైన రాజునకు సాష్టాంగనమస్కారముఁ జేసి కానుకలను సమర్పించినట్లును, శాసనము దానిమీఁద వ్రాయఁబడెను. రెండవది:—సుఖాసీనుఁడై యున్న 'షల్మనేశరుని' శిలాప్రతిమ మూఁడవది:—రెండు ఇత్తడితలుపులు; రాజుచేసిన యుద్ధములను జయించినపట్టణములను వానిమీఁదఁ జిత్రరూపములోఁ జెక్కఁబడియున్నవి. 'సిరియా, ఇస్రాయిలు, డమాస్కసు' దేశాధిపులు తిరుగఁబడినపుడు వారి నతఁడు లొంగతీసెను. ఎన్నిసారులు బాబిలోనియాదేశము స్వతంత్రించుటకు యత్నించిన నన్నిసారులు దానిపొంకము నణఁచెను. పోటుమగఁడైన రాజు పోటులాడుటలో కాలముఁ బుచ్చెను. ఈరాజు తండ్రికాలములో దేశమునకు స్వాస్థ్యముండుటచేత నతఁడు వేఁటకుఁబోయి సింహముతోఁబోరాడినట్లు శిలా

ప్రతిమలు కలవు. వేఁటకుఁ గాను మఱికొన్ని జంతువులను బోనులలో నుంచి, నట్లు ప్రతిమలుకలవు. ఈ కుమారునికాలములోమాత్ర మటులకాదు. ఇతఁడు ప్రతిసంవత్సరము పోటొగ్గి పోటుకాండ్రను తీసికొని పోటునకుఁబోవుచుండెను. ఇతనిపేరు వినిన దేశములుడుకు చుండెను. దీనిఁబట్టి చూడ, వర్తకముఁ జేసి బలిసి పెరుగుచున్న సిరియాదేశము నితఁడుభంగపఱచి లొంగతీసినట్లు కనఁబడును. ఇతనిమరణానంతరము రాజ్యమునకుఁ బాటుకాలము వచ్చెను. దేశ మల్లకల్లోలమై, ఎవరికి వారు స్వతంత్రించిరి. దేశమునకు నాథుఁడు లేఁడు; రాజులవంశ మంతరించెను.

క్రీ. పూ. సం॥ 746 రము. 'తృతీయతిగ్లేతపిలేశరుఁడు: — ఇతఁడు నూతనరాజవంశమునకు మూలపురుషుఁడు: మొదట బీదకుటుంబములోనివాఁడు. అయినను మహారాజలక్షణములను కలవాఁడు. శూరుఁడు. సంధానకర్త. యుద్ధముఁ జేసి దేశములను జయించుటచేత రాజులకు విజయకీర్తి తప్ప మఱియొకటిలే దనియు, ఈకీర్తికూడ కొద్దికాలములో నశించుననియు, అతనినమ్మకము. అందుచేత నతఁడు దేశములను జయించిన తోడనే, వానికిస్వాస్థ్యముఁ దెచ్చి, ఏవిధమున నవి స్వాధీనములై విజయునియం దనురాగమును కలవియై యుండునో, ఆవిధమున వానిని నతఁడు పాలించెను. అందుచేత నతనికాలములో నా దేశము మహోచ్ఛ్రపదవికివచ్చెను; అతనిరాజధాని నస్తకమునకుం బుట్టినిల్లయ్యెను. స్వాధీనముకాని పొగరుఁబోతులను పట్టితెచ్చి అతఁడు వారిని విదేశములకుఁ బంపుచుండె. స్వాధీనులై భృత్యులైయున్నవారు సంవత్సరమునకుఁ గొంతకప్పమును కట్టుచుండిరి; రాజాజ్ఞ ననుసరించి వారు అసీరియాదేశముతో వర్తకముఁ జేయుచుండిరి. ఇటుల దేశములను జయించి స్వరాజ్యముతో నన్నివిషయముల నైక్యమగునట్లు వాని నతఁడు పరిపాలించెను. "బాబిలోనియనులు, హిత్తేతులు, కాననేతులు శిరియనులు" — ఈమొదలగువారికిని అసీరియనులకును సంబంధబాంధవములను కలుపుట కతఁడుయత్నించెను. అందుమూలమున దేశము లైక్యముఁ జెంది, రాజ్యమునకు స్థిరత్వము వచ్చెను. స్త్రీలును, పిల్ల

లును, గృహోపకరణములతోఁ దగుపాటి అసీరియనులు వెంటనంటిరాను వివాహార్థము దేశములోనికిఁ బోవుచున్నట్లు, ప్రతిమలు చెక్కఁబడియున్నవి. ఇట్టిసంబంధబాంధవ్యములచేత దేశీయుల సమ్మేళనమువలన మహారాజ్యమున కేకీభావము జనించును. ఏకీభావము శ్రేయోదాయకము.

ఇదివఱకే బాబిలోనియాదేశము స్వాధీనమై యుండెను; ఇప్పుడు సిరియాదేశము కూడ భృత్యవర్గములోఁ జేరను. ఇంతియ కాదు. "ఇస్రాయేలు, డమాస్కసు రాజులు శిరియనులను తోడుబెట్టుకొని, నామీఁదికి దండెత్తినవచ్చిరి. వారిపోటునుండి నన్ను రక్షించి, భృత్యుని నన్నుఁ గాపాడవలె"నని జూడుదేశపురాజు "అవాజు" అనువాఁడు వచ్చి "తృతీయతిగ్లేతపిలేశరుని" వేఁడెను. అప్పు డతఁడు వారందఱియూపును మాపి వేసను. "డామస్కసు" అను రాజధానిని వారు తీసికొనిరి. దానిరాజు నతఁడు పంజరములో నుంచి మేపబందీ చేయించెను. వృక్షజాతులతోఁ గూడినయుద్యానవనము లా రాజధానిలోఁ గలవు; వాని నతఁడు ధ్వంసముఁ జేసెను. అతనిమరణకాలము సరికి అసీరియారాజ్యము బలిసెను. దక్షిణమున నున్న పారశీకజలసంధి మొదలుకొని తూర్పుననున్న "బిక్ని" పట్టణమువఱకును, మధ్యధరాసముద్రతీరమునుండి ఈజిప్టువఱకును గలదేశ మారాజ్యములోనిది. ఈరాజామహారాజ్యమునకు సృష్టిస్థితికర్త. ఇతనికి విజయునిగుణముల కంటె సంధానకర్తగుణములు విశేషముగఁ బట్టెను.

క్రీ. పూ. సం॥ 72-704రములు:—ద్వితీయసర్గనుఁడు:—ఇటులదేశములను సంధించి రాజ్యమును బహుళముఁ జేసి, "తృతీయతిగ్లేతపిలేశరుఁడు" దానిని సృష్టించెను; దానికి స్థితిగతులను పన్ని, దానికి స్థిరత్వము వచ్చుకాలమున కతఁడు మృతినొందెను. అనంతరము రాజ్యము లయమునొందకుండ దానిని నిలువఁబెట్టి "ద్వితీయసర్గనుఁ" డుద్ధరించెను. అతఁడు సింహాసనము నెక్కినతోడనే, బాబిలోనియా దేశము తిరుగఁబడెను. సిరియా దేశపు రాజులు స్వతంత్రిం

చుటకు యత్నించిరి: రాజ్యమునకుఁ బొలిమేరలనున్న జాతివారలపోటు పుట్టెను. ఈజిప్టుదేశపురాజు ధాటికి అసీరియనులు భయపడుచుండిరి.

“ద్వితీయసర్గనుఁడు” గతించినరాజుయొక్క సేనానాయకులలో నొకఁడు జాతిపోవుచున్న రాజ్యసూత్రముల నతఁడు బిగించి సేనలనచ్చటచ్చట నిలిపి, శత్రువులనుండి రాజ్యమును సంరక్షించెను, “త్రిశక్తియుతుఁడై” చతురంగబలములనతఁడు నడిపించుకొని పోయి “రాఫియా” వద్ద జరిగినయుద్ధములో సిరియనులను వారిమిత్రులతోఁ గూడ నోడించెను. ఇదివఱకే “సమేరియనుల” నతఁడు సాధించెను. మఱికొన్నిసంవత్సరములకు “వింతేతుల” రాజధానియైన “కార్కమేషు” అతనికిఁ బట్టుపడెను; ఈపట్టణము పూర్వపశ్చిమ దిశలవర్తకమునకుఁ బుట్టినిల్లు.

ఈకాలమున ఈజిప్టురాజు ‘షబకుఁడు.’ ఈయిరువురు రాజులయొక్క ముద్రలతోఁ గూడిన సంధిపత్రిక యొకటి కలదు. అందువలన వారు సంధిఁజేసికొని రని తెలియనగును. ఇంతలో ‘బాబిలను’ దేశపురాజు ‘మూరోదక-బలదనుఁడు’ సమయముఁ జూచి కుట్రలఁ బన్ని దిరుగఁబడుటకు సిద్ధపడుటయే గాక, జూడా దేశపు రాజగు ‘హాజికేయు’ ని తనపక్షమునకుఁ దెచ్చుకొనెను. ఇదివఱకితఁడు తనమంత్రియైన ‘ఇసాయు’ ని మంత్రాలోచనలను విని వాని ప్రకారము నడుచుకొనుచుండెను; కాని, బాబిలనురాజుయొక్క దురాలోచనలను విని అతఁడు పంపిన రాయబారుల నత్యాదరముతో నితఁడు గారవించెను. ‘చేతోహరాయువతయస్సుహృదోఽనుకూలాః సద్బాంధవాః ప్రణయగర్భగిరాశ్చ భృత్యాః, వల్గంతి దంతినివహాస్తరళాస్తురంగాః’ అనువిధమున, ‘హాజికేయుఁడు’ తనసర్వసంపత్తును వారికిఁ జూపించెను. “చూడుము, నీయావత్సంపదయు బాబిలనుకు తీసికొని పోఁబడును. నీకుమారులు సహిత మారాజునకు భృత్యులగుదురు” అను ఋషివాక్యము సఫల మయ్యెను; ఈశత్రుదారులిరువు రేకీభవించుసరికి ‘సర్గనుఁడు’ సైన్యముతో వారిమీద దుమికెను. జూడా దేశమును నాశనముఁ జేసి ‘జెరూసలము’ పట్టణముఁ బట్టుకొని, సర్గనుఁడు

'అష్షాదు' పట్టణముఁ దగులబెట్టెను, 'ఈజిప్టు' దేశము 'హజికేయునితో' స్నేహముగనుండినప్పటికిని, వానికి సహాయముఁ జేయలేదు. 'మారోదకబలదనుఁడు' తనబాబిలనుదేశమును సంరక్షించుకొనుచుండెను గాని, వానికిఁ దోడ్పడలేదు. విజయుఁడగు సర్గనుఁడు దండుతో 'బాబిలను'కు వచ్చుసరికి, 'మారోదకబలదనుఁడు' రాత్రికి రాత్రి భయపడి పిల్లివలె పాఱిపోయి, ఈలామేతుల రాజువద్దకుఁ బోయి 'నన్ను రక్షింపుము. నా బంగారు సింహాసనము, రాజదండములు, వెండిఛత్రమును నీకిచ్చెద'నని ఆరాజును బ్రతిమాలెను.

ఈబామేతులరాజు సర్గనుని బలపరాక్రమముల నెఱిఁగినవాఁడు గనుక, సహాయముఁ జేయక వానిని పంపివేసెను. 'మారోదకబలదనుఁడు' నిరుపేదవలె విలపించుచు తనపట్టణమునకు వచ్చెను. బాబిలోనియనులు రాజుచేత విడువఁబడినందున వారిమంత్రులు ప్రధానులు మొదలగువారు తమవిగ్రహములఁ బట్టుకొని సర్గనునిశరణుఁ జొచ్చిరి. అనంతర మతఁ డాపట్టణములో పట్టాభిషిక్తుఁ డయ్యెను.

ఇటుల నలువైపుల శత్రువుల బరిమార్చి సర్గనుఁడు తనపేరున 'సర్గనదుర్గను'ను పట్టణముఁ గట్టుట కారంభించెను. "రాత్రింబగళ్లు నగరనిర్మాణములోఁ గాలము వెళ్లుచుండెను. దేవాలయములను రాజభవనములను గట్టించితిని' అని అతఁడు వ్రాసెను. మొదట దేవళములు నిర్మింపఁబడెను; దంతముతోను 'ఓకు, దేవదారు, తాళ' వృక్షముల దూలములతోను మహోన్నతమైన రాజభవనము నతఁడు కట్టించెను. పట్టణమున కెనిమిదిసింహద్వారము లుండెను; ఒక్కొక్కద్వారమున కిరువైపుల రెక్కలు గలరెండువృషభముల శిలాప్రతిమలు కలవు. 'ఈనగరమును రాజనగరును 'అసరు' దేవుఁడు రక్షించుగాక! ఆచంద్రార్కము దీనికాంతి ప్రకాశించునట్లు చేయుగాక! శాశ్వతముగ నీనగరము నివాసయోగ్య మగుగాక! అహోరాత్రములు భగవంతుండు దీనిని కాపాడుగాక!' అని రాజు దేవునిఁ బ్రార్థించెను. ఆపట్టణపు ప్రహరీగోడల

మీఁద నారాజుయొక్క వీరకృత్యములన్నియు చిత్రరూపమునఁ జెక్కఁబడెను. ఈచిత్తరువులతనికాలమునాటి దేశచరిత్ర కాధారములు.

ఏయేదేశముల నతఁడు జయించెనో ఆయాదేశవాసులను రప్పించి, వారికి స్వామ్యముల నిచ్చి, వారు పట్టణములోఁ గాపురముండునటులఁ జేసెను. "నాయాజ్ఞోల్లంఘనఁ జేయలేక వివిధభాషల నుచ్చరించు దేశీయు లనేకులు నలువైపులనుండి వచ్చి, యాపట్టణములో నివసించిరి. వారంద ఱొకభాషను మాట్లాడుచుండిరి' అని రాజు వచించెను. ఏవిధమునవిదేశమునను వచ్చితి మను కించలేక వారు స్వాస్థ్యపడిసుఖముగ జీవింపఁగలరో,అవిధమున వారి నతఁడు సంతోషపెట్టి ఆదరించెను. ఎంత ఆదరణను పొందినను, వారిలోఁ గొందఱు స్వదేశగమనాభిలాషులై యుండిరి. వీరిలో నొకఁడురాజును బలవంతముగఁ జంపివేసెను.

క్రీ పూ. సం. 704రము "సేనాఖరీబు"—అనంతర మీరాజు సింహాసనమునకు వచ్చెను. రాజు సుఖముగ సింహాసనాసీనుఁడై యున్నట్లు బొమ్మలు కలవు.

బాబిలోనియనులరాజు "మారోదకబలదనుఁడు" కారాగృహమునుండి తప్పించుకొని పాఱిపోయెను. అందుచేత నా దేశమును తిరిగి "సేనాఖరీబు" జయింపవలసివచ్చెను. అయిన నిచట నొకచిక్కు వచ్చెను. ఇతని పూర్వపురాజులు బాబిలను పట్టణమునకుఁ బోయి అచ్చట దేవాలయములోని దేవుని హస్తములఁ బట్టుకొన, ప్రజలందఱు "రాజుజీవించుగాక" అని బయటనుండి కేకలువేయు ఆచారము కలదు. నేఁడు సేశాఖరీబు ఆపట్టణమునకు వెళ్లిన తరువాత నితఁడుకూడ పూర్వాచారము ననుసరించి నడుచునని వారుతలంచిరి; కాని పూర్వాచారము ననుసరించి ఆపట్టణములోఁ నభిషిక్తుఁడైనయెడల,ఆదేశమును స్వదేశముతో సరిసమానముఁ జూడవలెగాని స్వాధీనమై భృత్యవర్గములోఁ జేరినదానివలె భావింప వీలుపడదని యెంచి, అతఁడాప్రకారము నడుచుకొన

లేదు. నినవె పట్టణములో నతఁడు పట్టభద్రుఁడైనపుడు అతనికి స్వాధీనమై యున్న దేశముల కన్నింటికిని బాబిలోనియా దేశమునకును ప్రభువని చాటించిరి; అందుచేత నతఁడు తిరుగా బాబిలను పట్టణములో నభిషిక్తుఁడగుట కిష్టపడలేదు; ఆకోపముచేత వారు "మారోదకబలదను"ని వేఁడి కారాగృహమునుండి యెవరికిని తెలియకుండ విడిపించి తమదేశమునకుఁదీసికొని వెళ్లిరి; కాని, ఇతఁడు పిఱికిపంద. 'సేనాఖరీబు' పట్టణముమీదికి సైన్యములతో రా వేగమె "మారోదకుఁడు" పట్టణమును విడిచి పాఱిపోయెను. 'సేనాఖరీబు' ఆదేశములోని పల్లెలను, పట్టణములను కాల్చిబొగ్గుచేసెను. దేశములో నెక్కడచూచినను కాలి కూలిపడియున్న నివేశనములును పీనుగులపెంటలును తప్ప మఱియొకటి కానరాదు.

ఇంతలో "ఫోనీషియనులును, ఫిలస్తీనులును, ఇతియోపియనులును, ఐజిప్టియులు"ను యూదాదేశపురాజగు 'హాజికీయ'నితోఁ గలిసి; ఏకముఖముగ నందఱును గూడఁబడిరి. సేనాఖరీబు దండనాయకులఁ దోడ్కొని శత్రుసైన్యమును "ఎక్రను" వద్ద జరగిన యుద్ధములో నోడించెను. "నా ప్రతాపముఁ జెప్పనేల? కోదండంబునాటి ఒక్కుమ్మడిని శత్రువులఁ దునుమాడితిని. వారి పికాపికలై, నాయకులు నిలువలేక, చెదరి పోయిరి." అని రాజు వీరాలాపము లాడెను.

ఇందులో నొకసంగతిని చెప్పక రాజు మౌనమును వహించెను. దిగ్విజయముఁ జేసినరాజు "జెరూసలము" పట్టణమును ముట్టడించి పట్టుకొనక ఏల యూరకుండెను. దీనికిఁ గారణమీ దేశములోని లిఖితపూర్వకమైన నిదర్శనముఁ బట్టి చెప్పలేము; కాని, "దండును తీసికొని సేనాఖరీబు పులివలె జెరూసలము మీఁదవచ్చి పడెను; కాని భగవంతుని కటాక్షముచేతనుదయమునకు వానిసైనికులందఱు శవములై పడియుండి"రని "జూయు"లచరిత్రకారుఁడు వ్రాసెను. అనంతరమతఁడు స్వదేశము వచ్చి చేరెను. అతనికి జఱిగిన పరాభవమునకు విదేశీయు లందఱును సంతసించిరి.

అనంతరము బాబిలోనియనులును, చాల్డీనులును, ఈలామేతులును కలిసి యుద్ధమునకు సన్నద్ధులయిరి. క్రీ. పూ. సం. 692 రములో 'ఖలూలి' వద్ద జరిగిన యుద్ధములో నతఁడు వారి పొగరు నణఁచెను. "మిడుతలదండువలె శత్రువులు వచ్చి దేశముమీదఁ బడిరి 'అసరు' దేవుని కటాక్షమువలన వారిని భంగపఱచితిని అని రాజు ప్రస్తావించెను. ఈదండయాత్రలో నతఁడు చేసినపని యొకటియు శ్లాఘనీయమై యుండలేదు. కేవలము కార్పణ్యమును వహించి బాబిలను పట్టణమును రాజు భూమిలోఁ గలిపి వేసెను. రాజనగరులును సామంతుల భవనములును దేవాలయములును పుస్తకభాండాగారములును—అన్నియు నేలఁ గలిపెను. పట్టణముయొక్క రూపము పోయెను. అంతటితోఁ జాలక, కాలువలుగుండ నదీజలములను పారించి వానిని దానిమీఁద నతఁడు ప్రవహింప జేసెను. అనేకశతాబ్దముల క్రిందటఁబుట్టి, సర్వసంపత్కళలతోఁగూడి పెరుగుచున్న బాబిలను పట్టణమును నీటిలోఁగలిపి, శాశ్వతమైన అపఖ్యాతిని "సేనాఖరీబు" పొందెను.

తనతండ్రివలన వచ్చినరాజ్యము నతఁడు స్థిరపఱచి బలపఱచెను; కాని, దానిని వృద్ధిఁజేయలేదు. వృద్ధాప్యములో నతఁడు 'నినవె' పట్టణములో నుండెను.

"నారాజధానిఁ జూచుటకు రెండుకన్నులు చాలవు. విశేషముగ నివేశనములఁగట్టించితి. పురాతనమైన మార్గములను శుభ్రపఱచి, చీలికవలెనున్నవానిని విరివిగఁ జేసితిని" అని రాజునుడివెను. క్రీ. పూ. సం. 681 రములో నొకరోజు నతఁడు తనకుమారు లిరువురితోఁ గలిసి దేవాలయమునకుఁ బోయెను! దేవుని యెదుట నతఁడు సాగిలఁబడి ప్రార్థించుచుండ, నతనికుమారులు ఖడ్గముతో నతని శిరస్సును తెగవేసిరి.

క్రీ. పూ, సం. 680-668 రములు. "అసరుహాదనుఁడు."

ఇతఁడు తండ్రికిఁ బ్రియుఁడు; కుమారులలో రెండవవాఁడు. స్వాధీనులైయున్న విదేశీయులను స్వదేశీయులతో సమానులుగ నెంచి, ఆదరణతో వారిఁ జూచిన రాజు ఇతఁడొక్కఁడే కాని, ఇతని పూర్వులు కారు.

అతఁడు తండ్రిం జంపి రాజ్యమునకు వచ్చెను. ఆపాప మతనిమనసును బాధించుచుండెను. దేవతలకు శాంతిఁజేసి, ప్రాయశ్చిత్తము నతఁడు పొందెను. అతనికి స్వప్నములో "ఇష్తరుదేవి" ప్రసన్నయై, 'ఓ రాజా, నేను 'అర్బెల' పట్టణములో నుండు ఇష్తరుదేవిని. నీపక్షమున నుండినాను; కనుక నీవుభయపడకుము. నేను నాహో దేవిని. నీశత్రువులఁ దునుమాడెద; నీవువిజయుండవు కమ్ము. నీపితృహత్యాపాపమునకు వెఱవకుము. నా పరిచారికులతోఁ గూడి నిన్ను రక్షించెదను. నీప్రాణములకు భయము లేదు. నామాటలను నమ్ముము; నన్ను విశ్వసింపుము;" అని ఆమె రాజుతోఁ జెప్పినట్లు, శిలాశాసన మొకటికలదు.

అనంతరము ఘోరయుద్ధము జరిగెను. మాటప్రకారమామె రాజునకుఁ సహాయము నిచ్చెను. 'యుద్ధస్వరూపిణియైన దేవి యుద్ధములో నాప్రక్కనుండెను. శత్రుసైన్యములను విదళించి నాకుజయము నిచ్చెను' అని రాజు నుడివెను.

తండ్రికాలములో నతఁడు బాబిలను పట్టణములో రాజప్రతినిధిగ నుండువాఁడు; ఆకాలమునుండి బాబిలోనియను లనినను, వారిమత మనినను, వారిశాస్త్రము లనినను, అతని కభిమానము మెండు. నాఁడు రాజప్రతినిధి; నేడుతాను రాజు; కనుక వారిమనస్సుల నలరించి, బాబిలనుపట్టణము నతఁడు పునస్సృష్టిఁ జేసెను. పూర్వమునకంటె నాపట్టణము దేవాలయములు సామంతులభవనములు, రాజనగరులు, ప్రాకారపుగోడలు, ఉద్యానవనములు, విపణిమార్గములు, పుస్తకభాండాగారములు — మొదలగువానితో శోభిల్లెను. ఇది రాజధానిగఁ జేసికొని, ఇచటనే రాజు నివసించుచుండెను. ఈసమయములో, జూడాదేశపు రాజు "మనెసహుఁడు" తిరుగఁబడినందున నతనినికట్టితెచ్చి, సైనికులతనిని రాజుపాదములమీఁద వేసిరి. వానిని కట్లనుండి విడిపించి, స్వదేశమునకు వానిని రాజు పంపివేసెను.

ఈరాజు చేసినమహాకార్యము మఱియొకటి కలదు; అది యేమనిన, ఈజిప్టుదేశము నతఁడు జయించెను. ఇదివరలో నీసంగతిని వినియుంటిమి.

క్రీ. పూ. సం|| 668-రము అసరుబనిపాలుఁడు:—

"అసరుహాదను" నికాలములో నాదేశము రెండనపర్యాయము మహోన్నతపదవికి వచ్చెను. అతఁడు చనిపోయిన తరువాత, నతనికుమారుఁడు 'అసరుబనిపాలుఁడు' రాజ్యమునకు వచ్చెను; అతఁడు సింహాసనారూఢుఁ డైనపుడు శుభలక్షణము లగపడెను. "అయిదింతలు పంటలుపండెను; మందలకొలది పశువులు పెరిగెను; నెలకుమూఁడు వర్షములు పడెను; వాయువులనుకూలముగ వీచెను; ఋతుధర్మములు తప్పక ప్రవర్తిల్లెను; దేవతారాధనలు నిర్విఘ్నముగజరిగెను; సదాదేవత లానందించు చుండిరి"అని శిలాశాసనములో వ్రాయఁబడియున్నది. ఇట్టి సిరిసంపదలతోఁ గూడిన దేశము మాఱియేఁబదిసంవత్సరముల కంతరించును గదా! "ఆంగ్లేయసర్వవస్తుభాండాగారము" లో నుండిన ఱాతిపలక మీఁద విగ్రహముఁజూడ రాజు ఠీవిగ సింహాసనమునధిష్ఠించి మందహాసముతో నుండినట్లు కనఁబడును. గ్రంథావలోకనము, గ్రంథముల సంగ్రహమును.— ఈరెండు నతనికాలములో వారుపేక్షచేయుట నెఱిఁగి, బాబిలను పట్టణములోని గ్రంథములను తెప్పించి నినవేపట్టణములో నొకపుస్తకభాండాగారములోవాని నుంపించెను. ఈతేఁబడిన గ్రంథముల నెత్తివ్రాయుటకును, 'ఆకదు, షుమరు' అను ప్రాచీనభాషల వ్యాకరణములను నిఘంటువులను వ్రాయుట కతఁడు లేఖకుల నియోగించెను.

ఈరాజునకు గ్రంథావలోకనయం దభిలాషమెండు; అతని నియోగమున యుద్ధమునకు దండనాయకులు పోయి విజయులగుచుండిరి. 'సైరు'పట్టణనివాసులు తిరుగఁబడినందున,వీరిని పోటులో వారుపోరాడిచి సాధించి సముద్రోదకమును వీరిచేతఁ ద్రాగించిరి. "ఆర్వాదు" దేశపురాజుకుమారులు పదుగురు కానుకలనుతెచ్చి రాజుపాదములవద్దనుంచి పాదాక్రాంతు లయిరి. "చప్పన్న" దేశములరాజులువచ్చి అతనిశాసనములను శిరసావహించిరి."ఉదయాద్రిమొదలు అస్తాద్రివఱకుఁ గలదేశీయులు రాజులతో వచ్చి అతనికి నమ్రులయిరి. అనేకవిధములఁ బ్రయత్నించినను,వారిభాషలను, తెలిసికొనలేకపోతిమి."అని శిలాశా

సనముమీఁద వ్రాయఁబడి యున్నది. లిడియా దేశపురాజు "గ్రైజేసుఁడు" కూడ కట్నములనిచ్చి రాయబారుల నతనివద్దకుఁ బంపెను. అతనితండ్రి కాలములో నేరి కిని వీరి సంగతియే తెలియదు. వారతని స్నేహము కోరివచ్చిరి. "నారాజ్యము యొక్క మహౌన్నత్యమును గుఱించి అసురదేవుఁడు వారికి స్వప్నములో నగపడి, "మీరు పోయి అసురుబనిపాలుని శరణుఁబొందిన మీకు శ్రేయోదాయక" మనిచెప్పినందున వారు నావద్దకు వచ్చి నాతో స్నేహముఁ జేసిరి". అని రాజు వచించెను.

రాజ్యమంతయు స్వస్థముగ నుండెను. రాజప్రతినిధిగ బాబిలనులోనుండి అతని సహోదరుఁడు దేశమును పాలించుచు "ఈజిప్టు, పాలస్తైను, అరబియా" దేశములతోఁ గూడి, అతని మీఁదికి దండెత్తెను. ఈయుపద్రవము నతఁడు శ్రమపడి తప్పించెను; గాని ఈజిప్టు స్వతంత్రరాజ్య మయ్యెను; బాబిలను దెబ్బతినియిప్పటికిని శిరస్సు నెత్తుకొని యుండెను. సహోదరునితో వైరము కూడదని అతఁడు చేష్టఁజేసెను. అనంతర మతఁడు దిగ్విజయమహోత్సవమును జరిపెను. అతఁడు రథము నెక్కియుండ నలువురు దేశాధిపు లారథమును దేవాలయమునకు నీడ్చుకొనిపోయిరి. ఈదిగ్విజయమున కతఁడు కృతజ్ఞతను చూపుటకై దేవోత్సవములను జరిగించెను. శేషించిన జీవితకాలములో నతఁడు గ్రంథశోధనములో మునిఁగియుండెను. అతఁడు రాజ్యమునకు వచ్చుసరికి బలసియున్న రాజ్యము అతఁడు చనిపోవుసరికి క్షీణించి కృశించెను.

అనంతరము రాజ్యమునకు వచ్చిన రాజులు దుర్బలులు. బాబిలనులో నున్న రాజప్రతినిధి "నబోపలాశరుఁడు" స్వతంత్రించెను. అతనిని లోఁగఁదీయుటకు అసీరియా రాజులకు బలము లేదు. దేశసంచారావస్థలో నుండిన మందు జాతివారు ఈశాన్యభాగమునుండియు 'కుర్దిస్తానము' అను దేశమునుండియు వచ్చి రాజ్యముమీఁదఁ బడినందున రాజులు వారితోఁ బోరాడుచుండిరి; గాని బాబిలను దేశమును వశపఱచుకొనుటకు సమయము వారికిఁ జిక్కదయ్యె. పూర్వకాలములో రాజులు వీరి దేశమును ధ్వంసముఁ జేసినందున వీరు కోప

న్యాముతో నీదేశమునకు వచ్చి నాశనముఁ జేసి విడిచిపెట్టిరి. తుదకు నినవే పట్టణద్వారములవద్దకు వచ్చి, మందులనాయకుఁడు నిలిచెను; పట్టణములోనివా రతనిని బలువిధముల వేఁడిరి గాని కార్యములేక పోయెను. దానికాలము సమీపించెను; ఆసంగతినిగుర్తెఱిఁగి ఆసీరియాదేశపురాజు 'సీనేషరిష్షనుఁడు' తననగరునకు నిప్పుఁబెట్టించి, పుత్రమిత్రకళత్రాదులతో నామంటలో నశించెను. ప్రాకారపుగోడలు పడెను; టైగ్రిసునదియుప్పొంగి పట్టణముమీదఁ బాఱెను; నినవె పట్టణము రూపుమాసిపోయెను; అంతటితో నారాజ్యమస్తంగతమయ్యెను.

"ఓ అసరుదేశరాజా! నీపశుపాలకులు నిద్రించిరి; నీప్రధానులు పరలోకగతు లయిరి. నీప్రజలు కాంతారవాసు లయిరి. నీవు లేవుగనుక, వారిని సముకూర్చు వారెవరు?"

---

# ఇరువదిరెండవ అధ్యాయము.

---

## బాబిలోను ద్వితీయరాజ్యము (చాల్డియా).

### క్రీ. పూ. సం॥ 626-539 రములు.

బాబిలను పట్టణమును సేనాఖరీబు నాశనముఁ జేసి విడిచిపెట్టెను; అసరుహాదనుఁడు రాజ్యమునకు వచ్చినతోడనె, ఆపట్టణ మతనిరాజధాని యయ్యెను. క్రమక్రమముగ పెరిగి పెద్దదియై, అసరుబనిపాలుఁడు సింహాసనమునకు వచ్చుసరికి, ఆపట్టణ మతనితోఁ గలహించుటకుఁ దగినంతసాహసము కలదయ్యెను. ఆరాజు దానిని యుద్ధములో నోడించినను, దానిని పూర్ణముగ

ముట్టి వేయుతేను. రాజప్రతినిధియైన "నబోపలాశరుఁడు" స్వతంత్రించి రాజ్యమును స్థాపించెను. కొంచెము చీమును రక్తమును చేకూడినతోడనె, నతఁడు అసీరియా రాజుపై తిరుగఁబడి స్వతంత్రుఁ డయ్యెను.

చాల్డియుల ప్రభ:—'నబోపలాశరుఁడు' స్థాపించిన నూతనరాజ్యమును బాబిలోనియాను లామోదించలేదు; కాని, వారిలోనొక్క "చాల్డియు" లతనిని, అతనిరాజ్యమును నిలువఁబెట్టిరి. వీరు సముద్రతీరవాసులు; చాలకాలమునుండి బాబిలను పట్టణములోనుండి బాగుపడినందున, వారిమాట ప్రతి విషయములోను సాగుచుండెను. ఆ ప్రాచీనపట్టణము జీర్ణించి బలపరాక్రమములఁ జూపింపలేని సమయమున, వీర ప్రాజాపత్యముచేత నాపట్టణము శిరస్సునెత్తి తిరుగఁబడుటకు సాహసించెను. అసురుబనిపాలుఁడు పరలోకగతుఁడైనందున, వారికి స్వతంత్రించుటకు సమయము వచ్చెను. క్రీ.పూ. సం॥ 626 గములో, "నబోపలాశరు"ని రాజునుచేసి, వారు "చాల్డియు" రాజ్యమును స్థాపించిరి. అయిన నీరాజాపదవి నిలుకడ లేనిది. అసీరియా రాజులు బలవంతులైన నతనిని సాధించి వారిపూర్వపు ప్రభుత్వమును స్థాపింతురు; లేదా, చాల్డియు రాజకుమారులు నమ్మఁదగినవారు కారు; వారు కుట్రలం బన్నిన పన్నవచ్చును. ఇదివఱకె దెబ్బలను తిని ప్రస్తుతము స్వతంత్రించిన "ఈజిప్టు" దేశము తనపూర్వపు విజయుని దురవస్థఁ జూచి కార్పణ్యముతో వానినిప్పుడు సాధించి బాబిలను పట్టణమును ముట్టి వేయుటకు వచ్చినను రావచ్చును. ఇది మాత్రము కొంతకాలమువఱకును సంభవింపలేదు; "ఈజిప్టు" సైన్యములఁ దీసికొని అసీరియారాజ్యములోని పశ్చిమరాష్ట్రములను సాధించుటకుఁబోయెను. అనంతరము "నినవె" పట్టణము నేలపాలయ్యె; అందుచేత వారిభయము కూడ చాల్డియరాజ్యమునకు లేకపోయెను. క్రీ. పూ. సం॥ 605 రములో ఈజిప్టురాజు "నెఖుఁడు" సైన్యములతో బాబిలనుమీదికి దండెత్తి వచ్చెను— ఇదివఱకె సిరియా, పాలస్తీను రాజ్యములను యుద్ధములో సాధించి ప్రతాపశీలుఁ డని పేరొందిన బాబిలనురాజకుమారుఁడు ఈజిప్టు రాజసైన్యములను

"కార్క్మేసు" వద్ద జరిగిన యుద్ధములో నోడించెను—ఈరాజకుమారుఁడం "నబుచడ్నెజరు"—అనంతర మతఁడు వారి దేశమును సాధించి యుండును గాని, ఇంతలోఁ దనతండ్రి మరణమును విని, అతఁడు రాజధానికి వచ్చెను.

"నబుచడ్నెజరు" పట్టాభిషిక్తుఁ డయ్యెను. నేటినుండి చాల్డీయ రాజ్యము కీర్తికాంతులు వేయును మహోచ్ఛ్రపదవిఁ జేరెను.

ఐజిప్టీయులు సహాయముఁ జేయుదు రనునమ్మకముతో "జూదేయఫోనీషియా" దేశములవారు తిరుగఁబడిరి కాని అతఁడు "జూడా" దేశపురాజగు "జిహోకిము" అనువానిని రాజ్యమునుండి తప్పించి, వానిస్థానమున "జడికేయు"ని నియోగించెను. ఇతఁడు "నబుచడ్నెజరు"నకు భృత్యుఁడై యుండెను.

ఫోనీషియా దేశములో "టైరు" ముఖ్యపట్టణము; రాజు దానిని సాధించుటకు ముట్టడి వేసియుండెను. ఇంతలో జడికేయుఁడు ఐజిప్టీయులను సహాయముచేసికొని తిరుగఁబడెను. వెంటనే రాజు సైన్యమును పంపి అతనినికట్టిపట్టి తెప్పించెను. అతని నేత్రములఁ బోగొట్టి రాజతనిని బాబిలనునుఁ బంపివేసెను. "నీవుఅంధుఁడవై బాబిలనకు వచ్చెదవు" అని హీబ్రుఋషి చెప్పినవాక్యము నిజ మయ్యెను. అతనితోపాటు మరికొందఱు "హీబ్రూలు" కూడ బాబిలను పట్టణమునకుఁ దీసికొని పోఁబడిరి.

పదమూఁడు సంవత్సరములు రాజు "టైరు" పట్టణమును ముట్టడించి యుండెను గాని, దానిని సాధింపలేక పోయెను. దేశములో నీయుపద్రవములకు "ఈజిప్టు" దేశము కారణమనితలంచి, ఆదేశమును రాజు నాశనముఁ జేసి విడిచిపెట్టెను. ఇంతటితో నతనిదండయాత్రలు ముగిసెను. అనంతర మతఁడు రాజధానికి వచ్చి శేషించిన తనజీవితకాలము నాపట్టణమును శృంగారించుటలో వ్యయము చేసెను. పూర్వదేశరాజులలో ఘనుఁడైన "నబుచడ్నెజరు" క్రీ.పూ. సం. 520 రములో దివి కేగెను. అతనితో నారాజ్యము తేజోవిహీన మయ్యెను.

క్రీ. పూ. సం. 561-539 రవరకు చాల్డీయరాజ్యము యొక్క అవసాన దినములు :—

రాజు చనిపోయిన మఱి యాఱుసంవత్సరములకు "నాబోనిదాసుఁడు" రాజ్యము నేలుచుండెను; ఆతనికుమారుఁడు "బలేషజారుఁడు" యువరాజుగ నుండి రాజకీయవ్యవహారములఁ జూచుచుండెను. ఒకసంవత్సరమున కొకసంవత్సరము "మందులు, పారసీకుల" పోటు భరించ నశక్య మయ్యెను. వారు వారి రాజు "కైరసుతో" నీశాన్యమూలనుండి వచ్చి రాజ్యమును ముట్టుచుండిరి. "లిడియా" రాజ్యమును "చిన్నఆసియా" దేశము నతఁడు వశపరచుకొనెను. "ఐరోపా" ఖండములోని గ్రీకులను సహిత మతనిపేరు తెలియదు. వారుకూడ నతనికి భృత్యులయిరి. ఆసియాఖండములోని పర్వతకాంతార భూములలోనుండి "మందులు, పారసీకుల"తో నతఁడు దాడికి వచ్చెను.

క్రీ. పూ. సం. 539-రము బాబిలను నాశనము:—

ఈ సంవత్సరములో నతఁడు బాబిలను కుత్తరమున నున్న భూములను ముందు స్వాధీనముఁ జేసికొని ఆపట్టణముమీఁదికి వచ్చెను. ఆపట్టణము బలమైనది; దానిప్రాకారపుగోడలు దిట్టముగ కట్టఁబడెను; అది ముట్టడింపఁబడినప్పటికిని, దానికి నిలిచియుండును. అయినప్పటికిని దానిరాజు "నాబోనిదాసుఁడు" దానిని చతురంగబలములతో రక్షింపక విడిచిపెట్టెను. అతఁడా పట్టణములో నుండి లేచిపోయెను. దానిలో నతఁడు సైనికులనుంచక, దేశములోనున్న దేవతావిగ్రహములఁ దెప్పించి, వానితో దానిని నింపెను. కైరసు సైన్యములతో వచ్చుచుండ, చాల్డీయసైన్యములను నడిపించుకొని "బలేషజారుఁడు" ఎదురు నడచెను. కాలము సమీపించెను. చాల్డీయుల పోటులోఁ జాలు లేదు. వారిరాజు పట్టుబడెను; పట్టణద్వారములను తెఱచి వారు కైరసునకు స్వాగత మిచ్చిరి. ఏవిధమైన పోటు లేకుండ వారు స్వాధీనులయి విజయపాదాక్రాంతు లయిరి.

"బాబిలను పట్టణము నేలగ్రాలెను. దాని జెండాపడి పోయెను" అనుశబ్దము దశదిశలు నిండెను. ఒకదేశీయులనుండి మఱియొక దేశీయుల కీశుభవర్తమానము తంతివార్తవలె నడిచెను. ప్రాచీనమహారాజ్యములలో నొకటి నేఁడస్తంగతమయ్యెను.


4
పారశీక రాజ్యము
సిథియా
మాసిడోనియా
గ్రీసు
చిన్నఆశియా
మధ్యధరా సముద్రము
కైప్రసుదీవి
తురేను
మీడియా
హిమాలయపర్వతములు
బాబిలోనియాలేక బాబిలను
ఈరాను
ఈజిప్టు
అరేబియా
పెర్షియా
ఇండియా
సింధునది
నైలునది
అరేబియాసముద్రము

శ్రీ ర స్తు.

# మీడులు, పారశీకులు—వీరి దేశచరిత్రము.

## చతుర్థ ప్రకరణము.



### ఇరువదిమూఁడవఅధ్యాయము.

“మీడుల” రాజ్యమును పారసీకరాజ్యమును కలిపి చెప్పుచుందురు; కాని, దానిలో ‘మీడుల’ రాజ్యము ప్రాచీనమైనది. మీడులు కేవలము రాజసులు గాని సత్త్వగుణసంపన్నులు కారు. వారు క్షాత్రధర్మము ననలంబించుటచేత వారిచరిత్ర మన కంతగా తెలియదు. ‘మందులును’ ‘మీడులు’ నొకరేయని తలఁచి, మఱికొంతకాలమునకు గ్రీసులు వారిచరిత్రను వ్రాసిరి. ఈమందులు విచ్చలవిడిగ సంచరించు ‘శిథియను’ జాతివారు. ‘పారశీకసముద్రము’ నకును ‘కాస్పియను’ సముద్రమునకును మధ్యనున్న నాగరికులైన దేశీయులను వారు సాధించిరి. మీడుల రాజొకఁడు వారిని జయించినందున, వారతని సైన్యముతో నైక్యమయిరి; వారికి మందులనుపేరు పోయి మీడులను నామము వచ్చెను. మఱి కొంతకాలమునకు వారిలో నొకఁడు మీడులరాజయ్యెను. ఆరాజు ‘అస్త్యేయజీసుఁడు’ అతఁడు ప్రథమమున ‘బాబిలను’ మీదికి దండెత్తి వచ్చెను. అనంతరము ‘మీడుల’ దేశమును ‘పారశీకులు’ జయించిరి. వారిరాజ్యము వీరిదానిలో నైక్యమయ్యెను. ఇప్పుడు ‘మీడులకును’ పారశీకులకును, రాజు ‘కైరసు’ పుట్టుపూర్వోత్తరములలోఁగాని లేక గుణములలోగాని తారతమ్య మీరెండు తెగలవారికిని లేదు. మన మిప్పుడు ‘అఫ్గనిస్తానము,కురుదిస్తానము’అని పేరిడిన దేశములనే నాఁడు ‘ఈరాను’ దేశమని వారు పిలుచుచుండిరి. ఈరెండుతెగలవారు ‘ఈరాను’ దేశవాసులు.

ఈ "ఈరాను దేశములో" ననేకయుగముల క్రిందట మానవజాతిలో వారగు "ఆర్యకుటుంబము" వారు కాపుర ముండి, అనంతరము వారిలోఁ గొందఱు ఐరోపాఖండమునకుఁ బోయి ఆధునిక పాశ్చాత్యులకు మూలపురుషులయిరనియు, మఱికొందఱుపూర్వదిశకివచ్చి హిందువులకు మూలపురుషులయిరనియు, తదితరులు పారసీకుల వంశస్థాపకులనియు, మాక్షమూలరుఁడు మొదలగుపాశ్చాత్యుల మతమై యుండెను; కాని ఇటీవల పాశ్చాత్యశబ్దశాస్త్రజ్ఞులామతమును ఖండించి, ఆర్యుల ప్రథమనివాసస్థానము "ఐరోపా" ఖండములోనని చెప్పినసంగతులను ప్రథమకాండలో వివరించియుంటిమి.

ప్రథమమున పారశీకులు ప్రకృతిదేవతారాధకులు చాల్డీయులవలె భూతప్రేతపిశాచరాక్షసగణములఁ బూజింపక, వారు వానికంటె నెక్కుడగు దేవతలను శుద్ధాంతఃకరణతో నారాధించుచుండిరి. పారసీకులు మొదటను దేశసంచారులు; పశుపాలకులు; త్రాగుటకు నీటను, పశువులు మేయుటకు మంచిగడ్డియు — ఈ రెండు నెచటనుండిన వారాస్థలమునకు మందలను తోలుకొని పోవుచుందురు. వారికిస్థిరమైన నివేశనములైనను లేవు — ఈ కారణముల చేత (ద్యౌః = ఆకాశము), (తేజస్సు = సూర్యకాంతి), (అగ్ని = విద్యుచ్ఛక్తి), (పృథివి=భూమి), వాయువు, ఉదకము — వీనిని వారారాధించుచుండిరి. మతవిషయములో వారిబుద్ధి విజృంభించెను. గ్రీష్మకాలములో నంతరిక్షమున ఖండములు ఖండలుగఁ బోవు మేఘబృందములు గొఱ్ఱెలగుంపవలెనున్న వనియు, వీనిపాలు దాహము నెవిధమునఁ దీర్చునో, అటులనె వానిజలములు కూడ దాహముఁ బోగొట్టు ననియు వారుపమానమును దెచ్చుచుండిరి. మఱియొకప్పుడా మేఘములె జలములఁ దెచ్చుకన్యలతో వారు సరిపోల్చుట గలదు. నీటియెద్దడికలిగినపుడు, "గొఱ్ఱెలను రాక్షసులు దాఁచి వేసిరి; వారు కన్యలను పర్వతగుహలలోనుంచిరి;" అని వారు చెప్పుదురు. అప్పుడు వజ్రధరుఁడు వచ్చి విడిపించిన పైని, అవి వర్షించును.

"జోరాష్టరు" అను మహాపురుషుఁడు వారిమతాభిప్రాయములను సంగ్రహించి సంపుటీకరణముఁ జేసెను. అతని పుట్టుపూర్వోత్తరములు గాని,

అతని కాలము గాని మనకు స్పష్టముగ తెలియదు; కాని అతఁడు క్రీ. పూ. సం|| 1000 రము నాఁటివాఁ డని చెప్పుదురు. అతఁడు మహాజ్ఞాని; అతఁడు ప్రకృతిదేవత నారాధించినందున, నా మొకటాత్ముచేత నతనికిఁ బ్రకృతిరహస్యములు కొన్ని తెలిసెను. అతనికిఁ బ్రకృతిసూత్రములజ్ఞానము కలిగెను. అందఱు మహాపురుషులు వలె నతఁడు కూడ నతనికాలములో నెవరిచేతను మన్ననలం బడలేదు.

"ఏ దేశము వైపు తిరుగుదును? నే నచ్చటికిఁ బోదును? భృత్యులెవరు నన్ను మన్నించరు. క్షత్రియులగు భూపతులయినను నన్ను చేరరానీయరు. ఓ భగవంతుఁడా! ఓ స్వామి! నిన్ను నే నేవిధమున నారాధింపగలను? నేను నిరాశ్రయుఁడను" అని జొరాస్టరు తన గ్రంథమగు "అవేస్తాలో" వ్రాసెను. "నే నొక రాజుయొక్కయు రాణియొక్కయు ఆశ్రయమును సంపాదించితిని. వారి ప్రాపకమువలన నన్ను మతగురువుగఁ బ్రజలు భావించిరి" అని అతఁ డాగ్రంథములో మఱియొకసందర్భమునఁ జెప్పెను. నలుగురితోఁ గలియక, జీవితకాలము నతఁ డేకాంతముగఁ గడిపెను. అతఁ డొకపర్వతమునకుఁ బోయి అచట ఏకధ్యానమున నుండి, తన మతాభిప్రాయములను పరలోకచింతనలను వ్రాసెను. ప్రపంచములో నతని యవతారమును గుఱించి యొకముచ్చటగలదు. పూర్వకాలములో నొకసమయమున పశువుల కధిదేవత దేవతలయొద్దకుఁ బోయి "ఓ దేవతలారా! నా పశుగణములను మనుజులు బాధించుచున్నారు. వారి బారి నుండి వీనిని దప్పించు సాధనముఁ జూపుఁ" డని వేఁడెను. వారతనినిఁ జూచి "నీగణములను రక్షించుటకు నాథుఁడు లేఁడు. మనుజులకొఱకుఁ బాటుపడి, వారికి మాంసము నిచ్చుటకై నీగణములను సృజించితిమి" అని చెప్పిరి. అధిదేవత యామాటలను విని, "మనుజులలో నెవరైన నాగణములను రక్షించువారు లేరా?" అని యడిగి యేడ్వసాగెను. "మామాటలను విని వాని ప్రకారము నడచువాఁడు భూలోకములో నొకఁడు కలఁడు. వాఁడే జొరాస్టరు. వాని పలుకులు తేనెపలుకులు. వానియొద్దకు నీవు పొమ్ము" అని దేవతలు చెప్పిరి. అందు కధిదేవత సంతసింపక, "అయ్యో, నా కర్మము కాలిపోను! నాగణములఁ గాపాడుటకు నే నొక మహావీరు నొకని దయ

చేయు మని ప్రార్థింప, వీరరసములేనివీరుని విరసపు మాటలను విని సంతసింపు మని చెప్పెదరా ? నాగణములను రక్షించువాఁ డెన్నటికైన భూలోకములో నవతరించునా?” అనిదుఃఖించెను. ఇంతలో జోరాష్ట్ర రుద్భవించి, మనుజులను పశువులను తనమృదుమధురవాక్యములచేతరంజించెను.

అతఁడు వ్రాసినమతగ్రంథములు నశించినవి; కనుక వానిముఖ్యాభిప్రాయములను సంపూర్ణముగ చెప్పలేము ; కాని “జెంద-అవేస్త” అను మతగ్రంథమునుబట్టి మీడులు - పారసీకులమతమును గురించి కొంతవఱకుఁ జెప్పగలము ఈగ్రంథమును జోరాష్ట్రరు వ్రాసెను.

మనుజులమతము వారిదినచర్యల ననుసరించి యుండును. ‘మీడులును పారశీకులును,’ దేశసంచారులు. వారికి నిలుకడలేదు. బహిఃప్రదేశములే వారి నివేశనములు. అట్టివారు పంచభూతములు నారాధింతురు. సూర్యుని వారు పూజించిరి; దినకరుఁడు వారికి భగవంతుఁడు;అంధకారమును వారు రాక్షసునిగ భావించిరి. ‘అంతరిక్షమునను దినకరుఁడు దేవత. మూఁడులోకములు నతనికాంతిచేఁ బ్రకాశించును. అతనికిఁ జీఁకటి లేదు. నిత్యచింతామణిగృహమధ్యస్థుఁ డయిన ప్రభాకరుని సేవింపుమని జోరాష్ట్రరు వ్రాసెను. సూర్యుఁడు భగవంతుని నేత్రమనియు, అగ్ని అతని కుమారుఁడనియు వారు భావించిరి. జలములను వారు ప్రీతితోఁ జూచి పూజించిరి. సూర్యునితో సంబంధించిన ‘అరుణ’ దేవుని వారు మహాభక్తితోఁ గొలుచుచుండిరి.“అరుణుఁడు పచ్చికభూముల కధిదేవత. సూర్యోదయమున కతఁడు ముందువచ్చును; సూర్యుఁ డస్తమించిన తరువాత నతఁడు వెళ్లును. తనహిరణ్మయకాంతులతో నతఁడు పర్వతశిఖరముల నలంకరించును. సమస్తజంతుజాలముతో నిండి భూలోకముపై నతఁడు చల్లనిదృష్టులు వింధ్యవీథినుండి ప్రసరించును. పర్వతకాంతారములపై నేమి గంగాతరంగిణులపై నేమి—అంతట నతఁడు చల్లనికాంతులు వ్యాపించును” అని యాగ్రంథములో నున్నది.

గాఢాంధకారములో వచ్చి మనుజులను బాధించు రాత్రించరులను భగవంతుఁడు వధించి మనుజులను రక్షించును. ‘ఈహిరణ్మయుఁడైన పురుషుఁడు

తిమిరోన్మథనుఁడు, తెల్లని వసనముఁదొడిగి, తెల్లని అశ్వము నెక్కి, 'హిరణ్మయ కాంతు లొలుక, [illegible] తనఖడ్గముతో నతఁడు చంపును' అని సూర్యోపాసనమంత్రము కలదు. "నానృతం వదేత్" అని శాసనము కలదు. "మానుజుఁడు సత్యముఁ జెప్పవలెను; ఇతరులను హాసముఁ జేయరాదు; కృతఘ్నతఁ జూపరాదు. ఏపాపమును చేసినను భగవంతునికి రహస్యము లేదు. అన్నిసంగతులు అతనికిఁ దెలియును. మానుజుఁడు పాపముఁ జేసి, ఎచ్చటనుఁ బోఁగలఁడు?" అని వారి సిద్ధాంతము.

శాశ్వతానంతదీప్తిప్రభలతో వెలుగుచు దేవలోక ముదయపర్వతము మీఁదనుండును. "ఆలోకమున రాత్రిగాని, చీకటిగాని, లేదు; శీతోష్ణ వాయువులు లేవు; రోగముల భయము లేదు; మృత్యువన నేమో తెలియదు; మేఘములు లచటికిఁ రాఁజాలవు" అక్కొండకు చేరువను "వేనసముద్రము" కలదు. మేఘములు దానినీరుఁ ద్రాగి, మానవులను వర్షించును. [illegible] నేలలో "జీవవృక్షము" అనునది యున్నది; దానిసమీపమున మాఱియొకవృక్షము కలదు; ఇదియు భూలోకములోని సమస్తవృక్షములకు నాధారము.

అగ్ని భగవంతుని కుమారుఁడు గనుక సతతము వారు శ్రద్ధాభక్తులతో నారాధించిరి. ప్రతిగృహస్థు అవిచ్ఛిన్నాగ్నిహోత్రముల నుంచవలెను; వాని కింధనముల నిచ్చుచుండవలెను. రాత్రి మూఁడుపర్యాయములు లేచి, పాదములను హస్తములను జలముతోఁ గడిగి శుచియై, గృహస్థు వనస్పతిహోమముఁ జేయుచుండెను. సంఘాతముగ వారగ్నిహోత్రము నుంచి దేవాలయములో నగ్నిహోత్రమునద్దకుఁ బోయినపుఁ డర్చకుఁడు వస్త్రముతో నోరుమూసికొని పోయి సమిధలను హోమముఁ జేయును. వారి పురోహితులు "మాగీలు"— వీరికే మంత్రములు వచ్చును; దేశములో నెచ్చటఁ జూచినను వీరి ప్రభ ప్రసరించెను. రాజులు సహితము వీరిమాటలను శిరసావహించిరి.

మీడులును పారసీకులును చిదానందపురుషులు. వీరిబుద్ధికి మాంద్యము లేదు; ఆబుద్ధి భూమ్యాకాశములవఱకుఁ బ్రసరించెను. సంభాషణలో వారు సరసులు; సత్యముఁ దప్పనివారు; ధైర్యస్థైర్యములుఁ గలిగియుండిరి. కవచ

ములు లేకయె చిన్నచురకత్తులతో వారు పోరాడుచుందురు. గ్రీకులకు వీరి యందు మంచియభిప్రాయ ముండెను.

ఉపాధ్యాయుఁడు మూఁడుసంగతులఁ బ్రతిపారశీకబాలునకు నేర్పును; అశ్వారోహణము ధనుర్విద్య సత్యసంభాషణ. ఋణమునిచ్చుటగాని, పుచ్చుకొనుటగాని వారికిష్టములేదు. వస్తువులనిచ్చి పుచ్చుకొనుటలోఁ బీడించి బేరము వారు చేయరు. అతిథులను అభ్యాగతులను వారాదరించుచుండిరి; వారి సంభాషణ కపటము లేనిది, సందర్భము ననుసరించి శృంగారాదిరసములు వారి ముఖములమీఁద నొలుకుచుండును.

రాజునందు వారికిఁ బ్రేమాతిశయములు మెండు. అతని భ్రూభంగమునకు వారుభయపడి, అతనిమందహాసమునకు వారు సంతసింతురు. రాజు చీని-చీనాంబరములను ధరించెను. వాహనారూఢుఁడై రాజు సంచారమునకుఁ బోయినపుడు, అవరోహణాధిరోహణలకు గాను రత్నఖచితమైన పాదపీఠము నొకసేవకుఁడును, ఛత్రచామరములను మఱియొకరును, ధనుర్బాణముల నొకరును, అంబులపొది నొకరును పట్టుకొని ముందు నడుచుట గలదు. రాజభవనములు సకలభువనమోహనాకారములై రాజిల్లెను; నలువైపుల మహోన్నతప్రాకారములును, వానిమధ్య పాలశిలనిర్మితసౌధజాలంబులును, చిత్రవిచిత్రవితానములతోఁగూడిన కుడ్యములను, వానిసమీపమున నుపవనంబులును కలిగి, రాజనగరు శోభిల్లెను. అతనిపర్యంకమును వర్ణించుటకు వీలులేదు.

వారినిగుఱించిన సంగతులన్నియుఁ దెలియునుగాని, వారిస్త్రీలను గుఱించి మాత్రము మనకుఁ దెలియదు. వారిస్త్రీ లంతఃపురనివాసులుగాని, స్వేచ్ఛగ సంచరింపువారు కారు. స్త్రీలవిషయమై వారితోఁ బ్రశంసించుట తప్పు; సవారిలోఁ గూర్చుండి మార్గమున స్త్రీలు పోవుచున్నపుడు, పురుషుఁడు కనఁబడిన, వానికి శిరచ్ఛేద మగును. మనవి చేయకుండ రాజుసముఖమునకుఁ బోయినవానికిఁ గూడ శిరచ్ఛేద మగును. రాజశాసనములకుఁ దిరుగులేదు; వారి ధర్మశాసనములు శిలాక్షరములు; రాజానుగ్రహమునకుఁ గాని నిగ్రహమునకుఁ గాని ఫలములో లోపము లేదు. రాజు చనిపోయినపిదప, వాని శరీరముఁదగులఁ

బెట్టిన, పంచభూతములును కలుషముఁ బొందు ననితలఁచి, దానిని సమాధిఁ జేయుచుండిరి.

సంసారు లందఱు తమకుమారులకు విద్యను నేర్పుచుండిరి. ఐదుసంవత్సరములవయస్సుబాలునకు వచ్చినతోడనే, వానికి విద్యాభ్యాసముఁ జేయించి అదుపాజ్ఞలలో వానిని తండ్రి యుంచును; శీతోష్ణములను భరించి, నిద్రాహారములు లేకుండ, బాలుఁడు శ్రమపడవలెను; చేతిలోని ఖడ్గము దీయకుండ, నదిలో నీఁదుకొని పోయి వాఁడు గట్టునకుఁ జేరవలెను. పదునేను సంవత్సరములవయస్సున వాఁడు సైనికుఁడై, ఏఁబదిసంవత్సరముల వయస్సువచ్చువఱకు సైన్యములో నుండవలెను. వానిజీవనము సుఖజీవనము; చింతలేనిది. ఇటుల విద్యనభ్యసించుటచేత, వారు వీరు లయిరి. వారిపేరు వినిన గుండెల కదటు వచ్చును.

---

## ఇరువదినాల్గవ అధ్యాయము.

### పారసీకులపురాణకథ.

పారశీకదేశములోఁ దప్ప మఱియొకదేశములో నింతచిత్రమగు పురాణకథలు లేవు. ఈకథలలోఁ జరిత్రాంశములు విశేషముగ లేకపోయినను, వీని మూలమున వారి యాచారవ్యవహారములును, వారి గుణసంపదలును, వారి సాంఘికపుకట్టుదిట్టములను మనకుఁ దెలియును.

వారిపురాణకథలలోఁ జెప్పినప్రకారము ''కాయమర్సుఁ''డను వాఁడు పారసీకమహారాజ్యముఁ బూర్వకాలములో స్థాపించెను. అతఁడు సద్గుణసంపన్నుఁడు; సర్వజనమనోరంజకుఁడు; అందుచేత నతనిని దేశీయులు ''లోకాధిపతి'' యని బిరుదు నిచ్చిరి. వనమృగములు సహిత మతనికి పాదాక్రాంతులై

అతని యాజ్ఞను శిరసావహించెను. ఆశియాఖండములో నివసించు వనవాసులను స్వాధీనముఁ జేసికొనుట కతఁడు తర్లి వెళ్లినప్పుడు, రాజరక్షకులుగ నతని వెంబడి "మీసములవారును నామములవారును" వెళ్లిరి.

జమేషదుఁడు:—జమేషదుఁడు మఱికొంతకాలమునకుఁ బురాణకథానాయకుఁ డయ్యెను. అతఁడు చిరకాలము రాజ్యము నేలెను; రాజ్యారంభమున నతఁడు ప్రజలక్షేమముఁ గోరి శ్రమపడెను; లోహమును వాడుక చేయు విధమును వారికి నేర్పెను; పట్టు, దూది, రోమము—వీనితో బట్టలను నేయు విధమును చూపించెను. నాలుగుజాతులక్రింద మనుజుల నతఁడు విభజించెను: వైదికులు, క్షత్రియులు, వర్తకులు, కాపులు—నాల్గవజాతివారికి విశేషమర్యాద కలదు. "వారొకరికి భృత్యులు కారు; వారు శ్రమపడి, భూములను దున్ని, విత్తనములను జల్లి, పంటలను పండించుదురు; వారొకరికిఁ గీడుఁ జేయరు; వారి కష్టార్జితమునే వారనుభవింతురు. వారు ధరించు దుస్తులు సామాన్యమైనను, వారొకరి యాజ్ఞలకు బద్ధులు కారు; సత్సంభాషణను వారు చేయుదురు. దుస్సంభాషణ వారి చెవిని సోకదు, వారు స్వచ్ఛంద విహారులు. భూములను సాగుచేయుటయే వారి కులధర్మము. వారజాతశత్రులు, కలహశీలులు కారు" గృహముల నిర్మాణములో నిటికలను పాలశిలల నతఁడుపయోగించెను. అతఁడే నావలఁ గట్టించెను. అంతలో నతనికి గర్వము బలిసెను. తనకర్మమునకుఁ దానే కర్తయనియు, తనగొప్పతనమునకుఁ దానే కారణభూతుఁడ నని చెప్పి, అతఁడు వీరాలాపము లాడెను. అతని నాశనమున కదియె కారణ మయ్యెను. ఈగర్వముచేత నతని మనస్సు కలవరించెను. దుష్టచిత్తుఁడై మనుజులను క్షోభపెట్టినందున, వారు తిరుగఁబడిరి. ప్రజలు కుట్రలఁ బన్ని, అతనిని రాజ్యమునుండి తొలఁగించుటకై, పాశ్చాత్యదేశీయుల సహాయమును వారు కోరిరి. ఈపాశ్చాత్యు లశ్వారూఢులై బల్లెములఁ బట్టుకొని తమ నాయకుఁడు "జోహాకు" అనువానితో దండెత్తివచ్చి, యుద్ధములో రాజు నోడించిరి. రాజు దేశపరారీ యయ్యెను. జోహాకు సింహాసనము నెక్కెను.

ఈరాజు దుర్మార్గుఁడు. సైతానునకు భృత్యుఁడు. ఒకానొకప్పుడు భృత్యుని వేషము వేసికొని, జోహాకు వద్దకు సైతానువచ్చి "నేను నీభుజములను ముద్దు పెట్టుకొని నీ నేత్రములను స్పృశించుట కనుమతి దయచేయుము" మని వేఁడ 'జోహాకు' అందుల కంగీకరించెను. వాఁడు జోహాకుభుజములను స్పృశించినది మొదలు వానిలోనుండి రెండు త్రాచుపాములు తమనాలుకలను గీటుచు పైకి వచ్చుచుండును. వాని బారినుండి తప్పించుకొనుటకు మార్గ మతనికిఁ గనఁబడలేదు. ఇంద్రజాలకుని వేషము వేసికొని సైతాను అతని వద్దకు వచ్చి ప్రతిదినము నీవు వానికిరువురు మనుజులను బలియిచ్చినఁ గొన్నిదినములకవి చనిపోవు" నని చెప్పి పోయెను. ఆప్రకారము అతఁడు ప్రతిరోజు నిరువురినిఁ జంపుచుండెను. జమేషదునికంటె నితఁడు రెండింతలు క్రూరచిత్తుఁడైనందున జనులు ఘోషపెట్టుచుండిరి. జోహాకునితోఁ గూడవచ్చినపాశ్చాత్యులు అసీరియనులయియుండురు. వీరు మిక్కిలిఁ క్రూరచిత్తులై దేశములను జయించి, నరహత్యను వెఱవకుండిరి. వారిదౌర్జన్యమును విశదపఱచుటకై, పారసీకులు పురాణకథను కల్పించిరి.

చాలాకాలము క్రిందట మృతినొందిన జమేషదునకు వనవాసములో నొకపౌత్రుఁడు జనించెను. వానిపేరు "ఫరిదనుఁడు" అతఁడు జననమొందు సమయమునను, "ఎవరో పరాక్రమశాలియైన రాకుమారుఁ డొకఁడు వచ్చి తన్ను రాజ్యభ్రష్టునిఁ జేసి, తనను సంకెళ్లను వేయించి పర్వతముమీఁద విడిచి పెట్టు" నని జోహాకు స్వప్నముఁ గనెను. ఇతఁడు భయపడి, దేశములోనుండి రాకుమారులను వెదకించెను. ఈసంగతిని విని, ఫరిదనుని తల్లి తనపసిబాలుని చంకఁబెట్టుకొని, యొకవనములో దాగియుండెను. అచ్చటనుండిన సమయమున, "పరమాయా" అనునొక కామధేను వాబాలునికిఁ దనపాలనిచ్చి పెంచెను. ఈవనములో నాబాలుఁడు పెరుగుచున్న సంగతి రాజునకుఁ దెలియ, బాలుని దీసికొని అతనితల్లి "ఎల్బురజు" పర్వతములకుఁ బోయెను. ఈపర్వతములలో నాబాలుఁడు దినదిన ప్రవర్ధమానుండై, నానాటికి వయోవంతుఁ డయ్యెను.

తనపుట్టుపూర్వోత్తరముల నతఁడు కొందఱునాయకులతోఁ జెప్పెను. ఇంతలోఁ బ్రజలు తిరుగఁబడుదురని భయపడి, సామంతులను మంత్రులను మొదలగువారిని, రప్పించి "నేను రాజ్యమును మీకనుకూలముగ పరిపాలించితి ననియు, నేను సద్గుణవంతుఁడ ననియు,మీరొకపత్రమును వ్రాసి, సంతకములఁ జేసి, నాకియ్యవలె"నని వారికి జోహాకు ఆజ్ఞచేసెను. వారతనికి భయపడినవారై, ఆప్రకార మతనికిఁ బత్రమును వ్రాసియిచ్చిరి. "కావాయి" అను వడ్లంగి యొకఁడుండెను; వానికిఁ బదియార్గురు కుమారు లుండిరి; వారినందఱిని రాజు తన పాములకు హారముఁ బెట్టెను; నేఁడు వాని పసిబాలునిఁ జంపుటకు రాజు సిద్ధపడెను. అప్పుడు వడ్లంగి రాజుసముఖమునకుఁ బోయి, అనేక విధముల నతనిని వేఁడి కుమారుని రక్షింపు మనిప్రార్థించెను. అందుకు రాజు "నీవు పత్రమును సంతకముఁ జేసి యిచ్చిన,నేను సంతసించి రక్షించెద" ననిచెప్ప, వాఁడాపత్రమును చూచి, "ఓరాజా; నీవు దుర్మార్గుఁడవు. నీమంత్రులు పిఱికిపందలు. నేను పత్రముపైని సంతకముఁజేయను" అని నిర్భయముగ మాటలాడి రాజుచూచుచుండ, వాఁడాపత్రమును చించివేసెను. వెంటనె జనులందఱు తిరుగఁబడిరి. వారికి నాథుఁడు లేఁడు. వారు "కావాయి"ని వెంటఁబెట్టుకొని, "ఫరదను"ని నివాసమునకుఁ బోయి,అతనిని రాజుగ నియోగించుకొనిరి. అతఁడందులకు సంతసించి, గోముఖాకారముగల గదను ధరించి, సైన్యములతో వచ్చి "బాను" పట్టణమును ముట్టడించి, రాజనగరులోఁ బ్రవేశించెను. జోహాకు మాత్రము నగరును విడిచి,ఇంద్రజాలకులతోఁ గూడి మంత్రాలోచనలఁ జేసి, వచ్చునంతలో నతనిసైన్యములు పరాభవముఁ బొందెను. పట్టణమంతయు శత్రువులకు వశమయ్యెను తనతాతతండ్రుల ఋణముఁదీర్చుకొనుటకు, ఫరదనుఁడు వానికి సంకెళ్లనువేసి, "దమవెండు" పర్వతశిఖరమునకుఁ దీసికొనిపోయి, వాని నొకబండరాతికి మేకులతో దిగఁగొట్టించి విడిచిపెట్టెను. ఈప్రకారము జోహాకును వధించి ఫరదనుఁడు రాజ్యమునకువచ్చెను.

ఫరదనుని ముగ్గురుకుమారు లేవిధమున "ఈమను" దేశరాజు కుమార్తెలను వివాహమాడిరో, ఆకథ వినఁదగినది; ఆకథ నిచట నుదహరించుటకు సమయము కాదు. మఱికొంతకాలమునకుఁ ఫరదనుఁడు ముదుసలివాఁడై, కాలముసమీపించినదని గ్రహించి, తనరాజ్యమును తనముగ్గురు కుమారులకు విభజించి, వారి కిచ్చెను; "సాలీము" అను జ్యేష్ఠపుత్రునకుఁ బశ్చిమదేశమును, "తూరు" అను ద్వితీయునకుఁ బూర్వదేశమును, "ఈరెడ్జు" అను కనిష్ఠునకుఁ బారసీకదేశమును పంచియిచ్చెను. జ్యేష్ఠు లిరువురును కనిష్ఠునిఁజూచి కొఱకొఱ లాడుచుండి, వాని నేవిధముననైన రాజ్యమునుండి తొలఁగింపవలసిన దని మనవి చేయుమని వారొక రాయబారిని రాజునొద్దకుఁ బంపిరి. అటుల రాజు చేయనియెడల, వారు తండ్రిపైకి దండెత్తుటకు సిద్ధపడి యుండిరి. ఆరాయబారి మాటలను విని కోపించి తనకుమారుఁడు "ఈరెడ్జు"ను సైన్యముతో వారి మీఁదికిఁ బంపెను. ఇతఁడు పరమశాంతుఁడు; అన్నలతో వైరించుట కిష్టము లేదు; సామోపాయముల చేత వ్యవహరించుట కితఁడు కోరెను; ఆప్రకారము వ్యవహారమును పొత్తుపఱచుటకు, ఈరెడ్జు నిరాయుధుఁడై పాదచారియై, వారి యొద్దకుఁ బోయి 'ఓ యన్నలారా, మీ కనేకవందనముల చేసెద. మనలో మనకు వైరము కూడదు. నారాజ్యమును కూడ మీరేయుంచుకొనుఁడు. నేను వనములకుఁ బోయెద. ఈచతురంగబలముల నాశనమునకు నేనియ్యకొన''యని చెప్పి ప్రార్థించెను. ఆసత్వగుణసంపన్నుని మృదుమధురవాక్యములను రెండుసైన్యములవారామోదించి అతనిని నుతించిరి. ఇట్టి సర్వజనరంజకుఁడైనతమ్ముఁడు జీవించి యుండిన తమకుఁ గీడు వాటిల్లు నని జ్యేష్ఠు లిరువురును భయపడి, తమ్ముని తప్పపాటుగా వధించిరి. అంతటితో వారికిఁ దృప్తి లేకపోయెను. వారాశిరస్సును తైలద్రోణిలో నుండి, దాని నొకబంగారుపెట్టెలోఁ బెట్టి, తమ తండ్రికి దానినిఁ బంపిరి. "గర్భశోకము భరింపుట కశక్యము"—తండ్రికి వృద్ధాప్యములో నికష్టము వచ్చెను. "హాకుమారా, హాకుమారా" అని నేలఁబడి తండ్రి విలపించి విలపించి మూర్ఛిల్లెను. ఈదుఃఖమునకుఁ దరి కానరాదు. ఇటుల రాత్రింబవళ్లు నిద్రాహారములు లేక శోకించుచున్న ఫరదనునివద్దకు భృత్యులు వచ్చి "మహాప్రభూ, ఏలినవారు దాసులమని విని మన్నింపవలెను. ఈరెడ్జు

యొక్క ధర్మపత్ని నేఁడు సుఖప్రసవమై మగశిశువును కనెను. తమరు శాంతింపుఁడు''అని వేఁడి శుభవర్తమానముఁ జెప్పిరి. పౌత్రుని జననమునకు వృద్ధరాజు సంతసించి, వానిని తనకుమారునివలె భావించి వానికి ''మినోచరుఁడ''ని నామకరణముఁ జేసెను. అనంతర మాపితామహుఁడు దేహముఁ జాలించి స్వర్గస్థుఁ డయ్యెను.

శుక్లపక్షములో బాలచంద్రునివలె నాబాలుఁడు ''మినోచరుఁడు'' వర్ధిల్లెను. అంతకంత కాబాలునకు యౌవనప్రాదుర్భావ మయ్యెను. తన పెత్తండ్రులు తనతండ్రిని చంపినవిధమున కతఁడు రోసి పగను సాధించుటకై సైన్యములతో వారిమీఁదికిఁ బోయి, యుద్ధములో నతఁడు వారిని చంపెను. సత్వగుణసంపన్నులయిన తనతాతతండ్రులు చనిపోయినను, వినయపూర్వకముగ వారినామములను భక్తితో మనుజులు స్మరించుచుండుటచేత, నతఁడు కూడ సత్ప్రవర్తనుఁడై వారిగౌరవమును నిలువఁబెట్టెను. ''ఘరదనుఁడు దేవుఁడు కాఁడు. అతని శరీరము కూడ మాంసాస్థికలతోఁ గూడినది గాని, కస్తూరికాగరుచందనములతోఁ గూడినది కాదు. సత్యమును న్యాయమును విడువక, రాజ్యము నతఁ డేలినందున, నతనికిఁ గీర్తివచ్చెను. ఆమార్గము ననుసరించి నీవు సంచరింపుము''ని కవులు చెప్పిరి.

''మినోచరుని'' కాలములో, సాము'' అను వీరుఁడు. కలఁడు అనేక సంవత్సరములుఁ భగవంతునిఁ బ్రార్థింప, వానికటాక్షముననా ''సాము'' నకు రూపవంతుఁ డగు కుమారుఁ డొకఁడు పుట్టెను. ఆకుమారుఁడు నవమన్మథాకారుఁడైనను, తెల్లనిశిరోజములు గలిగి యుండెను. తెల్లనికంటిపాపలతోను తెల్లనిశిరోజములతో నెవఁడైన పుట్టిన, వానిమూలమునఁ గీడుమూడు నని పారశీకులలో నొక పిచ్చినమ్మకము కలదు. అందుచేత, వానితండ్రి భయపడి, ''ఎల్బర్జు''పర్వతశిఖరముమీఁద నాబాలుని విడిచిపెట్టెను. ఒకపక్షి ఆబాలునిఁ జూచి, వానిని దనగూఁడునకుఁ దీసికొని పోయి పెంచెను. ఆబాలుఁ డచ్చటఁ బెరిగి పెద్దవాఁ డయ్యెను. కుమారునినిమిత్తము తండ్రి దుఃఖించుచుండ, వాఁడు

సజీవుఁడై, యొకపక్షి గూఁడులో నుండెనని ఆతని కొకస్వప్నము వచ్చెను. అమఱుచటిదిన మతఁడుపర్వతమునకుఁ బోయి నలువైపుల శోధించి, గూడులోఁ దనకుమారుని జూచెను. పూర్ణచంద్రునివలె రూపలావణ్యములతోఁ బ్రకాశించుచున్నకుమారునివెంటఁ దీసికొని గృహమునకు వచ్చి, వాని కతఁడు 'తాలుఁడు' అని నామకరణముఁ జేసెను. ఈ 'తాలుఁడు' 'కాబూలు' పట్టణరాజకన్యను వివాహమాడెను; వారికుమారుఁడు ప్రసిద్ధికెక్కిన 'రస్తుము' అనుజగదేకవీరుఁడు. 'తాలుని' వివాహమూలమున 'పారసీక-కాబూలు' రాజ్యములకుఁ దత్కాలమైత్రి వచ్చెను. అర్జునుఁడు, కార్తవీర్యుఁడు, మొదలగువారివలె 'రస్తుము'మహోద్దండపరాక్రమశాలి.

రస్తుము:—నాటి 'తూరాను' దేశమునకు నేఁడు 'టార్టరి' అని పేరు కలదు. మినోచరునికాలములోఁ బారసీకమునకును 'తూరాను'కును వైరము పొసగి నందున, నీదేశపురాజు 'అఫ్రాసియాబు' మాతృదేశమగు పారసీకముతోఁ బోరాడుచుండెను. ఈపోరాటములలో 'రస్తుము'యొక్క పరాక్రమము లోకవెల్లడి యయ్యెను. 'తూరాను' దేశములోని సీపెంచను పట్టణమును 'రస్తుము' ముట్టడించెను. ఒక్కొక్కసైనికుని ఒక్కొక్కసంచిలో వేసికట్టి ఆసంచులను లొట్టియలమీఁదను వేయించి 'రస్తుము' వర్తకునివలె, వానితో నాపట్టణములోఁ బ్రవేశించెను. పురజను లతనిఁజూచి, ఉష్ట్రవర్తకుఁ డని తలఁచి యూరకుండిరి. రాత్రి నిశ్శబ్దముగ నుండినసమయమున,నతఁడు సంచులను విప్పి, సైనికులతోఁ బోయి, శత్రువులఁబరిమార్చి పట్టణముఁ బట్టుకొనెను. మినోచరుఁడు చనిపోయినతరువాత నొకబాలుఁడు సింహాసనముమీఁద నుండు సమయముఁ జూచుకొని, అఫ్రాసియాబు మఱల దండెత్తి వచ్చెను. ఇప్పుడు తాలుఁడు వాని నోడించెను. వాఁడు దేశమునకుఁ బాఱిపోయి, మరల దండెత్తి వచ్చెను. రస్తుమునొద్ద "రక్షు"అను శ్వేతాశ్వ మొకటి యుండెను; దానితల్లితోఁ బోరాడి, దాని నతఁడు సంపాదించెను. ఆశ్వేతాశ్వము నెక్కి, రస్తుము యుద్ధమునకు నడిచెను. ఉభయసైన్యములు తారొక్కని పోరాడెను. శత్రుసైన్యముల

నోడించి, రస్తుము "ఆఫ్రాసియాబు"ని పట్టుకొనెను. అనంతరము రెండురాజ్యములవారు సంధిఁజేసికొని తత్కాలమిత్రు లయిరి.

మఱికొంతకాలమునకు "కైకసుఁడ"నువాఁడు పారశీకమునకు రాజయ్యెను. సిరియాదేశపురాజు భృత్యుఁడైనను, కైకసునిమీఁదఁ దిరుగఁబడెను. రస్తుము వానిని లొంగదీసెను. అనంతరము రాజు సంతసించి "సౌదాభాయి" అను సిరియారాజకన్యను వివాహమాడఁ దలచి, ఆమె తండ్రికి వర్తమానముఁ బంపెను. సిరియారాజు తనకుమార్తె నతనికిచ్చి వివాహముఁ జేయుట కష్టము లేకపోయినను, ఆమాట నతనితో ధారాళముగ చెప్పలేక, ఏవిధముననైన వివాహముఁ దప్పించుటకు యత్నించి, కైకసుని విందునకుఁ బిలిచెను. అతఁడు పరిజనములతోఁ గూడి విందారగించుచుండ, సిరియను సైనికులు నిరాయుధులైన వారిమీఁదఁ బడి, వారిని గట్టితీసికొని పోయి అభేద్య మగు దుర్గములోఁ బడద్రోసిరి. తండ్రిచేసిన కుట్రకు "సౌదాభాయి" కోపగించినందున, నామెను కూడ దుర్గములో నతఁడు పెట్టించెను. అతఁడు "రస్తుము"యొక్క పరాక్రమమును మఱచెను. కైకసుని పరివారముతోఁ గూడ విడిచిపెట్టుమని రస్తుము సిరియారాజునకు వర్తమానముఁబంపెను: కాని ఆరాజు వారిని విడిచిపెట్టలేదు. అప్పుడు రస్తుము సైనికులను నావలలో నెక్కించి వారితో సముద్రము మీఁదఁ బోయి, సిరియాదేశములో దిగి రాజధానిమీఁదికి దండెత్తిపోయెను. "ఈజిప్టు, బార్బరి" దేశముల రాజుల సహాయముఁ దీసికొని, వారితోఁ గూడ సిరియారాజు యుద్ధమునకు నడిచెను. విద్యుచ్ఛక్తితోఁ గూడిన రెండుకాఱుమేఘములు లంతరిక్షమున నిరుప్రక్కలనుండి పరస్పరప్రేరితములై వచ్చి గుభిల్లున తాఁకు విధమున, రెండు సైన్యములవారు దండనాయకులచేత నుత్సాహింపఁబడి వీటుబీరమునఁ దలపడిరి. రస్తుము జయము నొందెను. కైకసుఁడు చెఱసాలనుండి విడువఁబడి, సౌదాభాయిని వివాహ మాడెను. పారశీకులకును "కాబూలు" రాజు ఆఫ్రాసియాబునకును యుద్ధము సంభవించెను; అప్పుడు సిరియను సైనికులు పారసీకులతోఁ గలిసి యుద్ధమునకు నడచిరి. ఆఫ్రాసియాబునకు సింహాసనమును విడుచుట కిష్టములేకపోయినను, రస్తుము ఆతనిని నిరోధించి

రాజ్యభ్రష్టుని జేసెను. అనంతరము రాజ్యములోఁ గొంతకాలమువఱకు స్వాస్థ్యముండెను.

రుస్తుము—అతని కుమారుఁడు సొరాబు:—ఒకానొకప్పుడు రాజ్యములో నొకభాగమునుండి మఱియొకభాగమునకుఁ బోవుటకు మార్గములు లేవు. మార్గములుండినను, వానిగుండఁ బోవుటకు భయము పుట్టును. ఆకాలములో రెండుసైన్యములవారు పోరాడక ఏపక్షమువా రాపక్షమున కొక వీరుని నియమించుకొని, ఆవీరు లిరువురు పోరాడుచుండిరి; వీరిలో నెవరు జయించిన, వానిపక్షమువారు విజయులు. భృత్యవర్గములోఁ జేరిన 'టార్తరి' దేశపు రాజకన్యను రుస్తుము వివాహ మాడెను. వధూవరులు కేళీవినోదములలో నుండ, పారసీక దేశమునుండి వర్తమానము వచ్చినందున, నతఁడామెను విడిచి పోవలసి వచ్చెను. అప్పుడతఁడు కేళీగృహములోనికిఁ బోయి, అర్ధాంగినిఁ జూచి 'ఓబాలా, నాకు వియోగకాలము వచ్చెను నిన్ను విడిచి దేశమునకుఁ బోవలెను. నీవు దుఃఖింపకుము, శీఘ్రములో వచ్చెద. ఈదండకడియమును భద్రము చేయుము. నీకు కుమారుఁడు కలిగి, నేను వచ్చులోపల వాఁడు పెద్దవాఁడైనయెడల, వానిచేతి కీకడియమును తగిలించి, వాని నావద్దకుఁ బంపుము, లేక, కుమార్తె కలిగిన యెడల, దీనిని నీవు దానికి శిరోభూషణముగ నుపయోగింపు' మని ఆమెతోఁ జెప్పి, ఆమెచెక్కిళ్లను నొక్కి శిరస్సునాఘ్రాణించి రుస్తుము బయలువెడలి స్వదేశమునకు వచ్చెను. మఱికొన్నిదినములకతని భార్య మగశిశువుని సుఖప్రసవ మాయెను. ఆశిశువు చిఱునగవు మోముకలవాఁడు; కాన వానికి 'సొరాబు' అని నామమిడిరి. మందహాసుఁడైన 'సొరాబు' అని వానికి పేరు వచ్చెను.

కుమారుఁడు పుట్టెనని వర్తమానముఁ బంపిన, తండ్రి వానిని రప్పించి అతనివలె వానినికూడ శస్త్రవిద్య నభ్యసింప చేయునని భయపడి కుమార్తె కలిగెనని భర్తకు జాబును వ్రాసి భార్య పంపెను. ఆనాటి కానాఁడు కుమారుఁడు పెరిగి పుష్టిచేసి బలిసెను; అతనికి యౌవనము వచ్చెను; అతనిపుట్టుపూర్వోక్తములను దాచిపెట్టక, తండ్రి సంగతియంతయు కుమారునితో నామె చెప్పెను.

అందుపై నతఁడు తండ్రి సమీపమునకుఁ బోవుటను నిశ్చయించి, "ఓతల్లీ, అతఁడు నాతండ్రి; కనుక, నేనతనికి సహాయముఁ జేయవలెను. అతఁడు పారసీకదేశమునకు రాజగును; మేమిరువురము కలిసి రాజ్య మేలెదము. నాకు సెలవు నిమ్ము" అని తల్లిని ప్రార్థించి అతఁడు ప్రయాణోన్ముఖుఁ డయ్యెను——అతని ముఖ్యోద్దేశమును కనిపెట్టి, కాబూలురాజు, అఫ్రాసియాబు, అతనిని రప్పించి, "ఓయి, వీరకుమారా, ఒంటరిగ నీవు వెళ్లుటకంటె, సైన్యములతోఁ బోయి, పారసీకపట్టణములను నీవు ముట్టడించిన, నీమీఁదికి నీతండ్రి దండెత్తి వచ్చును. అప్పుడు మీరు సమావేశమై, మీసంగతిని తెలుపుకొనుఁడు' అని చెప్పి, అతని వెంట సైన్యములఁ బంపెను. ఈమూలమున వారిరువురకు వైరము పుట్టి, ఒకరి నొకరు చంపుకొనుదురు; వారు చనిపోయిన పారసీకదేశమును సాధించుటకుఁ దనకుఁ వీలుపడు నని అఫ్రాసియాబు తలంచెను.

తండ్రి గుఱుతుగ నిచ్చిన కడియమును ధరించి సైన్యముతో శత్రువుల దేశమునకుఁ బోయి, "ధవళదుర్గము"ను సోరాబు ముట్టడించెను.

ఆపాదమస్తకపర్యంతము కవచమును ధరించి శత్రుపక్షములోని వీరుఁ డొకఁడు వచ్చి, సోరాబుతోఁ దిట్టముగఁ బోరాడెను. తుదకు సోరాబు వానిని జయించి పట్టుకొని, వానిశిరస్కకవచమును తీసివేసి చూచెను. ఆదుర్గాధ్యక్షుని కుమార్తె "గుర్దాఫరిద". ఆవీరుని వేషమును వేసికొని అతనితోఁ బోరాడెను. అతనిఁ జూచి "ఓయి రాకుమారా, నీవు నన్ను విడిచిపెట్టిన దుర్గమును నీకు స్వాధీనముఁ జేసెద" అని ఆమె చెప్పి, అతనికి నమ్మకముఁ బుట్టించెను. ఆమోహనాంగి రూపరేఖావిలాసములకుఁ బరవశుఁడై, ఆమెమాటలను మెత్తపడిన చిత్తము కలవాఁడై, తత్తరపడి ఆమె నతఁడు విడిచెను. ఆమెత్వరితగతిని దుర్గములోనికిఁ బోయి, దుర్గమును దిట్టపఱచి, దానిబురుజులమీఁద నెక్కి "ఓయి రాకుమారా, రస్తము వచ్చుచున్నాఁడు. నీబీరములను మానుము. పోరాటములో నీపాటవమున నతఁడు పొడిచి నిన్ను చంపును" అనిసోరాబు వినుచుండ ఘోషించి, ఆమె లోపలికిఁ బోయెను.

ఇంతలో రస్తుము సైన్యములతోఁ బోయి, సోరాబున కెదురుగ శిబిరములను వేయించి నిలిచెను. అంతకుపూర్వము సోరాబు ధవళదుర్గమును సాధించి దానిలోఁ బ్రవేశించియుండెను. అప్పుడు రస్తుము తురుష్కుని వేషమును ధరించి, శత్రువులలోఁగుట్టులఁ దెలిసికొనుటకై, దుర్గమునకుఁ బోయెను. హజారద్వారము నద్ద చీఁకటిలో నతఁడు నిలుచఁబడి, లోపల జరుగుచుండిన కేళీవినోదములఁ జూచుచుండెను. హజారములో నొకయున్నతాసనముపైని సోరాబు కూర్చుండియుండెను. అతనిని పరివేష్టించి దండనాయకులుచితాసనముల నలంకరించిరి. గాయకులు గానముఁ జేయుచుండ, వారు ద్రాక్షరసము పానంబుతో నాస్వాదించుచుండిరి. రసములోనికి వెళ్ల, సరసము బయటకు వచ్చెను. ద్వారమునద్ద చీఁకటిలో నిలుచుండిన మహోన్నతవిగ్రహమును దూరమునుండి చూచి, సోరాబుయొక్క మేనమామ వింగులోనుండి లేచి వచ్చి "ఇచటనిలిచియున్న మీరెవరు?" అని రస్తుము నుద్దేశించి పలికెను. అందు కతఁడు ప్రత్యుత్తర మియ్యక, వాని నొక ప్రేటున నేలఁగూల్చి, తనశిబిరముఁ జేరెను. వాని మరణమునకు సోరాబును సైనికులును దుఃఖించి, మఱుచటిదినమున యుద్ధమునకు సన్నద్ధులై వ్యూహముఁ బన్ని నడచిరి. శత్రుసైన్యములు రెండును హోరాహోరమని పోరాడెను; పారసీకసైన్యములు వీరధాటికి నిలువలేక పికాపికలై చెదర పోయెను. అప్పుడు పారసీకరాజు "కైకసుఁడు" రస్తుమును పిలిచి, "నీవుపోయి వారిలో నొకవీరునితోఁ బోరాడినఁగాని మనకు జయముకలుగదు. నీవువెళ్లు" మని చెప్పి, రస్తుమునుపంపెను. పారసీకుల జెండాను పట్టుకొని సైనికులు నడుచుచుండ, రస్తుము తనశ్వేతాశ్వము నెక్కి యుద్ధమునకుఁగదిలెను. అప్పు డతఁడు వచ్చి, సోరాబును ఎగదిగఁజూచెను; వాఁడుకూడ నతనిని దేఱిఁజూచి చూచి, అతనిమహోన్నతవిగ్రహమునకును అతని ధవళమగుశిరోజములకు నబ్బురపడి, "ఓయి, నీమనస్సాక్షిగ సత్యమును చెప్పుము—నీపేరు రస్తుముకాదా" అని వాఁడతనినిఁ బ్రశ్నచేసెను. తాను రస్తుము అని వానితోఁజెప్పిన, వాఁడు తనతో యుద్ధము మాని, వాఁడుస్వదేశమునకుఁ బోయి ప్రగల్భములఁ బలుకు

నని యెంచి, "ఓయి, వీరుఁడా, నాపేరు రస్తుము అయిన నేమి కాకపోయిన నేమి? నీవు నాతోఁ బోరాడుము"ని తర్జించి, వానితో నతఁడు కలహించెను. అశ్వారూఢులై, ఖడ్గములనుధరించి, తండ్రికుమారు లిరువురును వెనుక దీయక రెండుమదగజములవలెఁ జార్కొనిరి. సొరాబుకాలములోనివాఁడు; రస్తుము కాలము మించినవాఁడు గనుక,వానిపోటులకు సొమ్మసిల్లి,అశ్వముమీఁద నుండి నేలఁగూలెను. "కన్నెఱఁగింపక పోయినను, కడుపెఱఁగింపుము."అతనితోఁ బోట్లాడుచుండినను, వానిమనస్సు కాఠిన్యమును సహింపక మెత్తపడుచుండెను. అతఁడు నేలఁగూలిన తక్షణము వాఁడు వచ్చి, "ఓయివీరాగ్రగణ్యా, ఇఁకనైన నీపేరు చెప్పుము" అని అతనిని వేఁడెను. నేలఁగూలిన రస్తుము లేచి, కోపముచేత శరీరము కంపింప, అశ్వము నధిష్ఠించి, సొరాబును యుద్ధమునకుఁ బిలిచెను. తండ్రికుమారు లిరువురు కలహమునకు మరల సిద్ధపడిరి. వారశ్వముల నెక్కి ఎదురు నడచిరి. ప్రతికూలవాయువులు వీచెను; భూమి కంపించెను;నక్షత్రములు తెగిపడెను;సూర్యమండలము వెలవెలఁ బోయెను;అతని శ్వేతాశ్వము "రక్ష" కన్నీరు విడిచెను—బల్లెమును సూటిగ నుంచి, "రస్తుము,రస్తుము" అని కేకవేయుచు తనతురగమును పరుగెత్తించి అతఁడు వచ్చెను "రస్తుము, రస్తుము" అను కేకను విని కుమారుఁడు దాల్కత్తులను జాఱవిడిచి నిరాయుధుఁడై అశ్వముమీఁద నుండెను. అప్పుడు గుఱ్ఱము పరుగెత్తి వచ్చినందున, నతని బల్లెము కుమారుని దేహములోఁ గ్రుచ్చుకొనిపోయెను.తక్షణము సొరాబు నేలఁగూలి ఆమోహనాంగివచనము ప్రకారము నున్న నా తండ్రి చంపెనని పలికి మూర్ఛిల్లెను. మూర్ఛదేరి కంఠగతప్రాణుఁడై యుండిన కుమారునిఁ జూచి రస్తుమునకు కుమారులు లేరు; నీవెవని కుమారుఁడవు? అని రస్తుము వాని నడిగెను. అప్పుడు సొరాబు "నేను రస్తుము కుమారుఁడను. నా తండ్రి నాతల్లి కిచ్చిన యీకడియమే ఆనవాలు" అని చెప్పి, కడియము నిచ్చి తనప్రాణములను విడిచెను. సూర్యుఁ డస్తమించెను. ఇటు లుభయసైన్యముల మధ్యఁ బడియుండిన వీరకుమారరత్నముఁ జూచి రస్తుము ఏడ్వసాగెను.అప్పుడు

వారు వచ్చి అతనికి దుఃఖోపశమనముఁ జేసిరి. అతని సెలవు ప్రకారము టార్తరి దేశసైన్యములు పారసీకుల పోటులేక స్వదేశమునకుఁ బోయిరి.

కైకసునికుమారుఁడు "కాంబేశీశుఁడు"—రస్తుము చేత నితఁడు శిక్షితుఁడై అస్త్రవిద్యలో నారితేరెను. టార్తరి దేశపురాజు, అఫ్రాసియాబు, పారసీకము పైకి దండెత్తి వచ్చినపుడు, అతని మీదికి రస్తుముతో నితనిని తండ్రి పంపెను.

అపుడు గురుశిష్యు లిరువురు టార్తరిసైన్యములఁ బాఱదోలి, 'బాబు' అను వారి ముఖ్యపట్టణమును ముట్టడించిరి. అంతట అఫ్రాసియాబు వారితో సంధిఁ జేసికొనుటకు వచ్చి, ముందుకు వారితో యుద్ధముఁ జేయ నని చెప్పి, నూర్గురు సామంతులను జామీనుగ నిచ్చెను. అందుకు కైకసుఁడు కోపగించి, వారిరువురిని రప్పించి, 'టార్తరి' దేశమును సాధించి, దానిరాజు, అఫ్రాసియాబును చంపు మని మిమ్ములను పంపితిని గాని, వారితోసంధిఁ జేసికొనుటకు మిమ్ములను పంపలేదని చెప్పి వారిని తర్జించెను. అనంతరము మఱియొకసేనానాయకునితో సైన్యముల నాదేశముపైకిఁ బంపి, కైకసుఁడు తనకుమారునిఁ బిలిచి 'జామీను క్రింద నచ్చిన నూర్గురు సామంతులను నాకప్పగింపుము. వారి శిరస్సులను ఛేదించెద" నని అతనితోఁ జెప్పెను. కాంబేశీశుఁ డామాటను విని 'ఓతండ్రీ, వారు నిరాయుధులు, నిరపరాధులు. వారిని మనము చంపకూడ'దని చెప్పి తండ్రిని వారించెను, అతఁడు వినక వారినిఁ జంపించెను. ఈదౌర్జన్యమునకు కాంబేశీశుఁడు, కోపించి, స్వదేశమును విడిచి, టార్తరి దేశమునకుఁ బోయెను. వచ్చిన రాజకుమారుని అఫ్రాసియాబు గారవించి, 'నేటినుండి మనము పరమమిత్రులమై యుందుము గాక'' అని అతనితోఁ బలికి జగన్మోహినియైన తనకుమార్తె 'సుందన'ను అతనికిచ్చి వివాహముఁ జేసెను. ఇంతియ కాదు. ఒకపరగణాను కాంబేశీశుని అధికారిగ నతఁడు నియోగించెను. కాంబేశీశుఁడు మండనతోఁ గూడి కేళీవినోదములలోఁ దేలుచు దేశమును పరిపాలించుచుండెను. అతని భోగభాగ్యములఁ జూచి, కొంద ఱసూయపడి, అఫ్రాసియాబునద్దకుఁ జని 'ఓరాజా, నీఅల్లుఁడు కపటి; నిన్ను మోసపుచ్చ దలఁచి

యుండెను. సమయముఁ జూచి, పారసీక సైన్యములఁ దెచ్చి నిన్ను వధింపఁగలఁ డని అతనితోఁ బలికి, అతనికిఁ బురుల నక్కఱించిరి. యుక్తాయుక్తవిచక్షణ లేని రాజు గనుక, త్వరితముగ సైన్యముతోఁ బోయి, నగరులోఁ బ్రవేశించి, మాఱు మాటలాడక, నిర్దోషియైన కాంబేశుని వధించెను. అనంతర మతనికి 'మందన' గర్భమున నొకదౌహిత్రుఁడు పుట్టెను. ఆశిశువునకు 'ఖుసురు' అనియు 'కైరసు' అనియు రెండునామములు కలవు. మాతామహుఁడు శిశువును వధించు ననుభయముచే, నొకవృద్ధగోపాలుఁడా శిశువును రహస్యముగ దాచి, వానిపుట్టుపూర్వోత్తరముల నెవరికిఁ జెప్పక, వానిని బెంచుచుండెను.

కుమారుని మరణమును విని కైకసుఁడు దుఃఖించి రుస్తుమును రప్పించి వారిరువురును దండుతో వెడలి, టార్తరిదేశములోఁ బ్రవేశించిరి. వారి రాక విని ఆఫ్రాసియాబు దేశమును విడిచిపోయెను. కైకసుఁడు తనపౌత్రుని సంగతిఁ దెలిసికొనుటకు దేశమందంతట చాటింపించెను. అప్పు డావృద్ధగోపాలుఁ డాబాలుని దోడ్కొనివచ్చి, పితామహునియెదుట నిలువఁబెట్టెను. మృతినొందిన తనకుమారుని రూపరేఖావిలాసములను పౌత్రునిలో నతఁడు కనిపెట్టి, ఆబాలుని చేరఁదీసి, చెక్కిలినొక్కి, వానిశిరము నాఘ్రాణించి, వాని నెత్తికొని తనతొడపై వానిని గూర్చుండబెట్టుకొనెను. ఆఫ్రాసియాబు టార్తరిదేశమును సాధించుటకుఁ బునః ప్రయత్నముఁ జేసెను; కాని, కైరసు సైన్యముతోఁ బోయి, మాతామహుఁ డగు ఆఫ్రాసియాబును పట్టుకొని, తనచేతులతో వానిని వధించెను. కైకసుఁడు స్వర్గస్థుఁ డయ్యెను. పితామహునియొక్కయు మాతామహునియొక్కయు రాజ్యములకు కైరసు నిరంకుశప్రభు వయ్యెను. కైకసుని మరణముతోఁ బురాణకథలు ముగిసెను; కైరసురాజ్యమునకు వచ్చినదిమొదలు చరిత్రాంశము లారంభ మగును.

---

# ఇరువదియైదవ అధ్యాయము.

## పారసీక రాజ్యముయొక్క పోటుపాటులు.

## క్రీ. పూ. సం. 553-333 రములు.

పారసీక రాజ్యముయొక్క పోటుపాటులు రెండువందలసంవత్సరములలో జరిగినట్లు తెలియుచున్నది; అందులో మొదటి యేఁబదిసంవత్సరములలో నా రాజ్యము మహోచ్ఛపదవికి వచ్చెను. 'పార్శ్యులు లేక పారసీకుల' నాయకుఁడైన 'క్రైరసు, ఈలాము' దేశములో 'అన్సాను' పరగణాకు రాజుగనుండెను. అతని ప్రారంభదశలో 'పార్శ్యులు, మీడియా' రాజ్యమునకు స్వాధీనులై యుండిరి. రాజు 'క్రైయాక్సరీశుఁడు' పరిపాలించుచున్నప్పుడు, మీడియా రాజ్యము పరమోచ్ఛస్థితిలో నుండెను; ఈ రాజు 'ఎక్బటానా' పట్టణమును, దుర్గములతోను, ప్రాకారపుగోడలతోను కందకముతోను దిట్టపఱచి, దానిని రాజధానిగఁ జేసెను. ఇతని కాలములో మందులును మీడులు నేకీభవించి 'నినవేపట్టణము'ను నాశనముఁ జేసి అసీరియా రాజ్యమును తిలుగఁ దోసిరి. అసీరియా రాజ్యముయొక్క ఉత్తరభాగమును 'క్రైయాక్సరీశుఁడు' తనరాజ్యములోఁ గలిపెను; అంతకంత కితఁడు బలిసి, క్రీసను అనురాజు పాలించుచున్న 'లిడియా' రాజ్యముపైకి దండుతో నెడలెను. అప్పుడుభయసైన్యములు పోరాడుచుండ, సూర్యగ్రహణము పట్టెను; ఆగ్రహణ మపశకునమని తలఁచి, క్రైయాక్సరీశుఁడు క్రీససుతో సంధిఁ జేసికొని, స్వదేశమునకుఁ బోయెను.

క్రైయాక్సరీశుఁడు చనిపోయిన తరువాత 'అస్త్యెయజీశుఁడు' మీడుల రాజ్యము నేలెను; మందులను మీడుల పతిఁడు సంఘీకరణముఁ జేసెను. అతఁడును క్రైరసును, ఒకరి నొకరు ఎదురుకొనిరి. క్రైరసు 'ఈలాము' దేశములో నొకరాజుగ నుండెనని తెలియును. ఎనుబదిసంవత్సరముల క్రిందట 'పార్శ్య' జాతివారు 'ఈలాం' దేశమును సాధించియుండిరి.

పురాణకథలలోఁ జెప్పఁబడియున్న యుద్ధమినిర్మై యుండును. కైరసు 'అస్తేయజీసు'ని సభాస్థానములో మెలఁగుచుండెను; అచ్చట, 'హార్పేగసుఁడు' అను వాఁడొకఁడు కైరసుతో స్నేహముఁ జేసెను; వీరిరువురు కలిసి సామంతులలో ముఖ్యులగు కొందఱిని దమపక్షములోనికిఁ దీసికొనిరి. ఈప్రకారము కైరసు దిట్టపడి, అస్తేయజీసుని రాజ్యపదమునుండి తప్పించి, దేశమునకు రాజయ్యెను. హార్పేగసుఁ డతనికిఁ గుడిభుజమువలె నుండి సహాయముఁజేయుచుండెను. నేటినుండి, మీడులును, పారసీకులును, కైరసును తమరాజుగ భావించుచుండిరి.

దక్షిణమున:—అరేబియా అసీరియా దేశములలోని కొంతభాగము.

ఉత్తరమున:—కాస్పియను సముద్రము.

పశ్చిమమున:—లిడియా దేశము.

తూర్పున:—'హిందూకుషు' పర్వతములు. అతఁడు రాజ్యమునకువచ్చుసరికి, ఈసరిహద్దుల మధ్యమున నున్న దేశ మంతయు స్వాధీనమై యుండెను. మఱి యేఁబదిసంవత్సరములనాటికి ఆరాజ్యము బలిసెను.

దక్షిణమున:—ఈజిప్టుదేశమునకుపరిభాగము.

ఉత్తరమున:—రష్యాదేశము పొలిమేరలవఱకు.

పశ్చిమమున:—ఈజియను సముద్రము.

తూర్పున:—సింధునదివఱకును.

కైరసుయొక్క ప్రభుత్వ మంతయు దిగ్విజయముక్రింద నుపయోగమయ్యెను. గ్రీకులు కొందఱు స్వదేశమును విడిచి, సారవంతమైన 'ఈజియను' సముద్రప్రాంతమున నచ్చటచ్చటఁ గొన్నినివేశముల నిర్మించుకొని కాపురముండిరి; ఇవి నానాటికిఁ బట్టణములై, మాతృదేశముతో రాకపోకలు కలిగి వర్తకముచేత నభివృద్ధి యయ్యెను.

ఈనూతనసీములవారు భాగ్యవంతు లనితెలిసి, 'లిడియా' దేశపురాజు వారిని స్వాధీనముఁ జేసికొనెను. పారసీకరాజ్యమునకుఁ బశ్చిమమున 'లిడియా'

రాజ్యముండెను. లిడియా రాజ్యము యొక్క సంపదఁ జూచి, పారసీకరాజు కైరసు దానిని సాధించుట కువ్విళ్లూరుచుండెను, సమయముఁ జూచి, దానిపైకిఁ దాడి వెడలెను. ధనముకలవని గర్వపడి, క్రీససు వెనుకఁ దీయక, నతని కెదురు నడిచెను. 'తింబ్రా' వద్ద జరిగిన యుద్ధములో క్రీససు ఓడిపోయెను; అతని పట్టణమును పారసీకులు నేలఁ గలిపిరి. అతఁడు శత్రువులకుఁ బట్టుపడి, వారి దేశములో నిరానందుఁడై జీవించెను.

అనంతరము, క్రీ. పూ. సం॥ 538 రములో, 'అసీరియా బాబిలను' రాజ్యములకు రాజధానియైన 'బాబిలను' పట్టణమును ముట్టడించి, దానినతఁడు ధ్వంసముఁ జేసినసంగతి నిదివఱకు వినియున్నారము.

అటుపిమ్మట, రాజ్యమున కీశాన్యమూలనున్న వనవాసుల నెదిరించి, వారితో నతఁడు పోరాడుచుండెను; ఈపోరాటములో నతఁ డోడిపోయి, గాయము తగిలినందున చనిపోయెను. "పసార్గాడు" పట్టణములోని రాజనగరులోఁ జాలశిలతోఁ గట్టబడిన యతనిగోరీ నేటివఱకుఁ జూడ నగును.

కాంబేశీశుఁడు:—అనంతర మతనికుమారుఁడు కాంబేశీశుఁడు సింహాసనము నెక్కెను. అతఁడు దురాచారుఁడు; దుష్టచిత్తుఁడు; అయినను తండ్రివలె, మహాబలపరాక్రమశాలి. మొదట నతఁడు 'ఫోనిషియా' దేశమును 'కైప్రసు' దీవిని స్వాధీనముఁ జేసికొని, ఈజిప్టుదేశమును సాధించుటకు దాడి వెడలెను. ఆదేశము నతఁ డవిఘ్నమున సాధించి, ఆదేశీయుల నీతుల నిరోధించి, వారిమతమును పరిహసించెనో, మన మిదివఱకు వినియుంటిమి. తనదేశములోని దేవతలే గొప్పవారని తెలుపుచుఁ జేయుటకై, 'అమను' దేవతాలయమును నాశనముఁ జేయుట కతఁ డేబదివేలసైనికులను పంపించెను: వారా దేవతాలయమును సమీపించుటకు, ఒక యెడారిగుండ వారు పోవలసియుండెను. ఇన్నివేల సైనికులా యెడారిలో నశించిరి.

అతఁడు 'కార్తేజి' పట్టణము నైన సాధింప లేక పోయెను. చేయలేనిపనులఁ జేయుట కతఁడు సమకట్టి పరాభవము నొందుటఁ జూచి, అతని

పేరుఁ జెప్పిన, పారసీకు లసహ్యపడుచుండిరి. "శిరియా" దేశమున కతఁడు వచ్చుచుండ, తనసింహాసనము నొకసామంతుఁ డధిష్ఠించి తన పేరుఁ బెట్టుకొని రాజ్యము నేలుచుండె నని వినెను. తన దుష్ప్రవర్తనచేతఁ దనసైనికులకుఁ దన యందనురాగము లేనందున, నాసామంతునిఁ బరిభవించుటకు శక్యము కాదని తెలిసి, నూరక త్తితో నతఁడు పొడుచుకొని చచ్చెను.

డారియసు — డారియసు రాజకుటుంబములోనివాఁడు. సామంతులందఱేకగ్రీవముగ నతనిని ప్రార్థించినందున, నతఁడు సింహాసనము నెక్కెను. నలువైపుల దేశములో నల్లకల్లోలములు లేచెను. కాంబెసీసుఁడు జయించిన దేశములన్నియు తిఱుగఁబడెను. క్రమముగ వానిని సాధించి, అతఁడు వశముఁ జేసికొనెను. వీనిమూలమున నతనికిఁ గొంచెము రాజ్యానుభవము కలిగినందున, నతఁడు రాజ్యములో వ్యత్యస్తములు ముందును కలుగకుండ, కట్టుదిట్టముల నేర్పఱచెను; అందుచేత నతనికిఁ బారసీకరాజ్యసంస్థాపకుఁ డనుబిరుదు వచ్చెను. రాజ్యము నంతయు చిన్న క్షేత్రముల క్రింద విభజించి, వానిని బరిపాలించుటకు క్షేత్రపతుల నతఁడు నియోగించెను. వారినెలవులలో వారు మెలకువతో వ్యవహరించి, సంవత్సరమున కొకపర్యాయము రాజునకుఁ గప్పముఁ గట్టుచుండిరి. పూర్వమువలెఁ బ్రజలను పీడించి, ధనము నతఁడుస్వీకరించుట లేదు. రాజుకోరినపుడెల్ల, ధనమును బట్టుకొని సైన్యములతో క్షేత్రపతులు వచ్చి రాజునకు సహాయముఁ జేయుచుండిరి. ఆనాఁడు రాజ్యములో నొకభాగము నుండి మఱియొకభాగమునకుఁ బోవుటకు రాధారిమార్గములు కట్టఁబడెను. మార్గముల కిరువైపుల వృక్షము లుండెను; వానిలో నచ్చటచ్చట సత్రములు కలవు. "డారిక"అను పేరున బంగారునాణెముల నతఁడు ముద్రింపించివాడుకలోనికిఁ దెచ్చెను. అంతఃకలహములచేఁ గలవరపడుచుండిన రాజ్యమున కతఁడు స్వాస్థ్యముఁ దెచ్చి, విదేశములను జయించుటకు సమకట్టెను. తూర్పున సింధునదీ తీరమువఱకు నతనిరాజ్యము వ్యాపించెను. పడవలవంతెనను కట్టించి, సైన్యములతో నతఁడు దానిమీఁద నుండి పోయి, తనరాజ్యమున కుత్తరమున నున్న "సిథియా" దేశము సాధింపవలె నని తలఁచెను; కాని, అది మెట్టదేశ

మగుటచేత నతఁడు మగలివచ్చెను. అనంతరము, "ఈజియను" సముద్రమున కుత్తరతీరమున నుండు గ్రీకుల నూతనసీమలను సాధించెను; "మాసిడను" దేశపు రాజును సహిత మతఁడు వశపఱచుకొనెను. పూర్వపశ్చిమములకు మాసిడను దేశము మొదలు భరతఖండమువఱకును, దక్షిణోత్తరములకు "నైలు" నది తీరము మొదలుగ ప్యాసెజ్ముపఱకు నతనిరాజ్యము వ్యాపించెను.

అయోనియనుల అల్లరి:—అతఁడు "సిథియా" దేశముపైకి దండెత్తి వెళ్లినపుడు, పడవలవంతెనను కాపాడుచుండు మని గ్రీకుల నూతనసీమలవారితోఁ జెప్పెను. వారితుటూరికాఁడొకఁడు వారిని పడవలవంతెనను పగులగొట్టుఁడని ప్రోత్సహించెను; కాని వారు పారసీకరాజునకు నమ్మికై యుండిరి. పారసీకరాజుయొక్క ప్రాపక ముండుటచేత, నాతుటూరికాండ్ర ప్రభ నూతనసీమలలో వెలుగుచుండెను. "మిలేతసు" అను నూతనసీమలోని తుటూరికాఁడు గర్వి ష్ఠి యగు తెలిసి, నానినిమాంబిమాటలతో డారియసు తనపట్టణమునకుఁ దీసికొని పోయి, కారాగృహములో నాని నుంచెను. "మిలేతసు" లోని నూతనప్రభువు "ఆరిస్తగోరీసుఁడు" పశ్చిమరాజ్యములో నేలుచున్న పారసీకక్షేత్రపతితోఁ గలహించెను; అథెన్సు పట్టణమునుండి గ్రీకుసైనికులు వారిసహాయమునకు వచ్చిరి; వారుకలిసి, "సార్డిసు" అను పారసీకులపట్టణమును ముట్టడించి, దానిక్షేత్రపతిని దుర్గములోనికిఁ దఱిమి, వారాపట్టణమును కాల్చివేసిరి.

ఈనూతనసీమలవారి సాహసకృత్యమును విని, డారియసు మండిపడెను. "అథీనియనులా! ఎవరు మీరు?" అని అతఁడు ప్రశ్నవేసెను. అంతరిక్షము మీఁదికొక బాణమును ప్రయోగించి, "ఓ దేవతలారా, నామనవి వినుఁడు. అథీనియనులను సాధించునట్లు, నాకు శక్తిని దయచేయుఁ" డని అతఁడు వారినిఁ బ్రార్థించెను. ప్రతిదినము ముమ్మారు భోజనకాలమున నొక సేవకుఁడు వచ్చి, "ఏలినవారు అథీనియనులను జ్ఞప్తిలో నుంచుకొనుఁ"డని అతనితోఁ జెప్పుచుండును.

మఱి యాఱుసంవత్సరములనాటికి, నూతనసీముల వారి నతఁడు సాధించి, పురుషుల శిరస్సులను ఛేదించి, బాలులను బానిసలుగ నమ్మివేసెను. భోగభాగ్యములతోఁ గూడి అభివృద్ధి నొందుచున్న నూతనసీమలవా రతని ధాటికి నిలువ లేక జాతి మాయమై పోయిరి.

గ్రీసుదేశముపై దండయాత్ర:—క్రీ. పూ. సం. 490 రము అథీనియనులును స్పార్టనులును తనకు భృత్యులై కప్పములను కట్టుట కిష్టపడెదరో లేదో తెలిసికొనివచ్చుటకు రాయబారుల నతఁడు వారివద్దకుఁ బంపెను. వారా రాయబారులను నూతులలోఁ బడఁద్రోసిరి. అందుల కతఁ డాగ్రహించి, "దాతీశుఁడు" అను దండనాయకునితోఁ బారసీకసైన్యముల నాదేశముపైకిఁ బంపెను; వారచ్చటకుఁ బోయి, "మారాథాను" భూములమీఁద శిబిరములను వేసికొని నిలిచిరి. పారసీకుల నడవడికలను అథీనియనులు కనిపెట్టుచుండిరి. వీరికి వెనుకను సముద్రము; ఎడమప్రక్కను చిత్తడినేల; కుడిప్రక్కను నది; ఇట్టి దుస్థితిలో నుండినను, అథీనియనులు వ్యూహముఁ బన్ని శత్రువుల కెదురు నడిచిరి. అథీనియనుల పోటుకు వారు నిలువలేక పికాపికలై ప్రాణములను రక్షించుకొని పారిపోయిరి. పరాభవము నొంది స్వదేశమునకు వచ్చిన హతశేషులను చూచి దారయుసు మండిపడెను. అనంతర మతఁడు మఱియొక సైన్యమును గూర్చి స్వయము దండెత్తుటకు సిద్ధపడినంతలో నతనికిఁ గాలము వచ్చి స్వర్గస్థుఁ డయ్యెను.

జరజేశుఁడు క్రీ. పూ. సం. 486 రము:—

దారయునకు జరజేశుఁడు ఔరసపుత్త్రుఁడు కాకపోయినను, సింహాసనము నెక్కెను—అతఁడు చలచిత్తుఁడు; డాంబికుఁడు నవమోహనాంగుఁడ నని అతనికిఁ గర్వము. గ్రీసుదేశముపైకి దండువెడలుట కతనికిష్టము లేకపోయినను, సైన్యములు సిద్ధముగ నుండినందున, దండనాయకు లతనినిఁ బ్రోత్సహించినందున, నతఁడు సమ్మతించెను. దండనాయకు లుద్దండంబుగ కోదండంబులను చాచి, సైనికులతో నడచిరి; 'దశసహస్రఅమర్త్య'లను

పేరుగల ఆత్మరక్షకులు వెంటనంటి యుండ, రారాజు వెడలెను. 'హెలేసు పంథానము' మీదఁ గట్టబడిన పడవల వంతెనమీఁది గుండ నాసైన్యములు నడిచి, గ్రీసు దేశమున నుత్తరమున నుండు పర్వతశ్రేణులను దాఁటి, 'తెర్మాపల్లి' అను పర్వతకనుమునొద్దకు వచ్చిరి. ఆకనుమ ముఖద్వారమును కాపాడుచు 'లియొనిడాసు' డను వీరనాయకుఁడు మూఁడువందలు స్పార్టనుసైనికులతో నిలిచి యుండెను. వేనవేలు పారసీకులను వీరు బిఱ్ఱు వెనుదీయక, వారితోఁ బోరు చుండిరి. ఇంతలో వీరిలో నొకతుంటరి పారసీకుల వద్దకుఁ బోయి, మఱియొక మార్గమున వారిని పర్వతముమీఁద నుండి నడిపించుకొని వచ్చెను. ఆవచ్చిన వారు స్పార్టనులను వెనుకనుండి పొడిచిరి. ఇటుల ముందువెనుకల శత్రువుల నెదిరించి స్పార్టనులు పోరాడిరి; కాని, శత్రువుల పోటును వారు నిలువలేక, అందఱును నేలఁ గూలిరి; గాని, ఒకఁడైనను శత్రువునకుఁ జిక్కలేదు. ఈస్పార్టను మహాయోధులను గ్రీసుదేశములో నేటివఱకు స్మరింపనివాఁడు లేఁడు. అనంతరము పారసీకసైన్యము లాకనుమగుండ నడచి గ్రీసుదేశములోఁ బ్రవేశించి, ఆథెన్సుపట్టణమును ముట్టడించెను. అథీనియనులు స్త్రీపురుష బాలవృద్ధులు పట్టణమును విడిచి పడవలలోనికిఁ బోయిరి. ఇటుల నిర్జనమైన పట్టణమును పారసీకులు కాల్చి తగులపెట్టిరి. అనంతరము పారసీకులకును అథీనియనులకును 'సాలమీసు' రేవులో నావయుద్ధము జరిగెను. అథీనియనులకును సాలమీసు రేవులో నావ యుద్ధము జరిగెను. అథీనియనుల నావలు చిన్నవి; చులకనివి; అందుచేత వారు వానిని త్వరితముగఁ గడిపిరి — పారసీకుల నావలు పెద్దవి; బరువుగలవి; వానిని గడుపుట కష్టము. ఈనావ యుద్ధములోఁ బారసీకు లోడిరి. ఈపరాభవముఁ జూచి జగజేషుఁడు స్వదేశాభిముఖుఁడై నడిచెను. అతనిమూలమున దేశమున కపఖ్యాతి వచ్చెనని ప్రజ లతనిని నిందించిరి. క్రీ. పూ. సం॥ 465 రములో, నొకనాటిరాత్రి అతఁడు నిద్రించియుండ, దుర్మార్గులు కొంద అంతఃపురములోఁ బ్రవేశించి అతనిని వధించిరి.

అతనికుమారుఁడు 'అర్తజరజేషుఁడు' పట్టభద్రుఁ డయ్యెను. అతఁడు దుర్బలుఁడు; అవివేకి. రాజలక్షణములు లేనివాఁడు. అతఁడు కళావిహీనుఁడు. అతనికాలములోఁ బారసీకులు అథీనియనులతో సంధిఁ జేసికొని, తత్కాల

మిత్రులయిరి. ఈజిప్టుదేశములో నల్లరులు పుట్టినందున, వాని నణచుటకు అథీనియనులు పారసీకులకు సహాయపడిరి.

దారియసు-నోతేశుఁడు:—తదుపరి నోతేశుఁడు మూర్ధాభిషిక్తుఁ డయ్యెను. అతని పట్టపుదేవి 'పారిశతీసి' ఆమె రూపలావణ్యములో రతీదేవిని తిరస్కరించెను. ఆమెకు ధైర్యస్థైర్యములు గలవు. రాజ్యమంత్రులను వశీకరించి, రాజకార్యముల నామె పట్టుదలతో వ్యవహరించెను. అథీనియనులకును స్పార్టనులకును జగడము వచ్చెను; వారిలో స్పార్టనులు పారసీకముతో నేస్తముఁ గట్టిరి. పారసీకములో గ్రీకుల ప్రభవెలిగెను.

ఆసియాఖండములోఁ బశ్చిమతీరమున నుండిన గ్రీకుల నూతనసీమల లోని వారిలో భేదము పుట్టించి, ఆమె వారిని స్వాధీనముఁ జేసికొనెను. ఇంతలో "ఈజిప్టు" దేశము తిరుగఁబడి స్వతంత్రరాజ్య మయ్యెను. ఆదేశము స్వతంత్రించుటవలన పారసీకరాజ్యమునకు గొప్పదెబ్బతగిలెను.

ద్వితీయ అర్తజరజేశుఁడు—క్షైరసు:—వీరిరువురు "నోతేశు" ని కుమారులు; అర్తజరజేశుఁడు జ్యేష్ఠుఁడు; క్షైరసు "పారిశతీశి" యొక్క కుమారుఁడు. అర్తజరజేశుఁడు పట్టాభిషిక్తుఁడగుటకు సిద్ధముగ నుండిన సమయమున క్షైరసు అతనిని జంపుటకుఁ గుట్రను పన్నెను. ఆసంగతి జ్యేష్ఠునకుఁ దెలియును. సామంతులతో నతఁడు దేవాలయములోనికిఁ బోయి, అభిషిక్తుఁడై వచ్చుచుండ నతనిని క్షైరసు ఎదిరించెను. అతని అంగరక్షకులు వానినిఁ బట్టుకొని చంపఁదలఁచిరి గాని, వానితల్లి అడ్డుపడినందున, నతఁడు వానిని క్షమించెను. అనంతరము క్షైరసు స్వరాజ్యమునకుఁ బోయి, తల్లి ప్రోత్సహించినందున, గ్రీసులసైన్యములఁ దోడ్కొని, బాహాటముగ జ్యేష్ఠునిమీఁదికి దండెత్తి వచ్చెను.

ఆసంగతిని విని, అర్తజరజేశుఁడు యుద్ధసన్నద్ధుఁడై వెడలి వచ్చెను. ఉభయసైన్యములు "కునాక్సా" వద్ద తారొకనను. వ్యూహముఁ బన్ని క్షైరసు సైన్యములను సిద్ధముఁ జేయక, జ్యేష్ఠునిఁ జంపుటకు ఒంటరిగ శత్రుసైన్యము

లోఁ బ్రవేశించెను.శత్రువులను దాఁటి,అన్నగారిసమీపమున కతఁడు వచ్చెను; కాని, అతనిని వారు పట్టుకొని చంపిరి.

కైరసుయొక్క సేనానాయకులు ఆర్తజరజేసుని శరణుఁ జొచ్చిరి. ఇఁక కైరసు సేనతో వచ్చిన గ్రీసులు పడిన పాటులు చెప్పలేము. పారసీకుల సేనాధిపతి గ్రీసుల దండనాయకులను స్వశిబిరములోనికి రప్పించి వారినిఁ గడ తేర్చెను. పదివేలగ్రీసులనాథులయిరి; వారు విదేశములో నుండిరి; విదేశీయులు వారికి శత్రువులు; స్వదేశమునకుఁ బోవుమార్గము కానరాదు; విదేశములో నాధారమార్గములు లేవు: ఎన్నిశ్రమలు పడినను, వారిపౌరుషము మాత్రము బిగువుగ నుండెను. "మరాథాను" యుద్ధములోను "తెర్మాపల్లీ" యుద్ధములోను జయించిన గ్రీసులసంతతివారు కనుక, వారు దానిని సాధించి, ఆరు మాసములనాటికి సముద్రతీరమునకు వచ్చి చేరిరి. అప్పుడు వారినాయకుఁడు "క్సెనఫను" ఏనాఁడు కనిష్ఠభ్రాత, కైరసు, చనిపోయెనో, ఆనాఁడునుండి రాజ్యమునకుఁ జేటుకాలము వచ్చెను.

తృతీయ-ఆర్తజరజేసుఁడు :—అనంతరమితఁడు రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు దుర్మార్గుఁడు; కఠినచిత్తుఁడు; అయినను, సాహసము కలవాఁడు; కార్యములను పట్టుదలతో వ్యవహరించును. ఇతని సేనాధిపతి "మంతిరు". వానికి సేనాధిపతి లక్షణము లుపట్టెను. వారిద్దరు కలిసి ఈజిప్టుదేశమును సాధించిరి; చాలా కాలము ముట్టడించి, శ్రమపడి "సైడాను" పట్టణమును పట్టుకొనిరి. మాసిడను దేశపురాజు గ్రీసులపైకి దండెత్తినపుడు, వారికి ధనమును పంపి, సైన్యములను సహాయము నిచ్చెను అయినప్పటికి. మాసిడను రాజు గ్రీసులను క్రీ. పూ. సం. ౩౩౮ రములో నోడించి, వారిదేశమును వశముఁ జేసికొనెను. తృతీయ ఆర్తజరజేసుఁడు వీరుఁడైనను, ప్రజలకతనియం దనురాగము లేకపోయెను. ఏసంవత్సరము మాసిడను రాజు "ఫిలిప్పు" దిగ్విజయము నొందెనో, ఆసంవత్సరమునతనికి విషముఁ బెట్టి, దుర్మార్గు లతనిని జంపిరి.

దారయసు—కోడోమనసు:—అనంతర మితఁడు కొంచెము కాలములో సింహాసనము నెక్కెను. ఇతఁడు చక్కనివాఁడు; ఉత్తరకుమారునివలెఁ

ప్రజ్ఞలను చూపుచుండెను. "ఫిలిప్పు" చనిపోయినందున, నతనికుమారుఁడు "మహాఅలగ్జాండరు" మాసిడను రాజ్యము నధిష్ఠించి, ఆశియాఖండములోని రాజ్యములను జయించి, పారసీకరాజ్యములోనికి వచ్చెను.

"గ్రానికసు" నదీతీరమున మాసిడను సైనికులును పారసీకసైనికులు నొకరి నొకరు మార్కొనిరి. అలగ్జాండరు నేర్పరిగనుక, శత్రుసైన్యముల నోడించెను; "సార్డిశు" పట్టణము స్వాధీన మయ్యెను. ఇంతలోఁ బారసీక సేనాధిపతి "మెమ్నను" అనువీరుఁడు దండుతో వెడలి మాసిడను దేశముపైకిఁ బోవుటకు సిద్ధపడెను; ఈవిధమున, పారసీకమును రక్షింపవలెనని తలఁచెను; కాని, ఇంతలో నతనికి మృత్యు వాసన్నమై పరలోకమునకుఁ గొనిపోయెను. ఆతనిమరణమువలన పారసీకరాజ్య మస్తమించెను.

అనంతరము "ఇస్సస్సు" వద్ద మఱియొక యుద్ధము జఱిగెను; అందులో బారసీకు లోడిరి. డారేయసు కొండలఁ బట్టెను; అతని సైనికులు నూఱువేలు కాందిశీకు లయిరి.

డారేయసుయొక్క రథమును, ధనుర్బాణములును, దార్కత్తులును చీని-చీనాంబరములును శత్రువునకుఁ జిక్కెను; అతని భార్యయును, తల్లియును, కుమార్తెయును, పసిబిడ్డఁడు కుమారుఁడును శత్రువుచేతిలోఁ బడిరి. డారేయసు బాబిలను పట్టణమునకువచ్చి తనకుమార్తెను అలగ్జాండరునకు వివాహములో నిచ్చెదనని, అతనికి వర్తమానముఁబంపెను. ఆమాటను విని, 'సర్వసంపదలతోఁ గూడిన నీరాజ్యము నాచేతిలోఁ జిక్కెను. నీకుమార్తె నా యధీనములోనున్నది; నాకు మనస్కరించిన, నేనామెను వివాహ మాడెదను. నీవు నాపాదాక్రాంతుఁడ వైన, నిన్ను రక్షించెద'నని అలగ్జాండరు అతనికిఁ దెలియఁజేసెను.

ఆమాటలతో డారేయసు నిరాశుఁడై, దేశములో శేషించిన సైనికులఁ దోడ్కొని, 'ఆర్బేలా'వద్ద శత్రువులతోఁ బోరాడెను; కాని, అతనికి దుర్దశవచ్చెను. అతఁడుయుద్ధములో నోడిపాఱిపోయెను. పారసీకక్షేత్రపతియొకఁడతనినిఁ బట్టి కత్తితోఁ బొడిచిచంపెను. పారసీకులరాజ్యలక్ష్మి అలగ్జాండరునివరించెను.

డారేయసునితోఁ బ్రాచీన పారసీకుల మహారాజ్య మస్తమించెను.

---

శ్రీరస్తు.

# ఫొనీషియా దేశచరిత్ర.

## పంచమప్రకరణము.



### ఇరువదియాఱవ అధ్యాయము.

మధ్యధరాసముద్రమునకుఁ దూర్పునను ఉదయసముద్రమున కభిముఖముగ నున్న దేశమునకు రోమకులును గ్రీకులును 'ఫొనీషియా' యని నామ మిడిరి. గ్రీకుభాషలో 'ఫొనీషియా' యనఁగా 'ఖర్జూరపుదేశ'మని యర్థము. మధ్యధరాసముద్రతీరమున దక్షిణమున నున్న 'గాజా' పట్టణము మొదలు ఉత్తరమున నున్న 'కాసియసు' పట్టణమువఱకుఁ గల ఇసుక నేలలో ఖర్జూరవృక్షములు మెండుగ పుష్టి పెరుగుచు చూపఱుల నేత్రముల కానందమును గలుగఁజేయుచుండును. దేశయాత్రాభిలాషగలిగిన గ్రీకులు నౌకాయాత్రఁ జేయుచు, దైవికముగ వారితీరమున లంగరు వేసి ఒడ్డుఁజేరి దేశమునలుపైపులఁ జూచి, సంతసించి, ఆభాగమునకు 'ఖర్జూరదేశ'మనియు, 'ఖర్జూరము పండు దేశ'మనియుఁ బేరిడిరి. 'ఆసియామైనరు'ను, 'ఈజిప్టు'నకు మధ్యనున్న యావత్తు 'సిరియా' తీరప్రాంతమునకు 'ఫొనీషియా' యను వాడుక కలదు. ఈభాగములో నానాదేశీయులు నివసించుచుండిరి. వా రేకకుటుంబములోనివారు కారు. వారు మూఁడు కుటుంబములవారు. వీరి రాజకీయవ్యాపారములు భిన్నములు. గ్రీకులీసంగతిని తెలిసికొని, ఉత్తరమున నున్న 'సిరియా' దేశమును, దక్షిణమున నున్న 'పాలస్టీను' (అనఁగా ఫిలిస్టైనుల దేశము), ఈరెండు దేశములకు మధ్యస్థముగ సముద్రప్రాంతమున నున్న దేశమునకు, ఫొనీషియా యని నామ మిడిరి. దక్షిణోత్తరదేశములను మినహాయించినపైని, ఈదేశముయొక్క పొడవు 200 మైళ్లు మాత్రమె; ఇది మధ్యధరాసముద్రమునకుఁ దూర్పుతీరమున నున్నది.

ఈదేశమునకుఁ బొడుగుకుఁ దగినవెడల్పు లేదు. దీనికిని 'సిరియా' దేశమునకును మధ్యనున్న కొండలోయకు కవాటమువలెనున్న పర్వతశ్రేణిని కలుపుకొనినను, ఈ 200 మైళ్లలోను వెడల్పు 35 మైళ్లకంటె నెుత్తముమీఁద హెచ్చులేదు. దక్షిణ అమెరికాఖండములోని 'చిల్లీ' దేశమువలె, ఇదియు సన్నమై చీలికవలె నున్నది. ఒకవైపున అప్పతి; మఱియొకవైపున నగపతి; ఈ యిరువురి మధ్య చిక్కువడిన దీదేశము. ఉత్తరమున విరివికలిగి, దక్షిణమునకు రానురాను 2-మైళ్లకు సన్నమైనది. దీనివైశాల్యము 4000 చదరపుమైళ్లనుటయె యధికము.

ఏదేశమునకైనను కీర్తిప్రతిష్ఠలు వచ్చుట దాని వైశాల్యమువలన కాదు. ఇంతదేశమైన నేమి? అంతదేశమైన నేమి? ఎంతయైనను సరే! పూర్వకాలములో 'స్పార్టా' 'అథెన్సు' 'కార్తేజి' ఇవి చిన్నదేశములె; ఇటీవల 'జినోవా' 'వెనీసు' 'పైసా' 'ఫ్లారెన్సు'—ఇవియు చిన్నదేశములె అయిన నేమి? యావత్ప్రపంచము నేలుటకుఁ దగినత్రిశక్తుల నవికలిగియుండెను. ఇటీవల మనకాలమునకు రానురాను, ఇంగ్లాండు, హాలెండు పోర్చుగలు—ఇవి యేపాటిదేశములు? ఈదేశములు పిడికిలిలోనికి రావు. అయిన నీదేశీయులు మహాకార్యములఁ జేయలేదా? మహోచ్చపదవిఁ జెందలేదా? మహనీయమూర్తులని ఘనత వహించలేదా? ఎంతదేశమైన నేమి? దేశీయుల బలిమివలన నే దేశమునకు బలమును, ధనమును, ఘనతయు వచ్చును.

ఫొనీషియా చిన్నదేశమైన నేమి? దానిస్థితి యుత్కృష్టమైనది. ఇరుగుపొరుగుదేశములతో వ్యవహారములలో నైననేమి రాజకీయవ్యాపారములలో నైననేమి సమదృష్టి మిత్రదృష్టియే కాని శత్రుత్వము లేదు. దీనికిఁ దోడు భూమి సారమైనది; ఫలవంతమైనది. భూసారమె మనుజులకు సారము. ఆదేశము నాలుగుభాగములు; మొదటిభాగము సముద్రతీరప్రాంతము; ఇసుకనేల ఖర్జూరవృక్షములకుఁ దగినభూమి. ఇప్పటికిని 'బేరూటు' 'జాఫా' పట్టణముల వద్ద నీతోఁటలు గలవు. రెండవభాగము సారవంతమైన వరిక్షేత్రములతోను, నేత్రానందకరమైన ఫలవృక్షములతోను నిండినది. ఈభాగము 1 మైలు మొదలు 12 మైళ్లువెడల్పు గలిగి, ఎటుచూచినను కనుచూపు మేరవఱకు నుద్యానవనము.

లతో నిండి యుండెను. సేద్యగాఁడు జాగ్రత్తగా భూమిని దున్నినను సరే; నిర్లక్ష్యముగా విత్తులఁ జల్లినను సరే; సారముగలవిగనుకనే క్షేత్రము లారిగిన పచ్చనివరివెన్నులతో నిండియుండెను; ఇట్టిక్షేత్రముల పొలిమేర నచ్చటచ్చట పట్టణములును పల్లెలును కలవు. తోటలలో పసుపు ఎఱుపు కలిసిన రంగుగల దాడిమీఫలములు గలచెట్లును, నారింజవృక్షములును వాని పచ్చని ఆకులమధ్య కొమ్మలమీఁదనుండి శుకపికపరభృతారావములును—వీనికి మీఁదుగ క్రమక్రమముగ పైకిలేచుచున్న పర్వతశ్రేణులును—వానిమీఁదనుండి ధారలవలె జాఱిజాఱి, క్రమముగ సెలయేఱులైన ప్రవాహములతో నిండి ప్రకృతిసంపదను ఘోషించుచున్న దీదేశము.

తూర్పున నున్న పర్వతశ్రేణులు కేవలము పొడవును కేవలము కురుచయును గానందున, ద్రాక్షతీగెలు; ఫలికవృక్షములు ఇప్ప(oline)చెట్లు పెఱుగుట కవకాశమై యుండెను. కొండలు దట్టమైన కొలఁది భూమి సాగులేక పడియుండెను. అచ్చటచ్చట ద్రాక్షతీగెలు మాత్రముండెను. కడమభాగము యావత్తు కొండలు దూరని కాఱడవి, చీమలుదూరని చిట్టడవి. ఈయడవులు 'ఓకు' 'చెస్టునట్టు' అనుపేరులుగాఁగల మహావృక్షములతో నిండి, దేశమునకు వన్నెతెచ్చిన 'సిడారు' అను వృక్షరాజముతో శోభిల్లుచు సూర్యరశ్మి కభేద్యమై యున్నవి. పర్వతశ్రేణుల యౌన్నత్య ముత్తరమున [illegible]000 అడుగులు మొదలుకొని దక్షిణమునయున్న 'లబనన్' పర్వతశిఖరము 'మాకు నేలు' వఱకు వచ్చుసరికి [illegible]000 అడుగులను లేచినది.

సముద్రతీరము కత్తిరింపఁబడిన ఒడ్డు కాకపోయినను, మెలికలుపడిన తీరము గనుకనే, పడవలు లంగరు వేసి తుపాను సమయములలో నిరుపద్రవముగ నిలుచుటకుఁ దగిన రేవులు సహజముగ నేర్పడినవి. అట్టిరేవులు లేని తీరమున దేశీయులు నేర్పరులు గనుక బుద్ధికుశలతచేఁ దీరము కౌగిలించుకొనుటకుఁ దనచేతులను చాచినదేమో యనునటుల బందరుకట్టి లంగరు రేవుల నేర్పఱిచిరి. నీటిరాపిడిచేత గట్టు కోయఁబడి, ఆభాగమును నీరు మట్టివేసినందునను; మఱికొన్నిస్థలములలో గట్టు దోసకాయవలె సముద్రములోనికిఁ బోయినందు

నను—ఈస్థలములలో విశేషము పాటుపోటు లేనందున ఫొనీషియనుల పడవలు తుపానుసమయములలో నిరుపద్రవముగ నిలుచుటకు వీలుపడియుండెను. ప్రకృతిచేత నిర్మింపఁబడిన రేవులులేనిస్థలములలో దేశీయులు చెమట కోర్చి, చెలియలికట్టను త్రవ్వి, 20-30 పడవలు నిలుచుటకుఁ దగిన రేవుల నేర్పఱచుకొనిరి. సైడను, టైరు, ఆరేడసు—మొదలగునవి వారి రేవుపట్టణములు. మధ్యాధరాసముద్రము పాటుపోటును లేక గ్రీష్మకాలములో సరస్సువలె నుండుటచేత నౌకాయాత్రాభిలాషగల ఫొనీషియనులకు నౌకాయాత్రఁ జేయుటకు వీలుపడెను. కాసియసు, బార్గైలసు—పర్వతోపరిభాగముల నుండి పశ్చిమముగ చూచినవారికి "కైప్రసు" దీవి అగపడుచుండెను. ఈదీవినుండి "సైలీషియా," "కారియా" దేశములకును "రోడ్సు" మొదలగుదీవులకును సులభమైన పడవప్రయాణముఁ జేయవచ్చును. కాసియసు, బార్గలసు, లెబనను—పర్వతశ్రేణులు దేశమునకు దక్షిణోత్తరముగ గోడవలె నుండును. పడవలు, వానిని గట్టుపుటకు తెడ్లును వీనికిఁ దగినకలపయును ఈపర్వతములలో మెండుగఁ గలవు. కొండల చిక్కుత్రోవలు వారికి మొదటినుండి తెలిసియుండెను, గనుక, వారామార్గముల వెంబడి పోయి, వారికిఁ గావలసిన కలపను తెచ్చుకొనుచుండిరి. వారి పురాకృతము బాగుగ నున్నందున, సేతువువలె పూర్వపశ్చిమదిశలను వారు సంధించిరి.

రత్నాకరునికి రత్నములును ముత్యములే కాదు నత్తగుల్లలు కూడ కలవు. వానిగర్భములో నేమియున్నవో, ఎవ రెఱుఁగుదురు? వీరి తీరమునందు సముద్రములో నొకవిధమైన నత్తగుల్ల కలదు. 'టైరు' పట్టణము మొదలు 'కార్మలు' పర్వతశిఖరమువఱకు నుండు తీరమున నీగుల్లలు మెండు. వీనిలో నొకపురుగుండును. దానిశిరస్సువెనుక నొకసంచి కలదు. అందులో బంకవలె నంటుకొను ద్రావకము దిగియుండును. ఇది ఉల్లివాసన కొట్టును. పురుగుతోఁ గూడిన గుల్లలను వారు పట్టుకొని, ఆసంచిలోని ద్రావకమును గరిటెతో గోకి తీయుచుండిరి. ఊలు, నూలు, లినెను బట్టలను తడిపి, వాని కీద్రావకము నంటించి, తీక్ష్ణమైన ఎండలో ఆరవేసినయెడల, క్రమముగ, ఆకుపచ్చ, నీలి, ఎఱుపు

రంగులుగ మారినపైని, ఆబట్టలను సబ్బునీరుతో కడిగినపైని తుదకు వానికి ఎఱ్ఱగన్నేరు రంగు వచ్చును. ఈరంగు శాశ్వతముగ నిలుచును. ఇట్టిరంగుబట్టలను ఫొనేషియాలో తయారు చేసి, ఇతరదేశముల కెగుమతిఁ జేయుచుండిరి.

ఈనత్తగుల్ల లెచ్చటలేవు? అంతటనున్నను, వీరితీరమున నున్నవి శ్రేష్ఠమైనవి కావచ్చును. ఇతరదేశీయుల కీవిధమున బట్టలకు రంగువేయుట తెలియదా? వారికి తెలిసినను, వీరికి రసాయనశాస్త్రములోఁ బ్రవేశము విశేషము. ఇతర దేశములలో సూర్యరశ్మి హెచ్చుకావచ్చును. ఆయా దేశములలో బట్టల నెండలో నారవేసినను, చూచుట కింపగు ఎఱుపురంగు వానికి వచ్చుట లేదు. ఈదేశములో సూర్యరశ్మి తగినటులుండుటచేత, బట్టలకు మంచిరంగు వచ్చుటకు వీలుపడెను. కనుకనే, కేవలము ప్రాచీనకాలములో వీరికి కీర్తిప్రతిష్ఠలు వచ్చుటయే గాక వారి వర్తకవ్యాపారము సాగనందున వారు ధనసంపన్నులయిరి.

ఇట్టిప్రకృతిసంపదల ననుభవించుటయే కాదు. వీరిస్థితిగతులు, లౌకిక వ్యాపారములు, రాజకీయధర్మములు మంచివి. ఇవియె వీరిఔన్నత్యమునకు కారణములు. 'మెసపొటేమియా' నుండి 'ఈజిప్టు'నకు 'ఈజిప్టు'నుండి 'మెసపొటేమియా'కు రాఁబోవుమార్గమున 'సిరియా' కొండలోయను దాటిన శత్రుసైన్యములనుఁ బశ్చిమమునుండి యీపర్వతశ్రేణు లభేద్య మగుటచేత వారీదేశమును జయింపలేక పోయిరి. కొంతవఱకు వారికొండలనెక్కి అమూల్యమైన కలపనుమాత్రము దొంగిలించికొని పోవుచుండిరి గాని, వానిని దిగిదేశముపైకి వెళ్లుటకు వీలులేక పోయెను. దక్షిణోత్తరములకు రాఁబోవునపుడు వారీదేశమార్గమునః వెళ్లుటలేదు. ఇటుల భూసైన్యములు వచ్చుట కవకాశము లేదు. ఇక, నౌకాసైన్యములు తీరము వెంబడి వచ్చుట మిగుల కష్టము. దేశమునకుఁ బూర్వదక్షిణోత్తరముల నుండుపర్వతముల ఔన్నత్యము రానురాను తీరమునకు వచ్చునరికి సమమై, చాలదూరము సముద్రములోనికిఁ జొచ్చికొని పోయినందున, తెలిసినవారుతప్ప తదితరు లాతీరప్రాంతమున పడవలు బ్రద్దలగు

నను భీతిచేత వానిని గడపుటకు భయపడుచుండిరి. మఱికొన్ని స్థలములలో నీకొండ లేటవాలుగ సముద్రమువైపు దిగినందున, తెలిసినవారు తప్ప తదితరులా చిక్కు మార్గములవెంబడిని వెళ్లుటకు వెఱచుచుండిరి. ఇట్టి అభేద్యమైన మార్గములు 4-5 కలవు. ఒకానొక కాలములో 'అసీరియా', 'ఈజిప్తు' దేశాధీశు లీ మార్గములను సాధించినను, వారి కెంతధనవ్యయమును ప్రాణహానియు కలిగెనో మనము చెప్పలేము. దక్షిణకవాటమును భేదించి దేశమును సాధించినవీరులు వారికీర్తిప్రతిష్ఠలను నిలుపుటకు కట్టించిన జయస్తంభములు "లైకసు" నదీతీరమునకు దక్షిణమున నేటివఱకుఁ గానఁబడుచున్నవి.

ఈదేశము పూర్వపశ్చిమదిశలను వర్తకమను సేతువుచేత సంధించుచున్నది. మధ్యధరాసముద్రతీరమున నుండు, గ్రీసు, ఇటాలియా, స్పానియా దేశములు, "యూఫ్రటీసు" "టైగ్రీసు" నదులమధ్యనున్నదేశములు— వీనికి వర్తకవ్యాపారము జరుగుటకు దగ్గరిమార్గ మీదేశమువెంబడిని గాని మఱియొకటి లేదు. "యూఫ్రటీసు" నదీప్రాంతములనుండి, డమాస్కసు పట్టణముగుండ, ఫోనిషియాలోని టైరుపట్టణమున కొకబిడారుమార్గము కలదు; మఱియొక మార్గము చిన్నఆసియానుండి 'హామత్తు' పట్టణము గుండ, ఈదేశములోని "ట్రిపొలీసు," "ఆరేడసు" పట్టణములకు కలదు. ఇంచుమించు క్రీస్తుపూర్వము 12-వశతాబ్దము మొదలు నాటుమార్గమున 'పెరిషియా' కపడోషియా, ఆర్మీనియా, అనటోలియా, తూర్పుననుండి యీదేశములతోను పశ్చిమముననుండు గ్రీసు ఇటాలియా, స్పానియా, ఆఫ్రికా, ఫ్రాన్సుదేశములతో సముద్రముమీఁదను ఫొనీషియా దేశమువర్తకవ్యాపారమును సాగించెను.

ఫొనీషియాకును, పాలస్టీనుకును, అనఁగా ఫిలిస్టైనులదేశము దక్షిణపు సరిహద్దు 'కార్మెలు' పర్వతశిఖరము. దీనిఎత్తు 1700 అడుగులు. ఈతీరమునన్ని పర్వతములకంటె చాలదూరము సముద్రములోని కీపర్వతము చొచ్చుకొనిపోయి యున్నది. ఈపర్వతప్రాంతదేశము ఫలవంతమై, నందనోద్యానము వలె నేత్రముల కానందసంధాయియై యున్నది. అచ్చటచ్చట రమణీయమైన

కొండలోయలు కలవు. ముద్దలు ముద్దలుగ గుమిగూడియున్న తుప్పలు, వెలవెలఁబోవు 'ఇప్ప' తరుసీడలు గుజ్జుగుజ్జుగనున్న 'ఓకు' వృక్షములు—ఇవిదట్టముగ బలిసి, ఎల్లప్పుడు పచ్చగ కనఁబడుచుండును. ఆగ్నేయమూలగా, ఈపర్వతశ్రేణి 18-మైళ్లవఱకు వ్యాపించియున్నది. ఈపర్వతమునకును సముద్రమునకును మధ్యనున్న 'ఏకరుబలుల ప్రదేశము' మిక్కిలి సారవంతమై, తీరము ననుసరించియే నిడుపుగ ఇరువది మైళ్లవఱకు వ్యాపించియున్నది; ఇఁక వెడల్పు 3-4 మైళ్లకు తక్కువకాక 'గలీలు' పర్వతముల వఱకు తట్టియున్నది. ఈ ప్రదేశమున 'బేలసు' 'కిషాను' అను రెండునదులు ప్రవహించుచున్నవి గనుక నీ క్షేత్రములు అతిసంపన్నములు వలెఁ గాన్పించుచున్నవి.

చాల్దీయులును ఫొనీషియాలోని ప్రాచీననివాసులును మొదట నేకకుటుంబములోని వారనితోఁచును. సామేతులు దక్షిణాభిముఖులై వెడలినపుడు, చాల్దీయులలోఁ గొందఱు దేశసంచారులు ఫలవంతమగు ఫొనీషియా దేశమునకు వచ్చిరి; ఇస్రాయేలీయులు ఈజిప్టు దేశమును విడిచి స్వదేశమునకు వెడలినప్పుడు, చాల్దీయులు ఫొనీషియాలో స్థిరముగ కాపురముండిరి. క్రమముగ వారు దేశము నాక్రమించిరి. గుణదోషవిలాసములలో నేమి, గుణములలో నేమి వారును, కానానీయులును సరిసమానులు. అయినను వారికి స్వగుణములు కొన్ని కలవు. వారికి వర్తకవ్యాపారములలోఁ గల నైపుణ్యమునుబట్టి, వారు సామేతికుటుంబములోని వారని తెలియనగును. గాలివాన అనిన భయములేక అపారపారావారము మీఁద నౌకాయాత్రలఁ జేయుట వారిస్వగుణము. ఏయేదేశవాసులతో వారికి వర్తకసంబంధము లుండెనో, ఆయా జనుల కనుగుణముగ వారు ప్రవర్తించుచుండిరి. ఏకాంతస్వభావులును అన్యాయాపరులు నైన "ఐజిప్టియులు" సహితము వారిని ప్రేమించుటయే కాక, తమదేశములో నొకదేవాలయమును కట్టుటకును, ఒక నూతనసీమ నేర్పఱచుకొని, అందులోఁ గాపురముండుటకును వారి కనుజ్ఞ నిచ్చిరి. వారును హీబ్రూలును పరమమిత్రులు; అటులనే, అసీరియనులును బాబిలనులును, వారి కత్యంతమిత్రులు. కనక మధ్యధరాసముద్రమునుండి పారశీకతీరమువఱకుఁ గలదేశములలో వారు వర్తకముఁ జేయుటకు సమ్మతించిరి.

అసీరియనులును బాబిలనులును వారిని జయించి వారిదేశమును స్వాధీనముఁ జేసికొనినను, వారిని మన్నించి ఎన్నికతోఁ జూచుచుండిరి. అటులనే గ్రీకులకును వారికిని వర్తకములో మిత్రపోటి యుండినను, గ్రీకుల వారికి వర్తకములో నాధిక్యము నిచ్చిరి; పారశీకులు సహితము వర్తకము సాగించుటకు వారినిఁ బ్రోత్సహించిరి.

ఐహికవ్యాపారములలో వారు తిరుగుచున్నను, మతాభిమానులై నిస్పృహులై వారు లోకములో సంచరించిరి. దేవాలయముల నాశ్రయించి, వారి పట్టణములు కట్టఁబడెను; వర్తకముమీఁద నౌకాయాత్రకుఁ బోయినపుడు పడవలమీఁద నొక దేవతావిగ్రహము నుంచుకొని వారు తరలుచుండిరి. బాబిలనులవలె, వారనేక దేవతల నారాధించుచుండిరి. 'బాలు' వారి ముఖ్యదైవము; అసీరియనుల 'అస్టార్టె' అను చంద్రదేవతను 'మహాశక్తి' యని వారు పూజించుచుండిరి; వా రామెకు బలుల నిచ్చుచుండిరి. వారిపట్టణముల కధిదేవత 'మల్కార్తు'; 'డాగను' మత్స్యదేవత; బాబిలనులు మొదటఁ జేయుచుండెడి 'అదోనిశు'ని వ్రతమును వారు కూడ నాచరించిరి. ఐజిప్టీయుల దేవతలను కూడ వా రారాధించిరి. ఈదేవతార్చనలలో వారు బలుల నిచ్చుటచేత, వారు జీవహింసకు వెనుక తీయుట లేదు; వారిలో నీదుర్గుణము తప్ప మఱియొకటి కానరాదు. అనేకలౌకికవిషయములలో వారిబుద్ధి చొరఁబడినను, పరలోకవిషయములోఁ బ్రవేశముఁ గనలేదు. వారిమతగ్రంథములలో సహితము పరలోకచర్చ కానఁబడదు. స్థూలశరీరమును విడిచిన జీవుల కీలోకవ్యాపారములు జ్ఞప్తిలో నుండునని వారు యోచించినను, జీవుఁడు శూన్యములో నైక్య మగునని వారినమ్మకము.

లౌకికవ్యాపారములలో వారందఱిని మించియుండిరి. నౌకాయాత్రలఁ జేయుటలో నేమి, నూతనసీమలను స్థాపించుటలో నేమి, వారిపేరు ముందు చెప్పవలెను. లోహక్రియలోను, గాజుక్రియలోను, వారును ఐజిప్టీయులును సరిసమానులు. వారే మొదట నావలఁ గట్టిరి; బట్టలకు రంగు వేసిరి; సముద్రముమీఁదఁ బోయి, నూతనదేశములఁ గనిపెట్టిరి. వారు కనిపెట్టి వాడుకచేయుచుండిన అక్షరసమామ్నాయము ఆధునిక పాశ్చాత్యుల అక్షరసమామ్నాయమునకు

మాతృక. లోహ క్రియలో వారు ప్రసిద్ధికెక్కిరి. హోమరు కథలోఁ జెప్పిన ప్రకారము, "పాత్రోక్లెసుని" దినవారములలో శీఘ్రగమనునికి బహుమతి నిచ్చినపుడు, ఫొనీషియాలోని 'సైడాను' పట్టణములోఁ జేయబడిన లోహపాత్రను 'అఖిల్లిసు' బహుమతిఁ జేసెను. ఫొనీషియాదేశములోఁ జేయబడి, బంగారుకట్లతోఁ గూడిన రజతపాత్రను 'టాలిమేకనునకు' 'మానిలేయనుఁడు' కట్నముగ నిచ్చెను. 'హెకూబాయి' అను లలనామణి 'అధీని' దేవతకు సమర్పించిన పీతాంబరమును, ఫొనీషియా స్త్రీలుచేసియుండిరి. సమస్తకళలలోఁ బ్రవిష్టులై, కళాభిమానులగు ఫొనీషియనులా కాలములో వారికంటె నాగరికులైనందున, నన్నిదేశములలోను వారి ప్రభ వెలిఁగెను.

దిట్టముగ కట్టఁబడిన 'తైరు' పట్టణమువారిదేశమునకు రాజధాని. ఆపట్టణము రెండుభాగములు; ఒకభాగము, రేవున కట్టఁబడెను; రెండవభాగము, మొదటిభాగమున కఱమైలుదూరమున నెదురుగ నుండుద్వీపముమీదఁ గట్టఁబడెను. ఈపట్టణమువద్ద మంచిరేవులు గలవు; తుపానుసమయములో నీరేవులకుఁ బడవలువచ్చి నిలుచును. తీరముమీఁద నుండుపట్టణము దిట్టముగ కట్టబడెను; 150 అడుగులు ఎత్తుగల ప్రాకారపుగోడ దానిచుట్టును కలదు. ఈప్రాకారముమధ్య ద్రాక్షలతలచే నావరింపఁబడిన వారి నివేశనము లుండెను.

సైడానుపట్టణము మిక్కిలి ప్రాచీనమైనది; అదియొక్క రేవుపట్టణము. తైరు పట్టణమున కిరువదిమైళ్లదూరమున నుత్తరమున నుండెను. మొదట నది చేపలవర్తకమునకుఁ బ్రసిద్ధికెక్కెను; ఇటీవల, లోహక్రియకును అంబరక్రియకును ప్రఖ్యాతిఁ బడెను. బేరూటు' పట్టణమును గుఱించి 'ఫొనీషియాదేశ ప్రాచీనచరిత్ర' లో వ్రాయఁబడలేదు, అన్నిటికంటె నుత్తరమున 'లయోడేసియా' అను పట్టణ ముండెను. దక్షిణమున, 'జార్డను' నదీప్రదేశమునకు సమీపమున 'అకరు' పట్టణము కలదు: ఈపట్టణము 'పాలస్తేను' రాజ్యమునకుఁ గవాటము వలెనుండెను. ఈపట్టణములన్నియు స్వతంత్రరాజ్యములను స్థాపించుకొని, తమతమరాజులచేఁ బోషింపఁబడుచుండెను. 'కార్తేజి' మొదలగు రేవు

పట్టణములు 'ఫొనీషియను'లచే స్థాపింపఁబడిన 'నూతనసీమలు' వారి వర్తకము సాగుటకుఁ గట్టఁబడెను; ఆపట్టణములు కూడ నొకరికి లోఁబడి యుండలేదు.

వారిసాహసమును గుఱించి 'హీరోడెటేశుఁడు' అను గ్రీసుచరిత్రకారుఁ డీవిధమునవ్రాసెను. ఒకనాఁకాయాత్రలో వారు 'ఆర్గొలీసు' రాజ్యము యొక్క తీరమునకు వచ్చిరి. గ్రీకుల నగరరాజ్యములలో నారాజ్యము వన్నెకెక్కెను. అయిదు ఆఱు రోజులు దేశీయులతో వారు వర్తకముఁ జేసి, వారికిఁ దమసామగ్రుల నమ్మిరి; ఒకరోజున 'ఇనాకసుఁ' డనురాజుకూఁతురు 'ఈఓయో' అను నామె చెలికత్తెలతోఁ గూడి వారి పడవలలోనికిఁ బోయెను. పడవలలో సామగ్రు లేమియు లేకపోయినను వీరు వారితో బేర మాడుచుండిరి. అకస్మాత్తుగ వారు వీరినిఁ బట్టుకొని, పడవలకు లంగరు నెత్తి, వానిని సాగించిరి. కొందఱు చెలికత్తెలు తప్పించుకొని పాఱిపోయిరిగాని, రాజకన్య 'ఈఓయో' మాత్రము వారిచేతిలోఁ జిక్కెను. వా రామెను తీసికొని ఈజిప్టు దేశమునకుఁ బోయిరి.'

ప్రథమమున సాహసమునకును, సముద్రముమీద దొంగిలించుటకును, వారు ప్రసిద్ధికెక్కిరి. వారు దుర్మార్గులయినను, వారు నాణెమగు వస్తువులను తయారు చేసి అమ్మకము చేయుచున్నందున, దేశీయులు వారి దుర్గుణముల నెంచక, వారిని మన్నించుచుండిరి. సిరియాదేశములో 'డేవిడు' సింహాసనము నెక్కియుండ, ఇస్రాస్తేయులు తలల నెత్తి 'జేరుసాలము' పట్టణములో నొకగొప్పదేవాలయముఁ గట్టిరి; అందుకుఁ దగిన సామగ్రిని వారు ఫొనీషియా దేశమునుండి తీసికొని వచ్చిరి. 'టైరు' పట్టణములోని రాజు 'హీరాము' అను వాఁడు లోహక్రియలోను, దారుక్రియలోను, అశ్మక్రియలోను ప్రవీణుఁడు. డేవిడు అనురాజు తననగరును కట్టించినప్పుడు, దానికిఁ దగిన దారువులను 'హీరాము' తనదేశమునుండి యంపించెను. ఫొనీషియనులును ఇస్రాస్తేయులును, అత్యంత మిత్రులయి యుండిరి.

డేవిడుకుమారుఁడు 'సోలామనుఁడు' 'హీరాము' నను, "మీరు మాయందు దయగలవారు; లోహక్రియ, అశ్మక్రియ, దారుక్రియ, అంబర

క్రియ—వీనిలోఁ బ్రసిద్ధికెక్కిన పనివాండ్రను మావద్దకుఁ బంపుఁడు. వారిని
మేము యథావిధిగ సత్కరించెదము'' అని లేఖను వ్రాసెను. అన్నివిధముల
దేవాలయము నలంకరించుటలో ఫొనీషియనులు పాటుపడిరి. ఇస్రాయేలీయు
లును వారును కలిసి సొలొమోను కాలములో వర్తకముఁ జేయుచుండిరి
ఉమ్మడిని వారిపడవలు పూర్వదిశకిఁ బోయి, అరబ్బీదేశమును, హిందూదేశము
నుండి బంగారమును, పరిమళదినుసులను, చందనతరువులను, రత్నములను
ఆఫ్రికాఖండమునను, ఆంగ్లేయదీవులకుఁ బోయి, వెండియు దంతము మొద
లగు వస్తువులను తీసికొని వచ్చుచుండిరి. ఆ రెండు దేశములవారును పరమమిత్రు
లై యుండిరి; వారి రాజులు కూడ మిత్రులు.

ఏతు-బాలుఁడు:—హీరాము చనిపోయినతరువాత, టైరుపట్టణమును
'ఏతుబాలుఁడు' పరిపాలించెను. అతఁడు 'అస్టార్తె' దేవతార్చకులలో నగ్ర
గణ్యుఁడు—అతనిపరిపాలనకాలము దేశమునకు గ్రహణకాలమువలె నుండెను.
హీరామును వధించి, అతఁడు ప్రభువయ్యెను. 'అస్టార్తె' దేవతకు నరిభటులను
విశేషము నతఁడేర్పరచుటయే కాక, ఆయాచారములను విదేశీయులుకూడ నాచ
రింపవలెనని కోరుచుండెను. ఈయుద్దేశముతో నతఁడు తనకుమార్తెను ఇస్రా
యేలీయుల రాజు, అహాబునకు వివాహముఁజేసె, జెరుసాలము పట్టణములో
'బాలు' దేవుని కొక దేవాలయమును కట్టించెను, 'జెజిరేలు' పట్టణములోని రాజ
నగరు 'అస్టార్తె' దేవతార్చకులతో నిండెను. అనంతర మామెకుమార్తె తనతల్లి
యొక్క యాచారములను నిలువఁబెట్టెను. శరీరమును కంపింపఁజేయు ఈదేవ
తార్చనలమూలమున హీబ్రూలబుద్ధి చెడిపోయెను; వీనిమూలమున రెండురాజ్య
ములు నశించెను—వీనిలో నొకయాచారమునువినిన శరీరము వణుకును.
వారా దేవతలకుఁ బసిపిల్లలను బలివేయుచుండిరి. వారివిగ్రహములు లోహముతోఁ
జేయఁబడెను, బలివేయుటకు ముందు, వారావిగ్రహముల నెఱ్ఱగకాల్చి వేఁడిచేసి
యుందురు; ఎఱ్ఱగకాఁగుచున్న విగ్రహము చేతిలో వారాపసిపిల్లలను పెట్టి,
ఆవిగ్రహముయొక్క పాదములవఱకును దానిమీఁద నాపిల్లలను దొర్లింతురు.
ఈలోపున పిల్లలు ప్రాణములను విడిచిపెట్టుదురు. మఱియొకసమయమున

వారు పిల్లలను సంచులలోఁ గుట్టి, ఆస్తార్తె దేవతాలయశిఖరమునుండి, వారా సంచులను క్రిందకు జారవిడుతురు.

క్రీ. పూ. తొమ్మిదవ శతాబ్దమువఱకును వారొకరికి లోఁబడియుండ లేదు. ఆకాలమునకు 'అసురు—నజరుపాలుఁడు' అసీరియారాజ్యమును మహోచ్ఛ్రపదవికిఁదెచ్చెను. అతఁడు దేశములను నిమిషమాత్రమున సాధించుచుండెను. వారతనికి భయపడి, అతనితో యుద్ధముఁ జేయకయే, వారతనికి లోఁబడిరి. నజరుపాలుని ప్రజారంజకమైన పరిపాలనలో వారు సిరిసంపదలతోఁ గూడి యుండిరి.

తుదకు ఫొనీషియనులకును అసీరియనులకును కలహము పుట్టెను. తైరు పట్టణపురాజు తిరుగఁబడి కైప్రసు దీవిని స్వాధీనముఁ జేసికొనెను. అసీరియా రాజు 'చతుర్ధషాల్మనేసరుఁడు' సైన్యములతోఁ బోయి వారిదేశమునంతయు సాధించెను గాని, తైరుపట్టణమును మాత్రము వశముఁ జేసికొనలేక పోయెను. ఆపట్టణము దిట్టముగ కట్టఁబడెను. అయిదుసంవత్సరము లతఁడాపట్టణమును ముట్టడించి యుండెను. స్వాధీనులైన ఫొనీషియనులు నావలతోవచ్చి, అతనికి సహాయముఁజేసిరి. అతనికిని తైరుపట్టణములోనివారికిని నౌకాయుద్ధము జఱిగెను. కాని, నజరుపాలుఁడాయుద్ధములో నోడిపోయి స్వదేశమునకుఁ బోయెను. అనంతరమాదేశము తైరుపట్టణముతోఁ గూడ స్వతంత్రమయ్యెను. మఱికొంత కాలమున కాదేశము "సేనాఖరీబు" రాజునకు లోఁబడియుండెను. అతనితరువాత "ఈసరు హదనుఁడు" రాజ్యము నేలుచుండిన సమయమున, "సైడాను, లెబనను" వీనిరాజులు తిరుగబడిరి. ఈసరుహదనుఁడాదేశమును ధ్వంసముఁజేసి విడిచిపెట్టెను; సైడానురాజును పట్టితెప్పించి, వాని శిరస్సును ఛేదించెను. "లెబనను రాజు కొండలలోనికిఁ బారిపోయెను గాని, శత్రువులు వానినిఁ గట్టి తెచ్చిరాజుయెదుట వధించిరి.

ఈవ్యత్యస్తములు శాంతమైన తరువాత, ఫొనీషియనులు పడినపాటులు చెప్పుటకు వీలులేదు. అసీరియా రాజులు వారినిఁ బీడించి ధనముఁ బుచ్చుకొను చుండిరి; ఆరాజుల సైన్యములు వారిదేశములగుండఁ బోయి దానిని పాడు

చేయుచుండిరి. ఆరాజుల పనివాండ్రు ఆదేశములోని చేవగలదారువులను తమ దేశమునకుఁ దీసికొనిపోవుచుండిరి. దేశములోని పొగరుఁబోతులను శత్రువులు మట్టివేసిరి; పట్టణములు నిర్జనమయ్యెను, క్రీ. పూ. ఏడవశతాబ్దములో అసీరియారాజ్య మస్తమించెను. కుప్పిగంతులు వైచుచు, ఫొనీషియా దేశము ప్రబలమయ్యెను; పూర్వముకంటె రెండింతలు దానివర్తక మధిక మయ్యెను. సిరిసంపదలతో దేశము తులదూఁగుచుండెను; ఏదేశములోఁ జూచినను, దాని ప్రభ వెలిగెను; ఏదేశవాసులు కూడ, దానివస్తువులనే వాడెదరు; ఏనాణెమైన వస్తువైన ఆదేశమునుండి రావలెను; ఏనాణెమైన పనిని చేయించవలె ననిన, పనివాండ్రా దేశమునుండి వచ్చి, అపనిని జేయవలెను; చేవగలదారువులు ఆదేశమునుండి తేఁబడెను—"డామస్కసు" పట్టణమునుండి పరదేశములకు బిడారిమార్గము లనేకములు కలవు. అరబియా, అర్మీనియా, అసీరియా, ఇండియా—మొదలగుదేశములకు రాకపోకలు జఱుగుబిడారుమార్గము లాపట్టణమువద్ద కలియుచుండెను. నానాదేశములనుండి వచ్చినవర్తకు లాపట్టణములో సమావేశమగుచుండిరి. ఆపట్టణము వర్తకమునకుఁ బుట్టినయిల్లువలె నుండెను. ఈవైభవమంతయు నంతలో మాయ మయ్యెను.

టైరు, సైడాను—ఈరెండుపత్తనముల రాజులు ఈజిప్టుదేశముతోఁ గలిసి తిరుగఁబడినందున, "నబుచెడ్నెజరు" అనురాజు వారిపైకి దండువెడలి, వారివైభవము నపహరించెను. ఎటుచూచినను పాడుకొంపలును, పాడుపడిన భూములును, తప్ప మఱియొకటి కానరాదు. చిమ్మచీఁకటి దేశమంతయు వ్యాపించెను; నలువైపులఁ బెద్దమ్మ నాట్య మాడెను. భోగములు శాశ్వతములుకావు. అయిదుసంవత్సరములవఱకు "టైరు" పట్టణము శత్రువులకు లోఁబడక నిలువఁబడియుండెను గాని, వేనవేలమనుజులు నశించిరి; మఱి పదమూఁడు సంవత్సరములు గతించినతరువాత నాపట్టణము శత్రువులకుఁ జిక్కెను. దాని ప్రాకారమును, గృహములును, చిటిలిపోయెను; దానిసంపద సన్నగిల్లెను; మఱియేఁబదిసంవత్సరములవఱకు నాపట్టణము తలసెత్తి సంచరించలేదు.

బాబిలనుపట్టణము పారశీకరాజునకు స్వాధీన మయినతరువాత, ఫోనీషి యనులు స్వతంత్రించుటకుఁ బ్రయత్నించిరి; కాని, వారిఆటలు సాగలేదు. ఆఫ్రికాఖండమున నుత్తరమున సముద్రతీరమున నుండు "కార్తేజి" పట్టణ మును వారు పూర్వకాలములోఁ బ్రతిష్ఠఁజేసి కట్టిరి. ఆపట్టణమును సాధించుటకు పారశీకరాజు "కాంబేశీశుఁడు" వారిని నావలతో వచ్చి సహాయముఁ జేయు మనికోరినపుడు వారతనిమాట నిర్లక్ష్యముఁ జేసిరి. మఱికొంతకాలమువఱకుఁ బారశీకరాజులు వారిని ఉపేక్షఁజేసిరి. అనంతరము, డారేయసు కాలములోను, జరజేశుని పరిపాలనలోను, పారశీకులకును గ్రీకులకును జఱిగిన యుద్ధములో, వారు నావలతోఁ బోయి పారశీకులకుఁ దోడ్పడిరి. నాఁడు "సాలమీసు" నద్ద జఱిగిననౌకాహవములో ఫోనిషియనులు విశేషముగ దెబ్బలఁ దినిరి. అపజయ మునకు వారు కారణభూతులని యెంచి, జరజేశుఁడు వారిలోని ముఖ్యులను రప్పించి, వారిని వధించెను. అది చూచి హతశేషులైనవారు పడవలలో నెక్కి స్వదేశమున కతిత్వరితముగ వచ్చిరి. మఱి పదియేనుసంవత్సరములవఱకు వారిని పారశీకరాజులు స్మరించలేదు. ఆనాటికి అధీనియనులకును స్పార్టనుల కును జగడము రగిలినందున, తత్కాలానుసారముగ వారిలో నెరికైన సహా యముఁ జేయుటకు, పారశీకరాజు వారిని నావలతోఁ బంపుచుండెను.

క్రమముగ పారశీకరాజ్యము క్షీణించినకొలఁది, వారు స్వతంత్రించుటకు సిద్ధపడిరి, గాని పారశీకులు వారిని మట్టిచేయుచుండిరి: "ఇస్ససు" వద్ద జఱిగిన యుద్ధములోఁ బారశీకు లోడిపోవుటకుఁ బూర్వము, వారు సైదాను పట్టణమును ముట్టడించి సాధించి నేలఁ గలిపిరి. ఆపట్టణము మఱల పుష్టి చేసి బలిసిన సమయమునకు, పారశీకము మొదలగు దేశములను, సాధించి, "మహా అలగ్జాండరు సైన్యములతో ఫొనీషియాదేశములోఁ బ్రత్యక్ష మాయెను. ఆదేశమున నుత్తరమున నుండిన పట్టణము లన్నియు, అదిగ్విజయుని పాదా క్రాంతము లయ్యెను.

ఇంతకుపూర్వము కొంచెము కాలము క్రిందట దెబ్బలుతిని యుండుట చేత, సైదోనుపట్టణము కానుకలను విజయుని ముందటనుంచి, ఆతనికి జోహారొనర్చెను. టైరు పట్టణము కూడ జోహారు ననుచు నుపాయనములతో నతని యెదుట నిలువబడి యుండెను. అప్పు డతఁ డాపురవాసులఁ జూచి "మీ 'మల్కారు,' దేవుఁడును మా 'హెర్క్యులీసుఁడు'ను ఒకరు; కనుక మేము మీపట్టణముతోఁ బ్రవేశించి, మీదేవునకు హోమముఁ జేసెద మ"ని చెప్పెను. ఇంతవఱకు వారిపట్టణములో విదేశియుఁ డొకఁడు పాదముఁ బెట్టి యుండలేదు. నీ వతఁడు పట్టణములోఁ బ్రవేశించుటకు వారియ్యకొందురా? అతఁడు నగరములోనికి వచ్చిన, వారి పరువు పోవును; అతనిని రాకూడ దనిన, నతఁడు వారితోఁ గలహించును. అందుచే వారొకపన్నాగముఁ బన్ని, "మాపట్టణమున కెదురుగనుండు దీవిలో మల్కారు దేవాలయము కలదు. అందులో మీరు హోమముఁ జేయవచ్చును" అని వారతనితో విన్నవించిరి. ఆమాట కతఁడు మండిపడి, "మీపట్టణములోని దేవాలయములో మేము హోమముఁ జేయుదుము; కాని, మీరిచ్చినచోటను చేయము" అని చెప్పెను. అందుకు వారియ్యకొనలేదు. వారు నగరములోనికిఁ బోయి, దానిని దిట్టపఱచి యుద్ధమునకు సన్నద్ధు లయిరి. వారిపట్టణమునకు నలువైపుల ప్రాకార ముండెను; అగడ్తవలె దానిచుట్టు సముద్రము కలదు. అలెగ్జాండరు దానిని సాధించుట కనేక విధములఁ బ్రయత్నించెను. కాని, అతని ప్రయత్నములు నిష్ఫల మయ్యెను. అతఁడు పట్టుదలకలవాఁడు గనుక నావలను తెప్పించి, చాలవ్యయప్రయాసముల పైని, ఆపట్టణమును సాధించి దానిని నేలఁగలిపెను. ఆపట్టణవాసులలో బురుషుఁ డొకఁడైనను శత్రువునకుఁ జిక్కక, అనితలమునఁ బడెను. విజయుఁ డాపట్టణములోఁ బ్రవేశించి, స్త్రీలను బాలురను పట్టితెప్పించి, వారిని బానిసలుగ నమ్మివేసెను. అనంతర మతఁడు చేసిన ప్రతిజ్ఞ ప్రకారమాపట్టణములోని మల్కారు దేవాలయములోనికిఁ బోయి హోమముఁ జేసెను.

దేశములను జయించుట చేతఁగాని, దేశీయులను క్షోభపెట్టుటచేతఁగాని, ఫోనీషియనులు కీర్తిని సంపాదించలేదు. ప్రాచీనరాజ్యములలో వారిది చిన్న రాజ్య మైనను, ఫొనీషియా దేశము వన్నె కెక్కెను. వారిసాహసము, వారిధైర్య స్థైర్యములు, వారి వ్యాపారములలోని నైపుణ్యము, నలువురితో వారిపొత్తు, వారి స్వతంత్రేచ్ఛ—ఈగుణములచేతనే వారుకీర్తివంతు లయిరి. నేఁటితో వార స్తమించిరి.



శ్రీరస్తు.

# హీబ్రూలదేశచరిత్ర.

## షష్ఠప్రకరణము.

---

## ఇరువదియేడవ అధ్యాయము.

క్రీ. పూ. సం. 2000—63 లు

ఫొనీషియాదేశమునకు దక్షిణమున హెబ్రూలదేశ ముండెను; వారిదేశము గుండ "జోర్డను" నది ప్రవహించుచున్నది. కాని నేతులదేశము మెట్టభూములలో వారు నివసించి యుండిరి. ప్రాచీనదేశీయులలో నొకరైనను సుగుణసంపత్తిలో వారితో సమానులు కారు. పరలోకమునుగుఱించి అపూర్వమగు విషయములను లోకమునకు వెల్లడిఁజేయుటకొఱకు, భగవంతునిచే 'నిర్దిష్టజనులని' వారు పేరొందిరి. పరమేశ్వరుని 'నిర్దిష్టజనుల' మనుసంగతి వారలోఁ బ్రతిమనుజుని హృదయములో నాటియుండినందున, వారి కెన్నికష్టములు వచ్చినను వారు వానిని నిర్లక్ష్యముతో భరించుటచేత, సామాన్యులకంటె వారధికులయిరి. అట్టి వారిచరిత్ర నిందు పొందుపఱచుచున్నారము.

వారు మొదట నొకచిన్నకుటుంబమువారై, క్రమముగ నొకసంఘము క్రింద చేర్పడిరి; వారి జాతివారు బాల్యదశలో నుండినపుడు; బానిసలుగ నుండిరి. వారు క్రమేణ వృద్ధినొందిరి. వారు స్వదేశమునకు వచ్చి, పోరాడి దానిని సాధించి సిరిసంపదలతోఁ గూడి బలవంతు లయిరి. అంతలో అసీరియాదేశపు పోటు తగిలినందున, కొంచెము వారు కృంగిరి; కాని, వారికి మరల జయ వచ్చునంతలో అసీరియనులు వారిని గాలి కెగరవైచిరి. ప్రాచీనకాలములో నేపాటిపేరు

ప్రతిష్ఠలుఁ గల ప్రతిరాజుతో వారు సంబంధము గలుగఁ జేసికొనిరి. ఐజిప్టీయులు వారినిఁ గష్టపెట్టిన యజమానులును అసీరియనులును; బాబిలోనియనులును వారిని సాధించిన విజయులు; ఫోనీషియనులు వారి పొరుగువా రుండిరి; పారశీకులు వారిశత్రువులు రోమకులు వారినిఁ బీడించిరి. ముందుకు రానురాను లోకములోఁ బ్రతిపట్టణములో వారు కాపుర ముండిరి. ఎచ్చటనున్నను, వారిని శీఘ్రముగ తెలిసికొనఁగలము; వారి రూపరేఖా విలాసములచేతఁ గాక, వారి గుణములచేతను కూడ వా రొంటరిలోను నిర్ధారణీయులు—నాఁడు జూడాదేశములో నుండినప్పుడువలె నేఁడు కూడ వారు నిగూఢమగు ప్రవర్తన కల వారును ధనాకర్షణలో సూక్ష్మబుద్ధి గలవారై యుందురు. ఇతరదేశీయుల చరిత్రను వారిచరిత్రతో సరిపోల్చి చూచిన, వారిబలమునకును ఏకాంత స్వభావమునకును కారణము తెలియును.

ప్రాచీనులలో వారు మాత్రము నిశ్చలమగు ధర్మబుద్ధి గలిగియుండిరి. తదితరదేశీయు లనేక దేవతల ననేకవిధముల సగుణముగ నారాధించుచుండినదినములలో, సమస్తలోకముల నేలుచుండెడి భగవంతుఁ డొకఁడేయని వారునిర్ధారణఁజేసి లోకములకుఁ జాటిరి. కాలమంతయు వారి కీబుద్ధి నిశ్చలముగ నుండక పోయినను, వారిలోఁ గొందఱికి మాత్ర మీజ్ఞాన ముండెను. ఈజ్ఞానముకంటె వారికిఁ గావలసినది యేమియున్నది? ఇందుచేత వారందఱికంటె నధికు లయిరి.

క్రీ. పూ. సం॥ 2350—2200 రములు. పితృవ్యయుగము:—మానవజాతిలో హీబ్రులు సామేతకుటుంబములోని వారు. చాల్డియదేశము వారి జన్మభూమి. వారి స్వదేశము హితేతుల దండయాత్రచేతనస్వాస్థ్యముగ నుండుటచేతనో, లేక స్వదేశములో వారికి దినచర్య జరుగుట కష్ట మగుటచేతనో, వారు స్త్రీపురుషులు పశువులమందలతోఁ గూడి 'ఆరు' పట్టణమును విడిచి, దక్షిణాభిముఖులై వచ్చి వచ్చి, ఫోనీషియాదేశపు పొలిమేరలను గడచి, కాననేతుల మెఱకభూములలోఁ బ్రవేశించిరి. 'జార్డను' నది ప్రవహించుటచేత నాదేశము ఫలవంత మైనది; కనుక, నేకకుటుంబములోని వారైన, మోాబేతులు, కాననేతులు, అమనేతులు, ఈదోమేతులు—మొదలగువారితోఁ గూడి, ఆదేశములోని పశ్చిమభాగములను వా రాక్రమించిరి. వారి కాదేశ

మానుకూలముగ నుండు నని దివ్యజ్ఞానముచేతఁ దెలిసికొని, ఆదేశములో 'అబ్రహాము' వారితో నివసించెను. క్షామము వచ్చినపుడు సహిత మతఁ డచ్చట నే యుండెను; అతనిపరివారములోఁ గొందఱు మాత్రము "ఈజిప్టు" దేశమునకుఁ బోయిరి; కాని మరల వారు స్వదేశమునకు వచ్చిరి. అచ్చటనే 'అబ్రహాము'న కిద్దరు కుమారులు కలిగిరి; వారిలో నొకఁడు "ఈజాకు;" అతనిమూలమున వారు ప్రబలులై ముందుకు "పాలస్తేను" దేశమునకు ప్రభువులయిరి. జ్యేష్ఠుఁ డగు "ఇష్మాలు" బహిష్కృతుఁడు; నేటివఱకు సంచారావస్థలో నుండిన, అరబ్బు లతనినిఁ దమమూలపురుషునిగ భావింతురు. పాలస్తేను దేశమునకుఁ దూర్పున నుండు జాతివారలకు అబ్రహాముయొక్క తదితరకుమారులు మూలపురుషు లయిరి. ఈయుగములో వారు శైశవదశలో నుండిరి; వారు పట్టణములలో నివసించుటలేదు. వారు లొట్టియమీఁదను గాని లేక ఖరములమీఁదను గాని దేశములగుండఁ బోవుచుండిరి. ఎచ్చటనైన పచ్చికభూములును నదులును వారికి గోచరమైన నారచ్చటఁ దమపశువులతో నిలుచుచుండిరి. వారినాయకులకుమాత్రము గుడారము లుండెను. వారు క్షీరములఁ ద్రాగుటయే కాక, మేఁకమాంసముఁ దినుటకలదు. కొంచెముకొంచెము ద్రాక్షరసము వా రుపయోగించిరి.

క్రీ. పూ. సం. 1700 రము వారిలో మృగయులని, పశుపాలకులని, హాలికులని, మూఁడు జాతులవారు కలరు. ఈహాలికులకుఁ బొటలను నిలువఁ జేయుట తెలియదు; అందుచేత వారు క్షామములచేత బాధపడుచుండి, ఈజిప్టుదేశమునకుఁ బోయి, అచట నైలునదీతీరమున నివసించిరి; ఆసమయమున వారు ఈజిప్టుపైని "గోపాలరాజుల" చేత నాదరింపఁబడిరి. ఆదేశములో వారు పడినపాటులును, అచ్చటనుండి వారిని "మోసెసు" ఏవిధమున స్వదేశమునకుఁ దీసికొనివచ్చి రక్షించినసంగతియుం, ఇదివఱకుఁ జెప్పియున్నాము. ఆనాటికి హీబ్రూలు సాంఘికులై యుండలేదు; వారే విధమైన నియామకములు లేక యుండిరి.—భగవంతుని "నిర్దిష్టజనుల" మనెడి బంధనము తప్ప, వారిలోఁ వారికి మఱి యేవిధమైన సాంఘికానుబంధములు లేవు. అరబీదేశపు ఎడారు

లలో వారు మోసెసుతోఁ గూడి పడిన శ్రమలను చెప్పలేము; వారటులఁ గష్టపడినందున, ముందున వారికి శ్రేయస్సు కలిగెను. దేశకాలము లనుగుణ్యము లగుటచేత వారు క్రమముగ బానిసవృత్తిని మాని స్వతంత్రావస్థలోనికి వచ్చిరి; మోసెసుయొక్క ధర్మమున వారు సాంఘికసూత్రములకుఁ గట్టుపడిరి; క్రమముగ న్యాయవిధుల కలవడిరి.

క్రీ. పూ. సం॥ 1100 రము—'పౌరుషేయ యుగము'. 'కానన్తేతుల' దేశమునకు వచ్చినది మొదలు రాజ్యాధిపత్యము స్థాపింపబడువఱకు 'హీబ్రూల' సాంఘికరాజ్యము వర్ధిల్లెను—"ఇస్రాయెలు" అనువాని సంతతివారు కనుక, వారికి "ఇస్రాయేలీయులు" అని మఱియొక నామము కలదు. ఈయుగమునకు వీర యుగ మనిసంజ్ఞ కలదు—ఈకాలములో దక్షిణోత్తరముల నుండిన కాననేతులతో వారు పోరాడి జయప్రదులయిరి. ఈకాలములో కాననేతులు, వేర్వేఱుసంస్థానముల నేర్పఱచుకొని యుండిరి; ఒక్కొక్కసంస్థానమున కొక్కొక్కరాజు కలఁడు;వారిరాజ్యము భిన్నమై యుండెను; వేర్వేఱ వారు, హీబ్రూలతోఁ బోరాడిరి; కాని వారు యుద్ధములో నోడిరి. ఈయుద్ధములలోహీబ్రూలలోఁ గొందఱు పురుషులు ప్రసిద్ధి కెక్కిరి. "జోషువా" అనువానిజయదుందుభులు మ్రోగు,"జరికో" పట్టణప్రాకారములు చిటిలిపోయెను; 'గిడియను' అనువాఁడు 'బాలు' దేవునియూపస్తంభమును తీసివేసెను. ఉత్తరకాననేతుల రాజుయొక్క సేనాధిపతియైన 'శిశరుఁడు' అనువానిని 'జాయిలుఁడు' యుద్ధములోఁ జంపెను. హీబ్రూలు దిగులు నొందియుండినపుడు, 'డెబోరా' అను నామె వారినిఁ బ్రోత్సహించెను. ఆమె చెప్పినజయకీర్తన హీబ్రూభాషలో మృదుమధురశైలిని వ్రాయఁబడియున్నది. ఆకీర్తనఁ జదివినయెడల, ఆకాలములో వారిజాతుల వృత్తాంతమంతయుఁ దెలియనగును. ఆయుద్ధములలో వారు పడినశ్రమల నామె వర్ణించెను.

పాలస్తేను దేశతీరమునుండి 'ఫిలస్తేనులు' సైన్యములతోఁ గదలి వచ్చి ఇస్రాయేలీయుల నెదిరించిరి. వారిరాజధానియైన 'గాజా' పట్టణమున కెదుట 'సామ్సను' అను వాఁడు చేసిన పౌరుషకృత్యములను శత్రువులు సహితము

మెచ్చిరి. కాని 'ఫిలస్తీనులు' జయించి, 'నోవా' అనువాని కాలమునాటి నావను దొంగిలించికొని పోయిరి. అటుల దీనులై యుండిన వారి నుత్సహించి, 'ఫిలస్తీను'లను 'సామ్యూలు' అనువాఁ డోడించెను. అతనికుమారుల కాలములో సాంఘికరాజ్యము చెడినందున, నేకరాజ్యాధిపత్యము స్థాపింపఁబడెను.

ఏకరాజ్యాధిపత్యము:—క్రీ. పూ. సం॥ 1020 రము.—మాటిమాటికి 'ఫిలస్తీనులు' దాడివచ్చినను, ప్రభుభక్త్యుత్సాహశక్తులతోఁ గూడిన 'సాలు' అనువాఁడు రాజ్యమును నిలువఁబెట్టెను; కాని, కొంచెముకాలములో నతనికి మతిభ్రంశము కలిగెను. అప్పుడప్పు డతఁడు వెఱ్ఱివానివలెఁ జేష్టలఁ జేయుచుండెను. 'డేవిడు' అనువాఁ డతనిసేనాధిపతి; వానిఁ జూచి, అతఁ డసహ్యపడెను. అంతలో నతఁడు 'గిల్బోవా' వద్ద జరిగిన యుద్ధములోఁ జనిపోయినందున, సర్వజనరంజకుఁడైన 'డేవిడు'ను వారు రాజుగ నేర్పఱచుకొనిరి.

డేవిడు సింహాసనము నెక్కినతోడనే, వారి రాజ్యమునకు స్వాస్థ్యము వచ్చెను; భిన్నములై సదా పోరాడుచుండెడివారు నేఁడేకీభవించి మిత్రులయిరి. దేశముపైకి శత్రువులు దాడి వచ్చుటలేదు. ఒక పట్టణమున నతఁడు రాజధానిగఁ జేసెను. "యూఫ్రటీసు" నదీతీరము మొదలు సముద్రమువఱకును, దక్షిణమున "ఈజిప్టు" మొదలుకొని ఉత్తరమున "లెబనను" పర్వతముల వఱకు నతని రాజ్యము వ్యాపించెను. దేశసంరక్షణార్థ మతఁ డొక సైన్యమును నిలిపి, దానినిఁ బోషించుచుండెను; ఇరుగుపొరుగు దేశీయులతో నతఁడు సఖ్యముఁ జేసెను; అతని ప్రతాపముచేత వారు వీరుల మని విఱ్ఱవీఁగి దేశములలోఁ బ్రఖ్యాతి నొందిరి.

అతని కుమారుఁడు "సాలమనుఁడు" రాజ్యమునకు వచ్చినతరువాత, వారిదేశము మహోచ్చపదవికి వచ్చెను. ఫోనీషియనుల సహాయముచేత, నతఁ డొక దేవాలయమును 'జెరుసలాము' పట్టణములోఁ గట్టించెను. హీబ్రూలచేత నారాధింపఁబడు 'జిహోవా' యొక్క దేవాలయ మని దేశములలో నది ప్రసిద్ధి కెక్కెను. 'లెబనను పర్వతారణ్యభవనము'లో వారు రాచకార్యములను నిర్వర్తించుచుండిరి; దానిచిత్రములఁ జూచుటకును, లేక సిరియాదేశపువస్తులను

ధరించిన "సొలామనుని" ధానుష్కులఁ జూచుటకుఁ గాని, లేక ఈజిప్టుదేశపు
కన్యయైన స్వభార్య విలాసార్థమతఁడు ప్రతిష్ఠఁజేసిన మహోద్యానములఁ జూ
చుటకుఁ గాని దేశదేశములనుండి ప్రజలు వచ్చుచుండిరి. ఇంతమహావైభవములలో
నుండినను, నిర్మలమగువారిమనోవ్యాపారమునకు భంగము వచ్చెను. అనేకదేశ
కన్యలను "సొలామను" వివాహమాడినందున, వారికి వేర్వేఱ దేవాలయములఁ
గట్టించి వానిలో స్వదేవతారాధనలఁ జేయుచుండిరి. ఉత్తరమున నుండిన "డా
మస్కసు" అను ముఖ్యపట్టణమును, దక్షిణమున నుండిన "ఈదోము" అను
పరగణాయు ఈరెండును తిరుగఁబడి స్వతంత్రులయిరి. ఈదేశముఁ జూచిన
'ఈజిప్టు' దేశమునకుఁ గూడ నసహ్యము పుట్టెను. ప్రజలుకూడ పన్నులనిచ్చు
కొనలేక ఘూర్ణిల్లుచుండిరి; అట్టివారని లేవఁదీసి, జిరోభముఁడు తిరుగఁబడెను;
అతనికి 'ఈజిప్టు' సహాయముఁ జేసెను. సొలామనునితో హెబ్రూలప్రభుతగ్గెను.

సొలామనునికుమారుఁడు 'రేహోభముఁడు' రాజ్యమునకు వచ్చెను. పనుల
విషయమై రాజునకును ప్రజలకును వ్యవహారముపొసఁగక పోయెను. అందఱు
నొక్కమ్మడిని రాజుపైని లేచిరి. పదునొకండు జాతులలోఁ బదిజాతులవారు
జిరోభముని పక్షమునకుఁ బోయిరి. స్వపక్షము నవలంబించి యుండిన 'జూదుల
వద్దను 'రేహోభముఁడు' పాఱిపోయెను. నాటినుండి 'హెబ్రూల' రాజ్యము ద్వి
విధమాయ్యెను; ఉత్తరమున ఇస్రాయేలీయులరాజ్యము; దానికి రాజధాని 'సమే
రియా' నగరము — ఈరాజ్యము నూతనముగ స్థాపింపఁబడెను. దక్షిణమున ప్రాచీన
జూదులరాజ్యము; దీనికి రాజధాని 'జేరుసాలము' అను పట్టణము. రాజ్య మద్వై
తముగ నుండినంతకాలము దిట్టముగ నుండెను; ఎన్నాఁడు ద్వైత మాయ్యెనో,
ఆనాఁడు ఆరాజ్యమునకుఁ గీడు మూడెను. 'ఈజిప్టు' దేశపుసైన్యములు జేరుసాల
మును ముట్టడించి నాశనముఁ జేసినవి; డామస్కసు పట్టణపుసేనలు దాని ప్రాకా
రములను వ్రక్కలు చేసినవి. 'అహాబు' అనువాఁడు రాజ్యము నేలుచుండ,
ఇస్రాయేలీయుల పదిజాతులవారును ధర్మమార్గమును విడిచిరి. సైదాను పట్టణపురాజు
కూఁతురు 'జేజీబేలు' అను నామెను 'అహాబు' వివాహమాడి, ఆమెమూలమున
'ఇస్రాయేలీయుల' దేశములో, 'బాలు' దేవతారాధన స్థాపించెను. ఈనూతన

మతాభిమానుల పోరుపడలేక, ప్రాచీనమతగురువులు దిక్కులం బట్టి పోయి కొండలలోయలం జేరిరి. ఎన్నికష్టములనైనం బొందిరి గాని, ఈప్రాచీనమత గురువులు స్వమతమును విడువలేదు. ధర్మము కొఱకును స్వతంత్రమునకును వారు కత్తిం గట్టుకొని సిద్ధపడు చుండిరి; రాజులు ధర్మమార్గమును విడచి సంచరించిన యెడల, నిర్భయముగ గురువులు వారియెదుటికిం బోయి, తప్పులం జూపి, వారిని సన్మార్గమునకుం దెచ్చుట కలదు. 'ఎలీజా' అనువాం డీమతగురువు లలోం బ్రసిద్ధి కెక్కెను. ఒకసమయమున దేశములో క్షామము వచ్చెను; అప్పు డతండు 'బాలు' దేవతార్చకులను పిలిచి 'ఓయి అర్చకులారా! మీదేవుండు సత్యవంతుం డైనయెడల నీక్షామమును బోంగొట్టుటను సమర్థుం డగు నని' వారి తోం జెప్పెను. ఆక్షామమును మాన్పుటకు వారిదేవునకు శక్తిలేనందున, అతండు 'జిహోవా' దేవునిం బ్రార్థించి, దేశము నాబాధనుండి తప్పించెను. అంతటితో విగ్రహారాధనను విడిచిపెట్టి 'జిహోవా' దేవునిం బూజించుచుండిరి. అనంత రము 'డామాస్కసు' పట్టణమును ముట్టడించి యుండిన సిరియనులను వారు జయించిరి; ఈలోపున దక్షిణమున నుండిన 'హెబ్రూల' 'జూడా' రాజ్యముకూడ వృద్ధిచేసి బలిసి పెరిగెను. ఇస్రాయేలీయులరాజు 'అహాబు' నతని అతనిభార్య 'జెజిబేలు' నను వారికి గలిగిన కుమార్తె 'అతేలియా' అనునామెను 'జూడా' దేశపు రాజు వివాహమాడినందున, రెండురాజ్యము లేకమయ్యెను; కాని, ఆవివాహ మూలమున రెండురాజ్యములును నశించెను. 'ఈడాము' దేశము మరల తిరుగం బడెను; జూడులవాడలు సముద్రములో వ్రక్కలయ్యెను. ఫిలస్తీనులును అరబ్బులును దేశములోం జొచ్చిరి. అంత కంతకు అసీరియారాజు వారినిం దఱుము కొనివచ్చెను. రెండుదేశము లరాజకములై యుండెను. రెండురాజ్యములలో నంతఃకలహములు ప్రబలమైనందున, జూడులరాజు, 'ఆహాబు' అనువాండు అసీరియారాజు 'తిగ్లతపిలేశరు'ని శరణుం జొచ్చెను. ఇస్రాయేలులను 'తిగ్లతపిలేశరుండు' సాధించి రెండురాజ్యములవారినిం బీడించి ధనము నతండు రాబట్టెను. ఈజిప్టుదేశమును సహాయముం జేసికొని ఇస్రాయేలులు తిరుగంబడినందున, వారి రాజధాని 'సామేరి' నగరమును 'షాల్మనేశరుండు' ముట్టడించి సాధించి నేలం

గలిపెను; నాటినుండి, ఇస్రాయేలీయుల ప్రభ తగ్గెను. వారిరాజ్యముకూడ నస్తమించెను; వారిపదిజాతులవారును దిక్కులఁ బట్టిపోయిరి.

మఱికొంతకాలమునకును జూడారాజ్యమును 'హిజికేయుఁడు' పరిపాలించి, దానిని నిలువఁబెట్టెను. అతనికాలములో జేరుసాలెము పట్టణమును అసీరియారాజు 'సేనాఖెరీబు' ముట్టడించెను; కాని, అతనిసైనికు లునయముగు సరికి ప్రాణములను విడిచి పడియుండిరి; అందుచేత నతఁడాపట్టణమును సాధింపలేకపోయెను — అనంతరము దుర్బలుఁడైన 'మనేసహుఁడను' వానికాలములో నాజూడారాజ్యము నీరసపడి, విదేశీయులకు స్వాధీన మయ్యెను.

అసీరియారాజు 'ఈసరుహదనుఁడు' సైన్యములతో దేశముగుండఁ బోయి దేశమును నాశనముఁ జేసెను. మఱికొంతకాలమునకు 'ఐజిప్టీయులు' దేశములోనికి వచ్చి 'జేరుసాలెము' పట్టణమును పట్టుకొనిరి. ఈదెబ్బలనుండి తేఱి వారు పుష్టిఁజేయుచుండిన సమయమున, బాబిలను రాజు 'నబుచడ్నెజరు' వారి సర్వము నపహరించెను; వారిరాజును, రాజకుటుంబమును, సామంతులను — బాబిలనుపట్టణమున కతఁడు తీసికొనిపోయి చెఱసాలలోఁ బెట్టెను. క్రీ. పూ. సం॥ 587-రములో నాపట్టణము నేలఁ గలిసెను; ప్రాకారములును, రాజభవనములును, సామంతులనివేశనములును, దేవాలయములును — పట్టణమునకు రూపమును తెచ్చుసమస్తమును మాయ మయ్యెను.

పునరుద్ధారణ క్రీ. పూ. సం॥ 536 రము: —

ఇటుల హీబ్రూలు విదేశములోఁ గాలముఁ గడుపుచుండిరి. బాబిలోనియనులు వారిని బానిసలుగఁ జూడకపోయినను, వారు తమ అస్వతంత్రజీవనమునకుఁ గలఁగుచుండిరి. వారిలోఁ గొందఱికి రాజయోగము పట్టినను, వారికి స్వదేశాభిమానము నశింపలేదు; వారిని స్వమతాభిమానము విడచుటలేదు. వారిలోఁ గొందఱు మృతినొందినను, వారిసంతతివారు, వారిపౌరుషమును నిలుపఁ బెట్టిరి. ఇంతలో ననేకమార్పులు సంభవించెను. పారశీకరాజు 'కైరసుఁడు' బాబిలనురాజ్యమును మాపివేసెను. అప్పుడు హీబ్రూల ప్రధానమంత్రి 'డానియేలు' అనువాఁడు రాజువద్దకుఁ బోయి, వారాదేశములోఁ బడుచుండిన పాట్లు నతి

నికి విన్నవించి, అతనియనుజ్ఞఁ బడినవారిని స్వదేశములోఁ బునస్థాపితులఁ జేసెను.

స్త్రీపురుషాదు లాబాలవృద్ధులు తమతమపశువులతోను పరిచారకులతోను బాబిలనుపట్టణమునుండి బయలువెడలి యెడారిమార్గము గుండ పాలస్తీనుదేశము నకు నడిచిరి. మార్గములో ననేకవిఘ్నముల వారిదేవుఁడు 'జిహోవా'ను వారు సంకీర్తనఁ జేసిరి. వారు "జెరుసాలెము" పట్టణములోఁ బ్రవేశించి నిర్జనుష్య మై యుండినదానిఁ జూచి కన్నీరు విడిచిరి. అందులోని దేవాలయమును వారు కట్టి 'ఓ జిహోవా! నీకటాక్షముచేత, నీఆలయమునుకట్టుటకీనాటికి మాకు శక్తి కలిగె'నని వారుపాడుకొని, ఆలయమును ప్రతిష్ఠఁ జేసిరి. దేశీయులవలె నాదేవా లయము కూడ తేజోవిహీనమై యుండెను. విదేశీయులు పట్టణములోనికి వచ్చి కాపురముండుటకు హీబ్రులు సమ్మతింప లేదు; అందుచేత "సామేరి" నగరము వారు దేవాలయమును కట్టునప్పు డనేకవిఘ్నములను తెచ్చిరి. పారశీకరాజునొద్ద నానగరవాసులు రాజమాన్యరాజపూజితులై యుండినందున, వారిమాటలు సాగెను; పట్టణమును కట్టుటకుఁగూడ వారు నిరోధించిరి. ఇట్లు తొంబది సంవత్సరములు గడచెను. 'అర్తజగజేషుఁడు' పారశీకరాజ్యము నేలుచుండెను. "నెహీమాయుఁడు"ను రాజు పానపాత్రవాహకుఁ డొకఁడు రాజాజ్ఞఁ బుచ్చుకొని, ఎందఱో శత్రువర్గములు విఘ్నముఁ జేసినను వాని నతిక్రమించి, శీఘ్రములో నాపట్టణముఁ గట్టించెను. పూర్వమునందలె దేవాలయములో భోగరాగాదులు జరిగెను; ధర్మశాస్త్రగ్రంథము గానముఁ జేసెను.

ఇంతలోఁ బారశీకరాజ్యప్రభ తగ్గెను. గ్రీకులు మహోచ్ఛ్రయదశనుండి జారిపడిరి. పిదప యిట్లుండగ "మాసిడోను" రాజ్యప్రభ దినదినప్రవర్ధమాన మయ్యెను. అలెగ్జాండరు గ్రీకులను సాధించి, పారశీకులను పాఱఁదోలి ఫోనీషి యాదేశముగుండఁ బోవుచు, హీబ్రూల కతఁడు వర్తమానముఁ బంపెను. ఆవర్త మానమునకు వారు, వారి ప్రధానాధికారి "మేము పారశీకసింహాసనమునకు భృత్యుల" మని గడగడ వణఁకుచు ప్రత్యుత్తర మిచ్చెను. త్వరితముగ పట్టణముమీఁదికి విజయుఁడు వచ్చుచుండెను. ఆనగరవాసులు భయము నొందిరి. "మీకు భయ

ములేదు. మీశరీరమున నొకదెబ్బతగుల"దనియొకమహాపురుషుఁడు మఠాధికా రితో స్వప్నములోఁ జెప్పెను. విజయుఁడు చతురంగబలములతోఁ పట్టణబహి ర్ద్వారముపద్దకు వచ్చెను. అతనిసైనికులు పట్టణములోఁ బ్రవేశించుటకుఁ ద్వరిత పడుచుండిరి. ఇంతలో వారు పట్టణమును తెల్లనిజెండాలతో నలంకరించిరి; పురజనులు శ్వేతాంబరములను ధరించి, దేవతార్చకులను వెంబడించిరి; వారు పీతాంబరధారులై మఠాధికారి ననుసరించిరి; అతఁడు చీనాంబరములను నల్లె వేసికొని శాతదండమును చేఁబూని ముందు గోవిందునివలె నడచెను. ఇటుల నిరాయుధులై వచ్చుచుండిన వారినిఁ జూచి, శత్రువులు నిశ్చేష్టితులయిరి. అల్లంతదూరమున మఠాధికారినిఁ జూచి, అలగ్జాండరు రథమును డిగ్గి, పాద చారియై వచ్చి అతనికి సాష్టాంగ నమస్కారముఁ జేసెను. సండనాయకు లును, కోదండనాయకులును మొదలగువా రతనిచర్యఁ జూచి నెలవెలఁబోయిరి. "ఓరాజాధిరాజా! రాజులు నీరాజనములఁ గొను మీరేల నీమఠాధికారికి వందనముఁ జేసిరి'? అని మంత్రి యొకఁ డతనిని బ్రశ్నవేసెను. "నీవు పలికి నది సత్యము; కాని మాసిడను దేశములో నేనుండిన సమయమున, నొకనాటి రాత్రి నాస్వప్నములో నీమఠాధికారివలె దుస్తులనుధరించిన పురుషుఁడొకఁడు నాకగుపడి నన్ను ఆసియాఖండమునకుఁ బోయి పారసీకరాజ్యమును జయింపు మనిచెప్పి తిరోహితుఁ డయ్యెను. ఆరూపమును వహించిన భగవంతునకు నమ స్కరించితిని గాని అతనికి గాదు" అని విజయుఁడు ప్రత్యుత్తరము నిచ్చెను.

సాష్టాంగము పడియుండిన విజయుని లేవనెత్తి, అతనిని మఠాధికారి కౌఁగిలించుకొనెను. అనంతరము వారుభయులు పాదచారులై పోయి దేవాలయ ములోఁ బ్రవేశించి 'జిహోవా' దేవునిఁ బ్రార్థించిరి. వారతనియొద్ద సన్మానితులై యుండిరి. అతఁడు కట్టించిన 'అలగ్జాండ్రియా' నగరములో వారు కాపుర ముండిరి. ఇటుల 'హీబ్రుల' రాజ్యము క్షణకాలము వెలిగి క్షీణించెను.


7
రోము
కార్తేజి
ఆల్ప్సు పర్వతములు
ఇటలీ ద్వీపకల్పము
కార్సికా దీవి
రోము
సార్డినియా దీవి
కాపువా
స్పానియా
సాగంటమ్
మధ్యధరా సముద్రము
సిసిలీ
సిరాక్యూసు
గ్రీసు
జిబ్రాల్టరు జలసంధి
కార్తేజి
ఆఫ్రికా
రోము
కార్తేజి

భయముచేత వారు బాహాటముగాఁ బోవుటకు శంకపడిరి; ఆమె దుఃఖమును మ్రింగి 'నాదుఃఖమునకు పరికింపఁబడదు. నీవు సమ్మతించిన, నీవద్దకు వచ్చి నివసించెద' నని తనయన్నగారికి జాబు వ్రాసిపంపెను. అందు కతఁడు సంతోషించి సేవకులఁ బిలిపించి, నావలమీఁద నామె సామగ్రుల నెక్కించి ఆమెను తీసికొని రావలసిన దని యాజ్ఞఁజేసెను. రాజాజ్ఞప్రకారము సేవకులు సామగ్రులను పడవలలో నెక్కించి, 'టైరు' పట్టణమునకు పంపుటకు బదులు, ఆమెను తోడ్కొని మధ్యధరాసముద్రముమీఁదఁ బోయిరి. ఆమెయొక్క సౌందర్యాతిశయములచేత, భృత్యులామె చెప్పినమాట ననుసరించి సంచరించిరి. వారటుల పోయి పోయి, కొంతకాలము 'సైప్రసు' ద్వీపములో విడిదిచేసిరి. అచట వారు నివసించియుండినపుడు, 'జూపిటరు' దేవుని పూజారియును, మఱికొందఱు కన్యకామణులును వచ్చి వారిని కలిసిరి. అనంతరము వారందఱు సమూహమై 'ఆఫ్రికా' ఖండమునకుఁ బోయిరి. ఈకుట్రను రాజువిని, యాగ్రహించి, వారిం దఱుమఁ బ్రయత్నించెను, కాని 'నీవు వారిని నిరోధించిన నీకు విపత్తుసంభవించు' నని సోదెవాక్యమును విని, రాజు భయపడి యూరకుండెను.

అనంతరము వారు తీరమున దిగిరి. ఆదేశవాసులకు సొమ్ము నిచ్చి, 'డైడో' కొంతభూమినిఁ గొనెను. ఆభూమిని వారు సాగుఁజేయ నారంభింప, ఒకయెద్దుపునుక వారికి భూమిలో దొరకెను. 'ఇది సారవంతమైనభూమి; కాని, యిచట పట్టణముఁ గట్టిన, దానికిఁ జేయు ప్రతిష్ఠలు రానేరవు' అని పెద్దలు చెప్పినందున, వారాస్థలమును విడిచిపెట్టి, మఱియొకస్థలమునకుఁ బోయిరి. ఆస్థలమును కూడ వారు దున్నుచుండ, గుఱ్ఱపుపునుక వారికి దొరకెను. 'ఇచటఁ బట్టణముఁ గట్టిన దానికిఁ గీర్తిప్రతిష్ఠలు వచ్చు'నని పెద్దలు చెప్పిరి; అంతటవారు పట్టణము గట్టి దానికి 'కార్తేజి' యని పేరుపెట్టిరి.

అనంతరము 'మూర్లు' అను దేశీయులరాజు 'డైడో'ను వివాహమాడఁ గోరెను. 'కార్తేజి' పురవాసులామెఁ జూచి, 'ఓమహారాణీ, 'మూర్లు' అనాగరికులు. కాని, వారిరాజును వివాహమాడి, యాదేశీయుల నుద్ధరింపవలెనని యామెను ప్రార్థించిరి. ఆమె పూర్వసువాసిని కనుక పునర్వివాహమాడుట కామెను

ట్టణములను ముట్టడించి, వానిఁబట్టుకొని. ఆపురనివాసులను, మూఁడు వేలమందిని నిర్హేతుకముగఁ జంపిరి. 'సిసిలి' ద్వీపములో సామ్రాజ్యముఁ బొందవలెనని యామె పెక్కుసంవత్సరములు పోరాడెను గాని, 'సిరాక్యూసు' పట్టణపురాజు బల్లెమువలె నుండి, ఆమె ప్రయత్నములను సాగనీయలేదు. ఆమె సీమలవా రొకసమయమున 'సిరాక్యూసు' పట్టణమును ముట్టడించి, పట్టుకొనుటకు సిద్ధపడిరి. అప్పు డాపట్టణపురాజు 'ఆగతోక్లెసు' నకు దబ్బులేకపోయెను; పట్టణమును శత్రువులచేతిలోఁ బడవేయుటకు మనస్కరించలేదు. 'కార్తేజి' పట్టణముపైకి దండెత్తిపోవలె నని ప్రయత్నించెను గాని ధనము లేదు. అప్పు డతఁ డొకనాటిఁ బన్ని స్వనగరవాసులఁ బిలిచి, కష్టములు పడలేనివారందఱు పట్టణమును విడిచిపోవచ్చు నని వారితోఁ జెప్పెను. 'జీవన్భద్రాణిపశ్యతి' యని తలంచి భాగ్యవంతు లందఱు పట్టణమును విడిచి పోయిరి; అతఁడు వారిని పట్టికట్టి తెప్పించి వారిధనమును తీసికొనివారిని జంపెను. అనంతర మతఁడు పడవలమీఁద సైన్యములతోఁబోయి 'కార్తేజి' పట్టణమును ముట్టడించెను; కాని ఆమెను సాధింపలేక పోయెను. ఇంతలో నామెసీమలవారు 'సిరాక్యూసు' పట్టణమునద్ద నోడిపోయిరి.

ఈకాలములో 'కార్తేజి' నగరవాసుఁడు 'హానుఁడు' నౌకాయాత్రపై బయలుదేఱి, 'జిబ్రాల్టరు' జలసంధిని దాఁటిపోయెను. కంచరజాతివారికి స్వనగరములోనివాసములు దొరకనందున వారికి నూతనసీమలఁ జూపుట కతఁడు వెళ్లెను. ఆయా దేశములఁ జూచి, వారివారి రూపరేఖావిలాసములను, వేషభాషల నతఁడు వర్ణించి వ్రాసెను. 'ఒకదేశ మగ్నిహోత్రమయము. దానిమధ్య నగ్నిపర్వతమొకటి లేచి తారాపథమును ముట్టుచున్నది. అచ్చటి మనుజులు కోఁతులవలె నుండిరి'. అని యతఁడు వ్రాసెను. 'శని' గ్రహదేవాలయములో నొకరాతిపలకపై, అతఁడు చూచినచిత్రము లన్నియు వ్రాయఁబడియున్నవి. ఆదేవాలయము 'కార్తేజి' పట్టణములో నున్నది. అనంతరము మఱియొకనౌకాయాత్రికుఁడు బయలువెడలి, 'ఐరోపా' ఖండమునకుఁ బశ్చిమమునఁ బోయి, ఉత్తరమహాసముద్రమువఱకును వెళ్లెను. అతఁడు 'బ్రితను' ద్వీపములఁ జూచియుండవచ్చును. అతఁడు చూచిచెప్పిన సంగతులను వినిన, మనస్సు దిగులు

పడును. 'ఎటువైపుఁ జూచినను మంచుగడ్డలు తప్ప మఱియొకటి కానరాదు. వాయువు ప్రసరించుట లేదు. తెరవలె మంచు కప్పియున్నది' అని వ్రాసెను.

'కార్తేజి' పట్టణమునకు విశేషభాగ్యము వచ్చెను; ఆమెకు స్వాధీనులై యుండిన పట్టణములవారు కప్పములఁ గట్టుచుండిరి; 'స్పానియా' దేశము లోను 'సార్డీనియా' ద్వీపములలోని ఖనులమూలమున ధనము వచ్చెను; 'వాణిజ్యేవసతేలక్ష్మీః' యని, ఆమె వర్తకమువలన లక్ష్మీతులమాగుచుండెను. 'ఆఫ్రికా' ఖండమున నుత్తరతీరమున నుండువారందఱితో నామెకు వ్యాపారము తగిలి యుండెను. ఆనగరవాసులు వస్తుసామగ్రిలఁ దీసికొని, 'జిబ్రాల్టరు' జలసంధికి సమీపప్రదేశమున రేవులో దిగి యొడ్డున తమవస్తువుల నుంచి, వారు తిరిగి పడవలలోనికి వచ్చుట కలదు. అప్పు డాదేశీయులు వచ్చి, ఆవస్తువులకుఁ దగిన వెండి బంగారముల నుంచి,కొంచెము దూరమునకుఁ బోవుచుండిరి. పడవలలోని వారు దిగివచ్చి, సమానముగు వెండిబంగారములను వారచ్చట పెట్టిన యెడల దానిఁదీసికొని, వారు పడవల నెక్కి పోవుచుండిరి. ఆవెండిబంగారములు సమానములు కాకపోయినయెడల, వస్తువులగాని వెండి బంగారముగాని ముట్టుకొనక, పడవలలోనికి వచ్చిన పైని, ఆదేశీయులు గ్రహించి పూర్వము కంటె నధికముగ వానినుంచి దూరముగఁ బోవుదురు. అంతట వారు దిగివచ్చి దానిఁ దీసికొనియెదరు.' అని గ్రీకుల చరిత్రకారుఁడు 'హిరోడటసు' వ్రాసెను. ఆనగరవాసులు రంగుబట్టలు, గాజుపూసలు, వాడితేని యాయుధముల నమ్మి, వెండిబంగారములను, దంతములను, మణులఁ దెచ్చుచుండిరి. క్రమముగ నాపట్టణము లక్ష్మీకినివాస మయ్యెను; సామంతులు చీనిచీనాంబరములను ధరించిరి; వెలలేని మాణిక్యములహారములను వేసికొనిరి; సంపదకొలది చిన్నెలును వన్నెలును మెండయ్యెను; బలము క్షీణించెను; సంపదలు బహుళమగుట శరీరదార్ఢ్య నాశనముకొఱకు గాని మఱియొకటి కాదు. స్వనగరములో నుండిన వారు బలహీను లయిరి; విదేశములోనివారు బలముకలవారై పోరాడి కీర్తి ప్రతిష్ఠలను సంపాదించుచుండిరి.

పునః 'సిసిలీ' ద్వీపము రణరంగ మయ్యెను; ఈసమయమున 'కార్తేజి' రోమక మహారాజ్యముతోఁ బోరాడవలసి వచ్చెను. 'మామర్తేసుల'ని కొందఱు దొంగలు కలరు; వారాద్వీపములో నొకపట్టణముఁ బట్టుకొని, ఆపురవాసుల నందఱిని జంపిరి. అప్పుడు 'సిరాక్యూసు' పట్టణపురాజు వారిని శిక్షించుటకు దండువెడలెను; ఆదొంగలు భయపడి, వారిలోఁ గొందఱు రోమనులను సహాయముకోరిరి; మఱికొందఱు 'కార్తేజి'నగరవాసుల సహాయముఁ గోరిరి. 'కార్తేజి' లోనివారు శీఘ్రముగ సైన్యములఁ బంపిరి; వారిసేనాధిపతి యాదొంగల దుర్గములోఁ బ్రవేశించెను. అంతలో రోమకసేనాధిపతి వచ్చి ప్రవేశించి దుర్గబలుఁడగు 'కార్తేజి'సేనాధిపతి నోడించి, వానిఁ దరిమివేసెను. ఇటు లపజయము నొందిన సేనాధిపతిని 'కార్తేజి' వారు చంపివేసిరి. రోమనులకును వారికి నీవిధమున యుద్ధమారంభ మయ్యెను. ఉభయులకును మొదట జయాపజయములు సమముగ నుండెను. తుదకు రోమనులు జయించిరి. 'కార్తేజి'వారి నావలను వారు ధ్వంసముఁ జేసిరి; అంతటితో వారి నౌకోన్నత్యమునకుఁ బాటువచ్చెను. రోమకసేనాధిపతి 'రెగ్యులసు' సైన్యములతో 'ఆఫ్రికా'ఖండమునకుఁ బోయి 'కార్తేజి'నగరమును ముట్టడించెను. ఆనగరవాసులు చెప్పలేని శ్రమలఁ బడిరి; భుజించుటకుఁ బదార్థములు లేకపోయెను. పట్టణములో నెటువైపుఁ జూచినను పీనుగుపెంటలు కనఁబడెను; ప్రతిగృహములోను రోదనము తప్ప మఱియొకటి వినఁబడదు; వారికి నిద్రాహారములు లేవు. వారిసైన్యములలోఁ గొందఱు 'స్పార్టనుదేశ' సైనికులు వేతనములఁ బుచ్చుకొని యుద్ధముఁ జేయుచుండిరి. వారిలో 'జాంతిపసు' అనువాఁడు సర్వసేనాధిపత్యమును వహించి, సైనికుల నుత్సాహించి, వ్యూహముఁ బన్ని, రోమనులపైకిఁ బోయి యుద్ధముఁ జేసి వారి నోడించి వారిసేనాధిపతి యైన 'రెగ్యులసు'ను పట్టుకొనెను. అనేకసంవత్సరములవఱకు వారాసేనాధిపతిఁ జెఱసాలలో నుంచిరి. 'నేను రోమునగరమునకుఁ బోయి మీయుభయులకును సంధిఁ జేసెదను. లేనియెడల, తిరిగివచ్చెద'నని 'రెగ్యులసు' చెప్పినందున, స్వదేశమునకుఁ బోవుటకు వారతనికి సెలవిచ్చిరి. అతఁడు 'రోము' నగరమునకు వెళ్లి, 'సెనెటు' సభవారియెదుట నిలిచి 'ఓసభ్యులారా!

నేను 'కార్తేజి' వారి చెఱసాలలో నుండి వచ్చితిని. మీతో సంధిఁజేయఁగోరి వారు నన్ను బంపిరి. కాని మీరు సంధిఁ జేయఁకూడదు. మీరు వీరులును శూరులును కనుక వెనుదీయరాదు — అర్థప్రాణములను వారవోసి మీరు వారిరూపమును మాపివేయవలెను. ఆడినమాటఁ దప్పను కనుక, నేను వారిదేశమునకుఁ బోయి వారిచేతిలోఁ బడిచచ్చి స్వర్గస్థుఁడ నయ్యెద. మీకు శుభం బగుగాక' అని యుపన్యసించి, అతఁడు 'కార్తేజి' పట్టణమునకు వచ్చెను. సంధిఁ జేసికొని రానందున వారతనినిఁ జంపివేసిరి ఆ యుద్ధ మంతటితోఁ జల్లారెను, రోమకులకుఁ దమయావచ్ఛక్తిని వినియోగింపవలసివచ్చెను. 'కార్తేజి' వారు ప్రాణముల దక్కించుకొనిరి. 'సిసిలీ' ద్వీపముతో వారికిఁ బ్రసక్తి యేమియు లేకపోయెను.

'కార్తేజి' వారి వలన వేతనములఁ బుచ్చుకొని, యుద్ధముఁ జేయుటకు నానాదేశీయులు వారిసైన్యములోఁ బ్రవేశించియుండిరి. వారందఱు గుమిగూడి 'కార్తేజి' పైఁదిరుగబడిరి. 'హామిల్కారుబార్కా' యను వాఁడు వారిగర్వము నణచెను. అనంతర మతఁడు స్వనగరమునకు వచ్చిన నీచస్థితికి దుఃఖపడి, ఆమె నుద్ధరించుటకు సైన్యములతో 'స్పానియా' దేశమునకుఁ బోయెను. మఱి తొమ్మిదిసంవత్సరములవఱకు నతఁ డెచటనుండెనో వారికిఁ దెలియలేదు. ఈలోపున నతఁడు 'స్పానియా' దేశమును క్రమక్రమముగ స్వాధీనముఁ జేసికొని స్వనగరమునకుఁ గీర్తి ప్రతిష్ఠలఁ దెచ్చెను. ఆదేశములోని బంగారువెండిఖనులఁ ద్రవ్వించి, యాలోహముల నతఁడు స్వనగరమునకుఁ బంపెను. 'కార్తేజి' నగరమునకూడ నొకరాజ్యమును స్థాపించెను. 'నూతనకార్తేజి' యను పట్టణమును 'స్పానియా' దేశములో నతఁడు కట్టించెను. మఱికొంతకాలమున కతఁడు స్వర్గస్థుఁ డయ్యెను. అనంతర మతని యల్లుఁడు 'హాసుద్రూబలు' మామవలె దేశములఁ గొట్టి వానిని సాధించుచుండెను — ఈలోపున 'హామిల్కారు'ని కుమారుఁడు పెద్దవాఁ డయ్యెను. తండ్రి స్వనగరమును విడిచిపెట్టిన కాలమునకు వాఁ డెనిమిదిసంవత్సరముల ప్రాయము వాఁడు. వాఁడు తండ్రితోఁ బోనిశ్చయించెను కాని, తండ్రి వానిని నివారించి, దేవాలయమునకుఁ దీసికొనిపోయి 'ఓయి చిన్నితండ్రీ! నావలెనీవకూడ యావజ్జీవము రోమనులతో వైరముపాటిం

ష్టు’మని బోధించి, యా బాలుని చేత దేవునియెదుటఁ బ్రమాణముఁ జేయించి, వానిని గృహములో విడిచిపెట్టి యతఁడు ‘స్పానియా’ దేశమునకుఁ బోయెను. ఆబాలుఁడే ‘హానిబలు’ అనిపేరు కలవాఁడు. అతనికిఁ దండ్రిమరణము నాటికి పదునెనిమిదిసంవత్సరములు ప్రాయము వచ్చెను. దేహపరిశ్రమ జేసి యుండినందున, నతనిశరీరము దృఢముగ నుండెను. తండ్రివలె నతఁడు కష్టసహుఁడును సిద్ధమయ్యెను. అతని రూపరేఖావిలాసములఁ జూచి సైనికులు భ్రమపడి, యతని మాట ననుసరించి సంచరించిరి. సైనికవృత్తి నవలంబించి జీవించుట కతఁడుద్యుక్తుఁడాయెను.

అంతలో ‘హాసుద్రూబలు’ పరలోకగతుఁ డయ్యెను. ఆమాటను విని ‘హానిబలు’ స్వనగరమును విడిచి ‘స్పానియా’ దేశమునకు వచ్చి స్వసేనాధిపత్యమును వహించెను. ఆదేశములో రోమకపోషణదుర్గములో నుండిన ‘సాగంతము’ అను పట్టణము నతఁడు ముట్టడించెను. కొంతకాలమున కాపత్తనము నతఁడు సాధించెను. ఈవార్తను విని, రోమక ‘సెనేటు’ సభవారతనితో యుద్ధముఁ జేయ సిద్ధపడిరి.

అతఁడు సైనికులఁ బిలిచి ‘ఓసైనికులారా, మీరు విశేషము శ్రమపడితిరి. కనుక కొంతకాలము విశ్రమించి జనసత్త్వములఁ దెచ్చుకొనుఁడు. వసంతకాలము రాఁ వేగము, మీరాయుధపాణులై వచ్చిన, మనము గొప్పయుద్ధమునకుఁ బోయెదము. అందువలన మనకుఁ గీర్తిప్రతిష్ఠలు వచ్చు’ నని చెప్పి వారిని బంపివేసెను.

ఋతుధర్మములు మారెను. వసంతకాలము వచ్చెను. స్వగృహములనుండి సైనికు లాయుధపాణులై యుద్ధమునకు సిద్ధపడిరి. ‘స్పానియా’ దేశసంరక్షణార్థము తగుమాత్రము సైనికులను తమ్ముఁడగు ‘హాసుద్రూబలు’నకు నప్పగించి మిగిలిన సైన్యములతో నతఁడు ‘రోము’ నగరముపై దండు వెడలెను. మార్గములో నుండిన దేశములను జయించి, ‘ఇటాలియా’ దేశమున కుత్తరమున నుండిన ‘ఆల్ప్సు’ పర్వతశ్రేణి సమీపమున కతఁడు వచ్చెను. ఆపర్వతశ్రేణులను దాటుట యెటులు? కొండదారులఁ జూపువారెవరు? చీమలు దూరనిచిట్టడవులను,

కొండలుగూడని కొరడవులను దాటివచ్చుటకు మార్గములు కనఁబడవు; నదుల దాటుటకు వంతెనలు లేవు; కొండలలో నెలగుండఁ బోవు విధమేది? ఏనుఁగులు, గుఱ్ఱములు, లొట్టియలు, కాల్బలములు, రథములు — ఇవి యన్నియు నడచుట యెట్టులు? ఋజుమార్గముఁ జూపు వారెవరు? తప్పుదారులఁ బోయి చిక్కులలోఁ బడిరి ఎన్నిచిక్కులు వచ్చినను భగవంతుని కృపకలిగినవానిని దాటనిచ్చును. అన్నికష్టములఁ బడి నానాపర్వతములను దాటి 'ఇటాలియా' దేశములోఁ బ్రవేశించిరి.

'ఆల్ఫ్సు' పర్వతశ్రేణులను దాఁటి వచ్చునంతటి సాహసుఁడు లేఁడని రోమకుల నమ్మకము; అందుచేత వారు యుద్ధమునకు సన్నాహముఁ జేయకయూరకుండిరి — సైన్యములతో నతఁడు దేశములోనికి వచ్చెనని విని, అతనిసాహసము గొనియాడి, రోమకులు గుండెలఁ గొట్టికొనిరి. అప్పుడు వారు ఉత్తరమున సైన్యములఁ గూర్చి రణమునకు కాయత్తులయిరి. గొప్పసేనాధిపతితోఁ గలిసి రోమకులు యుద్ధముఁ జేసిరి, కాని, ప్రథమమున నపజయముఁ బొందిరి. రెండవ యుద్ధమున వచ్చినవారసేనాధిపతి చాకచక్యము లేనివాఁడు కనుక, రోమకులను మరల శృంగభంగ మాయెను. ఇట్లు జయప్రదుఁడై 'హానిబలు' దక్షిణాభిముఖుఁడై 'రోము' నగరముపైకి దండు వెడలెను. రోమకసేనాధిపతులు సముచితోచితముగ చతురంగ బలములను నడిపించుటకు సమర్థులయ్యును 'హానిబలు' యొక్క తెలివితేటలకును చతురతకును వారు నిలువలేక పోయిరి. 'ట్రాసిమీను' సరస్సుసమీపమున మూఁడవ యుద్ధము జరిగెను. అందులోఁ గూడ రోమకుల కపకీర్తి వచ్చెను. అంత నంతకు 'హానిబలు' రోము నగరముపైకి వచ్చుచుండెను, 'సెనేటు' సభవారు దిగులుపడిరి; వారు ప్రాణముల నరచేతులలో నుంచికొనిరి. వారు సర్వసేనాధిపత్యమును 'ఫేబియసు' అనువానికి నిచ్చి వానరతని యుద్ధమునకుఁ బంపిరి. ఇతఁడు ముఖమున కెదురునిలిచి యుద్ధముఁ జేయఁడు; ఎప్పుడును నతఁడు దొంగయుద్ధముఁ జేయును. అతనికి 'మాయలమారి' యని పేరు వచ్చెను. ఎంతవారికైనను వెనుకనుండియు ప్రక్కలనుండి యీ దొంగపోటులు పొడుచుచు, శత్రువులకుఁ జీకాకు పుట్టించును — ఈవిధ

మున నెంతకాల మతఁడు శత్రువుల నరికట్టఁగలఁడు? పవనప్రేరితములైన మేఘములవలె వారు పోవుచుండిరి. ఏసమయమున గుభాలున రోమునగరముపైఁ బడెదరో యని సభవారు భయపడిరి; 'ఫేబియసు' చేసిన దొంగపోటులు వారికి సహ్యము కాలేదు. అతనిని పిలిపించి, సేనాధిపత్యమును 'వారో' అను నతనికిచ్చి, వారతనిని శత్రువుపైకిఁ బంపిరి. రోమక సైన్యములఁ జూచి 'కార్తేజి' సైన్యములు కంపించెను గాని 'హానిబలు' వారినిఁ బురికొలిపి శౌర్యము నెక్కించెను. ఉభయసైన్యముల వారు హోరాహోరిని సంగ్రామముఁ జేసిరి; ఇదియే 'కానేయి' యుద్ధము. ధైర్యముఁ బోగొట్టుకొని, చీకాకుఁబడి, వెనుకకుఁ దిరిగి రోమకులు పాఱిపోయిరి. 'కార్తేజి' సైన్యములకు జయము కలిగెను. 'ఇఁక నాలుగు రోజులలో మనము 'రోము'నగరములో 'కాపిటలు' ప్రాసాదములో భుజింపఁగలమని 'హానిబాలు' సైనికులతోఁ జెప్పెను.

రోమునగరము సునాయాసముగఁ బట్టుబడునని నమ్మకము 'హానిబలు' నకు లేదు. 'కానేయి'యుద్ధముతో నతనికి దశతిరిగెను; ఇఁకను దుర్దశలు ప్రవేశించెను. 'ఇటాలియా' దేశములోని మధ్యదక్షిణ భాగము లతనికి స్వాధీనమయ్యెను; 'కాపువా' రేవుపట్టణమువారు రాజద్రోహముఁ జేసి నగరములో నతనినిఁ బ్రవేశపెట్టిరి. కనిష్ఠభ్రాతయైన 'మాగుఁడు'ను వానిని 'కార్తేజి'పట్టణమున కతఁడు పంపెను. అతఁ డాపట్టణసభవారి యెదుట నిలిచి, 'ఓసభ్యులారా! మేము 'ఇటాలియా' దేశములో యుద్ధముఁజేసి మేము సంపాదించిన బంగారు వస్తువులఁ జూడుఁడు. ఇదియంతయు తమనిమిత్తమే మేము పాటుఁబడుచున్నాము.' అని యుపన్యసించెను.

అతఁడు 'కాపువా' పట్టణములో నుండినసమయమున రోమకసైన్యములు వచ్చి యాపట్టణమును ముట్టడించెను. అతఁడు సైన్యములతోఁ గూడ 'రోము'నగరముపైఁ బోఁదలఁచెను గాని వర్షములచేత మార్గములు చెడినందున నతఁ డాప్రయత్నమును విడిచిపెట్టెను. రోమకులు స్వదేశములో నపజయముఁ బొందుచుండినను, విదేశములలో వారు జయముఁ బొందిరి.

ఇదివఱకే 'సిసిలీ' ద్వీపమును రోమకులు స్వాధీనముఁ జేసికొనిరి. రోమక సేనాధిపతులును భ్రాతృలు నగు 'జ్యేష్ఠ, కనిష్ఠ సిపియో' లిరువురును 'స్పానియా' దేశమును నాక్రమింపుటకొన నారంభించిరి; వారియెదుట 'హాసుద్రూబలు' నిలువలేక పోయెను. వారిలో నొకఁడు 'స్పానియా' దేశమును 'కార్తేజి' నగరమును స్వాధీనముఁ చేసికొనియెద ననిశపథముఁ జేసెను. 'కార్తేజి' నగరమునకు స్నేహితుఁడగు రాజొకఁడు 'ఆఫ్రికా'లోఁ గలఁడు; అతనితో స్నేహము జేయుటకు 'సిపియోల'లో నొకఁ డతనినగరమునకుఁ బోయెను. 'కార్తేజి' నగరమునుండి రాయబారి యొకఁ డాసమయమునను రాజదర్బారములో నుండెను. మొదటివాఁడు నూతనముగ సఖ్యముఁ జేయఁగోరి వచ్చెను; రెండవవాఁడు పూర్వపు స్నేహితుఁడు. వారిరువురమాటలను రాజు వినెను: వారిలో నెవరితో నతఁడు సఖ్యముచేసిన వారికి జయముకలుగును. 'కార్తేజి' నగరపు రాయబారి తనకుమార్తె 'సొఫొనిస్బా' ను వెంటఁదీసికొని వచ్చెను; ఆమె సమ్మోహనాంగి. 'స్త్రీవేవ మృత్యుర్నిగళం నిగళం హృదయానామ్' అనునట్టుల నామెచూపులలోఁ జిక్కుపడి, 'కార్తేజి' నగరముతో రాజు స్నేహముఁ జేసె, ఆమెను వివాహ మాడెను. రోమకులతో రాజు సఖ్యముఁ జేయనందున, 'సిపియోఁడు' దేశమును విడిచి పోయెను.

ఇంతలో 'హానిబలు'నకు 'ఇటాలియా' దేశమునఁ గష్టదినములు వచ్చెను. ఆదేశములో శీతోష్ణస్థితుల కతన సైనికులు నిలువలేకపోయి కొనవాడిరి. హతశేషులు యుద్ధముఁ జేయలేక యుండిరి; అతనితమ్ముఁడు 'ఆల్ఫ్సు' పర్వతములను దాటి సైన్యములతో వచ్చుచుండెను. అన్నకుఁ దన రాకఁ దెలుపుటకై యతఁడు జాబు ప్రేషించెను; కాని, యాజాబును రోమకసేనాధిపతి పుచ్చుకొని, సేనలతో నతఁడు 'హాసుద్రూబలు' నెదుర్కొనునడచి, వానితో యుద్ధముఁ జేసి వానిఁ జంపెను. వానిసైనికులు రోమకులశరణుఁ జొచ్చిరి. సోదరుని మరణమును విని 'హానిబలు' కడుదుఃఖించి చింతాక్రాంతుఁ డయ్యెను గాని దీనుఁడు కాలేదు. మఱియెవఁడైనను దిగులుపడును గాని, అతఁడు దిగులు పడలేదు; దైన్యముఁ బొందలేదు; శరణనలేదు, దేశపారి కాలేదు, అతని ధైర్యస్థైర్య

ములఁ గొనియాడవలెను. ఆతనిసైన్యము లయినను తిరుగఁబడ లేదు; ఆతని సైనికుల కతనియందలి భయభక్తులు పోలేదు; వా రతనియాజ్ఞలను శిరసావహించు చుండిరి. దేశమును జయించుటకు నిరాశఁ జేసికొనినను, మూఁడుసంవత్సరములతఁ డాదేశములో నుండెను. అన్నికాలములలో నతని శిబిరము నిశ్శబ్దముగ నుండెను.

ఈలోపున 'సిపియుఁడు' సముద్రమును దాటి 'కార్తేజి' నగరమున కెదుట శిబిరమును వేసి దండు విడెను. ఆతఁడు తంత్రముఁ బన్ని శత్రువులశిబిరముఁ దగులఁబెట్టించెను. 'నీవు నీసైన్యములతో స్వనగర రక్షణార్థము శీఘ్రము రావలెన'ని 'హానిబలున'కు జాబు వ్రాసి, కార్తేజినగరమువారు పంపిరి. ఆతఁ డాజాబుఁ జూచి, పళ్లు పటపటఁగొఱికి చేయునది లేక, దుఃఖపడి, 'ఇటాలియా' దేశమును జయింపలేక, స్వనగరమునకుఁ బోయెను.

అచట "సిపియుఁడు" సమరసన్నాహముఁ జేసి, వ్యూహముఁ బన్ని సిద్ధముగ నుండెను. హానిబలు సైనికులం జూచి 'ఓ సైనికులారా! మీరు నాబిడ్డలు; నామాట నతిక్రమింపక సంచరించితిరి; కీర్తిప్రతిష్ఠలు మీవలననే నాకువచ్చినవి. నేఁడుకూడ మీశౌర్యమును బింకమును చూపి సామ్రాజ్యవిజయమును పొందుదురు గాక" అని ప్రోత్సహించెను. ఉభయసైన్యములును బింకముతోఁ బోరాడెను. విజయలక్ష్మిరోమకులపక్షమున నుండెను; 'కార్తేజి' సైన్యములు చకాచకలై పాఱిపోయెను. 'హానిబలు' తగుపాటి సైనికులతోఁ బోయి నగరములోఁ బ్రవేశించెను. నగరము సభవారుగాని మహాజనులుగాని విశేషముగ నతని మన్నించలేదు. రోమకులు శాసించిన విధమున నానగరము వారు సంధిపత్రముల కొప్పుకొనిరి. "కార్తేజి" వారి యోడలన్నియు తగులఁ బెట్టఁబడెను: రోమకులకు వారు విశేషముగ ధనము నిచ్చుకొనవలసి వచ్చెను. అర్థప్రాణములఁ గోలుపోయి, 'కార్తేజి' నగరము దైన్యము నొందెను. స్వనగరము వారుచేసిన పరాభవమునకుఁ జింతించి 'హానిబలు' నగరమును విడిచి పోయెను. ఆసంగతి యెవరికిని తెలియదు. 'మహా అలగ్జాండరు' యొక్క సేనాధిపతి వంశములోనివాఁడగు 'అంటియోకసు' అను 'సిరియా' దేశపురాజు

రోమనులతో యుద్ధముఁ జేయుచుండ 'హానిబలు' వానితోఁ గలిసి సమరమునకుఁ బోయెను.

క్రీ. పూ. సం. 190 రములో 'అంటియోకసు' వ్యూహముఁ బన్ని 'మాగ్నిషియా' పట్టణము వద్ద వేచియుండెను. అంతలో రోమనులు వచ్చిరి. ఘోరయుద్ధము జరిగెను. రోమనులు జయముఁ బొందిరి. రోమనులు సంధిమాటలను శాసించి, 'నీవు మాకు హానిబలుని యొప్పగించవలె' నని వారు రాజుతోఁ జెప్పిరి. ఆమాటను విని, యెవరికిఁ జెప్పక, 'హానిబలు' పాఱిపోయెను. మఱి కొంతకాలమునకు 'ఆశియామైనరు' లో నతఁడు యుద్ధముఁ జేయుచుండెను. రోమను లాపక్షమువారికి వర్తమానముఁ బంపి, వానిని యొప్పగింపు మనిరి. ఆమాటను విని 'హానిబలు' గుండెలు ఝల్లుమనెను. అప్పటికి సు॥ 65 రముల ప్రాయము వచ్చెను. వృద్ధాప్యము సన్నిహిత మయ్యెను, అందఱు శత్రువులు గాని మిత్రు లతనికిలేరు. అతఁడు లోకకంటకుఁ డయ్యెను. స్వచరిత్రమును స్మరించుచు, విషముఁద్రాగి 'హానిబలు' మృతినొందెను.

అతఁడు చనిపోయిన తరువాతనైన, 'కార్తేజి' నగరమువారు భృత్యులై యుండురను నమ్మకము రోమనులకు లేదు. కొంతకాలమునకు నగరమువారు ధనసంపన్నులయిరి. దేహములఁ బుష్టిఁ జేసికొనిరి. వారినిఁ జూచి యందఱు కంటగించిరి. నుదించి కొమ్ములు తిరిగిన పొట్టేలువలె 'కార్తేజి' నగరము రోమనులకుఁ గనఁబడెను. వారు దానిరూపుమాపివేయుటకుఁ దలంచి, సమయమునకు వేచుచుండిరి. ఆసమయము కూడ వచ్చెను. రోమనుల సెలవులేక, "'కార్తేజి' నగరమువారు పరులతో యుద్ధమునకుఁ బోయిరి. అందుచేత నానగరమును ధ్వంసముఁ జేయవలెనని రోమక 'సెనెటు' సభవారు శాసించిరి. ఆమాటను విని నగరమువారు తెల్లపోయిరి. "ఓరోమనులారా! మీరుచెప్పిన ప్రకారము సంచరించెదము. మాపట్టణమును ధ్వంసముజేయకుఁడు" అని వారు ప్రాధేయపడిరి. "మాషరతులకు మీరు యొడంబడిన, మీపట్టణమును నాశనముఁ జేయము. మీయొద్దనుండిన కత్తికటారములను, ధనుర్బాణములను మాకిచ్చివేయవలెను.

మూఁడువందలు సామంతకుటుంబములోనిపురుషులను మాకు జామీను నియ్యవలెను'' అనిరోమకులు వర్తమానముఁ జేసిరి. నగరమువారు షరతుల ప్రకారము నడచిరి. కొంచెము రోజులు గడచినతరువాత నగరములో సైన్యముతో నివసించుచుండిన రోమక సేనాధిపతి నగరవాసులను సమావేశముఁ జేసి, ''ఓనగరవాసులారా! మీరు షరతుల ప్రకారము నడచితిరి. కాని రోమకసభవారు మీపట్టణమును నేలంగలిపివేయుమని యుత్తరువుఁ జేసిరి. కనుక పట్టణమును విడిచి మీరు పోవలెను'' అని వారితోఁ జెప్పెను. ఆపట్టణమునకుఁ బదిమైళ్లదూరమున నెచటనైన వారునివసింపవచ్చునని యాతఁడు చెప్పెను.

'కార్తేజి' వారావర్తమానమును విని 'మేముమాగృహములను నగరమును విడువము. మీతో యుద్ధముఁ జేయుదు'మని చెప్పి రోమకసేవకునిఁ దఱిమివేసి, నగరబహిర్ద్వారకవాటములను బిగించి, యుద్ధసన్నద్ధు లయిరి. కొందఱు శక్తినుతారములను, మఱికొందఱు బాణములను, తదితరులు బల్లెములను, సానవెట్టిరి. కొందఱు ధనుస్సులకు నారి తగిలించిరి. స్త్రీపురుషులు రాత్రింబవళ్లు శ్రమపడిరి. ఇంతలో రోమకసైన్యములు తీరమున దిగెను, వారు పట్టణమును ముట్టడించిరి అహోరాత్రములు వారు పోరాడిరి. 'కార్తేజి' నగరము వారికి చీమురక్తములు చల్లారెను. వారిలో బలముతేగు, దుఃఖములచేఁ గృశించిరి. నిద్రాహారములు లేక నిరసించిరి. రోమకులు నగరప్రాకారముల నెక్కి లోఁదిగి బహిర్ద్వారకవాటములఁ దెఱచిరి. బాహాటముగ రోమకసైన్యములు నిరాటంకముగ నగరములోఁ బ్రవేశించెను. ఎటువైపుఁ జూచినను పీనుగుపెంటలుతప్ప మఱియొకటి కానరాదు. వారి గృహములను రోమకులు తగులఁ బెట్టిరి. శరణుఁ జొచ్చిన వారిని రక్షించిరి. నగరము వారితోఁ గలిసి 900 రోమనులు, రోమక సైన్యములతోఁ బోరాడిరి.

తమరిని మాత్రము రోమకసేనాధిపతి రక్షింపఁడని తెలిసికొని, వారును భార్యాపుత్రాదులతోఁ గూడ నగరనాయకుఁడైన 'హాసుడ్రూబలు' అనువాఁడును—వీరందఱును గూడి, యొకదేవాలయములోఁ బ్రవేశించి, దానికవాట

ములను బిగించి లోన మఠము వేసికొని యుండిరి. పిరికిపందయైన 'హాసుద్రూబలు' వారికిఁ దెలియకుండ పాఱిపోయి, రోమక సేనాధిపతియైన 'సిపియో'ని పాదములమీదఁ బడి ప్రాణముల రక్షింపుమని ప్రార్థించెను. 'సిపియోఁడు' పరమానందమునొంది, తనసైనికులకు వానినిఁ జూపించెను. అంతలో దేవాలయములోనుండి మంటలు బయలు వెడలెను. ఇరుప్రక్కల నిరువురు పిల్లలఁ దోడ్కొని, 'హాసుద్రూబలు' భార్య ముందుకు నడచివచ్చి 'ఓరోమక సేనాధిపతియైన సిపియోఁడా, నీవు వీరధర్మము ననుసరించితివి. ఈదురవస్థను నిన్ను శిక్షింపుమని భగవంతుని నేను ప్రార్థింపను. దేశమునకును దేవతలకు ద్వేషియును మిత్రులకుఁ గపటియు, భార్యాపుత్రాదులకు ద్రోహియునగు నాభర్తయైన 'హాసుద్రూబలు'ని నీవును భగవంతుఁడు శిక్షించుదురు గాక? అని యామె 'సిపియో'నితోఁ జెప్పి, భర్తనుచూచి, 'ఓరిద్రోహి! ఓరిపాపి! నీవు వీరుఁడవు; నీవు వీరుల సేనాధిపతివి; అటువంటి నీవు నేఁడు రోమక సేనాధిపతియొక్క విజయము నలంకరించి రోమునగరములోఁ బ్రవేశింపఁగలవు. చూడుము. మేమీ మంటలలోఁబడి స్వర్గముఁ జూఱకొందుము' అని చెప్పి పిల్లలతో నామెమంటలలోఁ బడెను. నగరజననకాలమున నొక స్త్రీరత్నమగ్నిలోఁబడి బలవన్మరణము నొందెను; దాని వినాశకాలమున మఱియొక స్త్రీరత్నము పౌరుషముఁ జూపి అగ్నిలోఁ బ్రవేశించెను.

ఏడుశతాబ్దములవఱకు నానగరము సిరిసంపదలతోఁ దులదూఁగెను. ఆమెను జూచి కంటగింపనివారు లేరు. 'ఇరుగమ్మ సరిగఁబెట్టుకొనిన పొరుగమ్మ ఉరిబెట్టుకొనెను' అని చెప్పినవిధమున నానగరము ధనధాన్యాభివృద్ధిగలిగి యుండఁ బగలు చూడలేక తమకంటిలో జీడిఁబెట్టుకొనిరి. ఆనగరమును నేలమట్టముఁ జేసినపుడు, 'సిపియోఁడు' చూచి కన్నీరుఁ గార్చెను. 'అయి ఖలు విషమః పురాకృతానాం భవతి హి జంతుషు కర్మణాం విపాకః.' అని చెప్పినవిధమున జఱుగుచుండును.

ఉద్యానములతోను ప్రాసాదములతోను, భవనములతోను, ప్రాకారములతోను, సరోవరములతోను, రాజ్యలక్ష్మితోను, ధనలక్ష్మితోను, జయలక్ష్మితోను గూడిన నగరముయొక్క రూపము మాసిపోయి నేలఁగలిసెను. దానిరూపరేఖావిలాసము లీవిధముననుండె నని చెప్పుటకు వీలులేదు; దానిని పునర్నిర్మాణముఁ జేయకూడ దని శాపముఁ బెట్టిరి.

---


8
పెర్షియా
అరేబియా
సింధునది
హిమాలయపర్వతములు
గంగానది
చీనా రాజ్యము
ఇండియా
అరేబియా
సముద్రము
ఫసిఫిక్కు
మహాసముద్రము
బంగాళాఖాతము
సింహళము
హిందూమహాసముద్రము
ఇండియా, చీనా.

శ్రీరస్తు.

# చీనాదేశచరిత్ర.

## అష్టమప్రకరణము.

---

## ఇరువదితొమ్మిదవఅధ్యాయము.

### క్రీ. పూ. 2900 మొదలు సం. 100 రము వఱకు.

చీనాదేశము, ఆదేశీయులు, వారినియాచరణ విధానములు, విదేశీయులకు సందర్భముగఁ గనఁబడును. అనేక శతాబ్దములనుండి వారు నాగరికులై యుండిరి; కాని, వారిదేశాచారములను, వారియాలోచనలను జూచినయెడల, ననాగరికత వారిలోఁ గలదని తెలియును. వారికి శాస్త్రజ్ఞానము విశేషముగనుండినను, దానిని లిఖితపూర్వకముగ నుంచుటకుఁ దగినభాష వారికిలేదు. దేశములో ననేక కోట్ల ప్రజలునివసించియుండినను, రాజ్యాధికారులయెదుట వారుతృణప్రాయులు. ఆదేశము విశాలము; జనసంఖ్య బహుళము; జనులకు భేషజముమెండు; చూపరులను వారియౌన్నత్యము తేటయగును; కాని, నిజముగ వారు ప్రాచీనులు; అభివృద్ధియను మాటవారికిలేదు; వారు నవనాగరికులు కారు; "ఇంతవఱకే కాని, ముందుకునడుచుట కూడదు" అనియెవరో శాసించినట్లు, వారు నేటివఱకు బాల్యదశలోనుండిరి కాని, యౌవన కౌమార దశలు వారికిఁ గలుగలేదు. వారి దుర్దశ యేమని చెప్పవచ్చును ? ఇప్పుడిప్పుడు వారు తెలివిఁదెచ్చుకొని, నవనాగరికమార్గములఁ ద్రొక్కుచుండిరి. ఈదేశచరిత్రమును ముందు విశదముగ వ్రాయుచున్నాము.

చీనాదేశవాసులకు దురభిమానము మెండు: విదేశీయులతో వారు కలుపుగోలుఁదనముగఁ దిరుగరు; లోకములో వారే బ్రహ్మాండనాయకులమని, వారి

దేశమే, కలియుగమైయుండెనని, వారి యభిప్రాయము. ప్రపంచములో నన్ని దేశములకంటె ముందువారిదేశమే, జనులతో నిండియుండెనని వారుతలంచెదరు. ప్రథమమున, దేవతలే, వారిరాజులుగను గురువులుగను, వారికి సకలశాస్త్రములను కళలను వారికి బోధించిరనియు, వారినమ్మకము. ఏశాస్త్రములలోను, కళలలోను వారికి విశేషము ప్రవేశము లేదు. ప్రథమమున, వారికి శాస్త్రజ్ఞానము విదేశీయులవలనవచ్చియుండవలెను; లేదా ఆవిదేశీయులు వీరికిశాస్త్రములను గొంచెము చెప్పియుండవలెను; ఏదియెట్లుండినను, బాల్యదశను వలె, వారి శాస్త్రజ్ఞానము మట్టుపడెను గాని, వృద్ధినొందలేదు.

చీనాదేశస్థులు, ఆర్యకుటుంబములోని వారు కారు; ఈమాట నిశ్చయము. అనేకవిషయములను బట్టి యాలోచించి, చూడగా, ప్రాచీనకాల్డియా (Ancient Chaldia) దేశీయులగు "సుమరియనులు"ను (Sumarians) చీనావారునుబంధువులనితోఁచుచున్నది; న్యాయముప్రకారము ఆదిమదేశీయులు వలె, వారుబాల్యదశలోఁ బశ్చిమమునకుఁ బ్రయాణముగలుగు జగులు, తూర్పునకు వచ్చి, ఆసియాఖండమధ్యభాగము నాక్రమించిరి. ఈతూర్పుదేశము లంతకుఁ బూర్వమే, మంగోలియనులచే నాక్రమింపఁబడియుండెను, ఒకవేళ, క్రొత్తగ దేశములోనికి వచ్చినవారుబలపరాక్రమములచే మంగోలియనుల నోడించి, దేశమునుస్వాధీనముఁ జేసికొనియుండవలెను, లేక, శాంతముగను సంబంధబాంధవ్యములం జేసికొని, సమిష్టిగనుండియుండవలెను; ఏదయినను, క్రొత్తగవచ్చినవారు మాత్రము దేశములోఁ గాపురముండిరి. కాల్డియాదేశమును వారువిడిచిపెట్టి నప్పుడు, ఆదేశీయులశాస్త్రములను గాని, కళలను గాని, బాగుగ నభ్యసించియుండ లేదు. వానిజ్ఞానమైనను వారికి విశేషములేదు; ఇట్టిమిడిమిడి జ్ఞానముతో వారా దేశమునువిడిచి, చీనాదేశమునకువచ్చిరి, దేశకాలభేదములవలనను, నూతనదేశీయులతోఁ జేసిన సంబంధబాంధవ్యముల వలనను, వారుజ్ఞానాభివృద్ధి మార్గములను విడిచి, తమకుఁగలకించిచ్ఛాస్త్రజ్ఞానముతోఁదృప్తినొంది, శతాబ్దములనుగడిపిరి, పరిశ్రమఁజేసినగాని, శాస్త్రమును, కళయును, భూమియును, నిరసించి, కృశించి. జీర్ణించును. జ్యోతిషము వారికిఁ దెలిసినను, 'దూరదర్శిని' యంత్రము నుపయో

గించుట వారికిఁ దెలియదు. మందు గుండుచేయుట వారికిఁ దెలిసినను వారు దానిని వినోదార్థ ముపయోగించుచుండిరి కాని, మఱియొక పనిలో వాడుకఁ జేయలేదు. రోగము వచ్చినపుడు, రోగులను తాయెత్తులను గట్టుటతప్ప వారివైద్యులకు రెండవసాధనము తెలియదు. చిత్తరువులను వ్రాయుట వారి చిత్రకారులకు దెలియును; కాని, ఆబొమ్మ కెచ్చట కళయుంచవలెనో, ఎంత వఱకు దానికాంతి యుండవలెనో, ఏవిధమున దానిని దిద్దవలెనో, యీ మొదలగు సంగతులు వారికి లేశమును తెలియవు.

అనేకయుగాంతరములనుండి వచ్చుచుండిన వారి చరిత్రములో, వారి రాజులను మంత్రులను గుఱించితప్ప మఱియొక విషయమును గుఱించి వ్రాయఁబడి యుండలేదు. ఆ 'పసుపు' సముద్రము (Yellow sea) మొదలు పారసీకదేశమువఱకుఁ గల చీనాదేశములో నివసించియుండిన కోట్లకొలఁది జనుల గుఱించి చరిత్రలోఁ గానరాదు. వారిచరిత్రము రాజులచరిత్రముగాని, దేశీయుల చరిత్రముకాదు. దేశీయులును రాజులునుగలిసి, చేసినచర్యలతోఁ గూడి యుండినచే, దేశచరిత్ర మనఁబడును కాని, దానికి భిన్నత్వము వచ్చినపు డది చరిత్రముకాదు.

క్రీ. పూ. సం. 2000 రములకుఁ బూర్వమునుండి, దేశచరిత్ర ముండినట్లు ప్రతీతికలదు కాని, దానికిఁ దగిననిదర్శనములు కనఁబడవు; అవియన్నియుం నశించినట్లు కనఁబడును; అవి, పురాణకథలవలెఁ దోఁచును. ప్రథమమున వారు బాల్యదశలోనుండినపుడు, క్రమముగ నూతనాంశములు వారికిఁ దెలిసినందున, వారియజ్ఞానముపోయెను. ఈనూతనాంశములే, యవతరించి, రాజులై పుట్టి, వారిని బరిపాలించెనని వారియభిప్రాయము. వారి మొదటిరాజు భూమ్యాకాశముల కీరూపము నిచ్చెను. ఆరాజు తన నెత్తిమీఁదనుండిన రాతిగోళమును పరశుతోఁ గొట్టుచున్నట్లును చెక్కుచున్నట్లును బొమ్మకలదు; ఆరాతిగోళమే యాకాశము. అతని తరువాత, స్వర్గము, భూమి, మనువు — ఈమువ్వురు రాజు లనేకయుగములు కొలఁది రాజ్యముఁ జేసిరి, మొదట వారు వనములలోను చెట్లనీడలలోను జీవించుచుండిరి. ఈమువ్వురి తరువాత వచ్చినరాజు వారికి గృహనిర్మాణమును నేర్పెను.

ఈరాజు తరువాతవచ్చినరాజు, వారికినిప్పును రగిలించుటయు, కఱ్ఱసామగ్రులను జేయుటయు నేర్పెను; దేశములోజరిగిన విషయములను జ్ఞాపకముంచుకొనుట కతఁడు వారికొకమార్గముఁజూపెను; గొప్పసంగతి జరిగినపుడు, పెద్దముడిని స్వల్పసంగతి జరిగినపుడు, చిన్నముడిని దారముపైఁ గట్టుమని యతఁడు వారికి బోధించెను. అతనితరువాత, "ఫ్యూ—వా" అనురాజు సింహాసనము నెక్కెను; అతఁడు గృహస్థాశ్రమ ధర్మములను రచించెను. వారికి గానవిద్యను, చేపలను బట్టుటయు నేర్పెను. జిగిబిగిగనుండు చీనాభాషనతఁడే కనిపెట్టెను.

అతనితరువాత, 'షేన్—నంగ్' అనురాజుసింహాసనమునకువచ్చి, కృషి విద్యను వారికి బోధించెను. నాగళ్లనుజేయుటయు, భూమినిదున్నుటయు, సస్యములను ఖండించుటయు — ఈమొదలగునవి వారికి నేర్పెను. అతనిమూలమున, దేశము సకలసస్యఫలవంతమై, ప్రకాశించెను; దేశీయులు నానాటికి సుఖముగ నుండుచు వచ్చిరి. అతఁడే, వైద్యశాస్త్రమునకు మూలపురుషుఁడు. అనేకరోగౌషధుల నతఁడు కనిపెట్టెను. చేదాకులను నములుచున్నట్లు వ్రాయఁబడిన యతని బొమ్మప్రతివైద్యునివైద్యశాలగోడమీఁదఁగనఁబడును.

అతనియనంతరము, 'హ్వాంగు—టి' అనురాజు రాజ్యమునకువచ్చెను, అతఁడుగణితశాస్త్రమును గనిపెట్టి, పంచాంగమును వ్రాసి, జ్యోతిషమును జరుపుటకుఁదగినసాధనములను నిర్మించెను. గానవిద్యకుఁదగినసాధనములను సహితము కనిపెట్టెను. అతఁడుచెప్పినప్రకారమే, దేశీయులు నేటివఱకు కాలమును గుణించెదరు. అతనిభార్య పట్టుపురుగుయొక్క యుపయోగమును కనిపెట్టి, దానినిపెంచుటయు, దానిపట్టుతోబట్టలను నేయుటయు, జనులకు నేర్పెను. ఆమెయే, చీనాపట్టుకు మూలకారకురాలు. ఈరాజులుపురాణపురుషులు.

ఇఁకనిర్ధారణగ దేశమును బరిపాలించిన రాజులవంశము, 'యహా' అను రాజుతోఁ బ్రారంభమగును. ఐజిప్టుమహారాజ్యము మధ్యస్థితిలో నుండినపుడు, 'యహా' అనురాజు, చీనాదేశమును బరిపాలించి, యుండవచ్చును. ఈయుభయ దేశీయులకు ననేకవ్యత్యాసములు కలవు. ఐజిప్షియులు శ్రమపడి, చిన్నదేశములో నుండినను, శాస్త్రపరిశోధనఁజేసి, నాగరికులయిరి. వారిలో ననేక

వేదాంతులును, కవులును, పండితులును, చిత్రకారులును, శిల్పులును కలరు. చీనాదేశము విశాలము; దేశీయులు కోట్లకొలది కలరు: అయినను, వారు చిన్న పిల్లలవలె, నిరంకుశ ప్రభువునకులోఁబడి, యుగాంతరముల కొలఁది, దివారాత్రములు నిద్రాహారవిహారములలోఁ గడపి, అజ్ఞానాంధకారములో మునిఁగి యుండిరి; లోకమనిగాని, దేవుఁడని గాని, వారికి జ్ఞానములేక పోయెను. ఎంతవఱకును వారుప్రారబ్ధకర్మమని తలంచి, నిద్రించిరి.

'యా' అనురాజు తరువాత, 'షన్' అనురాజు సింహాసనమునకు వచ్చెను, అతఁడు గొప్పజనరంజకుఁడు. ప్రథమమున, నతఁడు కుమ్మరివాండ్రతోఁ దిరిగి, పనిఁజేయుచుండి నందున, నతనిని వారు ప్రేమించి నిర్దుష్టమగు మృత్పాత్రల నతనికివారు కట్నముగఁబంపుచుండిరి. అతనిపరిపాలనకాలములో, దేశము సుభిక్షముగనుండి, వృద్ధిఁబొందెను; కాని, అతనికాలములో దండనాధికారము ప్రబలమై, పాఠశాలలో బాలురను బెత్తముతోఁ గొట్టుట వాడుకలోనికివచ్చెను. ఈ'యా' అనురాజును, 'షన్' అనురాజును, వారిరాజులలో గొప్పవారు; వీరిరువురు కీర్తిప్రతిష్ఠలను నిలుపుకొనిరి.

వారితరువాత "యు" అనురాజు దేశమును బరిపాలించెను; అతనికాలములో నతివృష్టివలన, దేశములోనుండిన నదులన్ని యుప్పొంగెను; దేశము జలార్ణవమయ్యెను. అప్పు డారాజుకాలువలను ద్రవ్వించి, జలములుసముద్రములోఁబడునట్లు ప్రయత్నించెను. అతనితరువాత, ననేక రాజరాజులురాజ్యముఁజేసిరి; వారిలోఁగొందఱు ధర్మాత్ములును, కొందఱుపాపాత్ములును కలరు. తుదకు "చౌ—సిన్" అనుపాపాత్ముఁడు రాజ్యమునకువచ్చెను. అతనిపూర్వుఁడొకఁడుతోలుసంచులను రక్తముతో నింపి, వానిని మీఁదికి యెగరవేసి, వానిని బాణములతోఁగొట్టి, "ఓజనులారా! చూడుఁడు—నేను స్వర్గమును గొట్టితిని" అనిచెప్పుచుండెను. "చౌ—సిన్" అనురాజుకూడ, మూర్తీభవించినపాపమని చెప్పవచ్చును. అతనిపాపకర్మలకు సామంతులును జనులును మండిపడి, "వీర కుమారుఁడ"నువానిని మొదటఁబెట్టుకొని, తిరుగఁబడిరి; అప్పుడు "చౌ—సిన్" స్వనగరులోనఁ గూర్చుండి, ధనరాసులను దగ్గరఁబెట్టుకొని, నగరునకునిప్పుఁ

బెట్టించి,తగులఁబడె. ఈవీరకుమారుఁడే, "హా"వంశమును స్థాపించెను; ఈవంశము క్రీ. పూ. సం. 249రమునకును వచ్చెను. అతనివంశస్థులు, దేశమునకుఁ బశ్చిమమునసుండిన కిరాతులతోఁబోరాడి,వారినిజయించిరి. ఆరాజులను, "అసీరియా" దేశపురాజులుమన్నించి, గౌరవించిరి; కాని, దేశములోన స్వాస్థ్యము పుట్టియుండెను; భూఖామందుల (Land-lords) పోరువిశేషమయ్యె, వారి పోరును జనులుసహింపలేక, శ్రమపడుచుండిరి.

క్రీ. పూ. ఏడవశతాబ్దములో నిరువురు మహానీయులు దేశములోఁబుట్టి బోధనలవలనను,ప్రత్యక్షపు నడవడికలవలనను,దేశీయుల నుద్ధరించిరి. "లౌట్సు" అనువాఁడు గొప్పవేదాంతి; దేశీయుల పిచ్చిమతాచారములను, మతాభిప్రాయముల నతఁడు తొలఁగించి,సద్ధర్మము పట్టునటులకుఁ దగిన ధర్మమార్గములను వారికి బోధించెను. "కన్-ఫ్యూసియస్"అనువాఁడు గొప్పసంఘ సంస్కర్త. ప్రాణరహితమై పడియుండిన ప్రాచీన మతాచారములను, మతాభిప్రాయముల నతఁడు దేశీయుల దినచర్యల కనుగుణముగ మార్చి, వానికిఁ బ్రాణముఁబోసెను. వారిరువురకును కక్షవిశేషముగనుండెను, వారిలోవారికిఁ బొత్తులేక పోరియును. ఒకసమయమున, 'లౌట్సు' 'కన్-ఫ్యూసియసు' తోఁగొంతవరకు సంభాషించి, "అయ్యా! నామాటలను వినుఁడు. మీదురభిమానమును గర్వమును జాలింపుఁడు,మీదుర్వాంఛలను కట్టిపెట్టుఁడు. మీచేష్టలు,మీకోరికలు చాలు,చాలు. వీనివలన మీకుఁ బ్రయోజనములేదు."

ఏది యెట్లుండినను, "కన్-ఫ్యూసియసు" బోధించిన ధర్మమార్గములే, జనులకు సులభముగ నుండినందున, వానినే వారవలంబించిరి. ప్రథమమున నతఁడు, స్వసంస్థానములో సంఘసంస్కరణముఁ జేయనారంభించెను. అతని సంస్థానము తదితర సంస్థానములకు నిదర్శనమయ్యెను. అతని సంస్థానములో, వృద్ధులు సునాయాసముగ రక్షింపఁబడుచుండిరి; బలవంతులకుఁ దగినపనులు దొరకుచుండెను. దుర్బలులు కాపాడఁబడిరి. అతఁడు ప్రధానమంత్రియైనతరువాత, దేశీయుల యాచారవిధానములను, న్యాయశాస్త్రమును సంస్కరించెను. రాజునొద్ద నతనికిఁ గలసన్మానమును తదితరసామంతప్రభువులుచూచి, యోర్వలేక,అతఁడు చేయుఁ

దలఁచిన సంస్కారముల నెదిరించి, వానిప్రయోజనములేవని వాదించుచుండిరి; వారివాదముల నతఁడు సహింపలేక, యుద్యోగమునువిడిచి, ప్రతిసంస్థానములోఁ దిరిగి, శ్రవణాసక్తులగు వారికినిజబోధనలను జెప్పెను; ప్రాచీనగ్రంథములకు వ్యాఖ్యానముఁ జేసెను; 'చీనా' భాషలో వ్రాయఁబడిన గ్రంథములలో నుత్కృష్టమగు "స్ప్రింగు-ఆటమ్" అనుగ్రంథమును రచియించెను. దేశీయుల అస్వాస్థ్యమును, భూఖామందుల దౌర్జన్యము నతఁడుచూచి, పరితపించెను. ఒక సమయమున, నతఁడు శిష్యులతోఁగూడి, మార్గముఁబట్టి పోవుచుండ, దుఃఖించుచుండిన యొకస్త్రీనిఁజూచి 'ఓతల్లీ! కష్టముపైఁగష్టము ననుభవించినట్లు కనఁబడుచుంటివి' అనిపలికెను. "అయ్యా! మీమాటనిజము; నాతండ్రిని, భర్తను పులి చంపెను. నాకొకపుత్రుఁడుకలఁడు; వాఁడుకూడ, నేడుపులినోటఁబడెను" అని యామెచెప్పెను. 'ఓతల్లీ! ఇన్నికష్టములువచ్చెనుకదా! ఈస్థలములో, నీవేల నివసించియుంటివి?" అనియతఁడడిగెను. "అయ్యా! ఈసంస్థానములోఁ బ్రజాపీడలేదు! కనుక, నివసించియుంటిని" అనియామె చెప్పెను. అప్పుడతఁడుశిష్యులనుజూచి, "ఓయీ! బాలకులారా! ఈసంగతిని జ్ఞాపకములోనుంచుకొనుఁడు. ప్రజలను బీడించునరాజ్యము వ్యాఘ్రముకంటెభయంకరము" అనిబోధించెను.

ఆమహానీయుని మరణానంతరము నేకసంవత్సరములు గతించిన తరువాత, నతనిసద్బోధనలు సఫలమయ్యెను. ఈలోపునదేశములో నరాజకము మెండయ్యెను. అల్లకల్లోలములుపుట్టెను. ప్రచండవాయువువీచునపుడు వృక్షమువలె, దేశము కంపించెను. అప్పుడు; 'షి — హ్వాంగ్-టి' అనువాఁడు రాజ్యమునకువచ్చెను. అతఁడువిచ్చుకత్తిని బట్టుకొని, సింహాసనమునధిష్ఠించుట, యభ్యాసము. ఇతర సంస్థానములుకలిసి, అతని యెదిరించెను. మిడుతలదండు వెడలి, పంటలనుబాడుచేసెను. నవధాన్యములను సమృద్ధిగలదేశములోనికి దీసికొనివచ్చినవారిని రాజు సన్మానించి, వారికిగొప్పయుద్యోగములనిచ్చెను. క్రమముగ నతఁడు సంస్థానములను జయించి, మహారాజ్యమును సంస్థాపించెను. ప్రాచీనగ్రంథములవలనను, "కన్ — ఫ్యూసియస్" చెప్పినబోధనలవలనను, జనులు తన నిరంకుశప్రభుత్వము సహింపరని రాజుభయపడి, వైద్యగ్రంథములును జ్యోతిషగ్రంథము

లును తప్ప, తదితరలిఖిత గ్రంథములను నశింపఁజేయుమని యాజ్ఞాపించెను. ఆగ్రంథములను దగులబెట్టుటకుబదులు ప్రాణత్యాగముఁజేయుటకు జనులుసిద్ధపడిరి. కొంతవఱకు రాజాజ్ఞప్రకారము గ్రంథములు తగులబెట్టఁబడెను. రాజునిర్మించిన నూతనరాథారిమార్గములవలనను, వంతెనలవలనను, జనులుకొంతవఱకు శాంతిపడి, సుఖముగనుండిరి.

ఆసమయమున, చీనాదేశమునకుఁ బశ్చిమ ప్రాంతముల నుండిన 'తార్తారులు' దాడివెడలివచ్చిరి. 'హ్వాంగే-టి' చతురంగ బలములనులను దీసికొని, వారినియెదిరించి, వారినియోడించి, వారిదేశములోఁ బ్రవేశించి, వారిని స్వాధీనముఁజేసికొనెను. అంతతో నతఁడు తృప్తిఁబొందక, మున్ముందు శత్రువులదాడి నుండి దేశమును రక్షించుటకు గొప్పగోడను కట్టించెను. ఆగోడమూలమున, నతనిపేరు లోకములో శాశ్వతముగ నిలిచెను; ఈరాజింత గొప్పవాఁడైనను, మృత్యువనిన భయపడుచుండెను; దానిపేరుఁ జెప్పినవారిని సంహరించుచుండెను. వార్ధకదశలో నతఁడొక గొప్పనగరమును నిర్మించి, దానిలో నొక్కొక్క గదిలో నొక్కొక్కరాత్రి నిద్రించెను. ఏగదిలో నతఁడు శయనించునో, రెండవవానికిఁ దెలియదు. ఈప్రకారమే, యమదూతలను మోసపుచ్చవలెనని, పిచ్చితలంపుదలంచెను. ఇట్టిపిచ్చియాలోచనల నతఁడు కలిగియుండినను, రాజనీతిపారంగతుఁడు, ధర్మాత్ముఁడు, బుద్ధిమంతుఁడు. చీనామహారాజ్యమున కతఁడే, స్థాపకుఁడు, అతఁడు రాజ్యమునకు వచ్చినప్పటికి, దేశము చిందరవందరపడియుండెను. దేశమునకు స్వాస్థ్యములేదు. రాజ్యాంగములన్నియు చిక్కువడియుండెను; అట్టిరాజ్యమున కతఁడు స్వాస్థ్యముఁ దీసికొనివచ్చి, రాజ్యాంగములనుస్పష్టముఁ జేసెను, అతనికాలములో జనులు సుఖముగనుండిరి.

ఈరాజింత గొప్పవాఁడైనను, ఇతని పరిపాలన కాలములోను, ఇతని వంశస్థులకాలములోను, భూమి మానవరక్తముతోఁ దడుపఁబడెను. ప్రాణములనిన, చీనావారికి యొకగడ్డి పోఁచవలెఁ గనబడును; కనుక, వారు మానవరక్తముతో భూమిని దడుపుచుండిరి. మృత్యువనిన భయపడుచుండిన చక్రవర్తి శాసించిన దండనీతి, (Criminal Code) మహాకఠినముగనుండెను.

ఈయరాచకము కొన్నిదినములవఱకు దేశములోనుండెను; అంత "హాన్" (Han Dynasty) వంశస్థులు రాజ్యమునకువచ్చిరి. "కన్—ఫ్యూసియసు" బోధనలు ప్రబలముయ్యెను. వానిమూలమున దేశమునకు స్వాస్థ్యము వచ్చెను. నశించినగ్రంథములను వ్రాయించి, రాజులుశాస్త్రజ్ఞానమునభివృద్ధిఁ జేసిరి. గృహములలోని మిద్దెలమీఁదను, పర్వతగుహాములలోను, కన్నములలో, పూర్వపురాజునకుభయపడి, దాచియుంచఁబడిన గ్రంథములను జనులు బయటకుఁ దీసికొనివచ్చి, మరల వానిని తిరిగివ్రాసిరి. కొన్నిగ్రంథములను సవరణఁ జేసిరి. వారు నూతనగ్రంథములను, సాహిత్యమును నేర్చుకొనిరి. రెండుశతాబ్దములు గతించునప్పటికి, దేశములో నూతనపుస్తకభాండాగారములు వెలసెను.

తప్పుజేసినవారిని దండించుటకు నిర్మింపబడిన "అమానుష - శిక్షలు" కొట్టికొట్టి వేయఁబడెను. "టి—ఇంగ్" అనుబాలిక మూలమున, శిక్షలన్నియు, ఉరిదండనతప్ప—కొట్టివేయఁబడెను. ఆమెతండ్రి, సాయింతుఁడు. గొప్పవైద్యుఁడు. రాజస్నేహితులువచ్చినసంకటము నతనిని బాగుజేయుమని కోరినపుడతఁడు రాజాజ్ఞను మన్నింపక, యూరకుండినందున, నతని యవయవములను నుర్దించి, ఛేదింపుడని రాజాజ్ఞాపించెను. ఆవైద్యునికూఁతురు "టి—యింగ్" రాజువద్దకువెళ్లి, బ్రతిమాలెను. అతనికిఁ గుమారులు లేరు. రాజదండన నతఁడువిని పలువిధములఁ జింతించెను. ధైర్యస్థైర్యములుగల నతని కూఁతురు రాజునుసమీపించి, తండ్రినిర్దోషియని చెప్పుటయేకాక, అమానుష శిక్షలు కూడదని రాజునకు బోధించెను.

"ఓరాజా! నాతండ్రి, మరణదండనకుఁ దగినవాఁడైనయెడల, నతనిని జంపుఁడు; కాని, అతని యవయవములను ఛేదించుటవలన, నతఁడు పశ్చాత్తాపముపడక పోవుటగాక, న్యాయశాస్త్రముయొక్క ముఖ్యోద్దేశమునిష్ఫలమగును. ఎంతవిచారించినను, ఛేదింపబడిన యవయవములు తిరిగి రానేరవుకదా! ఓనాథా! ఈవిషయములో నన్నుబానిసగనమ్ముఁడు; మాతండ్రిని మాత్రము స్వేచ్ఛగవిడిచిపెట్టుఁడు" అనియామె ప్రార్థించెను. ఆమెమాటలను రాజువిని, యామెతండ్రినిపెట్టెను; అమానుష దండనలను కొట్టివేసెను.

ఇట్లు కొంతకాలము జరిగెను; ప్రాచీనదశమరలెను; "కన్. ఫ్యూసియసు" బోధనలు కోట్లకొలఁది మనుజులకు బోధపడలేదు; ఆబోధనల వలన వారిమనస్సులకు శాంతము లేకపోయెను. అప్పుడు వారు నూతనమతమును, మతాభిప్రాయములను తెలిసికొనఁగోరి; హిందూదేశమునకు రాయబారులను బంపిరి. వారు భరతఖండమునకువెళ్లి, బౌద్ధగ్రంథమతములను బుద్ధదేవుని విగ్రహములను దీసికొని స్వదేశమునకుఁ బోయిరి. ఈ బౌద్ధమతము దేశములో వ్యాపించి "హాన్—వంశ" మంతమగుకాలమునకు, వేరుపన్నను.

ఈ యుగములలో, చీనావారికిని, విదేశీయులకును గల సంబంధములను గుఱించి, లేశమపి తెలియదు. వారిదేశమున కొకవైపున గొప్పగోడ కలదు; తదితర ప్రక్కలను మహాపర్వతశ్రేణులు కలవు. ఇట్లు నలువైపులఁ గప్పబడి, చీనావారు స్వదేశమును, కలియుగ వైకుంఠముని భావించి, నిద్రాహారవిహారములలోఁ గాలముఁగడిపి, లోకములో మహారాజ్యముల సృష్టిస్థితిలయము లనుగుఱించి తెలియకయే, సుఖముగ నుండిరి.

ఇతరదేశ చరిత్రములలో, చీనావారినిగుఱించి, కొంచెము కొంచెము చెప్పబడియున్నది; వారికి విదేశీయులతో సాంగత్యము విశేషముగనుండినట్లు కనబడదు. పారసీకదేశచరిత్ర కథలలో వీరినిగుఱించి, కొంచెముచెప్పబడి యున్నది—ఏదియెట్లుండినను, వారిపట్టుబట్టలు లోకప్రసిద్ధి చెందెను. వారి పట్టుబట్టలను 'ఫొనిషియనులును' 'హీబ్రులును' కొనుచుండిరి. రోమకులకు గూడ, వారిపట్టుబట్టలసంగతి తెలియును.

మహారాజ్యమునకుఁ గౌమారదశ వచ్చునప్పటికి, వారు కొంచెము కొంచెము విదేశీయులతో సాంగత్యముఁ జేయనారంభించిరి; ఇప్పటికిని, వారు విదేశీయుల సాంగత్యమువలన, బాగుపడలేదు. చీనావారికి తెలివితేటలు కలవు; కాని, వారిబుద్ధి—బాలురబుద్ధి; వారిబుద్ధి గట్టుపడి యుండెను కాని, వికసింపలేదు: వారిబుద్ధినిజడ్డుదనము విడువలేదు.

---

శ్రీ ర స్తు.

# హిందూ దేశ చరిత్ర.

## ఇరువదితొమ్మిదవ అధ్యాయము.

---

### భరతఖండస్వరూపనిర్ణయము.

ఉత్తరమున హిమవత్పర్వతములును, దక్షిణమున కన్యాకుబ్జమును తూర్పున బ్రహ్మపుత్రానదియు, పశ్చిమమున సింధునదియు—వీని మధ్యమున నుండినదేశమే భరతఖండము. ఈభరతఖండము, భారతీయుల పూర్వపుణ్యము వలన, నాంగ్లేయ దొరతనమువారిచేఁ బరిపాలింపఁబడి, సకలసిరిసంపదలతోఁ దులదూగుచున్నది. ఈఖండముయొక్క విస్తీర్ణము—పదిలక్షుల యేబదివేల చదరపుమైళ్లు. ఈ దేశములో ముప్పదికోట్లజనులు, స్త్రీపురుష బాలవృద్ధులు జీవించియున్నారు. ఈదేశమొక చిన్నఖండము కనుక, దానికి భరతఖండమని పేరు వచ్చెను. శీతోష్ణస్థితిగతులలోను, సారములోను, స్వరూపములోను, దేశ మొకరీతిగ లేదు; కొన్నిస్థలములలో వేఁడిమియు, కొన్నిస్థలములలో శీతలమును విశేషము; కొన్నిప్రదేశములు సమశీతోష్ణములు; కొన్నిభాగములు సారవంత ములు; కొన్ని ఊసరక్షేత్రములు; కొన్నిభాగములు—బయలులు; కొన్ని కేవలము వనభూములు.

ఈశీతోష్ణస్థితులును, భూసారమును, దేశముయొక్కస్థితియు—ఈదేశ కాలస్థితులవలన, భారతీయుల దేహబలమును, బుద్ధిబలమును, ధనబలమును, ఇచ్ఛాశక్తియు, జ్ఞానశక్తియు, క్రియాశక్తియు వ్యక్తమయ్యెను. అందుచేత, దేశీయులచరిత్రమును జదువుటకు వీలుపడును. వీనిమూలముననే, భారతీయులు

ప్రస్తుతపుస్థితిగతులకు వచ్చిరి. అందుచేత, నేదేశీయుల చరిత్రమును మనము చదువుటకారంభించినపుడు, మనముముందు కొన్నిసంగతులను తెలిసికొనవలెను:—ఏదేశమువారినివాసము?. ఆదేశము, ద్వీపమా, సముద్రతీరదేశమా, లేక కేవలము నాటుదేశమా?. సముద్రతీర దేశమైనయెడల, దానితీరము కత్తిరింపబడినతీరమా, లేకకత్తిరింపఁబడలేదా?. దానితీరమున జలసంధులుగాని, అగాధములు గానికలవా? నాటుదేశమైనయెడల, నితర దేశములకును దానికిని గలసంబంధమేమి? దానియిరుగుపొరుగు దేశములెట్టివి? ఆదేశములో, నదులును, పర్వతములునుకలవా?ఆపర్వతములెట్లు నిలిచియున్నవి? ఆనదులెట్లు ప్రవహించును? చిన్నకొండలు,లోయలు, యెగుడుభూములు, దిగుడుభూములు—వీనిని గుఱించి తెలిసికొనవలెను. ఎంతవర్షముపడును? విశేషముగనా, లేకకొంచెమా? ఆదేశశీతోష్ణస్థితు లెట్టివి? ఆదేశమువేఁడిగనుండునా,లేక శీతలమా, లేకసమశీతలమా, సారవంతమగుదేశమా, లేక నిస్సారమా ? సారముగల దేశమైనయెడల, సునాయాసముగ పంటలుపండును ; నిస్సారమైనయెడల, మనుజులు కాయక్లేశము పడినగాని, పంటలు పండవు. ఈ విషయములను ముఖ్యముగ తెలిసికొనవలయును.

పూర్వకాలములో రాధారిమార్గములుకాని, రైలుబండ్లుగాని, లేవు, ఆకాలములో నొకదేశమునుండి మఱియొకదేశమునకు వెళ్లవలసివచ్చినపుడు; సంచారావస్థలోనుండిన మనుజులు కొండకనుమలను, లోయలను, నదులనను సరించి, గమనించుచుండిరి. పర్వతములపై నెక్కివెళ్లుటకష్టముగాని, కొండలోయలననుసరించి, వెళ్లుటసులభము ; నదులమార్గమువెంబడివెళ్లినందున, దాహమునకు జలముదొరకును ; దానియొడ్డున మొలచినపచ్చికను పసువులుతినును ; వీనికంటె సులభమగుమార్గము మఱియొకటిలేదు. సముద్రతీరము ననుసరించి, ప్రయాణముఁజేయుట,మిక్కిలిసులభము; కనుక, నదులనుగుఱించియు, కొండలోయలను, కనుమలనుగుఱించియు తెలిసికొనుట యావశ్యకము ; భారతమాతయొక్క స్వరూపమును నిర్ణయించి, ఆయాకాలములలో నివసించినమనుజులనుగుఱించి, చెప్పుచున్నాము.

ఆసియాఖండమునకు దక్షిణమున మహోన్నతప్రాకారములవలె, హిమవత్పర్వతములుఁగలవు; వానికి దక్షిణముననొక వేయిమైళ్ల దూరమువఱకును సముద్రములోనికి వ్యాపించి, మూఁడువైపుల సముద్రముచే నాక్రమింపఁబడిన దేశమొకటి కలదు. ఇట్లు సముద్రములోనికి వ్యాపించిన త్రికోణాకారమగు దేశమునకును, మహాఖండమునకును మధ్యనొక లోయకలదు: ఒకవంతెనవలె, నీలోయా రెంటిని కలుపుచున్నది; హిమవత్పర్వతములకు దక్షిణముననుండిన దేశమునకును; త్రికోణాకారముగ సముద్రములోనికి వ్యాపించిన దేశమునకును ఈవిశాలమగు లోయకును, భరతఖండమని పేరువచ్చెను.

ఈ ఆశియాఖండపటమును జూడుము; మీఁదఁజెప్పఁబడిన మూఁడు భాగములు ప్రత్యేకముగ దానిలోఁగనఁబడును; దానికినుత్తరమున, హిమవత్పర్వతములుకలవు; వానికిఁదగిలి, ఉత్తరహిందూస్థానముకలదు; అప్రదేశము పూర్వపశ్చిమములకు వ్యాపించియున్నది; గంగసింధుబ్రహ్మపుత్ర నదులు ప్రవహించుచున్నవి; ఆదేశమునకే, మధ్యదేశమనియు, ఆర్యావర్తమనియు, రెండు నామములుకలవు; దానికిదక్షిణమున త్రికోణాకారముగనుండి, పర్వతశ్రేణులతోను, నదులతోఁగూడి సముద్రములోనికి వ్యాపించియుండిన దేశమునకే, దక్షిణదేశమని, లేక 'దక్కను' అని, పేరుకలదు. అనేకవేలయుగముల క్రింద, భరతఖండమంతయు, జలార్ణవమైయుండెను; మఱికొన్నియుగములు గడచిన తరువాత, సముద్రములోనుండి "దక్కను" దేశము మీఁదికివచ్చెను; ఇదియొక్కటియెకాదు, నైరృతిమూలను, "దక్షిణ-ఆఫ్రికా" దేశముతోఁగలసి, మఱియొక భూఖండము దీనితోఁగూడి హిందూమహాసముద్రములోనుండి, మీదికి వచ్చెను. ఇట్లు మీదికివచ్చిన దక్షిణదేశమునకు నైరృతిమూలను "ఆరావలీ" పర్వతశ్రేణులుకలవు. ఇప్పటికిని, "దక్కను" దేశములోను, "దక్షిణ-ఆఫ్రికా" దేశములో నొకమాదిరిగనుండు జంతువులయెముకలును, స్థావరములశేషములును దొరకుచున్నవి; ఈరెండుఖండములను గలుపుచుండిన భూభాగమొకటి సముద్రములోఁగలదు. "దక్కను" దేశమునకుత్తరమున, (హిమవ

త్పర్వతముల పశ్చిమమునకును, ఆఫ్ఘనిస్థానము — బెలూచిస్థానమునకును) కొన్ని యుగములక్రింద సముద్రము ప్రవహించుచుండెను.

అనేకయుగములు గతించెను; మఱియొకభూభాగము క్రమముగ, సముద్రములోనుండి మీదికివచ్చెను; ఆభూభాగమే, 'దక్కను' దేశమున కుత్తరమున నున్నది; ఆభూభాగమే, సముద్రమట్టమునకు 20,000 ల అడుగులు యెత్తుగనున్నది; ఈభూభాగముమీద ననేక జలజంతువుల దేహములు నేటికిం గానవచ్చుచున్నవి; ఆభూభాగమునకే, హిమవత్పర్వతములని పేరు వచ్చెను; వానికి యుత్తరముననుండిన దేశమే, 'టిబెటు'. ఈభాగముసముద్రములోనుండి మీఁదికివచ్చినందున, నైరృతిమూలనుండిన దక్షిణభూఖండమంతయు సముద్రములో మునిఁగెను; 'దక్కను' దేశమున కుత్తరముననుండిన సముద్రజలములన్నియు దక్షిణముగఁ బ్రవహించెను; ఆజలములే, నేఁడు 'అరబ్బీ సముద్ర' మయ్యెను. ప్రాచీనవింధ్యపర్వతములకును, నూతనముగ మీఁదికివచ్చిన హిమవత్పర్వతములకును మధ్య, నొకగొప్పలోయ నిరూపింపఁబడెను. దక్షిణోత్తరములకుఁ గలపర్వతములలోఁ బుట్టిన మహానదులు లోయలోఁబడుచుండెను. అనేకయుగములకొలఁది నదులీలోయలోఁ బడుచుండుటవలన, నవితీసికొనివచ్చిన మట్టితో నీలోయ క్రమముగ నింపఁబడెను. ఈవిధముగ నింపఁబడిన ప్రదేశమే, ఉత్తరహిందూస్థానము; దానికిఁబశ్చిమమున సింధునదియు, తూర్పున గంగ-బ్రహ్మపుత్రా నదులముఖద్వారములును కలవు. కొండలమీఁదనుండి తీసికొని రాబడిన మట్టితో, వింధ్యాచల-హిమాచలముల మధ్యనుండిన లోయయంతయు నింపబడి, అనేకయడుగుల యెత్తుగనువచ్చెను. ఈ ప్రకారముగ నీలోయ నింపఁబడక యుండినయెడల, 'దక్కను' దేశము, 'ఆస్ట్రేలియా'వంటి నొక ద్వీపఖండమై యుండును; దానిచరిత్రము మఱియొక విధముననుండి యుండును.

దక్షిణ హిందూస్థానము త్రికోణాకారముగనుండు నొకభూమి. దానికి మూఁడు వైపులను సముద్రముకలదు; దానికు నుత్తరమున 'వింధ్యపర్వతములును' 'సత్పుర పర్వతములును,' వాని యుపశాఖలును, ఇంచుమించు

తూర్పుపడమరలకు వ్యాపించియున్నవి; ఈపర్వతములకును ఉత్తరమున నుండు 'హిమవత్పర్వతములకును' మధ్యనుండు దేశమే, 'ఆర్యావర్తము' లేక 'మధ్యదేశము'. వింధ్యపర్వతములు రానురాను దక్షిణమునకు వంగియుండును; అటువైపున, నర్మదానది ప్రవహించుచున్నది; పశ్చిమ తీరమునుండి యీనది గుండ 'దక్కను' దేశములోఁ బ్రవేశింపవచ్చును. ఈనదికి దక్షిణమున, 'సత్పు' పర్వతములుకలవు. ఈపర్వతములు రానురాను, తూర్పున'చోటా-నాగపురము' వద్దవంగును. ఈపర్వతమునకు దక్షిణమున 'తపతి' నదిప్రవహించుచున్నది. పశ్చిమతీరమునుండి, యీనదిగుండ 'దక్కను' దేశములోఁ బ్రవేశింపవచ్చును. ఈరెండు పర్వతముల ననుసరించి, తదితర పర్వతములు శాఖోపశాఖలు నలువైపులఁ బరిణమించుచున్నవి; వీనికిఁ దగిలి, కీకారణ్యములును బ్రహ్మారణ్యములును కలవు. ఇవి యన్నియు, 'ఉత్తర హిందూస్థానము' నకును 'దక్షిణహిందూస్థానము' నకును మధ్యనున్నవి. 500. మైళ్లనిడుపును వ్యాపించియున్నవి. పూర్వకాలములో నితరదేశీయులు దాడి వెడలివచ్చినపుడు, దేశములోఁ గాపురముండినవారు వారియెదుట నిలువలేక పాఱిపోయి, యీబ్రహ్మారణ్యములలో దాగుచుండిరి. జాంబవంతుని కాలమునుండి వచ్చుచుండిన జాతివారీయరణ్యములలో నేటివఱకుఁ గానవచ్చుచున్నారు; హిందువులని పిలువఁబడుటకు వారు సమ్మతింపరు.

'తపతి' నదికి దక్షిణమునమండి 'దక్కను' దేశము పశ్చిమమునమండి తూర్పునకు వాలియుండును; తూర్పున బంగాళాఖాతములోఁ బడుచుండిన నదులవలన, నీసంగతి విశదమగును. ఈదక్షిణ భాగమంతయు మోటుగఁగనఁబడును; ఎచ్చటఁ జూచినను పర్వతములును, గిట్టలును, లోయలును కలవు. ఈ భాగములో నివసించుచుండిన కొందఱు జాతివారు ప్రాచీనకాలమునుండి వచ్చుచున్నట్లుతోఁచును. ఉత్తరహిందూస్థానములో నివసించు హిందువులలోవలె; వీరిలోఁగూడ లేశమువిమార్పులు కనఁబడవు; వీరిమతమును, భాషయు, ఆచారవ్యవహారములును లేశమైన మార్పుచెందకయే వచ్చుచుండెను. ఇతరదేశీయులతోఁ గలసి మెలసినను, వారిగుణములేశమైనను వీరికిఁ బట్టుపడలేదు.

ఈదక్షిణ దేశమునకు తూర్పుపడమరలను రెండు పర్వతశాఖలు కలవు; వానికి 'తూర్పుకనుమ'లనియు (Eastern Ghats) 'పశ్చిమకనుమల' నియు (Western Ghats) నామములు కలవు. 'పశ్చిమకనుములు' పశ్చిమతీరమున, 3000 - 8000అడుగుల ఎత్తు లేచియున్నవి. వీనిని అనుసరించి, [illegible] చిట్టడవులు కలవు; ఈవనభూములు, వనవాసులకుఁ నెలవు, అడవిజాతుల కభేద్యములు. తూర్పుతీరమున, 'తూర్పుకనుములు' కలవు; ఇవి 1500 అడుగులకంటె మీదికి లేచియున్నవి; 'పశ్చిమకనుములు' వలెగాక, యివి మధ్యమధ్యను తెగియున్నవి; వీని నుండ ననేక నదులు ప్రవహించుచున్నవి.

ఈ రెండుకనుములకును సముద్రమునకును మధ్యనుండిన భూములు 2000 ల మైళ్లవఱకును వ్యాపించి, దక్షిణమున నుండిన కన్యాకుమారిదగ్గఁ గలియుచున్నవి. తూర్పుకనుములను భేదించి కొన్నినదులు బంగాళా ఖాతములోను, పశ్చిమకనుమలను భేదించి, కొన్నినదులు 'అరబ్బి' సముద్రములోను గలియుచున్నవి. పశ్చిమకనుమలకును సముద్రమునకును 20 మైళ్లదూరమే కలదు. ఈపశ్చిమతీరభూములు సారవంతములు; ఆతీరమున వర్షము లేమి యుండదు; అందుచేత నాభూములు సదా పచ్చగనుండును. తూర్పుకనుమలకును సముద్రమునకును 100- మైళ్లదూరము కలదు. ఈభూములు గోదావరి, కృష్ణ, పెన్న, కావేరి మొదలగునదులచే సారవంతములై, సస్యసంపన్నములై ప్రకాశించుచున్నవి.

ఈకనుములలో ననేకరాదారి మార్గములు, ఇనుపదారులు, సంతెవలు కలవు; ప్రయాణము చేయుట సులభము. పూర్వము, ప్రయాణము చేయుట కష్టముగ నుండెను; 'కాశికి వెళ్లినవాఁడును, కాటికి వెళ్లినవాఁడును సమానుఁడ'ని లోకవాడుక కలదు. పూర్వకాలములో ననేకసంస్థానములు తూర్పుతీరమున వర్ధిల్లెను. పశ్చిమతీరమున, దక్షిణభాగమున నుండిన జాతివారు, విదేశీయుల సాంగత్యములేనందున, నేటివఱకును పూర్వాచారపరాయణులై యుండిరి. ఆపశ్చిమకనుమలు దుర్గమములు కనుకనే, వారు కూపస్థమండూకములవలె, నుండిరి. పశ్చిమతీరమున నుత్తరమున, 'నర్మద' 'తపతి' నదులు ప్రవహించుచున్నవి;

ఆప్రదేశమున, పూర్వకాలములో ననేకసంస్థానములుపుట్టి, వృద్ధిఁబొందెను. ఆభాగములు సుగమములు; అచ్చటికి విదేశీయులు వచ్చిపోవుచుండిరి; అరబ్బి, పారసీకము మొదలగు పశ్చిమదేశవాసులు వర్తకము నిమిత్తమాభాగములకువచ్చు చుండిరి; వర్తకముమూలమున నాభాగములు సిరిసంపదలతోఁదులదూగుచుం డెను.ఆయాసమయములలో నాతీరమునకు వచ్చుచుండిన అరబ్బీనావికుల సంతతి వారు నేటివఱకు నాతీరమునఁ గానవచ్చుచున్నారు. ఆకాలములో వింధ్య పర్వతములను సత్పురపర్వతశ్రేణులను దాటుటదుష్కరము. ఉత్తరహిందూ స్థానమునుండి బయలువెడలి, తపతీనర్మదాతీరములకు రాజులైనను, సముద్ర తీరమునుండియేవచ్చుచుండిరిగాని, పర్వతములను దాటివచ్చుటలేదు.

ఉత్తరముననుండిన హిమవత్పర్వతములలోను,దక్షిణముననుండిన పర్వత ములలోను బుట్టి, ప్రవహించుచుండిన నదులు కాలాంతరమున బురదను దీసి కొనివచ్చి, మేటవేయుచుండెను; ఈప్రకారముత్తరహిందూస్థానభూములు కాలక్రమమున నేర్పడి, యొకరాయి యయినను లేక సారవంతములై, కన్నుల పండువుగనుండును. ఉత్తరహిందూస్థానమునకుఁబశ్చిమమున సింధునదియు దాని యుపశాఖలును, మధ్యభాగమున గంగాయమునానదులును వానియుపశాఖ లును,తూర్పున బ్రహ్మపుత్రానదియు దానిశాఖలును ప్రవహించుచున్నవి. ఈనదుల చేఁదడుపఁబడినభూములు సారవంతములు;అందుకుఁదగినసూర్యరశ్మియు, జలము లునుకలవు, ఆర్యావర్తము 'సర్వసస్యఫలాఢ్య' యనిచెప్పుటలోనబ్బురములేదు. జీవనదులు ప్రవహింపని ప్రదేశములలో ననేకకాలువలుకలవు; వీనిమూలమున భూములు ఫలవంతములగుచున్నవి. ఇందులో నొక విశేషముకలదు; 'ఆరావళీ' పర్వతములకు బశ్చిమమున సింధునది ప్రవహించుచున్నది ; భూములు సారవం తములు; తగినంత యెండకలదు. కాని, జలముమాత్రముసమృద్ధిగలేదు. పంచ నదీతీరమునకు దక్షిణమున వర్షమను మాటయే లేదు. 300 మైళ్లు విశాలముగల యీభాగము నిర్జలప్రదేశము; దీనినే 'థారు' యెడారి అని పిలుచుచున్నాము. వర్షములేనిచే, నీభాగము సాగు లేక కొరుగా పడియుండెను; వర్షముపడుచుం డినయెడల, నందనవనమువలె,నుండియుండునుకదా! సింధునదిలోనుండి యనేక

కాలువలు త్రవ్వబడి, ప్రవహించుచుండుటచే, ఆ భాగములో నూటయిరువది లక్షల యెకరముల భూములు సాగుచేయబడుచున్నవి. ఈ భూములే, ముప్పది సంవత్సరముల క్రిందట, కొరన్నపడి యుండెను; ఈనాటికి దొరతనమువారి కటాక్షమువలన, ఆ భూములు సాగులోనికి వచ్చెను

పశ్చిమమునుండిన అరబ్బీ సముద్రము మొదలు తూర్పునుండిన బంగాళాఖాతమువఱకు, 1700 మైళ్లు, ఈ ఉత్తరహిందూస్థానభూములు వ్యాపించి యున్నవి. ఈ భూముల వైశాల్యము 500,000 చదరపు మైళ్లు. 1650 లక్షల స్త్రీపురుష బాలవృద్ధులు కలరు. ప్రాచీనకాలమునుండి, యీ ప్రదేశములోన నేకదేశీయులు పుత్రపౌత్రపారంపర్యముగ జీవించుచుండిరి; ఈ దేశీయులు పేరుప్రతిష్ఠలను సంపాదించి, ప్రబలులై యుండిరి. ఈ భూములు సారవంతములగుటచే, ఈ ప్రదేశమున నుండిన జనుల జీవనములు సుఖముగనుండెను. కష్టముకంటె నధికముగ భూములు ఫలమునిచ్చుటచే, జనులు సిరిసంపదలతోఁ దులదూగుచుండిరి; పాడిపంటలు విశేషముగ నుండెను; అందుచేత, వారికి వ్యసనములు లేకపోయెను; వారు కాలాంతరమున, సకలశాస్త్రసంపూర్ణులై నాగరికులయిరి.

కేవలము శీతలప్రదేశములలో జీవించియుండినవారు జీవనాధారమునకై విశేషముగ శ్రమపడవలసియుండును; భూములను సాగుచేయుట కష్టము. కష్టపడి సాగుచేసినను, పంటలు పండవు; పండినను, పంటలు సమృద్ధిగ నుండవు. అందుచేత, శీతలప్రదేశములలో నుండినవారు నూతనమార్గములను కనిపెట్టి, భూములను సాగుచేయుచుందురు; ఇట్లు శ్రమపడుటవలన, వారి దేహములు దృఢముగనుండును. శీతలప్రదేశములలోఁ బనిఁజేయుట యుత్సాహము కలుగును. పనిచేయుటవలన, శరీరము వేఁడిగనుండును. ఉష్ణప్రదేశములలోఁ బనిఁజేయుటవలన, నాయాసము పుట్టును. ఏకదీక్షతో నాలుగుగంటలకాలము పనిఁ జేయుట కష్టము. అటులచేసినయెడల, శరీరమునకు బాధకలుగును. శరీరములు దుర్బలమగును. ఈ ప్రకారము పురుషాంతరములకాలము ఉష్ణప్రదేశములలో జీవించుచుండిన జనులును, వారి సంతతివారును శరీరపటుత్వము లేక, నీరసించి, కృశించియుందురు. వారు పిఱికిపందలు. భరతఖండములో శీతలప్రదేశములో

నివసించు జనులు శరీరదార్ఢ్యముగలవారై, బలమును పౌరుషమును గలిగియుందురు; వారికిధైర్యస్థైర్యములుండును. ఉష్ణప్రదేశములలో నుండినవారు పిఱికి పందలని చెప్పియున్నాము. తూర్పుననుండిన బంగాళీబాబులకంటెఁ, బశ్చిమముననుండిన మహారాష్ట్రులు బలవంతులును, ధైర్యశాలులు; దక్షిణముననుండిన ఆంధ్రులును, అఱవలును, మలయాళులును—వీరికంటె,బంగాళీబాబులు ధైర్యవంతులు; మహారాష్ట్రులకంటె, సులేమాను పర్వతప్రాంతముల నివసించు పఠానులు బలవంతులు. పంచనదీతీరములు శీతలములు ; కష్టపడి సాగుజేసినగాని, పంటలు పండవు; అందుచేత, నచ్చట నివసించు జాటులును (Jats) సీకులును (Sikhs) మొదలగువారు బలియులు. ధైర్యశాలులు సారవంతములగు నదీతీరములనుండిన జనులు దుర్బలులు, పిఱికిపందలు. ఈ తీరములు సమశీతోష్ణముగ నుండవు. భరతఖండములో రాజపుత్రులే మిక్కిలి సరసులు. వారంతసరసులగుటకు వారిదేశమే కారణము. వారిదేశము సమశీతోష్ణముగ నుండుటవలన, వారు సరసులయిరి. హిందూస్థానము సారవంత మగుటచేత, భారతీయులు ధనికులును,విద్యావంతులును, నాగరికులయిరి. సమశీతోష్ణముగ నుండిన ఉత్తర ఈశాన్యభాగములలో నివసించువారికంటె, మూడుకాలములలో మండుచుండిన దక్షిణభాగములో నివసించు వారు దుర్బలులని చెప్పవచ్చును.

భరత ఖండముయొక్క రూపమును దానితీరమును బట్టి, భారతీయుల చరిత్రమును గొంతవఱకుఁ జెప్పవచ్చును. ఏదేశమును జుట్టి సముద్రముండునో, ఏదేశములోనుంచి రేవు స్థలములుండునో, ఆదేశములో నివసించువారు తప్పక నావికులగుదురు; నిర్భయముగవారు సముద్రము మీఁద నావికాయాత్రఁ జేయగలరు;నావికా యాత్రఁ జేయువారు నిర్భయులు, ధైర్యశాలులు, బలవంతులు. పిఱికి పందలు సముద్రయాత్రఁ జేయజాలరు. నావికుని బ్రతుకు నిత్యముగండము; ప్రాణముమీఁదికి వచ్చినను వాఁడు ధైర్యమును విడిచిపెట్టక, స్వస్థచిత్తుఁడై యుండవలెను. భరతఖండమును జుట్టి మూడువైపులను సముద్రముండినను, భారతీయులు మాత్రము నావికులగుటకు వీలులేక పోయెను. సముద్రతీరము విశేషముగ నుండినను,తీరమునుంచి రేవుస్థలములు లేవు; ఆతీర

మంతయు ముక్కునకు సూటిగ నున్నది; కత్తిరపడియుండినఁ గాని, ఓఁగము రేవున కనుపయోగము. నదులముఖద్వారములవద్ద నిసుకదిబ్బలు పడియున్నవి. చిన్న పడవలుతప్ప పెద్ద స్టీమర్లు నదుల ముఖద్వారములగుండఁ బ్రవేశింపజాలవు. అందుచేత, భారతీయులు నావికులగుటకు వీలులేక పోయెను.

పూర్వకాలములో భరతఖండముతో నోడవర్తకము జరుగుచుండెను; కాని, ఆవర్తకమును విదేశీయులు చేయుచుండిరి. భారతీయులుమాత్ర మోడవర్తకమును జేసినట్లు కనబడదు. అరబ్బులు, పారసీకులు, గ్రీకులు, మొదలగువారు భరతఖండముతో నోడవర్తకమును జేసినట్లు తెలియుచున్నది.

ఈ ప్రకారము మూఁడువైపుల సముద్రముచేతను, యుత్తరమున మహోన్నతములగు హిమవత్పర్వతములచేత నావరింపఁబడి, భారతీయులు తదితరదేశీయుల సాంగత్యములేక, స్వస్థచిత్తులై కాలముగడపిరి. వారివేషభాషలు, వారి షోడశకళలు, వారిచతుష్షష్టికళలు, వారిమతము, వారిజాతి భేదములు— వారి సర్వము వారిదేగాని, పరులనుజూచి, వానిని నేర్చియుండలేదు; విదేశమునకు గాని, విదేశీయులవద్దకు గాని, భారతీయులు పోవలసినపని లేకపోయెను. భారతమాత సర్వాభీష్టదాయిని కనుక, వారుపరులను సేవింపవలసిన పనిలేకపోయెను. ఎంతవఱకు నామెనుజూచి భ్రమపడి, విదేశీయులు గుంపులు గుంపులుగవచ్చిరి; కాని, భారతీయులు విదేశములకుఁ బోయియుండలేదు. ఏదేశము భారతమాతతో సమానమగును ?.

హిందూదేశమున కుత్తరమున హిమవత్పర్వతములు కలవు. హిమవంతుఁడు పర్వతరాజు. తూర్పుపడమరలకు, 1500 లమైళ్లవఱకు హిమవత్పర్వతములు వ్యాపించియున్నవి. వానికి ఉత్తరమున 'టిబెటు' కలదు. (దానినే ఉత్తరకురుభూములని పిలుచుచున్నారు.) వానికిఁ బశ్చిమమున అఫ్గనిస్థానము కలదు. ఆపర్వతములలో గంగ, సింధు, బ్రహ్మపుత్రనదులుపుట్టి, ఉత్తరహిందూస్థానములోఁ బ్రవహించుచున్నవి. ఆహిమవత్పర్వతములశాఖలే, సులేమానుపర్వతములు, హిందూకుష్ పర్వతములు. ఈపర్వతములలో ననేక కనుమలు కలవు. బోలనుకనుమ,

కై బరుకనును మొదలగునవి. అలగ్జాండరును, బేబరును, మహమ్మదు గజినీ మొదలగువారు వీనిగుండవచ్చి, దేశములోఁ బ్రవేశించిరి.



హిందూదేశచరిత్రమును కొన్నియుగములక్రింద విభజించి వ్రాయుచున్నాము. ఏ యుగ మెప్పుడు ప్రారంభమై యెప్పు డంతమయ్యెనో చెప్పుట కష్టము. చరిత్రకారులు బుద్ధిని ఉపయోగించి, కొంతవఱకు వానిని వ్రాసియుండిరి. కాలమునుగుణముగ వచ్చుచుండును. లౌకికవ్యవహార ధర్మము లోకదాని ననుసరించి మఱియొకటి యుండును. కారణములేక కార్యము పుట్టుట దుర్లభము. ఈ యుగములలో జరిగినకార్యముల కొకకారణము కలదని తలంచుట తప్పు. తృణజలూకన్యాయము ప్రకారము కారణము ననుసరించి కార్యములు కాలక్రమమున వచ్చుచుండును. ఈ హిందూదేశచరిత్రము మూడుభాగములు:—

(I) హిందూమహాయుగము.

(II) మహమ్మదీయయుగము.

(III) ఆంగ్లేయ యుగము.

(I) హిందూమహాయుగములో నాలు భాగములు కలవు.

క్రీ. పూ. సం॥ 2000-ప్రాచీనచరిత్రము.

,, సం॥ 2000-1500-ఋగ్వేద కాలము.

,, సం॥ 1500-1000-మహాకావ్యముల కాలము.

,, సం॥ 1000-300-ప్రాచీనహిందూ రాజులకాలము.

,, సం॥ 300-క్రీ. వె. సం॥ 300-బౌద్ధులకాలము.

క్రీ. వె. సం॥ 300-సం॥ 650-పురాణములకాలము.

,, సం॥ 650-సం॥ 1200-రాజపుత్రులకాలము.

ఈ చరిత్రమున కాధారములేమి కలవు? ఏయాధారములను బురస్కరించుకొని, యీచరిత్రమును వ్రాయుటకు వీలుపడెను? ఆకాలములో లిఖితపూ

ర్వకమగు చరిత్రములులేవు. అనేక సద్గ్రంథములుకలవు; అవి చరిత్రములు కావు. ఆగ్రంథములలో మంత్రములును, వ్యవహారధర్మములును కలవు. వీనిని బురస్కరించుకొని, చరిత్రమును వ్రాయవలెను. మఱికొంతకాలమునకు శాసనములు (శిలాశాసనములు, రాగిశాసనములు) వచ్చెను. ఈశాసనములలో రాజులచర్యలును, వ్యవహారధర్మములు మొదలగునవి వ్రాయఁబడెను; కొంతకాలమునకు, నాణెములు వచ్చెను. ఆనాణెములపై రాజుల నామములు వ్రాయఁబడియుండెను. వానినిబట్టి ఆరాజుల కాలము నిర్ణయింపఁబడెను. ఈశాసనములపై వ్రాయఁబడిన వ్రాఁతను జదువుట కష్టముగనుండెను. శాసనముల లిపియు ఆధునికలిపియు వేర్వేరుగ నుండును. పండితులు శ్రమపడి, శాసనములలిపిని గ్రహించిరి; ఆభాషను ఆధునికభాషలోవారు వ్రాసిపెట్టిరి. వీనిమూలముగ దేశచరిత్రమును వ్రాయుటకు వీలుపడెను. ఇంతియకాదు. సం॥ 2000 రముల క్రిందట గ్రీకులు హిందూదేశమునకు వచ్చియుండిరి; వారు దేశమునకువచ్చి, దేశముయొక్క స్థితిగతులను వ్యవహారములను గుఱించి వ్రాసియుండిరి. సం॥ 1300 రముల క్రిందట బౌద్ధమతస్థులు చీనాదేశమునుండి భరతఖండమునకువచ్చి, దానినిగుఱించి వ్రాసిరి. వీరు వ్రాసినగ్రంథములను 'ఆంగ్లేయ' భాషలోనికిమార్చి, పండితులు వానిని వ్రాసిరి. వానిమూలమున దేశచరిత్రము కొంతవఱకు వెల్లడి అయ్యెను. ప్రాచీన శాసనములును ప్రాచీననాణెములును భూమిలో దొరకుచుండెను. గతించిన సం॥ 20-30 రములలోపున హిందూదేశచరిత్రము వీనిమూలమున నధికముగ వెల్లడిఅయ్యెను.

ఆయాకాలములచరిత్రమును వ్రాయుట కాధారములు:

ఋగ్వేదకాలము: — నాలుగు వేదములు.

మహాకావ్యములకాలము: — మహాకావ్యములు.

ప్రాచీనహిందూకాలము: — పురాణములు మొదలగునవి.

బౌద్ధులకాలము:—

(1) బౌద్ధచక్రవర్తియగు అశోకుని శాసనములు. క్రీ. పూ. సం॥250.

(2) బౌద్ధుల మతగ్రంథములు.

(3) బౌద్ధయాత్రికులగు ఫాహియాన్, హూనుత్సాంగ్ వ్రాసిన గ్రంథములు.

(4) క్రీ. పూ. సం॥ 300రము మొదలు క్రీ. శ. సం॥ 200 రమువఱకు గ్రీకులు వ్రాసినగ్రంథములు.

(5) నాణెములపైనుండిన వ్రాఁతలు.

నూతన హిందూకాలము:—

(1) క్రీ. శె. సం॥ 350 రము. పురాణములును, ఉపపురాణములును.

(2) క్రీ. శె. సం. 700 రము మొదలు:—రాజపుత్రులనుగుఱించి జైనులు వ్రాసిన గ్రంథములు.

(3) శాసనములు, నాణెములు.

(4) హర్ష చరిత్రము—బాణకవి ప్రణీతము. క్రీ. శె. సం.650రము.

(5) రాజ తరంగిణి:—కల్హణప్రణీతము. క్రీ. శె. సం. 1150 రము

(6) ఛాంద్—రాస్—రాజపుత్రులు చర్యలును, పృథ్వీరాజుయొక్క చరిత్రమును చెప్పును.

దక్షిణహిందూస్థానములోనుండిన రాజులచర్యలను గుఱించి అఱవభాషలోఁ గొన్నిగ్రంథములు కలవు.

II. మహామ్మదీయ యుగము.

III. ఆంగ్లేయ యుగము.

ఈరెండుయుగముల కాధారము లనేకములు కలవు. వానిని గుఱించి ముస్ముందు వ్రాయఁబడును.

ఇతర దేశచరిత్రములవలె, హిందూదేశచరిత్రము చిన్నదికాదు. ఇది మహాసముద్రము; అగాధము. ఈగ్రంథముయొక్క యుద్దేశమునకు విరుద్ధమని తలంచి, యీచరిత్రమును విపులముగ వ్రాయుటకు సంశయించి, విరమించితిని.

శ్రీరస్తు.

# గ్రీకులచరిత్ర

## నవమప్రకరణము.



### ముప్పదియొకటవ అధ్యాయము.

గ్రీకులు రోమకులు — వీరిచరిత్రలను ముందు రాబోవు సంపుటములలో విరళముగ వ్రాయబోవుచున్నారము; ప్రస్తుతము వీనిని సూక్ష్మముగ వ్రాయుచున్నాము.

గ్రీకులును రోమకులును ఆర్యకుటుంబములోని వారు. అందులో గ్రీకులు ప్రథమమున నాగరికు లయిరి. వారితరువాత రోమకులును, తదనంతర మితరులును నాగరికు లయిరి.

గ్రీసుదేశము నిండ పర్వతములు కలవు; వానిమధ్యఁ జిన్న దేశములు కలవు; ఆయాదేశములవారు స్వతంత్రు లయియుండిరి; వారిలో నైకమత్యము లేదు; వారేకకుటుంబములోనివారైనను శత్రువులవలె నుండిరి. ఆదేశముయొక్క తీరమంతయును కత్తిరింపఁబడియున్నది; అందుచేత స్వభావసిద్ధమైన లంగరు రేవులు కలవు; ఆదేశీయులు మొదటనుండి నౌకాయాత్రికు లని ప్రసిద్ధి కెక్కిరి; వారు నిర్భయులై తుపానులలోఁ గూడ నావలపై సముద్రముమీదఁ బోవుచుండిరి. ఆదేశము 'ఉత్తరగ్రీసు, దక్షిణగ్రీసు' అని ద్వివిధము. ఉత్తరగ్రీకుల చరిత్రను గురించి విశేషము తెలియదు. దక్షిణగ్రీకులచరిత్ర క్రీ. పూ. 27-వ శతాబ్దమునుండి తెలియవచ్చుచున్నది; వారికి 'ఏజియనుల'ని పేరు కలదు. 'క్రీటు' ద్వీపములో 'నాసను' పట్టణమునద్దను, 'ట్రాయి' పట్టణమునకు సమీపమునందుండు కొండమెట్టునద్దను, 'మిసిని' 'టిరిన్సు' పట్టణములనద్దను — త్రవ్వి

భూగర్భములోఁ జూడఁబడిన పదార్థములంబట్టి, దక్షిణగ్రీసులచరిత్ర క్రీ. పూ. 27-వ శతాబ్దమునుండి వచ్చుచున్నదని తెలియ నగును.

'క్రీటు' ద్వీపములో 'నాసను' పట్టణమువద్ద భూమిలో మూఁడునగరులు కానవచ్చుచున్నవి. వానింబట్టియు వానిలోని మృత్పాత్రలంబట్టి చూచిన నవి 'పాషాణయుగము' నాటివి యని తోఁచును. శిథిలమై పడియుండిన మొదటి నగరుయొక్క పునాదులపై గట్టఁబడిన రెండవదానింబట్టి చూడ, నది క్రీ. పూ. సం॥ 3500 రమున 'ప్రాచీనఈజిప్టు' రాజ్యకాలము నాటిదని తెలియును. నేఁడు కానఁబడు మూఁడవనగరు 'మినోసు' రాజుకాలములోఁ గట్టఁబడెను; 'ఈజిప్టు' లో 'హిక్కేశ' రాజులు క్రీ. పూ. సం॥ 1700-రములో రాజ్యముఁ జేయుసమయమున నదికట్టఁబడెను. ఆనగరములోఁ బద్మవ్యూహమువలెఁ జిక్కుదారులు గల గదులు కలవు; ఆకాలపురాజులు 'ద్వయముఖపరశము' నాయుధము గల దేవుని నారాధించిరి. వీనిమూలమున దక్షిణగ్రీసులకును, ఈద్వీపవాసులకును క్రీ. పూ 20-16 శతాబ్దములలో సంబంధములు కలిగియుండి వారందఱు నాగరికులై మహోన్నతపదవికి వచ్చిరని తెలియ నగును. శిల్పశాస్త్రవేత్తలు సరసముగ నానగరులఁ గట్టిరి; ఎటుచూచిన నగరులో భవనములును, హర్మ్యములును, బజారములును, సోపానములును, పాకశాలలును, భోజనశాలలును, గజాశ్వశాలలును, ధనభాండాగారములును, నూటిమీటు స్తంభములును కలవు. చిత్తరువుపను లానగరులోఁ గానవచ్చును; పుష్పములును, ఫలములును, యోధులును, కుడ్యములపై రంగులురంగులుగ వ్రాయఁబడియున్నవి—దంతపుబొమ్మలును బంగారువస్తువులును కలవు—అన్నిటికంటె మఱియొక విశేషము కలదు; కాల్పఁబడిన మృత్తికాఫలకలపై వ్రాయఁబడిన 'అక్షరసమామ్నాయముఁ' జూపనగును. 'ఫోనీషియనుల'కే 'లిపి' జ్ఞానము కలిగియుండెనని కొందఱియభిప్రాయము; ఇతరులు వారినిఁ బట్టి నేర్చుకొనిరి యని చెప్పుదురు. వారికి 6-7 శతాబ్దములకుఁ బూర్వము 'దక్షిణగ్రీసుల'కు వ్రాఁత తెలిసియుండెనని వాని వలన బోధపడుచున్నది.

నేడు 'కిసార్లిక' అను పట్టణము పూర్వకాలమున 'ట్రాయి' అని పిలవ బడెను, దానిసమీపప్రదేశముఁ ద్రవ్వి చూడ ప్రథమమున వేయఁబడిన పునాదులపై నొకటి శిథిలమైన తరువాత మఱియొకదానిని గట్టుచువచ్చిన రాజ భవన మొకటి నేఁడు కనఁబడును; "హోమరు" మహాకవి తనకావ్యములలో వర్ణించిననగరమని తోఁచుచున్నది; బహుశః అతనికంటెఁ బూర్వకాలములోఁ నది కట్టఁబడియుండును.

'మిసిని' 'టిరిను' పట్టణముల సమీపమునఁ దొరకిన పదార్థములం బట్టి చూడ, గ్రీసుదేశమునకుఁ దూర్పుభాగమున నుండిన మనుజులు క్రీ. పూ.సం॥ 1500 రములనాటికి నాగరికులై సర్వసంపదలతోఁ గూడి యుండిరని తెలియ వచ్చును. రాళ్లను చెక్కి యొకదానితో నొకటిని సున్నమును వేసి బిగించు టలేక కుడ్యములను భాండాగారములును, గవాక్షములతోఁ గూడిన హాజార ములును వారు నిర్మించిరి. 'మిసిని' పట్టణములోని నగరుచూడఁ జిత్రంబుగ నుండును; గోపురములతోను, ఇరుప్రక్కల సింహముల శిలాప్రతిమలు గల మహోన్నతమైన సింహద్వారములతోను, స్తంభములపైఁ గట్టఁబడిన లాదుల తోఁ గూడిన హావేలీలతోను,శిలాప్రతిమలతోను,కుడ్యములపై వ్రాయఁబడిన చిత్తరువులతో నానగరు ప్రకాశించుచున్నది. పంచరంగుల యిటికలతోఁ గట్టఁబడిన అగ్నివేదికలు కలవు; చిత్తరువులు చెక్కఁబడియుండిన గోరీలఁ జూడ నగును; ధనుర్బాణములును;గధములును, డాల్కత్తులును, చర్మముతోఁ జేయఁ బడిన కవచములును, రథములును—వీనిఁజూచి వారు నాగరికులని చెప్ప వచ్చును. 'ఈజిప్టు' దేశపురాజు 'తృతీయ అమనేతపు'ని నామాంకితముతో ముద్రవేయఁబడియుండిన పింగాణిచిప్పలును కత్తులును, 'మిసిని'పట్టణము వారి మృత్పాత్రలతోఁ గలిసి యుండుటచేత నా రెండుదేశములవారికిని క్రీ. పూ. 15-13 శతాబ్దములమధ్యను సంబంధము కలిగియుండెనని తోఁచును.

ఇటుల నాగరికులై బలవంతులై యుండినవారిని జయించికాని, లేక వారి ప్రాపకమున జీవనోపాధిని సంపాదించుటకుఁ గాని "కార్పేథియను"

చంద్రుఁ డొక దేవత; భూమి "డిమిటరు" అను దేవత. ఈదిగువ యంత్రములను విడిచి, మీఁదివానిలోనికి వారు వెళ్లిరి. శరీరముఁబట్టిగాని లేక మనోతత్త్వము బట్టిచూచిన సంపూర్ణ ప్రభావముగల జీవులను పూజింప నారంభించిరి. "అథీని" అను దేవత నిర్మలమై శాంతమైన జ్ఞానము యొక్క యవతారము. ఆమె వీరమాత; సమస్తకళల కధిదేవత ; ఆమె సత్యజ్ఞానస్వరూపిణి. "అపాలో" దేవుఁడు; త్రికాలజ్ఞానసంపన్నుడు, కావ్యనాటకాలంకారముల కధిపతి. మానసికవిషయములలో 'అథీని' దేవతయెటుల సంపూర్ణ ప్రభావురాలో, అటులనె 'అపాలో' దేవుఁడు శారీరకవిషయములలో సకల పరిపూర్ణుఁడని వారు భావించిరి. మనుజులు చేయు ప్రతికార్యమున కధిదేవతలు కలరు. ఏకార్యములను మనుజులు చేయఁదలచిన, దానికిఁ బూర్వ మాయా దేవతలనారాధించి వారిసెలవుఁ గొనవలెను. ప్రతిసంవత్సరము "డీలాసు" ద్వీపములో "అపాలో" దేవుని మహోత్సవము జరుగుచుండెను; గ్రీకులు స్త్రీపురుష బాలవృద్ధు లాయుత్సవమునకుఁ బోవుచుండిరి. "ఓ అపాలో దైవమా, నీవు మాతండ్రివి, రక్షకుఁడవు; మాసర్వసంపదలకుఁ గారణభూతుఁడవు; మాకు జ్ఞానముఁ గలుగఁ జేసినదాతవు ; నీయుత్సవము మహావైభవముతో జరుపుచున్నారము; నృత్యగీతవాద్యములు జరుగుచున్నవి; మల్లులు ముష్టియుద్ధముఁ జేయుచున్నారు. నీకటాక్షముచేత మా కీవైభవము సమకూరను" అని వారా దేవుని స్తోత్రముఁ జేసిరి.

వారి మతాభిప్రాయముల ననుసరించి "నాటకశాస్త్రము" పుట్టెను. వారు పూజించు దేవతలలో "డయోనిసను" యొకఁడు; అతఁడు ద్రాక్షఫలములకును ద్రాక్షతీఁగెకు నధిదేవత. ద్రాక్షఫలములకాలములోఁ గాని, ద్రాక్షరసముఁ దీయునపుడుగాని, ద్రాక్షతీగెలఁ బెంచుసమయమునఁ గాని వారా దేవుని పేరుఁ జెప్పి యుత్సవములఁ జేయుచుండిరి. ద్రాక్షతీఁగెలతో నిండినపర్వతభూభాగములపైఁ గూడి, కాపు లుత్సవమును నృత్యగీతవాద్యములతో జరిగించుట కలదు. వారిలో నొకఁడు తనకు సంభవించిన కష్టసుఖములఁ బాటగూర్చి యేరసమున పాడినయెడల నారసమున తదితరులు వాని దుట్టుగూడి పాటనుపాడు.

చుండిరి. ఆదేవుని దుఃఖచర్యలను గానముఁ జేయఁదలఁచినపుడు, దానికి ముందు వారొక గొఱ్ఱెను బలిసేయుట కలదు. అటుల శోకరసభూయిష్ఠమగు నాటకమునకు "దుఃఖనాటక"మని పేరు వచ్చెను. సంతోషముఁ గలుగఁజేయు దానికి "ఆనందనాటకము"ని పేరుఁ బెట్టిరి. మొదట నొకఁడు పాడినతరువాతఁ దదితరు లేకగ్రీవముగ గానముఁ జేయుచుండిరి. మఱికొంత కాలమునకు మొదటవానితరువాత మఱియొకఁడు గానముఁ జేసినపైని మిగిలినవారు ప్రారంభించిరి, తుదకు మిగిలిన వారొకటేపాటను పాడుటకు బదులు, వేరు వేరుగ నాటకపాత్రలై, సంభాషణఁ జేయ మొదలుపెట్టిరి. ఇదియె నాటక మయ్యెను. ఈనాటకములను వారు మొదటను తిన్నెలపై బహిఃప్రదేశములలో నాడుచుండిరి క్రీ. పూ. 5 వ శతాబ్దమునాటికి "ఈస్కైలసు" నాటకకవి నాటకములను సంపూర్తిగ వ్రాయ నారంభించెను: క్రీ. పూ. 4 వ శతాబ్దము నాటికి "అథెన్సు" పట్టణములో, గుఱ్ఱపుడెక్క యాకారముగ సోపానములతోఁ గూడిన యాసనములఁ గలిగిన నాటకశాల యొకటి కట్టఁబడెను.

ఇకను వారియాటలను గుఱించి విచారింపుదము; ఆటలనుగూడ వారు దేవుల ప్రీత్యర్థము ఆడుచుండిరి; ఆయాటలమూలమున దేహపుష్టి కలిగి వారు సళాకువలె నుండిరి; సొగసుగను తిరుగను మాంసపుకండలతోఁ బెరిగి వారిశరీరములు నేత్రోత్సవములై యుండెను, "డెల్ఫి" పట్టణములో "అపాలో" దేవుని ప్రీతికని, "కారింతులో" "పోసిడను" దేవత ప్రీతికని ఆటపాటలను వారు జరిగించిరి, "ఒలింపసు" పర్వతముపై నివసించు మహోత్కృష్టుఁడైన "జియసు" దేవుని ప్రీత్యర్థము మహావిభవముతో నాటపాటలతో నుత్సవమును వారుచేయుట కలదు. ఆయుత్సవముఁ జేసినసంవత్సరమునుండి వారు కాలప్రమాణమును నిర్ణయించుకొనుచు వచ్చిరి. మల్లయుద్ధము, ముష్టియుద్ధము, పాదసంచారము, రథగమనము—వీనిలో వారుపందెములు వేసికొని తమయాచ్ఛక్తిని వినియోగించిరి; వానిలో జయముఁ బొందినవానికి "ఇప్పపత్రికిరీటమును" బహుమతిగ నిచ్చిరి; అమూల్యాభరణములఁ గైకొనుటకంటె వారు దానితోఁ దృప్తినొందిరి; ఆబహుమతి నొందినవాఁడు స్వనగరములో విశేషముగ

మన్నింపఁబడును. వానిమాటకుఁ దిరుగు లేదు ; వాఁడు కోరినపదార్థమును లేదనువారు లేరు.

వారిమతము ననుసరించి, వారిలో 'సోదెలు' కలవు. సోదెలఁ జెప్పించి వానిమూలమున దేవతలయభిప్రాయములను వారు కనుగొనుచుండిరి. వాయువు వీచుటవలనఁగాని లేక భూమిలోనుండి వెలువడుశబ్దము వలనఁగాని దేవతల యభిప్రాయములను వారు ప్రథమమునఁ దెలిసికొనుచుండిరి. అనంతరము 'డెల్ఫి' పట్టణములోని 'సోదె' ప్రసిద్ధ మాయెను. ఆపట్టణసమీపమున నొకచిన్న గుహకలదు ; అందులో నగాధమైన బావి యుండెను; అభావిలోనుండి కొన్ని వాయువులు పైకి వచ్చును: దానిపై త్రిపాదపీఠమును వేసికొని అందుమీఁద నొక'నాంచారి' కూర్చుండి యుండును, అవాయువుల నాఘ్రాణించి స్మారకముఁ దప్పి, ప్రశ్నలకు త్తరములఁ జెప్పును. క్రమముగ సుప్రసిద్ధ మైనందున, నచట నొక దేవాలయమును భక్తులు కట్టించిరి ; వారుసమర్పించినకానుకలు కట్నములవలన దేవాలయమునకు విశేషము రాబడివచ్చెను. ఆదేవాలయము వలన దేశమునకును ప్రజలకును లాభమే కాని నష్టములేదు. కాల మతీతమాయినది. ఆటపాటలను, సరససంగీతసాహిత్యకావ్యనాటకాలంకారములను పురాణన్యాయమీమాంసతర్కవ్యాకరణధర్మశాస్త్రములను, సమస్త, విద్యలను కనిపెట్టి వాని నభ్యసించి వృద్ధిఁజేసి వారు ప్రయోజకులయిరి. ఒకదేశము నుండి మఱియొకదేశమునకు జనులు గమనించిరి. మఱికొందరు ద్వీపములలోను, 'ఆశియామైనరు' తీరములను, 'ఇటాలియా' దేశములోను నూతన సీమలను స్థాపించిరి. ఏనాఁ డీసంగతులు జఱిగిననో, ఆనాఁడునుండి చరిత్రాంశములను నిర్ధారణతోఁ జెప్ప నగును. కాలాంతరమున వారు 'పశుపాలకావస్థను' విడిచిపెట్టి, సాంఘికులై నగరములఁ గట్టి సాంఘికసూత్రముల నల్లి రాజధర్మముల నేర్పఱచికొని జీవింప నారంభించిరి. ఆనగరములలో రెండు మాత్రము ప్రఖ్యాతి నొందెను. వేర్వేరుగ గాని కలిసినగాని గ్రీకులచరిత్ర మంతయు నారెండుపట్టణముల నావరించియున్నది.

వానిలో 'స్పార్టా' యనుపట్టణము ప్రథమమున పన్నికెక్కెను. దక్షిణ గ్రీసులో దక్షిణభాగమునకు 'లాకోనియా' యని పేరు కలదు. ఆపట్టణమా భాగమునకు రాజధాని. ఆభాగములోని మనుజులను 'లాకోనియను' లనియు 'స్పార్టను' లనియు రెండు నామములతోఁ బిలుచుట కలదు. వారు దుర్బలులు; అంతఃకలహములతోఁ గూడి యుండిరి. 'లైకర్గసు' అనువాఁడు వారికి సాంఘికశాస్త్రములను పద్ధతులను నేర్పి రాజధర్మముల నుపదేశించి వారి నుద్ధరించెను. దేశభాగములలో వారు అనాగరికులు; చుట్టుప్రక్కలనుండు వారితోఁ బోరాడుచుండిరి. అందుచేత, 'లైకర్గసు' వారిని యుద్ధములో నజేయులుగఁ జేయఁదలఁచెను; దాని కనుగుణముగ శాస్త్రములఁ బన్నెను. శిశువు భూపతితమయిన వెంటనె గ్రామపెద్దలు వచ్చి వానిని పరీక్షించి, బలవంతుఁ డగునని వారికిఁ దోచిన, తల్లి ప్రక్కను శిశువు నుంచుటయు, బలహీనుఁ డగునని తోచినవానినిఁ దీసికొనిపోయి 'టాజిటసు' పర్వతశిఖరముపై బలవన్మరణము నొందుటకు విడిచి పెట్టుటయు జరుగుచుండెను. ఏడుసంవత్సరముల ప్రాయమున బాలకులు పాఠశాలలకుఁ బోయి కఠినశిక్షఁ బొందిరి; వారు పాదరక్షలులేకయే సంచరింపవలెను; తగినదుస్తులు లేకయే వారు విహరింపవలెను; దుప్పటులు గాని పరుపులు గాని లేకయే కఠినమైన నేలమీఁద వారు నిద్రింపవలెను; వారికిఁ గడుపునిండ నాహారములేదు; తెలియకుండ దొంగిలింపవచ్చును; బయలుపడి పట్టుపడిన దొంగ కఠినశిక్షఁ బొందెను. ఏయేవిధముల వారు మొండితేరి కష్టములను పాటింపరో, ఆయావిధముల వారు కాయక్లేశముఁ బడిరి. ప్రతి సంవత్సరము 'ఆర్టిమిజ్' దేవాలయములో వారు రక్తము చిమ్మునటుల దెబ్బలఁ దిని కన్నీరుఁ గార్చక బాధ నోర్చుచుండిరి. ఎంతపటుతరమైన సాముఁజేసి దృఢమైనదేహములు కలవారైరి; వారికి గానవిద్యలోఁ గొంచము ప్రవేశముండెను. ఇరువదిసంవత్సరముల ప్రాయమునఁ బాఠశాలలను విడిచి "సంఘశిబిరముల"లో వారు ప్రవేశింతురు; ఆనాడునుండి వారు రాజ్యదండనలోని వారయిరి. వివాహముఁజేసికొని సంసారవ్యాపారములుఁ జేయుచున్నను, వారు రాజ్యముకొఱకు

విశేషము శ్రమపడవలసి యుండెను. ఇటుల సర్వావస్థలయందును దేహపరిశ్రమఁ జేసి దేశమును వా రుద్ధరించిరి.

"ఆథెన్సు" నగరము యొక్క ఖ్యాతి దిగంతములను వ్యాపించెను. అందుచేతనే "అధీనియనులు" విశేషముగ నాగరికు లయిరి. ఆనగరమును మొదట నొక రాజు పరిపాలించెను. అనంతరము, సామంతప్రభువుల మంత్రాలోచనలఁ బుచ్చుకొనుచు, "ఆర్కను" అను పేరు పెట్టుకొని సామంతప్రభువు ఒకఁడు రాజ్యముఁ జేయుచుండెను. నాటుదేశీయులనియు, ఫలవంతములైన భూముల నాక్రమించిన భూఖామందులనియు, వర్తకులనియు, మీలవాండ్రనియు, మెఱకభూములపై నివసించు పశుపాలకు లనియు వారిలో భేదములు కలవు. ప్రథమమున నా రనేకకష్టములఁ బడిరి; దేశ మరాజకమై యుండెను; ధర్మమార్గములు లేవు. అట్టిసమయమున, "డ్రేకో" యనువాఁడు న్యాయసూత్రముల నల్లి మిక్కిలి చిన్నతప్పులకు సహితము మరణదండనను విధించెను. ఈసూత్రములవలన వారికి క్షేమము కలుగలేదు. అనంతరము 'సోలను' అను న్యాయవేత్త ప్రజలక్షేమముఁగోరి సాంఘికసూత్రములనల్లి, రాజధర్మములను శాసించి వారిని సంస్థాపించెను. అటుపైని వారు క్రమముగ నౌన్నత్యమునకు వచ్చిరి. వయస్సు ముదిరినపైని 'ఈజిప్టు' 'ఆశియామైనరు' మొదలగు దేశములలో యాత్రఁజేసెననియు, తుదకు 'సోలను' 'లిడియా' దేశపురాజు 'క్రీసను'ను జూచెననియు వినుచున్నాము. ఆరాజు విశేషముగ ధనధాన్యములఁ గలిగియుండినందున, నతనికి భూలోకకుబేరుఁడని పేరువచ్చెను. అతఁడు 'సోలను' జూచి 'భూలోకములో నెవఁడు సౌఖ్యవంతుఁడ?'ని యడుగ, నతఁడు రాజుంజూచి, 'ఓరాజా! నీవు ధనముఁగలవాఁడవు, కాని, నీవు మాత్రము కావు.' అని చెప్పెను.

మఱికొంతకాలమువఱకును 'ఆథెన్సు'నగర మంతఃకలహములచేఁ బీడింపబడి బలహీనమై యుండెను. ఆసమయమున 'క్లిస్తనీసు' అనువాఁడు 'ప్రజారాజ్యము'ను స్థాపించెను, అంతటినుండి దేశమునకు స్వాస్థ్యము వచ్చెను; దినదినప్రవర్ధమానమై బాలచంద్రునివలె నభివృద్ధినొందెను. 'పెరికిలీసు' పరిపాలన

కాలము నగము భుక్తియగునప్పటికి, వారు పరమోచ్ఛస్థితికివచ్చిరి. 'పీరనాయుక' యని ప్రసిద్ధిఁ జెందిన 'అథీని' దేవత శిరస్త్రాణమును వహించి, ఒక చేతిలో బల్లెముఁ బట్టుకొని మఱియొక బాహుదండమునుఁ జాచి నిలువఁబడియుండిన కంచువిగ్రహము చిన్నకొండశిఖరము నలంకరించియున్నది; బాలాతపకిరణము లా మెఱుపుఁ బ్రసరింప దూరముగ సముద్రముపై యాత్రఁజేయుచుండిన "అథీనియను" నావికులకును నగరవాసులకు నామె పరిపూర్ణానందసంధాయి యాయెను. ఆకొండ పాదాగ్రమున "అక్రొపొలిసు" అను దేవసభవంటి సభామంటపము కలదు; దాని కనతిదూరమున "పార్థినాను" అను "అథీని" దేవతాలయము కనఁబడును; ఆదేవాలయములో నా దేవతయొక్క దారువిగ్రహము ముఖహస్తములును, దంతపు నగిషీచేయఁబడి నవరత్నఖచితమైన బంగారుకవచము తొడిగియుండిన యాదేవి ప్రసాదాభిముఖముతో నాశ్రితజనరక్షణ సేయుచుండును. ఆదేవాలయముఖద్వారమున "నికేయి—ఆప్టిరసు" అను పక్షములు లేని జయదేవతయొక్క సుందరవిగ్రహము కలదు. వారు నిర్మించిన భవనములు చక్కనివి; వారుకట్టిన దేవాలయములు రమ్యమైనవి; వారుచేసిన బొమ్మలు సుందరమైనవి. తద్దేశధ్యానమున సర్వకాలసర్వావస్థలయందును నిర్గుణమైన శృంగారమును చింతించి సకలవ్యాపారములలోను దానిని సగుణముగఁ బ్రవర్తింపజేసి వారు సకలకళాపరిపూర్ణులై వర్ధిల్లిరి.

గ్రీకుల మహోత్కర్షను రాబోవు సంపుటములలో బహుళముగ విస్తరించెదము. ఇచటను, వారిచరిత్రలో ముఖ్యాంశములను సూక్ష్మముగ వ్రాయుచున్నాము.

క్రీ. పూ. సం॥ 490-479 రములు:— దేశమునకు స్వాస్థ్యము కలిగెను. దేశీయులకు జవసత్త్వములు వచ్చెను. వారు కొంచెము శిరస్సుల నెత్తి తిరుగుచుండిరి. అంతలో వారికి 'పారసీకుల'తో యుద్ధము సంభవించెను; దానికిఁ గారణములను 'పారసీకదేశ' చరిత్రలోఁ జదివియున్నారము.

పారసీకచక్రవర్తి పంపిన రాయబారులు గ్రీసుదేశమునకు వచ్చి 'ఓ గ్రీకులారా, మాచక్రవర్తి ప్రతాపుఁడు, జగదేకవీరుఁడు; అతనికి మీరుభృత్యులై

యుండవలెను; అందుకు నిదర్శనముగ తగుమాత్రము మన్నును నీరును మీ రివ్వవలెను' అని వారితోఁ జెప్ప, 'మీకుఁ గావలయునంత మన్నును నీరును తీసి కొనుడ'ని బదులు చెప్పి గ్రీకులు వారిని బావిలోనికిఁ ద్రోసివేసిరి. పారసీకచక్రవర్తిదండు వెడలి వచ్చెను. 'మరాథాను' భూములపై గ్రీకులు వారితో ఘోరమైన యుద్ధముఁ జేసిరి; పారసీకులు కాందిశీకు లయిరి. గ్రీసుదేశమునకును ఐరోపాఖండమునకును పునర్జీవము వచ్చెను. మఱికొన్నిసంవత్సరములు గడచిన తరువాత, పారశీకులు దేశముపైకి వచ్చి 'ఆథెన్సు' నగరమును ధ్వంసముఁ జేసిరి. 'స్పార్టనుల' సేనాధిపతి 'లియోనిదాసుఁడు' తనసైన్యములతోఁ గూడ 'థెర్మాపిలా' కొండ కనుమల ముఖద్వారమున నుండి పారసీకులతోఁ బోరాడెను కాని వా రతనిని చుట్టివేసిరి. వారందఱు వీరస్వర్గము నొందిరి. చక్రవర్తి "జరజేశుఁడు" కార్పణ్యమును వహించి, "ఆథెన్సు" నగరమును నాశనముఁ జేసెను. ఆతనిజయము క్షణభంగురము. "సలామిసు" వద్దఁ జఱిగిన నౌకాహవములోఁ బారసీకులు పరాభవముఁ బొంది స్వదేశమునకుఁ బోయిరి. ఇంతటనుండి పారసీకులభయము గ్రీకులకు లేకపోయెను.

క్రీ. పూ. సం. 479 రము:—ఏబదిసంవత్సరములు గతించెను. రాజ్యధర్మముల బాగుగ గుర్తెఱిగిన వ్యవహారికులచేత నడిపింపబడి, "ఆథెన్సు" నగరము గంతులు వేయుచు మహోచ్ఛపదవికి వచ్చెను. "పెరికిలీసు" అను రాజ్యవ్యవహారస్థుని కులములో నానగరము గ్రీసుదేశమునకు నాయిక యయ్యెను. ఆమెఁ జూచి "స్పార్టను" లోకపోయిరి; కాని యేమియు చేయలేక యూరకుండిరి. దేశములో నొకసంస్థానము తరువాత నొకదానిని "అథీనియనులు" సాధించిరి; చుట్టుప్రక్కలనుండిన ద్వీపము లన్నియు వారిపోష్యవర్గములోనికి వచ్చెను; వారనేక నూతనసీమలను స్థాపించిరి; ఆసీమలవారు సిరిసంపదలతోఁ దులఁదూగుచుండిరి; వారు వర్తకమును సాగించి ధనము నార్జించిరి. మహోన్నతమైన దేవాలయములను వారు కట్టిరి, "అథీని' దేవివిగ్రహమునకు బంగారుకవచమును దొడిగిరి; "ఫైదాసుఁడు" అను శిలాప్రతిమకారుఁడు చక్కని శిలాప్రతిమలఁ జెక్కెను. ఈకాలము "కృతయుగమ"ని (క్రీ. పూ. సం

450—430 రములు) వారికిఁ దోఁచెను. న్యాయమీమాంసతర్క వ్యాకరణధర్మ శాస్త్రవేత్తలును కావ్యనాటకాలంకారసరససంగీతసాహిత్యనిపుణులును పొంద లగువా రా కాలములోనుండి ఆదిచరిత్రకారుఁడైన "హిరోడటసు" చరిత్రములను వ్రాసిరి; "థుస్యాకిడైడీసు" బాలుఁడై క్రమముగ జ్ఞానాభివృద్ధిఁ జేసికొని ముందుపుఁ జరిత్రకారుఁ డయ్యెను. "ఈస్కిలసు," "సోఫోకిలసు" అను నిరువురు "నాటక" శాస్త్రము నభివృద్ధిలోనికిఁ దెచ్చిరి; "యూరిపిడసు" వ్రాసిన "దుఃఖనాటకముల"ను విని ప్రజలు కన్నీరుఁ గార్చిరి. 'ఆరిస్టపనసు' వ్రాసిన 'ఆనందనాటకముల'ను విని ప్రక్కలు వ్రక్కలగునట్లు ప్రజలు నవ్విరి. 'సోక్రేటసు' వేదాంతశాస్త్రమునకుఁ దగినవిధమున జ్ఞానము నభివృద్ధిఁ జేసికొనెను. 'పెఱుగుట విఱుగుటకొఱకే'నని చెప్పినవిధమున, నేటినుండి 'ఆథెన్సు' నగరమునకుఁ జేటుకాలము సమీపించెను.

౩౨. పూ. సం॥ 431 రము:— 'అథీనియనుల' సంపదఁ జూచి 'స్పార్టనులు' మండిపడుచుండిరి. 'అథీనియనుల'కు స్వాధీనములై యుండిన చిన్న సంస్థానములు 'స్పార్టనుల' మాటవిని వారిపైఁ దిరుగఁబడిరి. 'అథీనియనులు' స్వదేశీయులతోఁ బోరాడిరి. 'పెరికిలీసు' దుఃఖాక్రాంతుఁడై స్వర్గస్థుఁ డయ్యెను; 'ఆథెన్సు' నగరములో మహామారి సంకటము ప్రవేశించి వేలకొలఁది ప్రజలను నమిలివేసెను. 'అథీనియనుల' రాజ్యమునకు శృంగభంగ మయ్యెను.

'స్పాక్టీరియా' వద్ద జరిగిన నౌకాహవములో 'అథీనియనులు' 'స్పార్టనుల' నోడించిరి. కాని వారికి నీచదశలు సంప్రాప్త మయ్యెను. 'ఆల్సిబియాదీసుఁ'డను నొక అథీనియనుఁడు బయలువెడలి, స్వనగరము నుద్ధరింపఁ దలచెను. వాఁడు ధనికుఁడు గర్విష్ఠి. పిచ్చియాలోచనలఁ జేసి, స్వదేశీయులతో యుద్ధము జరుగుచుండ 'అథీనియనుల'ను వెంటఁదీసికొని 'సిసిలీ' ద్వీపముపై నతఁడు దండువెడలెను. అతఁడు దేవతలను దూషించెనని స్వనగరవాసు లతనిపై నేరస్థాపనఁ జేసిరి. 'అథీనియనుల' యెదుటఁ బడి నిర్దోషినని చెప్పుకొనుట కతఁడు భయపడి స్వసైన్యములను విడిచిపెట్టి 'స్పార్టనుల' శరణుఁ

జొచ్చెను. వారతని విశ్వసింపనందున, నతఁడుపరారియై 'పారసీకదేశము'నకుఁ బోయెను. గ్రీకు లంతఃకలహముచే బలహీనులై యుండినందున వారిని జయించుట సులభమని చెప్పి పారసీకుల నతఁడు యుద్ధసన్నద్ధులం జేసెను. పారసీకులు చేసినగౌరవమున కతఁడు సంతసింపక, వారికిని 'అథీనియనుల'కును పొత్తుఁ గలిపి, అందుమూలమున 'అథెన్సు'నగరమునకుఁ బోయి దానిని పరిపాలింప వలె నని యుద్దేశించెను. 'స్పార్టనుల' దాడికి నిలువలేక 'అథీనియనులు' మూలుగుచుండిరి. ఏవిధమున నైన తమకష్టములు నివారణ యగునని యెంచి, వారతని మాటల కొప్పుకొనిరి. 'అథీనియనుల'కతఁడు సేనాధిపతి యయ్యెను, వా రతనిని రాజ్యపరిపాలకునిగ నియోగించిరి. నీచదశ లతనికిని సంప్రాప్తమయ్యెను. 'అథీనియనుల'పేరు చెప్పినవిని మండిపడుచుండిన పారసీకచక్రవర్తి 'కైరసు' సైన్యములతో వచ్చి వారికిఁ బ్రతికక్షు వహించెను. 'స్పార్టనుల' నౌకాసేనాధిపతి 'లిసాండరు' నావలను నడిపించుకొని దక్షిణమునుండి వచ్చెను. ఇటుల రెండుసైన్యముల మధ్యనుండి, నిర్లక్ష్యముతో నతఁడు చేయునది లేక తటస్థుఁడై యుండెను. 'ఏజెసుపోటామి'వద్ద జరిగిన నౌకాహవములో 'అథీనియనులు' పరాభవము నొందిరి. అంతటితో వారినగరప్రాకారపుగోడలు నేలఁగూలెను. వారు 'స్పార్టనుల'కు భృత్యు లయిరి, వారి రాజ్యమంతరించెను.

క్రీ. పే. సం॥ 401 రము. మఱి యేబది సంవత్సరములవఱకు నంతఃకలహములలో గ్రీకులు చిక్కువడి యుండిరి. 'స్పార్టనులకు దేహబలముగాని బుద్ధిబలము లేదు; వారిప్రభ కొంచెము కాలము మాత్రమె వెలిగెను. ప్రతిష్ఠ చెడినవారు గనుక 'అథీనియనులు' పూర్వపుస్థితికి రాదలచి ప్రయత్నించిరి. గాని వారియత్నములు సాగలేదు. బుద్ధిమాంద్యమునకుఁ బ్రసిద్ధి కెక్కిన 'బిరోషియా' దేశీయులు 'ఎపామినాందాసు'ని నాయకునిగఁ జేసికొని కొంచెము కాలము ప్రబలులై విఱ్ఱవీగిరి. యాదవులు వలె గ్రీకులు వారిలో వారు గ్రుద్దులాడి నీరసించిరి; వారి స్వాతంత్ర్యమునకు వినాశకాలము వచ్చెను.

"బియోషియా" దేశములో గొంతకాలము "ఫిలిప్పు" అనువాఁడు కారాగృహములో నుండనలపి వచ్చెను; ఆ సమయమున నతఁడు గ్రీకులయుద్ధ రహస్యములను గ్రహించెను. అతఁడు నేఁడు గ్రీసు దేశమున కీశాన్యమూల నుండు "మాసిడను" దేశమున కధీశుఁడయ్యెను; అతఁడు స్వదేశముఁ జక్కఁ పఱచి దండువెడలి గ్రీసుదేశము పైవచ్చి పడెను. అతనియెదుట వారు నిలువలేక పోయిరి. 'డెమాస్తనీసు' అనువాఁడు తనవాచాలత్వముఁ జూపి 'అథీనియనుల' నుత్సహించినపైని వారు 'ఫిలిప్పు'తో యుద్ధముఁజేయుటకుఁ బోయిరి, కాని క్రీ. పూ. స, 338 రములో 'క్రైరోనియా' నద్దజఱిగిన యుద్ధములో వారు పరాభవముఁ బొందిరి. నాటితో వారిస్వాతంత్ర్య మంతరించెను. వారు 'మాసిడను' దేశమునకు స్వాధీను లయిరి 'ఫిలిప్పు' మరణానంతరమున వారు శిరస్సుల నెత్తఁజూచిరి. కాని అతనికుమారుఁడు 'మహాఅలగ్జాండరు' వారిని మట్టివేసెను.

నేటితో గ్రీకుల మహారాజ్య మస్తంగత మయ్యెను. 150 సంవత్సరములు గతించినతరువాత, రోమక సేనాధిపతి 'ప్లేమినను' వారికి స్వాతంత్ర్యము నిచ్చెను. కాని దానిని వారనుభవింపలేక దుర్వ్యాపారములలో దిగినందున, రోమకులు వారిని శాసించి భృత్యవర్గములోఁ జేర్చిరి 'గ్రీసు' అపజయము నొందినను, తనకళలచేత విజయుని పరిభవించెను. సూర్యుని కాంతిచేత గ్రహములు ప్రకాశించు విధమున, గ్రీకులకళలచేత రోమకులును, అలగ్జాండరును, ప్రకాశించిరి.


10
అలగ్జాండరు రాజ్యము
సిథియా
కాకసుపర్వతము
కాస్పియనుసముద్రము
ఈజియనుసముద్రము
మాసిడోను
చిన్న ఆశియా
మధ్యధరాసముద్రము
అస్సీరియా
మీడియా
పార్థియా
అలగ్జాండ్రియా
సిరియా
యూఫ్రటీసునది
టైగ్రీసునది
బాబిలను
పెర్షియా
పారశీకసముద్రము
అరేబియా
రుధిరసముద్రము
ఐగుప్తు
నైలునది
సింధునది
ఇండియా

శ్రీ ర స్తు.

# అలగ్జాండరుచరిత్ర

## దశమప్రకరణము.



### ముప్పదిరెండవ అధ్యాయము.

### క్రీ. పూ. సం. 350—200 రములు.

ప్రాచీనమహారాజ్యము లొకటి తరువాత నొకటి "మహాఅలగ్జాండరు"నకుఁ బాదాక్రాంతము లయ్యెను—"మహాపురుషులజీవితము"లను గ్రంథములో నతనిజీవితచరిత్రముఁ బొందుపఱచియున్నారము. అందులో విశదీకరింపని యంశముల నిందుఁ వ్రాయుచున్నాము.

'మాసిడను' దేశము మొదట నంతఃకలహములోఁ జిక్కుపడి స్వాస్థ్యము లేక యుండెను. అటువంటి దేశమును 'ఫిలిప్పు' అను రాజు యుద్ధరించెను. ఆదేశీయులు సాంఘికులై రాజధర్మముల కొడంబడిరి. అతని ప్రాపకమున వారు గ్రీసుదేశమును సాధించిరి. అతనికుమారుఁడు 'అలగ్జాండరు'—అతఁడు దేహసౌష్ఠవము కలవాఁడు; తండ్రిమరణానంతరమున నతఁడు నిరాటంకముగ సింహాసన మెక్కెను. అతనిరూపరేఖా విలాసములం జూచి, మనుజు లతనికి భృత్యు లయిరి. వా రతనిమాటను మీఱలేదు. సైనికు లతనిఁ బ్రేమించిరి. అతఁడు విదేశీయులను సాధించినను, ఆయాదేశీయు లభిలషించెడి స్వసాంఘికసూత్రములను స్వరాజ్యధర్మములను నిలుపఁబెట్టి వాని ననుసరించి వారిం బరిపాలించుటచేత, వా రతనిని మనఃపూర్వకముగఁ బ్రేమించిరి. ఏదేశీయు లత

నికి భృత్యులయి యుండిరో, ఆయాదేశీయులచేత నారాధింపబడు దేవతల నతఁడుకూడఁ బూజించెను. అందుచేత నతఁడు వారికిఁ బ్రేమాస్పదుఁ డయ్యెను. తమలోనివాఁడని వారు భావించిరి. అన్యుఁడని వారు తలచలేదు.

ప్రాచీనదేశముల చరిత్రములను వ్రాసియుంటిమి; ఏవిధమున నతఁడు వానిని జయించెనో చెప్పియున్నాము. ఆయంశముల నిచట సంక్షిప్తముగ వ్రాయుచున్నాము.

ఇరువదిసంవత్సరముల ప్రాయమున నతఁడు రాజ్యమునకు వచ్చెను; అంతలో గ్రీకులు తిరుగబడిరి; అతఁడు వారిని సునాయాసముగ సాధించెను. అనంతర మతనికిఁ దూర్పుదేశములను జయింపవలెనని కోరిక కలిగెను. 'నాయనా, నీకీ 'మాసిడను' దేశము సరిపడదు. నీవు పరాక్రమశాలివి గనుక విదేశములను జయింపు'మని తండ్రి పలికిన పలుకులయందతనికి గురి తప్పలేదు. అతడుచిన్నతనమునుండి గ్రీకులలో మెలగుచుండినందున, వారి వేషభాషలను ఆచారవ్యవహారముల నతఁడభ్యసించెను; అతఁడు గ్రీసుదేశమును పిత్రార్జిత మనిభావించెను. అతఁడు 'డెల్ఫి' పట్టణమునకుఁ బోయి సోది వేయించి చూడ 'ఓకుమారకా, నీవు అజేయుఁడ' వని ప్రత్యుత్తరము వచ్చెను. అతఁడు శీఘ్రము బయలువెడలి సైన్యములతోఁ బారశీకదేశముపై బడెను. ఈకాలములో నతనిగుణము లతిశయించెను; వానిమూలమున నతనిని విదేశీయులు ప్రేమించిరి. 'అర్బెలా' యుద్ధము జరుగుటకుఁ బూర్వము, సైనికు లతనింజూచి 'ఓరాజా మన మీరాత్రి దొంగతనముగఁ బోయి పారసీకచక్రవర్తినిఁ బట్టుకొనియెద' మనిచెప్ప, అతఁడు 'నేనుదొంగను కాను; మీరు కారు—మనకు దొంగజయము కూడ' దని వారి నివారించెను. మఱియొకనాడు 'ఓరాజా నీవైద్యుఁడు నీవు సేవించు ఔషధములో విషము గలుప నుద్యుక్తుఁడై యున్నవాఁడు. కనుక నీవు జాగరూకుఁడవై యుండు' మని యుత్తర మతనికి వచ్చెను. మరునాఁ డుదయమున వైద్యుఁడు వచ్చి ఔషధము నతనికిచ్చెను. అతఁడు దానినందుకొని 'నీవు నాకు విషముఁ బెట్టవలెనని తలంచినట్లు తెలియుచున్నది' అని వైద్యునితోఁ జెప్పి వానిచేతిలో నాయుత్తరముఁ బెట్టి దానిని త్రాగివేసెను. పారసీకము, ఆశియా

మైనరు, పాలస్తైను, సిరియా, ఫొనీషియా, ఈజిప్టు—మొదలుగాఁగల దేశముల నతఁడు సాధించెను. తూర్పుదేశీయులు కొంద రతనిని నిరోధించిరి; అతఁడు 'రోజని' యను వారి రాజకుమార్తెను వివాహమాడిన తరువాత వారతనికిఁ బాదాక్రాంతు లయిరి. అనంతర మతఁడు 'సింధు' నదిని దాటి 'ఆర్యావర్త' ప్రదేశమును స్వాధీనముఁ జేసికొనెను. తూర్పుమహాసముద్రము వఱకుఁ గలదేశముల నతఁడు జయింప నుద్దేశించెను కాని సైనికు లతనిని నిర్బంధముఁ జేసినందున, నతఁడు స్వదేశాభిముఖుఁడై 'బాబిలను' పట్టణమునకు వచ్చిచేరెను.

ఇటుల దిగ్విజయముఁబొంది సర్వసామ్రాజ్యాభిషిక్తుఁడై రాజభవనములో నతఁడు ప్రవేశించెను. దివానులును, ప్రధానులును, సేనాధిపతులును, సామంతప్రభువులును, విదేశాధీశులును—మొదలగువారు కొలువుకూటంబున పరివేష్టించియుండ, నతఁడు సింహాసనము నధిష్ఠించి తారాగణములోని చంద్రునివలెఁ బ్రకాశించి, కొందఱిని తర్జించుచు కొందఱిని శ్లాఘించుచు, కొందఱిని భాషించుచు, కొందరినిఁ జూచి శిరఃకంపముఁ జేయుచు, కొందరిని భూషణములతో నలంకరించుచు, కొందరితో దర్శించుచు—ఇటుల నానావిధముల నందరిని మెప్పించి రాజ్యముఁ జేసెను. కాల మతనికి సమీపించెను; దిగ్విజయుని మృత్యుదేవత జయించెను.

అతనితమ్ముఁడు రాజ్యమునకు వచ్చెను కాని అతఁడు దుర్బలుఁడు; రాజ్యతంత్రములను గుర్తెఱుఁగడు. విదేశములలోనుండిన సేనాధిపతు లాయా దేశముల నాక్రమించిరి; 'అలగ్జాండరు' దేశములను సాధించెను గాని వానికి స్వాస్థ్యముఁ గలుగఁజేయలేదు. దేశములు కలతఁ జెందియుండెను. ఒకదానిపై నొకటి దండువెడలుచుండెను. సాంఘికసూత్రములు మాసిపోయెను; రాజ్యధర్మములు మాటుపడెను; మాత్స్యన్యాయము ప్రబలమయ్యెను. ఒకదేశము తరువాత నొకదేశము మెరుపువలె క్షణకాలము ప్రకాశించి చల్లారెను. రెండువందలసంవత్సరముల వఱకును తూర్పుదేశములన్నియు జీకాకు పడియుండెను.



అలగ్జాండరు.

అలగ్జాండరు యొక్క దిగ్విజయము వలన సమస్త తూర్పుదేశములను గ్రీకుల వేషభాషలును వారి యాచారవ్యవహారములును వారి రాజ్యధర్మములును వ్యాపించెను. వానిని నిదానముగఁ జేసికొని తూర్పుదేశీయులు వ్యవహరింపనారంభించిరి. అవి వారికి గర్భీకృతములు కానందునఁ, గొంచెము కాలములో నశించెను.

మహారాజ్యములో నంతట పట్టణములు స్థాపింపబడెను. ఆనగరవాసులు నానాదేశీయు లయినను, వారిలోని సామంతప్రభువులు గ్రీకు లయియుండిరి. గ్రీకులయాటపాటలను, వారిభాషను నేర్చినవారు నాగరికు లయిరి.పాఠశాలలో 'గ్రీకు'భాష నభ్యసించిరి; గ్రీకుల విధమున చిత్తరువులను వ్రాసిరి; సర్వము గ్రీకుమయ మయ్యెను. ఆకాలమున గ్రీకులవేదాంతులప్రభావము నలుదిక్కులను వ్యాపించెను-గ్రీసుదేశము వేదాంతమునకుఁబుట్టినయిల్లు. వారిలో నిరువురు ప్రతికూలమైన సిద్ధాంతములఁ బోధపఱచి లోకవిఖ్యాతిం బొందిరి. 'ఎపికూర్యరసు' అనువాఁడు 'ఆనందము ననుభవించుటకు మనుజుఁడు జీవించుచున్నాఁడు' అని సిద్ధాంతముఁ జేసి దానిని శిష్యుల కుపదేశించెను. ఆనందమని నీస్వేచ్ఛానుసారము భోగముల ననుభవించుటకాదు. కామ్యములు లేనిజీవనము వలన మనస్సునకుఁ దృప్తియు నైర్మల్యముఁ గలుగును;అందువలన బుద్ధిమాంద్యము విడును; తన్మూలమున వస్తుతత్త్వమును బాగుగ గుర్తెఱుఁగ నగును;అదియె ఆనందమని వాని తాత్పర్యము. వానిశిష్యులు కొంతకాలమునకు గురూపదేశమార్గంబుల విడనాడి, విషయాసక్తులై భ్రష్టులయిరి.

'జెనో' యనువాఁడు మఱియొకవిధమున నుపదేశించెను ; అతఁడు దుర్బలుఁడు కనుక నిష్కాముముగ జీవించెను. అతని సిద్ధాంతములు పూర్వము వానికంటె గొప్పవి. సుఖముగాని దుఃఖముగాని కలిగినను, వాని ప్రసక్తి లేక, ధర్మార్థమె ధర్మము నాచరింపవలె నని యతనిసిద్ధాంతము. మనస్సు నఱికట్టిన, బుద్ధి వికసించుననియు, అందువలన ద్వంద్వముల కతీతుఁ డగుననియు శిష్యుల కతఁ డుపదేశించెను. ప్రాచీనకాలమునుండి వచ్చుచుండిన దేవులను దేవతల నారాధించుట విడిచిపెట్టి ఈరెండు ప్రతిపక్షసిద్ధాంతములను దేశీయు లవలంబించి, రాజ్యసంబంధములు లేనివారు సహితము వీనిమూలమున సంబంధమును గలుగఁజేసికొనిరి.

ఈకాలములో నీ గ్రీకుల శిలాప్రతిమల వైభవము వెల్లడి యయ్యెను. క్రీ. పూ. 3-వ శతాబ్దమున 'కొట్టె'ల దాడిచేత 'గ్రీసు' 'ఆశియామైనరు' దేశ

ములు బాధపడుచుండ, 'అపాలో' 'బెల్విడీరు' మొదలగువాని శిలాప్రతిమలు బయలు వెడలెను.

'మహాఅలగ్జాండరు' స్థాపించినపట్టణములలో 'ఈజిప్టు' దేశములోని 'అలగ్జాండ్రియా' పట్టణము 'టోలమీ'ల రాజులకాలమున సుప్రసిద్ధ మయ్యెను. ఆపట్టణము నలుచదరముగ నాలుగు ప్రాకారములమధ్య నిమిడియుండెను. వానిలో రాదారిమార్గములు కలవు. ఆపట్టణములోని సర్వకళాశాల నాల్గుశతాబ్దములవఱకు సరస్వతీపీఠమై యుండెను. ఆపట్టణమునకు సమస్తదేశీయులు వచ్చి, అచ్చటిపుస్తక భాండాగారములలోను సర్వవస్తుదర్శనశాలలలోను, వస్తుతత్త్వవిచారణశాలలలోను విద్యల నభ్యసించుచుండిరి.

ఈసర్వకళాశాలలలో విద్యార్థులకు 'రేఖాగణితము'ను బోధపఱచుచు 'యూక్లిడు' మహామహోపాధ్యాయుఁడుగ నుండెను. ఆరేఖాగణితమును ప్రథమమునఁగని పెట్టి శిష్యులకుఁజెప్పిన వాఁడతఁడు కాఁడు. అతనికంటెఁ బూర్వము వందలసంవత్సరములనుండి "ఈజిప్టు" దేశీయులనుఁ దెలిసి, వారాశాస్త్రము ప్రకారము 'నైలు' నదీతీరప్రాంతములఁ గొలిచి యుండిరి. ఆగణితము ననుసరించి భూమిపై శాల్యమును గుర్తెఱుఁగ నగును. క్రీ. పూ. సం॥ ౩౦౮ మున స్థాపింపబడిన సర్వకళాశాలలో నతఁడుపాధ్యాయుఁడుగ నుండెను. 'ప్రథమటోలమి'యను రాజు రేఖాగణితము నతనివద్దఁ జదివెను. అతఁడు గురువుఁ జూచి, 'ఓస్వామి! ఈశాస్త్రమును సూక్ష్మమార్గమునఁ దెలియఁజేయుడు.' అని ప్రార్థించిన, 'యూక్లిడు' శిష్యునిఁ జూచి, 'ఓరాజా, రేఖాగణితమునకు రాజమార్గములేదు.' అనిచెప్పెను. ఒకనాడు మఱియొకశిష్యుఁడు ప్రథమపాఠమును నేర్చుకొని, 'దీనిని నేర్చుకొని పూర్వముకంటె నేమి బాగుపడితిని' అని తలంచెను. ఆసంగతి గురువుతెలిసికొని ఆశిష్యునిఁ బిలిచి, వానిచేతిలో నర్ధకాసుఁ బెట్టి, వానిని పంపివేసెను.

---


II
ఈజియను సముద్రము
కాస్పియను సముద్రము
ఆసీరియా
మెడియా
బాబిలోనియా
బాబిలను
దమాస్కసు
ఆరేబియా
పారసీక సముద్రము
ఇండియా
పార్థుల రాజ్యము

శ్రీ ర స్తు.

# పార్థుల చరిత్ర

## ఏకాదశప్రకరణము.

---

### ముప్పదిమూఁడవఅధ్యాయము.

క్రీ. పూ. సం. 250 రము. క్రీ. వె. సం. 227 రము.

'మహాఅలగ్జాండరు' స్వర్గస్థుఁడైనశతాబ్దములోఁగొందఱు 'పార్థుల'ను పేరతో బయలువెడలిరి. మనోబుద్ధిబలముల వలనఁ గాక, కేవలము దేహబలముచేతి వారు ప్రసిద్ధులయిరి. 'కాస్పియను'సముద్రమునకాగ్నేయభాగమున చెన్నపురి రాజధానియంత వైశాల్యము గలప్రదేశములో వారు నివసించిరి; వారు 'తురేని' యను కుటుంబములోనివారు వారిబుద్ధి మందము. చీమగంగాయాత్రవలె వారు నాగరికులయిరి. వారు 'సిథి' యను తెగలోనివారని కూడఁ గొందరి మతము. వారిదేశము సారహీనమైనది. భూములను సాగుచేయక, వారెల్లప్పుడు నశ్వారూఢులై సంచరించుచుండిరి.

ఇటుల నిలుకడలేని 'సంచారావస్థ' లో నుండుటచేత స్వదేశమును విస్తరింపఁజేయుటకు వారుతలచి, ఇంచుమించుపారసీకరాజ్యమును యావత్తును సాధించిరి. అందువలన 'పార్థుల'రాజ్యము 'రుధిర' సముద్రతీరములనుండి 'జాక్సారిటీసు' నదీతీరములవఱకును, 'సింధు' నదిమొదలు 'ఆసియామైనరు' వఱకును వ్యాపించియుండెను.

'మహాఅలగ్జాండరు' మరణకాలమువఱకును వారు దేశచరిత్రములోఁ గానరారు. అంతవఱకు వారు పారసీక పోష్యవర్గములో నుండిరి, పారసీకచక్ర

వర్తి వారితోఁ గూడ 'దిగ్విజయుని' పాదాక్రాంతుఁ డయ్యెను. అతఁడు చని పోయినతరువాత, 'మధ్యధరాసముద్ర' తీరమునుండి 'సింధు' నదివఱకుఁ గల ప్రదేశము 'సిరియా' దేశములోఁ జేరను. అతనిసేనాధిపతియగు 'సెల్యూకసు' అనువాఁ డీయావద్దేశమునకు రాజయ్యెను. పార్థులుకూడ నతనికి భృత్యు లయిరి. ఈరాజ్యములోని దేశములన్నియు విడివిడిగ నుండెనుగాని సామాన్య మగు రాజ్యధర్మములచేత నొకదానితో నొకటి బిగింపఁబడలేదు. అటులవానిని బిగించుటకుఁ దగినసామర్థ్యము 'సెల్యూకసు'నకు లేకపోయెను. అతనికి సేనా బలముగాని బుద్ధిబలము లేదు. స్వలాభమును కోరి విదేశములను జయించుట లో నతఁడు కాలముఁబుచ్చెను. విదేశక్షేత్రపతుల నతఁడు కఠినముగ శిక్షించు చుండెను. అంతియకాని, ప్రజలకు సాంఘికపద్ధతులను బోధపఱచియు, వారికి రాజ్యధర్మముల నతఁ డుపదేశింపలేదు. అందుచేత నతనిని ప్రజలు మన్నింప లేదు.

క్రీ. పూ. సం॥ 250రము. 'సిరియా' దేశమునకు 'అంటియోకసు' ప్రభు వయ్యెను. అతఁడు నియోగించిన క్షేత్రపతి 'పార్థులను' పీడించుట చేత, వారతని జంపి, 'అర్సెసు' ని రాజుగఁ జేసికొని స్వతంత్రరాజ్యమును స్థాపించిరి. వారినిదండింపలేక, "అంటియోకసు" యూరకుండెను. అర్సెసుని తరువాత నతనిసోదరుఁడు "త్రిదేశిశుఁడు" రాజ్యమునకు వచ్చి 'మహారాజు' అని బిరుదునహించి దేశమును పరిపాలించెను. అతనికాలమునుండి 'పార్థులు' స్వతంత్రులయిరి.

ఇటుల నూతనముగ స్థాపింపఁబడిన రాజ్యమునకు నాగరిక విధానములు లేవు; పార్థులదేశములో నగరములులేవు; అన్నికాలములలోను వారశ్వములమీఁద గాని శకటములలోఁగాని జీవించుచుండిరి. ఒకనూరుగురు సామంతప్రభువులు రాజునకు సేవఁ జేయుట కలదు; తదితరజనులు వారికి భృత్యులై యుండిరి; వీరు కత్తికటారములఁబట్టుకొని యుద్ధముఁ జేయుదురు. రాజు సామంతులను, వారు భృత్యులను శాసించుచుందురు; యుద్ధసమయమున రాజు సామంతుల నాజ్ఞచేయ, వారు సైన్యములఁ గూర్చుటకలదు. సైనికులు గొలుసుకవచమును

ధరించి. అశ్వారూఢులై, యుద్ధమునకు గమనింతురు. అశ్వములపై మెత్తలు లేక వారు స్వారీ చేయుదురు. వారు శత్రువులను భీభత్సుఁ జేసి జయముఁ బొందుదురు; అందుచేత వారికి "భీభత్సు" లని పేరు వచ్చెను. వారికి దేవుఁడు కాని గురుఁడు కాని లేఁడు; పాపపుణ్యములని మాత్రము వారికిఁ దెలియును; సూర్యచంద్రులను దైవము లని భావించి వానిని వారు పూజించుచుండిరి.

రాజు కొలువుకూటము మహావిభవముతో నుండెను; అతఁడే ప్రదేశములకుఁ బోయిన నచట రాజసభ జఱుగుచుండెను. సాధారణముగ రాజు సామాన్యమైనదుస్తులను ధరించి, శిరమున కొకపట్టుపట్టమును కట్టుకొనెను. పార్థులు తమశిరోజములను శిఖలుగఁ జుట్టిపెట్టుకొందురు. పట్టణపురాణియు, రాజాంగనలును, తదితరస్త్రీలును, రాణివాసములో నుందురు. రాజభవనములు మనోహరముగ నుండెను. రాజదర్శనములకుఁ బోవువారు కట్నములఁ దీసికొని వెళ్ళవలెను. రాజుభోజనముఁ జేయుకాలమున నతనిప్రియమిత్రుఁడు తప్ప పరులు సమీపమున నుండకూడదు. కటాక్షించి భుజించుచు పాఱవైచిన పదార్థముల నతనిప్రియమిత్రుఁడు భుజించును. రాజు హంసతూలికాతల్పములపై నిదురించును. పార్థులు సకలకళావిహీనులు; వారికి గ్రంథములు లేవు; వారికి వ్రాఁత తెలియును; వారు వర్తకవ్యాపారములఁ జేయుచుండిరి.

ప్రథమమున పార్థులు తాము నూతనముగ సంపాదించుకొనిన స్వాతంత్ర్యమును నిలుపఁబెట్టుకొనుటకు శ్రమపడిరి. "సిరియా" దేశపు సైన్యములు బహుళమై రణశిక్షను బొందినను, పార్థుల సైన్యములయెదుట నిలువలేక పోయెను.

"ప్రథమ-మైత్రదేతీశుఁడు" రాజ్యమునకు వచ్చినదిమొదలు వారు విదేశములను జయించుట కారంభించిరి. ఆరాజు ముద్రింపించిన బంగారు నాణెములఁ జూచి అతఁడు రాజలక్షణములఁ గలిగియుండె నని చెప్ప నగును. అతని కాలములో "పార్థియా" దేశము ప్రబలమై వన్నె కెక్కెను; ఆదేశీయులు రోమకులతో జగడమాడుటకుఁ దగినంతశక్తి గలవారైరి. ఆరంభ

ములో నతఁడు "బాక్ట్రియా" దేశమును జయించెను. "సిరియను"ల రాజు బాలుఁడై సామంతుల పోషణవర్గములో నుండుటచేత నతనిదేశమునకు స్వాస్థ్యము లేకపోయెను. అందుచేత "పార్థుల" రాజు సైన్యములఁ దీసికొని, "సిరియను"ల పోషణవర్గములో నుండిన "మీడియా" దేశముపైఁ బడి, దాని రాజధానియైన "ఎక్బటాను" పట్టణమును పట్టుకొనెను; ఆపట్టణమును రాజధానిగఁ జేసికొని "మైత్రదేతీసుఁడు" పశ్చిమమున నుండిన "బాబిలను" "పారసీక" దేశములను సాధించి తూర్పున "సింధు" నదీపర్యంతము గలప్రదేశము నాక్రమించెను. ఇటులు పాదాక్రాంతులైన దేశీయు లతనికిఁ గప్పముఁ గట్టుచుండినను, వారు స్వరాజ్యధర్మముల నాచరించుచుండిరి; వారిరాజ్యధర్మముల నతఁడు స్వీకరించి వానిని స్వదేశములో నాచరణలోనికిఁ దీసికొని వచ్చెను. ప్రాచీన "అసీరియా" "పారసీక" మహారాజ్యములవలె నతఁడు మహారాజ్యమును స్థాపించి "రాజాధిరాజు" అని బిరుదు వహించెను.

అతనితరువాత 'ఫ్రాతీసుఁడు' 'పార్థుల' సింహాసనమునకు వచ్చెను. అతఁడు దేశములను కఠినముగ పరిపాలించుటచేత, దేశీయులు తిరుగఁబడుటకు సిద్ధముగ నుండిరి. అంతలో 'సిరియా' దేశపురాజు 'అంటియోకసు' సైన్యములతోఁ బోయి మూఁడు యుద్ధములలో "పార్థుల"నోడించెను. "బాబిలను" దేశములోని చిన్నసంస్థానాధిపతులుకూడ "సిరియను"ల రాజుతో నేకమై "పార్థుల"పైఁ దిరుగఁబడి, 'సిరియను'ల పోషణవర్గములోనికిఁ బోయిరి.

కొంచెము కాలము 'సిరియను'ల జయము నిలువఁ బడియుండెను. 'దమేత్రియసు' అనువాఁడు 'సిరియను' రాజుయొక్క సోదరుఁడు; పూర్వకాలమున 'పార్థుల' రాజు 'మైత్రదేతీసుఁడు' అతనిని పట్టుకొని తీసికొనివచ్చి స్వదేశములోఁ జెఱసాలలో నుంచెను. 'సిరియను'ల రాజు 'అంటియోకసు' 'బాబిలను' దేశమును సాధించి వారిగృహములకుఁ బోవుటకు సెలవు నిచ్చి సైనికులను విడిచిపెట్టెను. వారు స్వనగరములకుఁ బోయి శత్రువు మీరియుండుటవలన, నగరవాసులను వారు పీడించుచుండిరి. 'బాబిలను' దేశము పూర్వము

కంటె నరాజకముగ నుండెను. ఆసమయముఁ జూచి 'పార్థుల' రాజు 'ఫారతీశుఁడు' 'దమేత్రియసు'ను చెఱసాలనుండి విడిచిపెట్టి వానికిఁ గొంతసైన్యము నిచ్చి 'సిరియా' దేశముపైకిఁ బంపెను. అతనిరాక నగరమునుండి నగరమునకు వ్యాపించి దేశమంతట వెల్లడియయ్యెను. దేశీయు లతనిపక్షముఁ జేరిరి. అందుకు "ఫారతీశుఁడు' సంతసించి వానికిఁ దానుగ నిలువఁబడి యుండెను. ఈసంగతులను విని 'అంటియోకసు' ఆత్మరక్షకభటులతోఁ గూడి 'బాబిలను' దేశమును విడిచి పాఱిపోవుచుండ, 'పార్థులు' వారిని బట్టుకొని చిత్రవధఁ జేసిరి. అప్పటినుండి 'సిరియనులు' తూర్పుదేశములను సాధించుటకుఁ బ్రయత్నములఁ జేయుటలేదు.

అనంతరము, 'సంచారావస్థ'లో నుండిన ప్రజలు దేశముపైఁ బడి ధ్వంసముఁజేయుచుండ, 'పార్థులు' వారితోఁ బోరాడి వారిని దేశమునుండి తఱిమివేసిరి; కాని వా రప్పుడప్పుడు దేశముపైకి వచ్చుట కలదు. వారు మూర్ఖులనియు, కళావిహీనులనియు, అనాగరికులనియు చెప్పనేల? వారిదాడిచేత నాగరికులైన దేశీయులయొక్క శాస్త్రములకును, సంఘములకును, రాజ్యధర్మములకును, సంపదలకును, ముప్పు వచ్చెను. 'ద్వితీయ - మైత్రదేతీశుఁడు' రాజ్యమునకు వచ్చి వారిని నిశ్శేషముగఁ దునుమాడెను. అతఁడు 'ఆర్మీనియా' దేశపు రాజు 'తైగ్రనేశు'ని యుద్ధములోఁ బట్టుకొనెను; కొంతకాలము వానిని స్వనగరములో నుంచి పోషించి వాని దేశమునకుఁ బంపివేసెను. 'తైగ్రనేశుఁడు' స్వదేశమునకుఁ బోయి సైన్యములఁ గూర్చుకొని 'పార్థులపై' దండు వెడలెను. "పార్థులు" రోమకులసహాయముఁ గోరిరి. "పాంటను" దేశమునకు రాజు 'మైత్రదేతీశుని'తో వారు జగడమాడుచుండినందున, రోమకులు సహాయముఁ జేయలేక పోయిరి. 'పార్థులు' వారిలో వారంతఃకలహములలోఁ జిక్కువడి యుండిరి. ఆసమయముఁ జూచి 'తైగ్రనేశుఁడు' వారిరాజ్యములోఁ జాలభాగము నాక్రమించి స్వాధీనముఁ జేసికొనెను. క్రమముగ 'అశీరియా,' 'ఉత్తరమెసపొటేమియా', 'మీడియా', 'సిరియా', 'సిలీషియా', 'ఫోనీషియా'—మొదలగు 'పార్థుల' దేశముల నతఁడు స్వాధీనముఁ జేసికొనెను.

క్రీ. పూ. సం. 85—74 రములనాటికి 'ఆర్మీనియనులు' ఉచ్ఛస్థితికి వచ్చిరి; 'పార్థుల'ప్రభకు అస్తంగతదోషము పట్టెను. 'పాంటసు' దేశము రాజు పశ్చిమరాష్ట్రములను ఆక్రమించి, నేఁడు రోమనులతోఁ బోరాడుచుండెను. వారి పోరాటమును 'పార్థులు' తటస్థముగ నుండి చూచుచుండిరి. క్రీ. పూ. సం. 65 రమున వారికి మంచిదినములు కలసివచ్చెను. 'టైగ్రేనసు'ని కుమారుఁడు తండ్రితో వివాదపడి, 'పార్థుల' రాజు 'ఫ్రాటిసు'ని శరణుఁ జొచ్చెను. 'పాంటసు' దేశము రాజు 'మిత్రదేతీసుని' సాధించుటకు రోమనుసైన్యములతో 'పాంపేయుఁడు' దండు వెడలి వచ్చి, 'ఫ్రాటీసుని'తో సఖ్యముఁ జేసి, అతనిని 'టైగ్రేనసుని'పైకి యుద్ధమునకుఁ బంపి, తాను 'పాంటసు' రాజుతోఁ బోరాడెను; 'ఫ్రాటీసుఁడు' కొంచెముకాలము 'టైగ్రేనసుని'తోఁ బోరాడి విసుగుఁ జెంది స్వదేశమునకు వచ్చెను; 'పాంపేయుఁడు' 'పాంటసు' రాజు నోడించి వానిదేశమును స్వాధీనముఁ జేసికొనెను; అనంతరము 'టైగ్రేనసుఁడు' కూడ నతనికిఁ బాదాక్రాంతుఁ డయ్యెను. సఖ్యముఁ జేసినప్పుడు చెప్పిన మాటల ప్రకారము రాష్ట్రములను పుచ్చుకొనుటకు 'ఫ్రాటీసుఁడు' వెళ్లి 'పాంపేయుని'తో వానిని గురించి ప్రసంగించెను; 'పాంపేయుఁడు' కోపగించి, దేశము నతనికి స్వాధీనముఁ జేయక, అతనిని దేశమునుండి తఱిమివేసెను.

క్రీ. పూ. సం. 55 రము. రోమకక్షేత్రపతి 'క్రాససు' 'సిరియా' దేశమును పరిపాలింపవచ్చెను; అతఁడు వయస్సులోఁ బెద్దవాఁడు. 'పాంపేయుని'వంటి వీరుఁడుకూడ 'పార్థుల'ను సాధింపలేకపోయెను; అట్టిసమయమున, పెద్దలు చెప్పినమాటలను వినక 'పార్థులను' సాధింపవలె నని 'క్రాససు' దాడివెడలెను. 'సిరియా' దేశములోని 'అంటియాకు' పట్టణమునందు నతఁడు దండుతో గమనించెను. 'గలేషియా' సంస్థానాధిపతి స్వనగరముయొక్క ప్రాకారపుగోడలఁ గట్టించుటఁ జూచి, "ఓరాజా, ఇంతవిలంబముఁ జేసి గోడలను కట్టించుచుంటి వేమి?" అని 'క్రాససు' హాస్యముఁ జేసెను. "ఎందుచేత నీవు 'పార్థుల'పైకి దండు వెడలి విలంబము చేయుచున్నావు?" అని రాజు

క్షేత్రపతి నడిగెను. ఎప్పుడును 'క్రాసను' ధనాపేక్షకలవాఁడు; అందుచేత, దేశములోని దేవాలయములలో వెండిబంగారముల నతఁడు ప్రోగుచేయుచు కాలవిలంబముఁ జేసెను. కులాతీతమునకుం జీకాకుపడి 'పార్థుల' రాజు 'ఓరదీశుఁడు' కోపగించి, 'రోమకులు నిన్ను మాతో యుద్ధముఁ జేయుటకుఁ బంపిన యెడల మాకంఠములోఁ బ్రాణము లుండినంతవఱకు నీతోఁ బోరాడుటకు సిద్ధముగ నుంటిమి. రోమకుల సమ్మతిలేక నీస్వలాభమునకు నీవు మాతో యుద్ధమునకు వచ్చినయెడల నీవు పెద్దవాఁడవు. 'మెసపొటేమియా' దేశములోని రోమకులు దేశమును కాపాడుటకు బదులు వా రాపనిని చేయనందున మేము వారిని కాపాడవలసి వచ్చెను గనుక వారిని మేము నీవద్దకుఁ బంపుచున్నాము. వారినిఁ దీసికొని నీవు స్వదేశమునకుఁ బోవలె'నని 'క్రాసను'కు వర్తమానముఁ బంపెను. అతఁ డారాయబారమునువిని 'నేను మీ రాజధానికి వచ్చి, మీకుఁ బ్రత్యుత్తరము నిచ్చెద' నని రాయబారులతోఁ జెప్పెను. వారామాటను విని 'నీవు మారాజధానికి వచ్చుసరికి, ఈభూమిమీఁద శిరోజములు మొలుచు'నని ధిక్కరించి వారు లేచి వెళ్లిరి.

ఆవెంటనే 'పార్థుల' సైన్యములు రోమకుల నెదిరించెను. రోమకులు భీభత్సులై చెల్లాచెదరై పారిపోయిరి. ఎటువైపుఁ జూచినను వారికంటికి 'పార్థులు' కనఁబడుచుండిరి. వారిశరముల ప్రయోగమునకు రోమకులు నిలువ లేక పోయిరి. వారికంటె వారిబాణములు ముందు పరుగిడుచుండెను. వారి కవచములను శత్రువులబాణములు భేదింప లేకపోయెను. కాలవిలంబముఁ జేసి నందున 'క్రాసను'శత్రువులయెదుట నిలువలేక పోయెను. ఎదురుగ నడుచుట కతనికి దుర్ఘట మయ్యెను.పాఱిపోవుట వీరధర్మము కాదని తోఁచెను. అటులఁ జింతించుచు 'యూఫ్రిటీసు' నదీతీరమున నతఁడు శిబిరము వేసియుండెను. సామంతప్రభు వొకఁడు వచ్చి, 'పార్థులు' పరారి యగుచున్నారు. నీయెదుట వారు నిలువలేక పోయినారు. నీవు వారిని వెంటఁ బెట్టుము. వారిసైన్యమును నీవు కలిసికొనుటకు వీలుపడదు. కాని వస్తుసామగ్రులతో వెనుకఁ బోవు

వారిని నీవు పట్టుకొనుమనచ్చు' నని 'క్రాససు'తోఁ జెప్పెను. ఆమాటల నతఁడు విని సంతసించి, స్వసైన్యముల నురలించి, వాఁడు చూపినమార్గమున వారు నడచిరి. వాఁడు చూపినతప్పుమార్గమునఁ బోయి, వారు 'పార్థు'ల సైన్యముల కెదుట నిలిచిరి. అప్పుడు రోమనులకును 'పార్థు'లకును ఘోరమైన యుద్ధము జరిగెను. 'పార్థు' సైన్యములు కొన్ని నటించి పాఱిపోవుచుండ, వారు నిజముగ పాఱిపోవుచుండిరని తలంచి, 'క్రాససు'కుమారుఁడు వారిని వెంటఁ దఱిమెను. కొంతదూరము రోమనులు వచ్చినతరువాత, 'పార్థులు' నలువైపుల చుట్టి రోమకులను ముట్టడించిరి. శత్రువులచేతిలోఁ బడి నీచముగ బ్రతుకుట మంచిపని కాదని తలచి, 'క్రాససు' కుమారుఁడు కత్తితోఁ బొడుచుకొని చచ్చెను. అనంతర మతనిశిరస్సును కొట్టుకొని 'పార్థులు' స్వసైన్యములో వచ్చి చేరిరి. అప్పటికి సాయంకాలసమయము కనుక వారు యుద్ధముఁ జాలించి శిబిరములకుఁ బోవుట కుద్యుక్తులయి యుండిరి. వారు శిరస్సును రోమనుల శిబిరమునకుఁ బంపి, 'నీకుమారుని మరణమునకు నీవీరాత్రి దుఃఖింపుము. రేపటిదినము నిన్ను నీకుమారుని యొద్దకుఁ బంపఁగల'మని 'క్రాససు'నకు వర్తమానముఁ జేసిరి. రోమకులు గుండెలు జారవిడిచి 'కారాహీ' పట్టణమునకుఁ బాఱిపోయిరి. అచ్చట నుండి 'క్రాససు' ఆత్మరక్షకులతోఁ గూడి పోఁదలఁచెను కాని రోమకసైనికులు శత్రువులతో మఱియొక యుద్ధముఁ జేసి తరువాత స్వదేశమునకు గమనించుట మంచిది యని చెప్పి అతని ప్రయాణమును నిలుపు చేసిరి. కపటదారులగు 'పార్థుల'రాజు 'ఒరదిసుఁడు' ప్రాణములతో 'క్రాససు'ను పట్టుకొనఁ దలఁచెను. రాజు తగుమాత్రము ఆత్మరక్షకులను వెంటఁదీసికొని పోయి రోమనుల శిబిరమునొద్దకు వచ్చి 'నీతో సంధిఁజేసికొనఁ దలఁచి వచ్చితిని. నీవు గూడ తగుమాత్రము రక్షకులతో వచ్చి సంధిమాటలను నాతోఁ బ్రసంగింపు' మని 'క్రాససు'నకు రాయబారముఁ బంపెను. ఆమాటల నతఁడు విశ్వసింపకపోయినను, రోమను లతనిని నిరోధించి సంధిఁ జేసికొనవలయు నని నొక్కి చెప్పినందున, నతఁడు బయలుదేఱి రాజుసమీపమునకు వచ్చెను. అతనిని రాజు మర్యాదఁజేసి, కొంతదూరమునకు సంధిమాటలఁ బ్రసంగించి, 'మీరోమకులను

మాటనిలుకడలేదు. మీ 'పాంపేయుఁడు' నమ్ములను నమ్మించి మోసపుచ్చెను. కనుక లిఖితపూర్వకముగ నీవు చెప్పినమాటలను మాకు దయచేయు' మని చెప్పెను. ఉభయపక్షములను విడిచిపెట్టి మఱియొకస్థలమునకుఁ బోవలసి వచ్చెను. 'పార్థుల' తురంగములపై నెక్కి స్వారీచేయుటకు రోమకు లిష్ట పడలేదు. కాని వారు నిరోధించినందున 'క్రాసను' మొదలగువారు తురగా రూఢు లయిరి. ఆవెంటనె అశ్వరక్షకులు వానికళ్లెములం బట్టుకొని వానిని తఱిమి వారిని 'పార్థుల' శిబిరమునకుఁ దీసికొని వచ్చిరి. 'క్రాసను' మొదలగు వారు కొంచెము శత్రువుల నెదిరించిరి. కాని; వారిని 'పార్థులు' మట్టివేసిరి. 'క్రాసను' వీరస్వర్గముఁ బొందెను. హతశేషులైన రోమకులు వారికిఁ బాదా క్రాంతులై, వారిదేశములోఁ గాపురముండి, వారితో సంబంధములఁ జేసికొని, సుఖముగ జీవించిరి. ఈవిధమున రోమకుల గర్వమును వారణఁచి వేసిరి. కొంత కాలమునకు 'పార్థులు' పూర్వపుదేశములను సాధించిరి. వారిరాజునకును 'క్రాసను'ను జంపినవారి సేనాధిపతికిని మనస్పర్థలు కలిగినందున, రోమకులను 'ఆశియా'నుండి పాఱఁదోలుటకుఁ వారికి వీలు లేకపోయెను.

క్రీ. పూ. సం॥ 40 రను:—రోమనగరములోని రాజ్యవ్యవహారములు చిక్కువడి యుండెను. "జూలియసు—సీజరు' చనిపోయెను; "బ్రూటసు" "కాసియసు" అనునిరువురును "పార్థుల" రాజునొద్దకు రాయబారముఁ బంపిరి. ఆరాయబారి వచ్చి రాజుపక్షము నవలంబించి రోమకులరహస్యము లతనితోఁ జెప్పెను. వారుభయులు నేకీభవించి, "ఆశియా" ఖండమునకుఁ బశ్చిమమున నుండిన రోమకరాష్ట్రములపై దండువెడలి వానిని స్వాధీనముఁ జేసికొనను. మఱికొంతకాలమునకు "మార్కు—అంతోని" అనువాఁడు నియోగించిన క్షేత్రపతి పశ్చిమఆశియాదేశములకు వచ్చి, "పార్థుల" సైన్యములఁ దునుమాడి, ఆదేశములను రోమకులకు స్వాధీనముఁ జేసెను.

"మార్కు—అంతోని" సైన్యములతో వచ్చి, "పార్థులను" సాధింపఁ బూనెను గాని, వారిని సాధింపలేక స్వదేశాభిముఖుఁ డయ్యెను.

ఇటుల "పార్థులు" రోమనుల కజేయులై, స్వరాష్ట్రములను న్యాయముతోఁ బరిపాలించిరి; మఱి రెండువందలసంవత్సరములవఱకు దుర్బలులుగాక బలవంతులు గాక సామాన్యస్థితిలో నుండి తుదను వారు "పారసీక" రాజ్యములో నస్తంగతు లయిరి.

శ్రీరస్తు.

# రోము దేశ చరిత్ర

## ద్వాదశప్రకరణము.

---

### ముప్పదినాల్గవఅధ్యాయము.

"రోము" నగరము స్థాపింపఁబడినవిధమును గుఱించి చెప్పఁబడిన యంశములన్నియుఁ గల్పితకథలుగాని చరిత్రాంశములు కావని నమ్మవలెను. మానుషకృత్యములను అమానుషకృత్యములను సంమ్మేళనచేసి, ఆనగరము దేవనిర్మాణమని మనపెద్దలు చెప్పినందుకు వారిని మనము దూషింపరాదు. ప్రపంచములో నేదేశీయులు దేవవంశసంభూతులమని గర్వించి "మార్సు" అను "క్షాత్రవీర్య" దేవుఁడు తమవంశమునకు మూలపురుషుఁ డనిచెప్పకొనియుండిరో, వారు రోమకులు కాని మఱియొకరు కారు. వారు పశుపాలకవృత్తిని విడిచిపెట్టి వీరధర్మము నవలంబించి, దిగ్విజయముఁ జేసి సామ్రాజ్యమును స్థాపించిరి." ఈ ప్రకారము "లివి" అనువారి చరిత్రకారుఁడు వ్రాసినమాటలు సత్యమని వారి చరిత్రను చదివినపైని తెలియ నగును. రోమకులు దిగ్విజయులు; "అశీరియనులు" "మాసిడనులు" —వీరు స్థాపించిన రాజ్యములు వలె రోమకులరాజ్యము క్షణకాలము వెలిగి అస్తమింపలేదు ; ఒకటికాదు, రెండుకాదు, అనేకశతాబ్దములవఱకు వారు వివిధదేశములఁ బరిపాలించిరి. వీరధర్మము ననుసరించిరియే కాక, సాధించినదేశములలో "రాజశాసన" మనిన భీతావహము కలుగువిధమున రాజ్యధర్మములను ప్రకటనఁ జేసి, వాని ననుసరించి యాదేశములను రోమకులు పరిపాలించుటచేత, వారిరాజ్య మనేకశతాబ్దములవఱకు నిలువఁబడి

యుండెను. భగవంతునికి నమస్కరించు విధమున దేశీయులు రోమనుల "రాజశాసనము" నకు నమస్కరించుచుండిరి.

రోమనులకును గ్రీసులకును పెక్కువ్యత్యాసములు కలవు. గ్రీసులు నూతనసీమలను స్థాపించిరి; ఆసీమలవారు మాతృదేశమునిన వాత్సల్యముఁ గనఁబఱచి, దానితో మతసంబంధము గలిగియుండిరి; అంతకంటె నితరయొకసంబంధము వారిలోవారికి లేదు. రోమనులు విదేశములను జయించి, "రోమకరాజ్యహస్తము" లనెడిపాశములచేత వానిని స్వనగరముతో బిగించి, కీర్తిప్రతిష్ఠలను సంపాదించిరి. "పడుచుబుద్ధి బుద్ధికాదు; పంగుటపాడి పాడి కాదు" అని లోకోక్తి కలదు. గ్రీసులబుద్ధి పడుచుబుద్ధి. రోమనులబుద్ధి కాలముగడపిన పెద్దలబుద్ధి వంటిది. మనుజుని జీవన మొకనాటకమని తలంచి, గ్రీసులు మనఃకల్పితముల నల్లుకొని, ప్రకృతిధర్మములను మనఃకల్పితకారణములను నిరూపించి, చిదానందభరితులై యుండిరి. మనఃకల్పితము లనిన రోమనుల కసహ్యము; "నాగరికకర్మ"ను నిదానముగఁ జేసికొని, వారందు కనుగుణమగు ధర్మముల ననుష్ఠించిరి. ప్రథమమున వారిగుఱించి చెప్పిన పురాణకథ లన్నియును వారి వీరధర్మములను జయములఁ జెప్పుచున్నవి గాని వారిమతములను గుఱించి చెప్పుట లేదు. గ్రీసులదేవతలైన "జయసు", "అథీని" "అఫ్రొడైతి" "ఆరెసు" అనువానికి "జూపిటరు" "మినెర్వా" "వీనసు" "మార్సు" అని పేర్లుపెట్టి రోమనులు వాని నారాధించిరి.

రోమనులు తమ స్వాభావికగుణముల ననుసరించి తమదేవతలగుణములను మార్చి వానిని పూజించిరి. గ్రీసులచేత విశేషముగ నారాధింపఁబడని "ఆరెసు" దేవుని రోమనులు "మార్సు" అను వీరులదేవునిగ మార్చి ఆదేవుఁడు తమ వంశమునకు మూలపురుషుఁడని భావించి పూజించిరి. గ్రీసులుపూజించిన "ఆఫ్రొడైతి" నిర్గుణదేవత; రోమను లారాధించిన "వీనసు" సగుణదేవత; వారి "జయసు" వజ్రాయుధమును ధరించువాఁడు; అతఁడే "పితాసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్." వారిమతమును వారి మతాభిప్రాయములును అజ్ఞానతిమిరాంధకారములోఁ బడి చిక్కుపడి యున్నవి. మృగములను పక్షులఁ జంపి వాని ప్రేగులఁ జూచి వారు భవిష్యత్తుఁ

జెప్పుదురు. పక్షులగమనముఁ బట్టిగాని మెఱపుఁ జూచికాని మేఘధ్వని విని గాని వారు తమదేవతల యభిప్రాయములఁ గనుగొనిరి. వారు దేవతలలో దయా దాక్షిణ్యములకును శాంతమునకుఁ బ్రసిద్ధి కెక్కినవాఁ డొకఁడు లేఁడు. వారి దేవతలందఱు నరబలిఁ గోరువారు. ఉత్తరోత్తరముచక్రవర్తులు వారిని బరి పాలించినపుడు, ఆచక్రవర్తినిఁ గూడ దేవునిగఁ భావించి మల్లులరక్తముచేత నతనిని వారు తృప్తినొందించిరి.

ఇట్టి మతాభిప్రాయములతోఁ గూడిన రోమకులు తదనుగుణముగ సుగుణసంపత్తులు కలవారై వన్నెకెక్కిరి. "నాగరికో భవ" అని తల్లి కుమారుని దీవించెను. ఆమాట ప్రకారము శరీరములఁ బుష్టిఁ జేసి పట్టుదలకలవారై ద్వంద్వా తీతులై స్వవాంఛాపరులు కాక వారు ప్రసిద్ధు లయిరి. వారు స్వనగరమునం దభిమానము గలవారు కనుక నగరమున కపకీర్తి వచ్చునను భయముచేత నీచపు పనులఁ జేయలేఁడు. "స్వాధీనులను రక్షింపుము" అని కంకణముఁ గట్టుకొని సాధింపఁబడిన దేశీయులను వారు సన్మానించిరి గాని అగౌరవము చేయలేదు. "రోమకనాగరికుఁ" డని పేరు పెట్టికొనిన వాఁడెవఁడును తుచ్ఛపు పనులఁ జేయుటలేదు. సాధించినదేశములలో వారు కట్టినరాదారిమార్గములఁ జూడ, వారి యౌదార్యము వెల్లడి యగును. ఎన్నికష్టములకైన నోర్చి చేయఁ బూనిన కార్యమును వారు నెఱవేర్తురు. ఏకార్యముఁ జేసినను వర్తకమును సాగించుటకును అనాథులను రక్షించుటకును, రాజశాసనముఁ బ్రస్తరించుటకును, సమస్తజంతు వులశుభమునకును స్వనగరముయొక్క ఔన్నత్యమునకును వారు చేయుచుండిరి.

రోమునగరమును స్థాపించిన విధమును గుఱించి వారు చెప్పినయంశము లన్నియు కట్టుకథలని తోఁచును గాని వానిలోఁ గొంతవఱకు సత్యము కలదని "ఆధునికశాస్త్రోక్తఘర్షణ" వలనఁ దెలియుచున్నది. "హోమరు" మహాకవి వర్ణించిన "ట్రాయి" పట్టణములో "ఆనీయసుఁడు" అనునొకవీరుఁడు కలఁడు. అతఁడు "వీనసు" దేవతకుమారుఁడని మనుజుల నమ్మకము; అఁతడొకసమయ మున నోడలపై బయలు వెడలివచ్చుచుండ ఝంఝామారుతము లేచిసముద్ర మల్లకల్లోల మైనందున నతనిపడవలు "ఇటాలియా" దేశతీరమునకుఁ గొట్టఁ

బజెను "ఆల్బను" కొండలదగునను "ఆల్బాలాంగా" అను పట్టణము నతఁడు తన కుమారుఁడు "అసకానీసు" నకుఁ గట్టించెను. ఆతఁడా దేశమునను వచ్చినప్పటికి కొండలు రాజులాదేశముఁ బరిపాలించుచుండినట్లు పురాణకథలవలనఁ దెలియుచున్నది. "ఆనీయసుఁడు" ను గ్రీకులను దేశములోనికి రాకపూర్వము "ఎత్రూసకనుల" నువారు దేశము నాక్రమించి పరిపాలించిరని ప్రాచీన చరిత్రముల వలనఁ దెలియుచున్నది. "ఇటాలియా" దేశముయొక్క దక్షిణమున చాలభాగమును "గ్రీకులు" "రోము" నగరమును స్థాపించక పూర్వము నుండి ఆక్రమించి దానికి "మాగ్నాగ్రీసు" అని పేరుపెట్టి పరిపాలించుచుండిరి.

"ఎత్రూసకనులు" "టైబరు" నదికి నుత్తరభూముల నాక్రమించి ప్రబలులై యుండిరనియు అంతకుఁ బూర్వము "పో" నదీప్రాంతముల నుండి "గాలుల" చేతఁ దఱిమి వేయఁబడుటచేత నీప్రాంతములను వచ్చిరనియు తెలియవచ్చుచున్నది. ఏకాలమున నగ్నిపర్వతములు విజృంభించుటచేత భూకంపములు కలుగుచుండెనో నాకాలమున వారు జీవించియుండుటచేత, వారుస్వాభావికముగ పశుప్రాయులై భీకరులై రక్తమాంసములఁ దినుచుండిరి. ఈయుగమును మెఱుపును దేవతలని భావించి పూజించిరి. తమకిరుప్రక్కల నుండిన జాతులతో వారు కలసిమెలసి యుండలేదు. వారు భూమినిసొరంగములఁ ద్రవ్వి, వానిలో లాదులతోఁ గొన్ని నివేశనములఁ గట్టిరి; మఱికొన్ని నలుచదరముగ రాతితోఁ గట్టిరి. "అసీరియా" మొదలగు దేశములలోని శిలాప్రతిమలఁ బోలు ప్రతిమలతోఁ గొన్నినివేశనముల నలంకరించిరి.

ఇటుల నలుప్రక్కలఁ బశుప్రాయుల నటసంచరించు మనుజులు జీవించియుండ 'ఆనీయసుఁడు' మొదలగువారు వచ్చి 'అల్బను' పర్వతప్రాంతముల నాక్రమించి సం॥ 300 రములు రాజ్యముఁ జేసిరి. అప్పుడు 'మార్సు' దేవుని ప్రసాదమువలన 'రోమ్యులసు' 'రీమసు' అను నిరువురు కవల పిల్లలు పుట్టిరి. అంతట వంశకలహములు వారిలో వారికిఁ బుట్టినందున, వా రాబాలురను తీసికొనిపోయి 'టైబరు' నదీజలములలో విడిచిపెట్టిరి; ప్రవాహవేగము వారినిఁ గొంతదూరము తీసికొనిపోయి యొకదొడ్డున కొట్టివేసెను. ఒకతోడేలు వచ్చి

వారికిఁ బాలుపెట్టెను; ఒకపక్షి వచ్చి అన్నముఁ బెట్టెను. అంతట నొకవృద్ధ గోపాలుఁడు వచ్చి చూచి వారిని స్వగృహమునకుఁ దీసికొని పోయి పెంచెను. దినదిన ప్రవర్ధమానముగ వారు పెరిగి పెద్దవారైరి; వారి దివ్యవిగ్రహములఁ జూచి మనుజులు చోద్యపడిరి.

అనంతరము వారు తమపుట్టుపూర్వోత్తరములను గ్రహించి, స్వదేశమునకుఁ బోవొల్లక, సప్తపర్వతోపత్యకాభూములపై నొకపట్టణముఁ గట్టుటకు నారంభించిరి. ఏపర్వతోపత్యకాభూములపైఁ బట్టణముఁ గట్టుట మంచిపనియో వారికిఁ దెలియక వారిలో వారు కలహించిరి; 'రోమ్యులసు' 'పలాటీను' పర్వతపాదభూములపై నగరముఁ గట్టెను. అన్నదమ్ములకు వైరము బిగిసెను. 'రోమ్యులసు' కట్టుచుండిన నగరప్రాకారములమీఁదనుండి తమ్ముఁడు తిరస్కారభావముతో దుమికెను; అందుచేత నతనికిఁ గోపమువచ్చి తమ్మునిఁ జంపించెను. 'రోమ్యులసు' నిష్కంటకముగ 'రోము' నగరమును స్థాపించెను. ఇందులో సత్యము కలదు. 'అల్పను' పర్వతప్రాంతముల నగ్నికొండలభయము చేత స్వదేశమును విడిచిపెట్టి సారవంతమైన 'టైబరు' నదీ ప్రాంతభూముల నాక్రమించి, గోపాలకులు 'రోము' నగరము స్థాపించిరని తెలియుచున్నది. ఆనగరము కాలక్రమమున నభివృద్ధిలోనికి వచ్చెను. ఒకవైపున 'టైబరు' నది చేతను, మూఁడుప్రక్కల మహోన్నతపర్వతపంక్తులచేత నానగరము రక్షింపఁబడుచున్నది. 'అత్రూసకనులు' చేయువిధమున, గోపాలకులు పట్టణమును స్థాపించినపు డుత్సవములఁ జేసిరి. కంకణమువలె నొక గుండమును వారు త్రవ్వి దానిలో ఋతుఫలములను వేయుదురు; తాము వచ్చినదేశమును తెలియఁజేయుటకు నచ్చటనుండి మట్టిపెల్లలఁ దీసికొనివచ్చి తదుపరి వానిని వేయుట కలదు. వానిపై నొక వేదికను రాతితోఁ గట్టి దానిపై నగ్నిని ప్రజ్వలింపఁ జేసిరి. ఒకకంచునాగలికి గోవృషభముల రెండింటిని పూఁజువేసి, నగరస్థాపకుఁడు ప్రదేశమును దున్నెను. నాగలిచాలు వెంబడిని నగరప్రాకారములఁ గట్టిరి; వానిమధ్య నగరబహిర్ద్వారముల నెత్తిరి. 'ఓ దేవతలారా, ఆచంద్రార్క మీనగరము మీకృపవలన భూమిమీఁద నిలువఁబడు గాక; మీకటాక్షముచేత

నీనగరము సూర్యాస్తమయములేని ప్రదేశమున కంతయు రాజధానియగు. గాక' అని నగరస్థాపకుఁడు దేవతలఁ బ్రార్థించి పూజించెను.



జూలై సీసర్.

క్రీ. పూ. సం. 755 రము:—ఈవిధమున 'రోము' నగరము స్థాపింపఁబడెను. క్రీ. పూ. 8 శతాబ్ద మధ్యకాలమునాటికిఁ దక్షిణదేశీయు లేవిధమున నుండిరో చూచెదము. అప్పుడు 'కంచుయుగము' వర్తించెను; 'అల్బాలాంగా' వద్దనుండిన భూమిసొరంగములలోఁ గంచుపనిముట్లు కనఁబడుచున్నవి కాని లోహపుపనిముట్లుకానరావు. నగరప్రాకారములమీఁదఁ గంచునాగలి బొమ్మ

వ్రాయఁబడియున్నది. సం. 150 రములు గతించినతరువాత 'రైను' నదిమీఁద మూలములతో వారు వంతెనఁ గట్టిరి; దానిలోఁగూడ లోహము కానరాదు ఆ నాటికి 'లోహయుగము' ప్రవేశింపలేదు. అప్పటికి 'ఈజిప్టు' మహారాజ్యమునకు అపరాహ్ణము తిరిగెను; 'ఈథియోపియనులు' వచ్చి యారాజ్యమును క్షోభపెట్టిరి. ప్రస్తుతము దినములు కొంచెము సామాన్యమైనను, 'అసీరియ' మహారాజ్యము చీముక్తములఁ గూడఁ బెట్టి ముందుకుఁ దిగ్విజయములఁ జేయుఁబోవుచు; 'జూడా' దేశపురాజు 'ఉజియ'ని కాలములో నారాజ్యము ప్రబలమగుచుండెను. 'అథెన్సు' నగరము విషయమై యాలోచింప, 'గ్రీసు' దేశము పుష్టిఁ జేయుచుండెను; ఆనగరమునకు 'క్లీస్తనీసు' రాజ్యాంగముల నేర్పఱచెను. ఆ నగరప్రాకారములకుఁ బునాదులు వేయునప్పటికి, దేశకాలభేదము లీవిధముగ నుండెను.

ఆనగర మతిశీఘ్రములో నభివృద్ధికి వచ్చెను. గోపాలకులకును, బీదలకును, దీనులకును, నేరకులకును—సమస్తజనుల కానగరము శరణాలయమయ్యెను. 'సకలప్రాణుల కీనగరము శరణాలయము. సేవకులు, ఋణగ్రస్తులు, నరాంతకులు— మొదలగు వారికి దేవశాసనమువలన నేను శరణు నిచ్చువాఁడ' నని నగరస్థాపకుఁడు చెప్పెను.

ఆనగరవాసులు బ్రహ్మచారులై యుండిరి; వారికి వివాహముఁ జేయవలెను. 'మానగరవాసులు వివాహముఁ జేసికొనఁ దలఁచిరి; కనుక వారికి మీ కుమార్తెల నిచ్చి వివాహముఁ జేసిన మాకు సంతోష మగు'నని 'రోమ్యులసు' సమీపముననుండిన 'సాబీనుల'ను వారికి యుత్తరము వ్రాసి పంపెను; కాని వారందుకు సమ్మతింప లేదు. మఱికొంతకాలమునకు 'రోమ్యులసు'నగరములో నొకగొప్పయుత్సవముఁ జేసి, అందుకు 'సాబీనుల'ను పుత్రమిత్రకళత్రాదులతో దయచేయు మని ప్రార్థించెను. ఆప్రకారము వారు వచ్చి యుత్సవముఁ జూచి విం దారగింపుచుండఁ, బ్రతిరోమకుఁడును తనకు సమీపమున నుండిన నొక 'సాబీను' కన్యం దీసికొని పాఱిపోయెను. 'సాబీనులు' నిరాయుధులై వచ్చినందున, రోమకులతోఁ బోరాడలేక నగరమును విడిచి స్వదేశమునకుఁ

బోయి, సమరసన్నాహముతో వారు తిరిగివచ్చిరి. 'కాపిటలీను' పర్వతముల మీఁద 'రోమ్యులసు' కట్టిన దుర్గమును సాధింపవలెనని 'సాబీను' లభిలషించిరి; ఆదుర్గరక్షకుని కూఁతురు 'సాబీనుల' బంగారమున కాశపడి, వారినిఁ జూచి 'మీరు దుర్గములోఁ బ్రవేశించినపుడు, మీరొక్కొక్క బంగారు వస్తువును నాకు బహుమతిఁ జేసినయెడల మీకు దుర్గద్వారములఁ దెఱచెద'నని 'సాబీనుల' తో నామెచెప్పెను. ఆమె పేరు 'టార్పీయ'. ఆమె ద్వారము తలుపులఁ దెఱచెను. ప్రతి 'సాబీనుఁడు' దుర్గములోఁ బ్రవేశించి, ఒక్కొక్క బంగారు హారము పైకి విసరను. అనేకహారము లామెపైఁబడుటచేత నామె క్రుంగి చనిపోయెను. ఆమె మృతినొందిన ప్రదేశమునకు 'టార్పీయను శిల' యనిపేరు వచ్చెను. ఆనగరము యొక్క సప్తపర్వతములలో నొకదానిని 'సాబీను' లీవిధమునఁ బట్టుకొని స్వాధీనముఁ జేసికొనిరి. అప్పుడు రోమనులను వివాహమాడిన 'సాబీనుల' స్త్రీలు వచ్చి తమవారినిఁ బ్రార్థించినందున వారి యుద్ధము సాంతమయ్యెను. ఇటుల వారు సంధిఁజేసికొనినకాలముఁ దెలియఁజేయుటకై, వారు నాటినుండి ప్రతిసంవత్సరము 'మాతృకేళి' యను నొక యుత్సవముఁ జేయుచుండిరి. ఇటుల 'సాబీను' లును రోమనులును కలిసి యానగరములోఁ గాపురముండిరి. ఆనగర మభివృద్ధిలోనికి వచ్చెను. 'పలాటీను' పర్వతోపత్యకాభూమిపై నలుచదరముగ నాపట్టణము కట్టఁబడెను. రాజులు పరిపాలించుకాలములో నది పెద్దదియై సప్తపర్వతముల నాక్రమించెను.

రోమునగరమును సప్తనృపాలురు పరిపాలించిరని వారి పురాణకథల వలనఁ దెలియుచున్నది. వారు నగరము నభివృద్ధిలోనికిఁ దెచ్చి ప్రజలను నాగరికులఁ జేసిరి. 'రోమ్యులసు' జనులకు నగరములో నివాసముల నిచ్చెను. వారికి వివాహముఁ జేసి వారిని గృహస్థులఁ జేసెను. కలహస్వభావులగు 'సాబీనుల'తో నతఁడు సఖ్యముఁ బాటించెను. ఇంతియ కాదు. అతఁడు 'కాపిటలు' దుర్గముఁ గట్టించెను. నదీతీరభూముల నాక్రమించి సాగుచేయించెను. నాలుగుపర్వతములను నగరముసరిహద్దులలోఁ జేర్చెను. అతని తరువాత 'న్యూమాపాంపీలియసు' సింహాసనమునకు వచ్చెను. అతఁడు 'సాబీనుల' వంశములోఁ

బుట్టి, 'న్యూరెసు' అను వారి గ్రామములోఁ బెరిఁగి పెద్దవాఁ డయ్యెను. అతఁడు మతకర్మలను నిరూపించి, మతోత్సవములఁ జేయఁ జూపి, ఋతువులను గుర్తెఱుఁగు విధమును వారికి నేర్పెను. అతని కాలములో దేశమునకు స్వాస్థ్యము వచ్చెను. ప్రజలు మతకర్మలఁ జేయుచుండిరి.

'ట్యూలసు' 'హాస్టీలియసు' తరువాత రాజ్యమునకు వచ్చెను. ఇంతవఱకు మనుజులు స్వస్థచిత్తులై యుండిరి. నేఁడు రణభేరి మ్రోగెను. రోమకులు ధనుర్ధరులై 'ఆల్బాలాంగ'లో మనుజులను సాధించి రోమునగరములో నివసింపవలసినదని వారిని నిరోధించిరి. నగరబహిఃప్రదేశములను స్వాధీనానుభవములోనికిఁ దీసికొని వచ్చుటకుఁ బ్రయత్నింప రోమకులకుఁ గలహములు సంభవించెను. 'ఆంకేశ-మారుతీశుఁడు' రాజ్యముఁ జేయుకాలములో నీకలహములు ప్రబలమై, రోమకులకును 'లాటినుల' కను ఘోరమైన యుద్ధము జరిగెను. రోమకులు బలవంతులు గనుక వారి నోడించిరి. మఱియొక విశేషము కలదు. రోమునగరమును దృఢముగఁ గట్టిరి. జనబాహుళ్యముచేత నగరము వ్యాపించిన కొలఁది నూతనదుర్గములను వారు కట్టుచువచ్చిరి. 'టైబరు'నదీముఖద్వారమున రేవుపట్టణముఁ గట్టిరి. వారు శత్రువులను సాధించి వారిభూముల నాక్రమించుటయే గాక, వర్తకమును విశేషముగ సాగించిరని వీనిమూలమునఁ దెలియుచున్నది. ఈకాలములోఁ "కాపిటలోను" పర్వతోపత్యకాభూములపైఁ గట్టఁబడిన కారాగృహముఁ జూడ, రోమకులు నాగరికులైనకొలఁది, పాపకర్మలఁ జేసిరనియు తెలియనగును.

తరువాత "జ్యేష్ఠ—తార్క్వినీయశుఁడు" పట్టభద్రుఁ డయ్యెను. అతఁడు "ఎత్రూసకనుల" వంశములోనివాఁడగుటచేత, వారివంశము రోమునగరములో స్థాపింపఁబడినదని వారిపురాణకథలు చెప్పుచున్నవి. అతఁడు "తార్క్విని" యను నగరములోఁ బుట్టిపెరిఁగి పెద్దవాఁ డయ్యెను. స్వనగరములో నభివృద్ధినొందుటకు వీలులేకపోయినందున, నతఁడు దానిని విడిచిపెట్టి రోమునగరమునకు దారపుత్రాదులతో బయలువెడలెను. అతఁడు "జానికులము" నకు వచ్చి నగరబహిర్ద్వారము సమీపింప, గృధ్రరాజ మంతరాళమునుండి వచ్చి,

అతనిటోపీని గ్రద్ద త్రిప్పికొని పోయెను. ఈచోద్యముఁ జూచి, యాతనిభార్య "మీకీనగరములో రాజయోగము కలుగును" అని తనభర్తతోఁ జెప్పెను; ఆవింతఁజూచిన రోమనులు సహిత మద్భుతపడిరి; అతనిభాగ్యమునకును, అతని వెంటవచ్చిన పరివారమునకును వారు చోద్యపడిరి. అతఁడు నగరములోఁ బ్రవేశించి, సర్వజనరంజకుఁ డయ్యెను; "అంకసుఁడు" స్వర్గస్థుఁ డయ్యెను; తరువాత నతనిని జనులందఱు రాజుగ నియమించిరి. ఈనాటికి "ఎత్రూసకనుల" వంశము స్థాపింపఁబడెను; రోమునగరప్రాకారములు కట్టుటకుఁ బూర్వము వారు నాగరికులై యుండిరి; వారి వంశీయుఁడు రాజ్యమునకు వచ్చినతోడనే, రోమునగర మభివృద్ధిలోనికి వచ్చెను. కొండవాఁగులు ప్రవహించుటకు భూమిసొరంగములఁ ద్రవ్వించెను; వానిని నేఁడుచూడవచ్చును. "ఫోరము"లోని వేశముల నతఁడు కట్టించెను; 'కాపిటు'లోను పర్వతముపై నొక దేవాలయముఁ గట్టించి దానిని 'జూపిటరు' దేవునకుఁ బ్రతిష్ఠఁ జేసెను. గరిడీలయాలయములో మల్లయుద్ధము ముష్టియుద్ధము మొదలగునవి జరుగుచుండెను; శకునముల వలన దేవతాభిప్రాయముఁ గనుగొనుచుండిరి. ఈకాలములో రోమునగరము వ్యాపించి పెద్దదియయ్యెను; అందుకు నూతనముగ నుత్తమమైన ప్రాకారము గట్టుటకుఁ బునాదులను వేయించిరి. ఈప్రాకారము 7-8 వందలసంవత్సరములవఱకు నిలిచియుండెను. నగరమున కిరుప్రక్కలనుండు 'లాతీయము' అను పరగణాలోని పట్టణములన్నియు రోమకుల పోష్యవర్గములో నుండెను.

'తార్కినీయుఁడు' ఒకబాలునిఁ బెంపకముఁ జేసికొనెను. వాఁడు తక్కువకుటుంబములోఁ బుట్టెను. వానిపేరు 'సెర్వీయసుఁడు'. ఈబాలుఁడు నిద్రించుసమయమున నతనిలో నుండి యొకదివ్యతేజస్సు వెలుగుచుండెను. దానిని 'తార్కినీయసు'నిభార్య చూచి భర్తతోఁ జెప్పెను. అతనిఁ జంపి, 'సెర్వీయసు'ని రాజభవనములోనుండి తఱిమి వేసి రాజ్యముఁ బొందవలెనని 'అంకసుని' కుమారులు నల్వురు ప్రయత్నించిరి; కాని, వారిప్రయత్నములు సాగలేదు. రాజు బ్రతికియుండెనని చెప్పి "ఆయనస్థానమున ఆయన యాజ్ఞలను నేను నిర్వర్తించుచున్నవాఁడ"నని 'సెర్వీయసుఁడు' వారితోఁబలికి క్రమముగఁ బ్రజల

స్వపక్షముఁ జేసికొనెను. వారతనిపరిపాలనకు సంతసించిరి. అనంతర మతఁడు రాజు మృతినొందెననియు, తానే రాజుననియు వారికి వెల్లడిఁజేసెను. వారందఱు నోరుమూసికొని అతనియాజ్ఞలను శిరసావహించిరి. అతనికాలములో నూతన ప్రాకారము సొంత మయ్యెను. రోమకులతోఁ గూడి 'లాతీయము' ప్రజలు పూజించుటకుఁగాను 'దయాని' దేవతకు నగరములో నాలయముఁ గట్టించెను. అతఁడు 'రాజు' అయినను, సామంతము లేదు. ప్రజలపక్షము నవలంబించెను. 'ప్రజారాజ్యము'నకు బీజము వేసెను. ఆదివఱకు వారిలో 'సామంతు'లనియు 'ప్రజలని'యు రెండుభేదములు కలవు. సామంతులకు 'నగరప్రేక్షణికు'లని పేరు కలదు. వర్తకులను శరణుఁజొచ్చినవారికిని 'ప్రజ' లని నామ మిడిరి. ఈభేదములు వారివారిజననమువలనఁ గలిగినవి. వారిజననమును గణింపక, వారి ధనముఁబట్టి వారిని యాఱుతరగతులక్రింద 'సెర్వియసుఁడు' విభజించెను. నిర్ధనులగు సామంతులు ధనికులగు ప్రజలతో సరిసమానులయిరి. ఈవిభజనను నగరములోని సామంతు లియ్యకొనలేదు. తదనుగుణముగఁ బ్రతి అయిదుసంవత్సరముల కొకపర్యాయము జనసంఖ్యఁదీసికొనుచుండిరి. ఈయాఱుతరగతులకును 'అఱుశతమానము'లని పేరుఁబెట్టిరి. జనసంఖ్యఁదీసికొను సమయమున ఈశతమానములవారు ధనుర్ధరులై కవచములఁ దొడిగి, 'మారుతీశ-మైదానము'లో సమావేశ మగుదురు. ఒకపందిని, ఒకయెద్దును, ఒకగొఱ్ఱెను, వారుతీసికొని వచ్చి, సమావేశమైనవా రందఱికిని మూఁడుప్రదక్షిణములు వానిచేతఁ జేయించి, ధూపము వేయుదురు. ధ్వజముల నెత్తి, పతాకముల నెగరవేసి, భేరీభాంకారములు మ్రోగ, మధుతర్పణముఁ జేసి, వారామూఁడుపశువులను ప్రజలక్షేమమునకు బలిచేయుదురు.

'సామంతులకు'ను 'ప్రజలకు'ను వైరము బలిసెను; భార్యమాటలను విని 'ప్రజల' కనుగుణుఁడైన 'సెర్వియసు'నిఁ జంపి, జ్యేష్ఠ-'తార్కినీయసు'ని కుమారుఁడు 'గర్వి-తార్కినీసుఁడు' రాజ్యమునకు వచ్చెను. అతనికాలములో దేశమునకు క్షోభ కలిగెను; నరహత్యలు విశేష మయ్యెను; నలువైపుల రక్తము ప్రవహించెను. దుర్నృపతిపరిపాలనచేత, దేశము నంధకారము గప్పెను;

రాజుచేసిన దౌర్జన్యములకుఁ బరిమితిలేదు. అతని తండ్రికాలములో నారంభింపఁబడిన 'జ్యూపిటరు' దేవాలయము సాంత మయ్యెను. 'లాతీయము' పరగణాలోని మనుజులందఱును రోమునగరమును రాజధానిగ భావించిరి. గ్రీకులు స్థాపించిన నూతనసీమలలో 'కుమాయి' అను పట్టణ మొకటి కలదు; అందులో 'సిబిలు' అను నొకదాసురాలు జీవించియుండెను. ఆమె కొన్నిగూఢగ్రంథములను వ్రాసియుండెనని ప్రసిద్ధి కలదు. ఆగ్రంథముల నీకాలమున రోము నగరమునకుఁ దీసికొని వచ్చిరి. ఆగ్రంథములఁ జూచి 'శాకునికులు' (అనగా శకునములఁ బట్టి భవిష్యత్తుఁ జెప్పువారు) రోమకుల యోగఫలములఁ జెప్పెడివారు; వానిఁ బట్టి విపత్తులు సంభవింపకుండు శాంతులఁ జేయుచుండిరి. వానిఁ బట్టి యోగము కనఁబడినయెడలఁ దదనుగుణముగ శుభకార్యములఁ జేయుట కలదు.

రాజులవంశమున కస్తమయకాలము సంప్రాప్త మయ్యెను. ఒకనాఁడు రాజు హోమము వ్రేల్చుచుండ నొకసర్పము ప్రాకివచ్చి ఆహుతిని మ్రింగివేసెను. వెంటనె రాజు భయపడి తనకుమారుల నిరువురను తనమేనల్లుఁడు 'బ్రూటసు'ను ఈమువ్వురను 'డెల్ఫి' పట్టణములోని దాసురాలువద్దకు 'సోదెను' వేయించి చూచుటకుఁ బంపెను. వారు ప్రశ్నవేసి యడుగ 'రాజు పదభ్రష్టుఁడగు'నని ఆమె జవాబుఁ జెప్పెను; తిరుగవారు 'ఎవరు రాజు కాఁగలరు?' అని ప్రశ్నవేయ 'ఎవరు తనతల్లిని ప్రథమమున ముద్దుఁబెట్టుకొనియెదరో వాఁడు రాజు కాఁగలఁడు' అని ఆమె ప్రత్యుత్తర మిచ్చెను. రాకుమారు లిరువురు నొకరితో నొకరు గ్రుద్దులాడుచుండిరి; ఇంతలో 'బ్రూటసు' దాసురాలికిఁ గట్నముఁ జదివించి, ఆమె చెప్పినసోదెను నిజమైన యర్థముఁ దెలిసికొని, స్వదేశమునకు వచ్చి, కాలుజాఱినందున, నతఁడు నేలఁబడి, సమస్తజంతువులకుఁ దల్లియైన భూదేవిని ముద్దుఁబెట్టుకొనెను. దాసురాలు చెప్పినప్రకార మతఁడు చేసెను. రాజుపైఁ దిరుగఁబడుటకు సమయము వచ్చెను. రాజు కామోద్రేకుఁడై క్రిందుమీదుఁ గానక, పతివ్రతాశిరోమణియైన 'లూక్రీషియ'ను చెఱఁబట్టఁ జూచి, ఆమె యొల్లనందున నతఁడామెను

కత్తితోఁ బొడిచి చంపెను; రక్తము వఱదలై శరీరమునుండి కాఱుచుండ, నామె మృతకళేబర మంగడి వీథిలోఁ బడియుండెను. ఏకత్తిచేత నామె చంపఁబడెనో, ఆకత్తిఁ దీసికొని 'ఓదేవతలారా, ఆపతివ్రతయొక్క రక్తముఁ బట్టుకొని ప్రమాణముఁ జేయుచున్నాను. రాజును రాణిని ఆతని వంశస్థుల నందఱిం దునుమాడి, నగరమునకు స్వాతంత్ర్యముఁ దెచ్చెద. నేఁడు మొదలు నగరములో రాజులపరిపాలన సొంత మగుఁగాక' అని 'బ్రూటసు' జనులు విను చుండఘోషించెను. 'మారుతీశ-మైదానము'లో నొక గొప్ప సభ జఱిగెను. అప్పుడు సమావేశమైన వారంద ఱొక్కమ్మడిని 'ప్రజారాజ్యమును' చాటించిరి. రాజులవంశము నీటిలోఁ గలిసెను. 'తార్క్వినీశుని' పేరు మాసిపోయెను. 'కారేయి' పట్టణములో నతని తాతదండ్రులు జీవించియుండెడి వారు గనుక రాజు స్వగ్రామమునకుఁ బరారియై పోయెను. 'బ్రూటసు'ను 'లూక్రీషియ' భర్తయును వీరిరువురును 'ప్రజారాజ్యప్రథమప్రదర్శకులు'గ నియోగింపఁబడి, రాజ్యముఁ బరిపాలించిరి.

'ప్రజారాజ్యమును' స్థాపించినది మొదలు రోమకులు వీరిధర్మము నవలంబించిరి. 'ఎత్రూసకనులు' నగరములో స్వరాజ్యమును స్థాపింపఁ బ్రయత్నించినందున, వారికిని రోమకులకును వైరము సాగెను. శత్రుసైన్యములతో 'లార్సు-పార్సేనుఁడు' నగరముపైకి వచ్చుచుండ, 'హొరేషియసు-కాకిలేశుఁడు' ఏటివంతెనపై సైన్యముతో నిలువఁబడి, శత్రువులఁ దునుమాడెను. ఈకాలములోనే, 'క్లీలియ' అను కన్యకామణి అభయము నిమిత్తము శత్రువుల కియ్యబడినను, వారిని తప్పించుకొని నదిని దాటి స్వపక్షము వచ్చి చేరెను. కణకణలాడు చుండిన నిప్పులోఁ దనహస్తముఁ బెట్టి 'రోమకులు శ్రమ నోర్వగలరు. వారు రహస్యములఁ జెప్పరు.' అని 'మూసీయసుఁడు' చెప్పెను. తన గర్భవాసమందుఁ బుట్టిన కుమారులు రోమునగరమునకు ద్రోహముఁ జేయఁదలచినందున వారిని పట్టితెచ్చి సమవర్తియైన 'బ్రూటసు' వారికి మరణదండనను విధించెను. దేవతలు సహితముమానుషరూపములను ధరించి నగరములో సంచరించిరి. 'రేజిలసు-సరస్సు' వద్ద 'తార్క్వినీశున'కును రోమకులకును జరిగినయుద్ధ

ములో రోమకులు పరాజయమగుటకు సిద్ధపడినప్పుడు ఇరువురు దివ్యపురుషులు శ్వేతాశ్వములపై నెక్కివచ్చి వారిఁ బ్రోత్సహించి వారికి జయము నిప్పించిరి. కొందఱు సైనికులు వారిని చూచిరి; యుద్ధమాయిన తరువాత వారు కనఁబడ లేదు. అవిధముగ నగపడిన వారుభయులను 'కాస్టరు - పోలక్సు' దేవతలని యెంచి వారిపేరున రణరంగముమీఁద నొకదేవాలయము గట్టించిరి.

ఈనాటికి రోమను లెంతవఱకు నాగరికులయిరో కొంచె మాలోచింతదము. ప్రథమమున సప్తపర్వతములమీఁద నివసించియుండినవారు గోపాలురు అని తెలిసికొంటిమి. వారు నదీతీరమున నగరముఁగట్టి క్రమముగ వర్తకవ్యాపారములో దిగిరి. అందు కనుగుణముగ "కార్తేజి" నగరమువారితో సఖ్యముఁ జేసికొనిరి. ఆనగరముయొక్క స్థితిగతులఁ బట్టి గోపాలకుల స్వాభావికమును విడిచిపెట్టి రోమకులు ధనార్జనములను గ్రహించి సిరిధర్మము నవలంబించిరి. ప్రతి నాగరికుఁడును యుద్ధకాలములో నాయుధములఁ బట్టుకొని యుద్ధమునకు వెళ్లవలెను. యుద్ధానంతరము వారివారి పనులఁ జేసికొనుచుండిరి. రాజవంశములోఁ బుట్టిన ప్రతిమనుజుఁడును సింహాసనము నెక్కుటకు వీలుపడదు; ప్రజలందఱు సమావేశమై యెవరినివారేకగ్రీవముగ నెంచికొనియెదరో వాఁడు సింహాసనారూఢుఁడు కాని తదితరులు కారు. రాజు వారికి మతగురువు; వారికి న్యాయాధికారి; వారికి సేనాధిపతి. రాజు ప్రభుత్వము నిరంకుశమైనను, ప్రజల సమ్మతి ననుసరించి వ్యవహరింపవలెను? "క్యూరేషియముల"నియు "హోరేషియముల"నియు రెండు తెగలవారు కలరు; వారు సహజశత్రువులు; ఒక్కొక్కకుటుంబములో ముగ్గు రన్నదమ్ములు కలరు. ఒకసమయమున రోమకులకును "ఆల్బనుల"కును యుద్ధము సంభవించెను. రోమకులపక్షమున "హోరేషియముల" ముగ్గు రన్నదమ్ములును "ఆల్బనుల" పక్షమున "క్యూరేషియముల" ముగ్గు రన్నదమ్ములును పోరాడిరి. మొదటివారిలో నిరువురు రెండవవారిలో నిరువురఁ జంపి, జయముఁ బొందుసమయమునకు వారు కూడ నేలఁగూలిరి. "హోరేషియముల"లో మిగిలినవాఁడు "క్యూరేషియముల"లో మిగిలినవానిఁ జంపెను. చనిపోయిన వాని చెల్లెలను "హోరేషియుఁడు" వివాహముఁ జేసికొనఁ దలఁచెను; కాని

ఆమెసోదరుని మరణమునకు విచారించుట చూచి, వాఁడు కోపగించి, ఆమెఁ బొడిచి చంపెను. రాజు వానికి మరణదండనను విధించెను ; వాఁడు "ప్రజల"కు మొఱఁబెట్టుకొనినందున, వారి మాటప్రకారము రాజు మరణదండనను రద్దుపఱచెను. వాఁడు కొన్ని ప్రాయశ్చిత్తకర్మలఁ జేసి స్వస్థచిత్తుఁ డయ్యెను.

రాజులవంశ మంతరించినతరువాత సంవత్సరమున కిరువురు 'రాజ్యప్రదర్శకుల'ను వారు నియోగించిరి. వారిరువురు రాజకార్యములను వ్యవహరించిరి; సంవత్సరానంతరమున స్వాధీనమై యుండినదేశములకు 'ప్రజారాజ్యప్రతినిధులు'గ వారు నియోగింపబడుచుండిరి; వారిస్థానమున నగరములో నూతనముగ నిరువురు 'ప్రదర్శకులు' రాజకార్యములను నిర్వర్తించిరి. యుద్ధకాలములో నొక 'ప్రదర్శకుఁడు' నగరమును విడిచి పెట్టవలెను కనుక, నాఱుమాసముల కొక 'సేనాధిపతిని' వారు నియమించిరి; అతఁడు యుద్ధకాండను నడిపించును. 'ఎత్రూసకనుల' ద్వారా గ్రీకులమతాచారములను రోమకులు నేర్చి వాని నవలంబించిరి. ప్రథమమున వారు పశుపాలకులును సేద్యకులును కనుక వారిమతాచారములు కూడనందు కనుగుణముగ నేయుండెను. 'ఫ్లోర'అను పుష్పదేవతను, 'జేనసు' అను ద్విముఖసూర్యదేవునియు, 'సాతగను' అను సస్యదేవునియు వారారాధించి పూజించిరి. ప్రజలు పిచ్చిమతాభిప్రాయములను విస్తరింపఁ జేయుచుండునటులను పిచ్చిమతాచారముల నవలంబింప కుండునటులను, కొన్ని 'మతముల'ను వారు స్థాపించిరి; అనుతాధికారులు శాస్త్రోక్తమైన మతమును ప్రజ లనుసరించునట్లు చూచుచుండిరి; శకునములఁ జూచి భవిష్యత్తుఁ జెప్పుటకు 'శాకునికులు' నియోగింపఁబడిరి. ప్రతిరోమకుఁడును స్వగృహదేవతలను స్వగృహపితృదేవతల నారాధించును; స్వదేశములోఁగాని విదేశములోఁగాని వాఁడు వానినిఁ బూజించును. స్వగృహదేవతల ప్రీత్యర్థము ప్రతిదినము ప్రతిగృహములో నగ్నిహోత్రముఁ జేయఁబడును. నగరములో 'వేస్త' అను దేవతాలయము కలదు; అందులో నవిచ్ఛిన్నాగ్నిహోత్రము స్థాపింపఁబడెను. ప్రతిగృహస్థుఁడును దానిని బూజించును. దానిని రక్షించుట కాఱుగురు కన్యకామణు లాదేవాలయములో నివసించుచుండిరి.

ఈనాటికి నగరము స్థాపింపఁబడి మూఁడుశతాబ్దము లయ్యెను; ఏకళలలోను వారికిఁ బ్రవేశము లేదు; వారు నేర్చిన కళలన్నియు 'ఎత్రూస్కనులు' వలనఁగాని, గ్రీకులవలనఁ గాని నేర్చిరి. శాస్త్రములుగాని గ్రంథములు గాని వారిలోఁ గానరావు. ఇంతవఱకు వారికి దేహబలము గాని బుద్ధిబలము లేదు 'రాజ్యసృష్టి' విధానములను వారు కొంచెము గుర్తెఱిఁగియుండిరి. క్రమముగ వానిని విస్తరింపఁజేసి మహారాజ్యమును వారు సృష్టించిరి.

క్రీ. పూ. సం. 509-266రవరకు; — 'ప్రజారాజ్యము' స్థాపింపఁబడిన తరువాత రెండునందలయేఁబదిసంవత్సరములవఱకు రోమనులంతఃకలహముల చేతను బహిఃకలహముల చేతఁ బీడింపఁబడిరి; నగరములో 'సామంతులకు'ను 'ప్రజలకు'ను పోరాటము తగిలెను; దేశములోఁ బ్రతియంగుళము భూమిని గుఱించి పోరాడి వారు స్వాధీనముఁ జేసికొనిరి. ప్రజలకు రెండువిధములౌ దుఃఖములు తగిలియుండెను; ఇరుప్రక్కల నుండిన శత్రువులు దాడివచ్చి వారి వ్యవసాయములఁ బాడుచేయుట చేత వారు నిరుపేదలై యుండిరి; రోమకనాగరికునికి నుండవలసిన ప్రవృత్తిధర్మములు వారికి లేకపోయెను. వీరధర్మము ననుసరించి వారు యుద్ధమునకుఁ బోయినపుడు వారియాస్థులఁ గాపాడువారు లేకపోయిరి; నిర్ధనులు గనుక, ధనికులవద్ద ఋణముఁ జేయవలసివచ్చెను; ఋణగ్రస్తుల విషయమై ధర్మశాస్త్రము కఠినముగ నుండెను. శత్రువులు నగరముపైకి దాడివచ్చియుండ, ప్రజలందఱు గుమిగూడి 'మా ప్రవృత్తిధర్మములను స్పష్టపఱచి వానినిఁ గాపాడిన గాని మేము యుద్ధమునకు బయలువెడల'మని మొఱఁబెట్టిరి. స్వధర్మములఁ గాపాడుటకును, స్వదుఃఖముల నివారించుటకును 'ప్రజాదర్శకుల'ను వారు నియమించిరి. వీరు ప్రజలలోని వారు కనుక, వారిక్షేమమునకు వ్యవహరించుచుండిరి; అన్యాయమైన సూత్రముఁ గల్పించి దానిని శాస్త్రీయమని సభవా రంగీకరింపకుండునటులఁ జేయుటకు 'ప్రజాదర్శకుల'కు శక్తి కలదు. ఎవ్వరైనను ప్రజలపక్షము నవలంబించి వారి ధర్మములఁ గాపాడఁ దలఁచినయెడల, వానిని 'సామంతులు' చంపివేయుచుండిరి. 'స్పూరిశ-కాశీయసుఁడు' ప్రజలకష్టములనువిని వారిని

అతఁ డాదరించినందున నతనిని సామంతులు చంపివేసిరి. మఱియొకవిశేషము గలదు. 'ద్వాదశపథకము'లని పేరుగల ధర్మశాస్త్రసూత్రములను గ్రీకులవద్ద నుండి రోమకులు తీసికొని వచ్చి వాని ననుసరించి వ్యవహరింప నారంభించిరి. రాజాంగములు బలిసినకొలఁది వానిని నడిపించుటకు వ్యవహారస్థులు నూతనముగ నియోగింపఁ బడిరి. ఇరుప్రక్కల రాజదండములఁ బట్టుకొని సేవకులు నిలిచి యుండ, 'అక్షుదర్శకులు' (Consels) ఉన్నత్తమును (Toga) ధరించి దంతముతోఁ జేయబడిన యున్నతాసనముల నధిష్ఠించి యుందురు; న్యాయదండనాధికారము లను త్రిశక్తులు వారికిఁ గలవు. ప్రతిఅయిదుసంవత్సరముల కొకపర్యాయము జనసంఖ్యఁ దీసికొనుటకు 'గుణదోష వివేచకు' (Censors) లిరువురు కలరు. రాదారిమార్గములను వంతెనలను, వ్యవహార మందిరములను, మొదలగువానిని వారు చూచెదరు. న్యాయసభలలో న్యాయాన్యాయవిచారణఁ జేయు 'ప్రేటర్లు' అను న్యాయాధికారు లుండిరి. వారియంగడివీథులను వినోదములఁ బరీక్షించుటకు 'ఈడైలులు' అనువారు కలరు. వీరు రాజకీయవ్యవహారస్థులు. వీరు రాజ్యాంగములను నడిపించిరి. వీరి వ్యవహారములను విరోధించుటకుఁ గాని లేక వారిని సరిచేసి ప్రవర్తింపఁజేయుటకుఁ గాని 'ప్రజాదర్శకులు' భారమును వహించిరి. 'వికర్ణికులు అనువా రాదాయవ్యయములఁ జూచుచుండిరి. తుదను రాజ్యసూత్రములు న్యాయమార్గము ననుసరించి యుండెను. రాజ్యాంగము లాయామార్గములలోఁ బ్రవర్తించెను. 'సామంతులు'ను 'ప్రజలు'ను అత్యంతమైత్రితో నగరములో నివసించిరి.

క్రీ. పూ. సం॥ 390 రము:—రోమకులు వీరధర్మము ననుసరించి నగర బహిఃప్రదేశములను క్రమముగ సాధించిరి. మఱికొంతకాలమునకు 'గాలులు' నగరముపైఁ బడి దానిని ధ్వంసముఁ జేసిరి. రోమకులు వారియెదుట నిలువ లేక పోయిరి. శత్రువులు సమస్తపదార్థములను దొంగిలించికొని పోయిరి. నగరములో వెండిబంగారములు కఱవయ్యెను. కాలక్రమమున వారు పునర్జీవితులై, నగరమును బలపఱచిరి. దక్షిణోత్తరభాగములను వారు స్వాధీనముఁ

చేసికొనిరి. ఆయాభాగములలో నూతనవసతులను స్థాపించి వానినుండి నగరము వఱకును రాదారిమార్గములఁ గట్టించిరి. దక్షిణమున 'మాగ్నా-గ్రీసు' అను గ్రీసుల నూతనవసతులు మాత్రము వారికి స్వాధీనము కాలేదు. ఆభాగమును రోమనులు సాధించినప్పుడు వారికిని "పిర్హసు" అను వానికిని యుద్ధము సంభవించెను. గ్రీసుదేశమున నుత్తరమున నొకసంస్థానము గలదు; దాని కతఁ డధిపతి. "మహా అలగ్జాండరు" చనిపోయినతరువాత, నతఁడు "మాసిడను" దేశమును స్వాధీనముఁ జేసికొనెను. అతఁడు స్వరాజ్యమును విస్తరింపఁ జేయఁగోరెను. రోమనులతో జగడమునకు "టారంటము" పట్టణమువా రతనిని సహాయముఁ గోరిరి; అతఁ డందుకు సమ్మతించెను. ఆకాలమున నతఁడు "ఇటాలియా" "గ్రీసు" దేశములను సాధింపఁబూనెను కాని, అతని మనోరథములు నిష్ఫలము లయ్యెను. యుద్ధములో నతఁ డపజయముఁ బొంది స్వదేశమునకుఁ బోయెను. "రోమనులంబోలు సైనికులతో దిగ్విజయముఁ జేయవచ్చు"నని అతఁడు ప్రసంగించెను. తరువాత దక్షిణభాగమంతయు రోమనులకు స్వాధీనమయ్యెను.

క్రీ. పూ. సం|| 264-133 వఱకు కాలము గడచెను. రోమనులకును 'కార్తేజి' నగరమువారికిని యుద్ధము పొసఁగెను. ఆకథను మనము పూనికయుద్ధము. క్రమముగ రోమనులకీర్తి ప్రాచీనదిశను వ్యాపించెను. 'కొరింతు'నందు జరగిన క్రీడలఁ జూచుటకు రోమకరాయబారులను గ్రీసు లనుజ్ఞనిచ్చిరి; అంతకు మించిన గౌరవము లేదు. 'మాగ్నాగ్రీసు' లో నివసించు గ్రీసుల వలన వారి సమస్త శాస్త్రములను సకలధర్మములను రోమను లభ్యసించిరి. రోమనచరిత్రకారులు 'గ్రీకు'భాషలో స్వదేశచరిత్రలను వ్రాయఁజొచ్చిరి, నాటకాలలో 'గ్రీసు' భాషఁ జదువనేర్చిరి. ఎప్పటికైన గ్రీసుదేశమును వారు సాధింపఁబూనిరి. 'కార్తేజి' నగరము వారితో యుద్ధము ముగిసెను; 'మాగ్నాగ్రీస్సు'లో నివసించు గ్రీకులు శత్రువులకు సహాయముఁ జేసిరని నెపము పెట్టి రోమనులు వారిమీఁదికి దండు వెడలి, వారినోడించి, వారి 'మాగ్నగ్రీసు' ప్రదేశమును స్వాధీనముఁ జేసికొనిరి. క్రమముగ 'మాసిడను' దేశమును 'గ్రీసు' దేశమును రోమసామ్రాజ్యములోనికి

వచ్చెను. గ్రీసు దేశములోని దివ్యమగు శిలా ప్రతిమలు రోమునగరమునకుఁ దేఁబడెను. స్వదేశము యొక్క నాక్రమించి, దిగ్విజయముఁ జేసి, రోమకులు కీర్తి ప్రతిష్ఠలఁ బొందిరి. క్రీ. పూ. సం॥ 264—133 రములనాటికి 'కార్తేజి' నగరము 'సిసిలీ' ద్వీపము 'స్పానియా' 'మాసిడను' 'గ్రీసు'— మొదలగు దేశము లన్నియు వారియాజ్ఞకు లోఁబడియుండెను. మఱి నూఱుసంవత్సరముల నాటికి 'సిరియా' 'ఈజిప్టు' 'ఆశియా మైనరు' 'గాలు'— మొదలగు ప్రదేశములు వారికిఁ బాదాక్రాంతము లయ్యెను. ఈలోపున 'ప్రజారాజ్యము' యొక్క వినాశమునకును 'సామ్రాజ్యము' యొక్క సంస్థాపన కనుగుణమగు వ్యవహారిధర్మములు గమనించినందున, మఱి నూఱుసంవత్సరములు గడచుటకుఁ బూర్వము 'ప్రజారాజ్య' మంతరించెను; 'సామ్రాజ్య' ముదయించెను,

క్రీ. పూ. సం॥ 134—30 రములలో రోమునగరము మహోచ్ఛ్రపదవికి వచ్చి సిరిసంపదలలోఁ దేలుచుండెను; కాని, కొందఱు రోమకులు కడుపేదఱికము ననుభవించుచుండిరి. కుడుచుటకుఁ గూడును, నిలుచుటకు నీఁడయు, కట్టుటకు వస్త్రమును లేక వారు బాధపడిరి; వారిబాధలఁ జూచువారు లేరు; వారిని రక్షించువారు లేరు; ధనికులగృహములవద్ద వారు పడి కావులుపడియుండిరి. కాని వారిరోదనములను వినువారులేరు. కొర్నుపడి యుండిన భూములను వారు సాగుఁ జేయుఁదలఁచిరి; కాని ధనికు లాభూముల నాక్రమించి స్వాధీనానుభవములో నుంచుకొనిరి; నిరుపేద లనుభవించుటకు భూములు లేకపోయెను. ఇటాలియా దేశములోని మృగములు నిలుచుటకు నీఁడ కలదు; కాని స్వదేశము నిమిత్తము చీమురక్తము ధారపోసిన రోమకుఁ డన్న దేహిా స్త్రియై గృహములేక సంచరించుచున్నవాఁడు' అని చెప్పి 'గ్రాకసు భ్రాతలిరువురు వారిపక్షము నవలంబించి, 'సామంతుల'తోఁ బోరాటమునకు దిగిరి. వా రా భ్రాతల నిరువురఁ జంపివేసిరి. అంతఃకలహములలో రోమకులు మునిగిరి. అందుమూలమున వారు "రోమక నాగరికధర్మముల'ను స్థాపింపఁ బ్రయత్నించిరి. ఈజగడములో 'మారీయుఁడు'ను 'సల్ల' అనునిరువురును విగతజీవు లయిరి. వారిమరణానంతరమున కూడ

నగరములో రెండుపక్షము లుండెను; రాజ్యసూత్రములను వహించుటకుఁ దగిన వారు సామంతులని కొందఱిమతము; సామంతు లయిన నేమి కాకపోయిన నేమి ఎవరైనను బుద్ధిబలము గలవారు రాజ్యభారమును వహింపవలెఁ గాని తదితరులు కూడదని కొందఱియభిప్రాయము. ప్రభుమంత్రోత్సాహశక్తులుగలవానికి మంచి సమయము వచ్చెను. సకలగుణసంపన్నుఁడైన 'పాంపేయుఁడు' ప్రాచీన రాజ్యములను సాధించి ప్రబలుఁడై కొంతకాలము వెలిఁగెను; కాని, అతని చర్యలు సర్వజనశ్లాఘనీయములు కానందున నతని ప్రభ తగ్గెను. అతనికంటె 'జూలియను—సీజరు' గొప్పవాఁడు. సైనికులమనస్సులను రంజించెను; 'గాలు' 'బ్రిటను' దేశములను సాధించి 'పాంపేయూ'ని విదేశమునకుఁ బంపివేసి, 'సర్వాధికారి' యయ్యెను. అంతకంటె గొప్పదయిన 'సార్వభౌమ' అనుబిరుదు నతఁడు ధరింపలేకపోయెను. ఆపేరు లేకపోయినను, సీజరు రోమకమహా రాజ్యమునకు నిరంకుశప్రభు వయ్యెను. అతనికాలములో రోమనులు సకల సంపదల ననుభవించిరి. బ్రూటసు పన్నిన దురాలోచనలచేత సీజరు దుర్మరణము నొందినందున, ప్రజారాజ్య మతనితో నస్తమించెను. అనంతరము 'ఆక్టేవియసు—సీజరు' రాజ్యసూత్రములను వహించి, 'మార్కు—అంతోని' మొదలగు శత్రువులఁ దునుమాడి, రోమకమహారాజ్యమునకు అగస్టసు అని పేరుఁ బెట్టుకొని ప్రథమసార్వభౌముఁ డయ్యెను. అగస్టసు కాలమునుండి సామ్రాజ్యాధిపత్యము ప్రారంభమయ్యెను.

అన్నిచిక్కులం దాటి సామ్రాజ్యాభిషేక కాలమునాటికి వచ్చితిమి; మధ్యందినమార్తాండుని వలె, మహారాజ్యము వెలుంగుచున్నది; పదిదిశల రోమకులకీర్తి ప్రతిష్ఠలు వ్యాపించెను. ఇంతవఱకు వారు రాజ్యధర్మములను నడిపించిన విధముఁ జూచితిమి; ఇటుపైని వారు గృహస్థాశ్రమధర్మముల నెటుల నడిపించిరో చూచెదము. రోమునగరములో నొకవీథిగుండఁ బోవుచు నొక గృహస్థుని గృహములోఁ బ్రవేశింతుము. ఎడమపాదముఁ బెట్టిన నపజయము కనుక, కుడిపాదముఁ బెట్టి గుమ్మము దాఁటి హాజారములోఁ బ్రవేశింపవలెను. హాజారము గచ్చునగిషీ చేయఁబడి చూచుట కింపుగ నుండును; అందులోఁ

ప్రవేశింప, గృహస్థుగాని అతనిస్థానమున మఱియొకరుగాని వచ్చినవానిని దయ చేయుఁడు అని మర్యాదఁజేసి, వాని, సుఖాసీనుఁజేయును. అచ్చటనుండి చూచినయొకవైపున అగ్నివేదిక (hearth) స్థాపింపఁబడిన గది కనఁబడును; ధూమము పాఱినందున దానికి 'చీఁకటిగది' అని పేరువచ్చెను. ఒకసంసారి గృహ మయిన యెడల నాచీఁకటి గదిలో షోడశకర్మలు జఱుగును; అందులోఁ గుటుం బము వారందఱు సమావేశమై తమతమపనులం జేయుదురు. అదియే సామంతుల గృహ మయినయెడల భోజనమందిరములు, పాకశాలలు, శయనమందిరములు, పుస్తకభాండాగారములు, స్నానమందిరములు, గరిడీశాలలు — మొదలగునవి వేర్వేర నొకటితో నొకటి కలిసియుండును. అంగణము నలువైపులఁ బుష్పవృ క్షములతో శోభిల్లుచుండును; దానిమధ్య 'యంత్రోదకస్థానము (Fountain) కలదు. భోజనశాలలో వారు పర్యంకముపై సుఖాసీనులై తమముందు బల్లపై పళ్లెరములలోఁ బెట్టినపదార్థములను, వామహస్తముపై వ్రాలి వానిని భుజింతురు. గ్రీకులఁ జూచి విద్యాభిలాషకలవారై, పుస్తకభాండాగారముల నిర్మించిరి. ఎండతీక్ష్ణముగ నుండినపుడు, అంగణములో వారున్నతాసనముల నధి ష్ఠించి, సుఖముగఁ బ్రసంగింతురు. పూర్వము 'రోమ్యులసు' కాలములో 'సా బీనుల'కు కన్యలను రోమకులు బలాత్కారముగఁ దీసికొని వచ్చి వివాహముఁ జేసికొనిరి; అప్పూర్వాచారము ననుసరించి వివాహకాలమున రోమకుఁడు కన్యను హస్తముఁ బట్టుకొని లాగును. ; ఆమెను భర్తయెత్తుకొని గృహములోఁ బ్రవేశపెట్టును. అగ్నిహోత్రము నుదకమును ఆమె యెదుటనుంచి భర్త ఆమెను ఆహూయముఁ జేయును. అనంతర మామె భోగములఁ బుచ్చుకొనిన తరువాత గృహిణి యగును ; గృహకృత్యముల నెఱవేర్చి భర్తకుఁ బరిచర్యలఁ జేయును. "ప్రజారాజ్యము" స్థాపింపఁబడిన ప్రారంభమున రోమకుల అన్నపానాదులు సంసారిపక్షముగ నుండెను. మధ్యాహ్నమున దధిక్షీరఘృతసూపసమన్వితమైన శాల్యోదనమును వారు భుజింతురు. "ప్రజారాజ్యమునకు" అవసానకాల ములు సమీపించునప్పటికి ఉదయమున వారు ఫలములను, రొట్టెలను జున్నును సేవింతురు ; మధ్యాహ్నమున వివిధపదార్థములను సాయంసమయమున మధు

పానముచే తృష్ణాధిక్యము వహించు మనుజులన, శాకములతో గూడిన మాంసము నారగింతురు. చేపలను, పీత, గుల్ల, నత్తగుల్లలు, కోడి, బాతు మొదలగువాని మాంసములను, నెమలి భరద్వాజముల నాలుకలను, వారు భుజింతురు. తినుపిదప వమనముఁ జేసి వారు మరల భుజింతురు. ధనికులైన రోమనులు పల్లకీలోఁ గూర్చుండి ప్రయాణము సేయుదురు. అత్యాడంబరమైన సంసారములు గనుపింతురు. నిర్ధనికులు శకటములలోఁ బోదురు. గ్రీసుదేశమును స్వాధీనముఁ జేసికొనిన తరువాత, వారు విద్యాభ్యాసముఁ జేయ నారంభించిరి. దాసుపాఠకులనుండి అక్షరములను చిన్నపిల్లలు నేర్చిరి; పెద్దలు ప్రాచీనపద్ధతిని మైనముతోఁ గప్పఁబడిన దారుఫలకములమీఁద వారు ఘంటముతో వ్రాయుచుండిరి. విద్వాంసుఁడైన ప్రతిరోమనుఁడును గ్రీసుభాషను వ్రాయను భాషింపను చదువను నేర్చుకొనెను; గ్రీసులను లక్ష్యముఁ జేసికొని ప్రతిరోమకగ్రంథకర్తయు గ్రంథములను వ్రాయుచుండెను. "లూక్రీషియసుఁడు" అను నొక కవిశ్రేష్ఠుఁడు "పదార్థతత్త్వము" అను నొక పద్యకావ్యమును వ్రాసెను. ఆకావ్యము నవనవ వచనములతోఁ గూడినదియే కాక, "ఎపిక్యూరసు" యొక్క మతమును బోధించును. 'అయినిడు' అను పద్యకావ్యమును వ్రాసిన 'వర్జిలు' అను మహాకవి 'అగస్టసు' సార్వభౌముని యాస్థానము నలంకరించెను. ఆకాలములో 'లివి' అనువాఁడు రోమకచరిత్రను వ్రాసి ముగించెను; 'హోరేసు' అను కవి అన్యాపదేశముగ శ్లోకములఁ జెప్పెను. ముచ్చటను మున్నుగాఁ జెప్పియుంటిమి; ఇంక ననేకులు కలరు; వారందరు పలువిధముల శాస్త్రపరిశోధనఁ జేసిరి.

రోమనుల క్రీడావినోదములఁ జూచెదము. ఆబాలవృద్ధులు చదరంగము నాడుదురు; ఈయాటను వారు గ్రీసులవద్దనుండి నేర్చుకొనిరి. అన్నిటికంటె వారికి 'మల్లయుద్ధముల' యందభిలాష మెండు. శుభాశుభకార్యములు వచ్చినపుడు, మల్లులు వచ్చి పోరాడవలెను; వినోదముకొఱకేఁ గాక, వారు పోరాటములో విగతజీవు లగుదురు.

ఇకను వారిప్రేతకర్మలను వినఁబోవుదము. ఒకనికి అవసానకాలము సంప్రాప్తమయ్యెను; బంధుపుత్రమిత్రకళత్రాదులవద్ద వాఁడు సెలవుఁ గైకొనును;

వైతరణీనదిని దాటించు వానికి వేతనము నిమిత్తము వాని నోటిలో బంగారు నాణెమును వేయుదురు. వాఁడు ప్రాణములను విడుచును; ముసుగులు వేసి కొని వాహకులు శరీరమును మోసికొని పోవుదురు; పుత్రమిత్రాదులు పాద చారులై వెనుకనుండి గమనింతురు; ఆశరీరమునకు శ్మశానవాటికలో నగ్ని సంస్కారముఁ జేయుదురు.

క్రీ. పూ. సం|| 30—క్రీ. వె. సం|| 14 రములు: — 'అక్టేవియసు— అగస్టను—సీజరు' రోమకమహారాజ్యమునకుఁ బ్రథమసార్వభౌముఁ డయ్యెను; దేదీప్యమానముగ మహారాజ్యము విజృంభించి యుండెను. 'మేడిపండుఁ జూడమేలిమై యుండును, పొట్టవిచ్చిచూడఁ బురుగులుండు' అని చెప్పిన విధమునఁ జూచుటకుఁ బైకి మహారాజ్యము మేలిమై యుండెను. 'అగస్టను' లోకాంతరగతుఁ డయ్యెను.

'కారేరాజులు రాజ్యముల్గలుగవే గర్వోన్నతిం,బొందరే.వారేరీ?' అను నటుల ననేకచక్రవర్తు లొకరితరువాత నొకరు వచ్చి వెళ్లిరి. వారేరీ! మహా రాజ్యము క్రమముగ దిగుడుమార్గములోఁ బడెను.

క్రీ. వె. సం. 14-34రములు: అతనితరువాత 'టైబీరియసు—సీజరు' సింహాసనమునకు వచ్చెను. అతఁడు గర్విష్ఠి; తామసుఁడు; అతనియందుఁ బ్రజల కనురాగము లేదు. క్రీ. వె. సం. 37-41రమువఱకు 'కాలిగుల' అను చక్రవర్తి రాజ్యముఁ జేసెను. అతఁడు మోహాంధకారమగ్నుఁడై కన్నుగానక దుర్మార్గములలో సంచరించెను. క్రీ. వె. సం. 41-54 రములవఱకు 'క్లాడియసు' చక్రవర్తి 'బ్రిటను' ద్వీపమును జయించి దేశముఁ బరిపాలించెను క్రీ, వె. సం. 54-68 రముల వఱకు మాతృదేవతను చంపి క్రైస్తవులను బలివేసి 'నీరో' అను చక్రవర్తి పరమ దుర్మార్గుఁ డని పేరుఁ బొందెను. క్రీ. వె. సం. 68-79రములు వఱకు 'వేస్పాసియనుఁడు' అచక్రవర్తి రాజ్యముఁ జేసి 'జేరూసలము' పట్టణముఁ బట్టుకొని ధ్వంసముఁ జేసెను. క్రీ. వె. సం. 79-81 రముల వఱకు 'టైటసు' చక్రవర్తికాలములో 'పాంపేయి' 'హేర్క్యులనము' అను పట్టణములను 'అగ్నిపర్వతములు' విజృంభించి నాశనముఁ జేసెను. క్రీ. వె. సం.

వయస్కుఁడగు చక్రవర్తిని సింహాసనమునుండి పడఁద్రోసి, నగరమును ధ్వంసముఁ జేసిరి; 'గాతుల' ప్రభుత్వ మారంభ మయ్యెను.

రోమకమహారాజ్య మస్తమించెను; సంధ్యారాగమువలె, మఱియొక విధమున దాని ప్రభ మఱికొన్ని శతాబ్దముల వఱకు వెలిఁగెను. ఆవిధమును ముందుకురాఁబోవు గ్రంథములలోఁ జూపఁగలము.





వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి.—1917.

# ఆంధ్రగ్రంథములు.

## —పద్యకావ్యము.—

| | | రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రభారతము — ప్రతి 1-కి | | | |
| ఆది, సభాపర్వములుగల సంపుటము | ... | 1 | 12 |
| అరణ్యపర్వము ,, | ... | 1 | 12 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 1 | 12 |
| శాంతిపర్వము ,, | ... | 1 | 12 |
| అనుశాసనిక అశ్వమేధ ఆశ్రమవాస మౌసల మహాప్రస్థానిక స్వర్గారోహణ పర్వములుగల సంపుటము | ... | 1 | 12 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 5 | 0 |
| తెలుఁగుసమస్యలు, చక్కనికూర్పు | ... | 0 | 2 |
| ఆంధ్రభారత విమర్శనము, శ్రీమల్లాది. సూర్యనారాయణశాస్త్రి గారిది | | 0 | 8 |
| లంకావిజయము (రావణసమ్మోహనము), సటీక, పింగళిప్రోలు. లక్ష్మణకవిది | | 1 | 8 |
| కృష్ణరాయవిజయము, కుమార. ధూర్జటికృతము, చక్కనికూర్పు | | 0 | 8 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు | ... | 2 | 8 |
| నిర్వచనోత్తరరామాయణము, సాధారణప్రతి | ... | 0 | 12 |
| ఉత్తరరామాయణము, కంకంటి. పాపరాజప్రణీతము, చక్కనికూర్పు | | 1 | 8 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కని క్రొత్తకూర్పు | ... | 2 | 8 |
| గోపీనాథరామాయణము, 2-సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైన పద్యకావ్యము. కవనము మిక్కిలి సొగసు | ... | 4 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దయక్షరములతో చక్కగ ముద్రితము | | 0 | 8 |
| మార్కండేయపురాణము, మారనకవి | ... | 1 | 12 |
| అచ్చతెనుఁగు రామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 8 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైనప్రతులకన్న అన్నివిధములబాగుగనున్నది | ... | 3 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి, 2 వాల్యములు | ... | 5 | 8 |
| వసుచరిత్రవిమర్శనము, శ్రీ టి. సీతారామస్వామిశాస్త్రి కృతము. అత్యద్భుతములగు క్రొత్తవిషయములనేకము లిందుగలవు | ... | 1 | 0 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| మనుచరిత్ర, సటీక ... | 1 | 8 |
| వీరభద్రవిజయము, బమ్మెర. పోతనామాత్యప్రణీతము ... | 0 | 12 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు ... | 2 | 8 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక (అచ్చగుచున్నది.) | | |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రి గారి వ్యాఖ్యానముతో మేలుకాగితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము. | 3 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు ... | 0 | 8 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు ... | 1 | 8 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు ... | 1 | 8 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది, క్రొత్తకూర్పు ... | 0 | 14 |
| హరవిలాసము ,, ... | 0 | 10 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు ... | 1 | 8 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర ... | 1 | 8 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 0 | 8 |
| విజయవిలాసము, చేమకూర. వేంకటకవిది ... | 0 | 4 |
| సారంగధరచరిత్రము, చేమకూర. వేంకటకవికృతము ... | 0 | 8 |
| బిల్హణీయము, చక్కనికూర్పు ... | 0 | 8 |
| వైజయంతీవిలాసము ,, ... | 0 | 8 |
| రంగరాయచరిత్ర, దిట్టకవి. నారాయణకవిప్రణీతము ... | 0 | 8 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు. రామభద్రకవికృతము ... | 1 | 4 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి. తిమ్మకవికృతము ... | 0 | 4 |
| రసికజనమనోభిరామము, శుద్ధప్రతి ,, ... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము ,, ,, ... | 0 | 6 |
| రాజశేఖరవిలాసము ,, ... | 0 | 8 |
| పారిజాతాపహరణము ... | 0 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము ... | 0 | 8 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి. అబ్బయామాత్యప్రణీతము ... | 0 | 8 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము ... | 0 | 6 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ. వెంకమ్మకృతము, చక్కనికూర్పు | 0 | 14 |

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 4 |
| బసవపురాణము, పిడుపర్తి. సోమనాథప్రణీతము | ... | 1 | 12 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము | ... | 1 | 0 |
| శ్రీనాథునిసిద్ధినాటకము | ... | 0 | 2 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, క్రొత్తకూర్పు | ... | 2 | 8 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు | ... | 0 | 12 |
| ఉత్తరహరివంశము, నాచన. సోమనాథకృతము | ... | 1 | 4 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగడ, క్రొత్తకూర్పు | ... | 0 | 12 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము | ... | 0 | 8 |
| సులక్షణసారము, సటీక | ... | 0 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు టీకానుక్రమణికా సహితము, కాలికోబైండు | ... | 0 | 12 |
| అప్పకవీయము, చక్కనికూర్పు | ... | 1 | 10 |
| ఆంధ్రభాషాభూషణము | ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 0 | 12 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 0 | 8 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు | ... | 0 | 4 |
| భాగవతసప్తమస్కంధము, సాధారణప్రతి | ... | 0 | 4 |
| సప్తమస్కంధము, సటీక, చిన్నసైజు | ... | 1 | 0 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము) | ... | 0 | 4 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 6 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కని ప్రతి | ... | 0 | 6 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు | ... | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద, క్రొత్తకూర్పు | ... | 0 | 14 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |

## వచనము.

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీశతఘంటము. వేంకటరంగశాస్త్రికృతము | ... | 7 | 0 |

| | | | రూ. | అ. |
|---|---|---|---|---|
| | | | **ప్రతి 1-కి** | |
| సంగ్రహరామాయణము, శ్రీ శేషాద్రిశర్మకృతము | | ... | 0 | 8 |
| సంస్కృతనాటకకథలు, శ్రీ సీతారామశాస్త్రికృతము | | ... | 0 | 12 |
| దశకుమారచరిత్రము, శ్రీ ఎనమదింతల. సంజీవరాయశాస్త్రికృతము | | | 1 | 0 |
| శివాజీచరిత్ర | | ... | 0 | 4 |
| శ్రీ రామానుజార్యచరిత్ర | | ... | 0 | 2 |
| శ్రీ శంకరాచార్యచరిత్ర, ప్రతిమతో | | ... | 0 | 2 |
| రామకృష్ణపరమహంసచరిత్ర | ,, | ... | 0 | 2 |
| శ్రీ వేమనయోగిజీవితము | ,, | ... | 0 | 2 |
| బాలగంగాధరతిలకుగారిచరిత్ర | ,, | ... | 0 | 2 |
| దాదాభాయినౌరోజీచరిత్ర | ,, | ... | 0 | 1 |
| శ్రీ కరంచంద్ గంధిజీవితము | ,, | ... | 0 | 2 |
| శ్రీ గైక్వారుగారిజీవితము | ,, | ... | 0 | 2 |
| శ్రీ లాలాలాజపతిరాయిజీతము | ,, | ... | 0 | 2 |
| శ్రీ గోపాలకృష్ణ గోఖ్లేజీవితము | ,, | ... | 9 | 2 |
| ఆనిబిసెంటుచరిత్ర | ,, | ... | 0 | 1 |
| శ్రీ రానడేజీవితము | ,, | ... | 0 | 2 |
| వివేకానందస్వామిజీవితము | ,, | ... | 0 | 1 |
| శ్రీ కృష్ణదేవరాయచరిత్ర | ,, | ... | 0 | 2 |
| స్వామిరామతీర్థజీవితము | | ... | 0 | 1 |
| శాలివాహనచరిత్ర | | ... | 0 | 2 |
| శ్రీ బుద్ధచరిత్రము | | ... | 0 | 4 |
| సోదరినివేదితజీవితము | | ... | 0 | 1 |
| సూరతుకాంగ్రెస్సు ఉపన్యాసములు. | | ... | 0 | 2 |
| శ్రీ గైక్వారుగారి ఉపన్యాసములు | | ... | 0 | 2 |
| శ్రీ మహాభక్తవిజయము | | ... | 4 | 0 |
| దక్కనుపూర్వకథలు, శ్రీ సీతారామశాస్త్రికృతము | | ... | 1 | 4 |
| భోజకాళిదాసకథలు, 1-వభాగము | | ... | 0 | 12 |
| డిటో 2-వభాగము | | (అచ్చగుచున్నది). | | |
| మైరావణచరిత్ర, చక్కనికూర్పు | | ... | 0 | 1 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| రెదుక్క-పగటిముక్క కథలు | ... | 0 | 2 |
| విక్రమార్కునికథలు | ... | 0 | 6 |
| బేతాళునికథలు | ... | 0 | 6 |
| భారతరమణీమణులు | ... | 0 | 12 |
| మర్యాదరామన్నకథలు | ... | 0 | 2 |
| పరమానందశిష్యులకథలు | ... | 0 | 3 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | ... | 0 | 4 |
| తాతాచార్యులకథలు | ... | 0 | 6 |
| నలుగురుమంత్రులకథలు | ... | 0 | 4 |
| అయిదుగురుదొంగలకథ | ... | 0 | 4 |
| మదనకామరాజుకథలు, చక్కనికూర్పు | (అచ్చగుచున్నది.) | | |
| సత్యసేనవిజయము, శ్రీ ల. అనంతాచార్యకృతము | ... | 0 | 4 |
| షేక్స్పియర్ నాటకకథలు, సులభశైలి | ... | 1 | 8 |
| ఈసపునీతికథలు, క్రొత్తకూర్పు 1-వ భాగము | ... | 0 | 6 |
| డిటో రెండవభాగము | ... | 0 | 8 |
| అరేబియన్ నైట్సుకథలు, చక్కనికూర్పు | ... | 1 | 4 |
| ప్రహ్యకథలు | ... | 0 | 12 |
| శ్రీగురుజాడ. శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు | ... | 2 | 8 |
| తారాభాయి, చక్కనినవల, క్రొత్తకూర్పు | ... | 0 | 12 |
| ఆనందమఠ, నవల, నూతనముద్రితము | ... | 0 | 12 |
| కపాలకుండల, నవల ,, | ... | 0 | 14 |
| ఉన్మాదిని, నవల | ... | 0 | 4 |
| రాధారాణి ,, | ... | 0 | 4 |
| లీల ,, | ... | 0 | 4 |
| రోషనార ,, | ... | 0 | 10 |
| లాలాభాయి,, | ... | 0 | 10 |
| నీతిచంద్రిక, చిన్నయసూరిగారిది | ... | 0 | 6 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | ... | 0 | 6 |
| క్షేత్రయపదములు, చక్కనికూర్పు | ... | 0 | 14 |

# వైదిక గ్రంథములు.

ప్రతి 1-కి రూ

| | | |
|---|---|---|
| అమావాస్యాతర్పణము | ... | 0 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు | ... | 0 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము | ... | 0 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, చిన్నసైజు | ... | 0 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక | ... | 0 |
| తిథిమంత్రములు, (ఆరాధ్యులది) | ... | 0 |
| దేవతార్చన, చిన్నసైజు | ... | 0 |
| పంచసూక్తములు, సస్వరము | ... | 0 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము | ... | 0 |
| పంచోపనిషత్తులు, బ్రహ్మమేధసహితము | ... | 0 |
| పితృతర్పణము, చిన్నసైజు | ... | 0 |
| బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 |
| మహాన్యాసము, సస్వరము, చిన్నసైజు | ... | 0 |
| మంత్రప్రశ్నములు, మూలము | ... | 0 |
| డిటో సస్వరము (ఏకాగ్ని కాండ) | ... | 0 |
| తైత్తిరీయ ఆరణ్యకోపనిషత్తులు, పితృమేధము, మంత్రప్రశ్నములు సహా, సస్వరము. | ... | 3 |
| మంత్రపుష్పము, సటీక | ... | 0 |
| యజుర్వేదసంధ్యావందనము, మూలము, సస్వరము | ... | 0 |
| శ్రీవైష్ణవాహ్నికము, చిన్నసైజు | ... | 0 |
| యజుర్వేద ఆబ్దికమంత్రములు, మూలము | ... | 0 |
| యజుర్వేదసంధ్యావందనభాష్యము | ... | 0 |
| డిటో పురుషసూక్తము, శ్రీసూక్తము, ఆంధ్ర టీకా తాత్పర్యము. | ... | 0 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము | ... | 3 | 8 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము | ... | 0 | 6 |
| రుద్రము—నమకము, చమకము, సస్వరము | ... | 0 | 3 |
| రుద్రాధ్యాయము, భాష్యటీకాసహితము | ... | 1 | 8 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు | ... | 0 | 2 |
| సత్యనారాయణవ్రతకల్పము, క్రొత్తకూర్పు | ... | 0 | 8 |
| వ్రతరత్నాకరము, ప్రథమభాగము | ... | 0 | 12 |
| ,, ద్వితీయభాగము | ... | 1 | 21 |
| వ్రతచూడామణి, (సంస్కృతము) చక్కనిప్రతి | ... | 2 | 8 |

## జ్యోతిషగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| 60 సంవత్సరముల పంచాంగము (1867-1926) [illegible] | ... | 10 | 0 |
| అష్టకవర్గు, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము | ... | 0 | 12 |
| కాలామృతము, టీకాతాత్పర్యవ్యాఖ్యానసహితము | ... | 2 | 0 |
| కృష్ణవాస్తుశాస్త్రము, అను వాస్తుసారసంగ్రహము | ... | 1 | 0 |
| జలార్గళశాస్త్రము, ఆంధ్రటీకాసహితము | ... | 0 | 6 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరము, సాంధ్రతాత్పర్యము | | 0 | 12 |
| పుష్పబంధము, సాధారణప్రతి | ... | 0 | 8 |
| బృహద్యోగరత్నాకరము, తెనుగువచనము | ... | 0 | 12 |
| బృహజ్జాతకము, ఆంధ్రటీకాతా॥ వ్యా॥ సమేతము | ... | 3 | 8 |
| మయవాస్తువు ,, | ... | 0 | 4 |
| భృగుసూత్రములు ,, | ... | 0 | 6 |
| నక్షత్రచూడామణి, చక్కనిప్రతి | ... | 0 | 8 |
| భావార్థచంద్రిక, ఆం॥ టీకా॥ తా॥ | ... | 1 | [illegible] |